# మహావాక్య రత్నప్రభావావళి.

(శ్రీమత్పరమహంస

శ్రీ సదానన్ద సరస్వతీస్వామి వారిచే

విరచితము.







బెజవాడ వాస్తవ్యులగు

వెంపటి శ్రీధరశాస్త్రిగారిచే ప్రకటితము.

రామా ముద్రాక్షరశాల, ఏలూరు.

1922 నవంబరు.



---

 వెల రు 1—0—0.

# మహావాక్య రత్నప్రభావావళి.

శ్రీమత్పరమహంస

శ్రీ సదానన్దేన్ద్ర సరస్వతీస్వామి వారిచే

విరచితము.



బెజవాడ వాస్తవ్యులగు

వెంపటి శ్రీధరశాస్త్రిగారిచే ప్రకటితము.

రామా ముద్రాక్షరశాల, ఏలూరు.

1922 నవంబరు.

 వెల రు 1—0—0.

వలయువారలు:—

బెజవాడ ప్రిన్సిపల్ మునసబుకోర్టు హెడ్ గుమాస్తా వెంపటి శ్రీధరశాస్త్రిగారి వద్దనుంచి తెప్పించుకొనవచ్చును.



వెంపటి అమ్మన్నగారు.

(అనన్తరమ్.)

శ్రీ మత్పరమహంస

శ్రీ సచ్చిదానన్దేన్ద్ర సరస్వతీ స్వామినః.

# విన్నపము.

ఈ పరమోత్కృష్టమైన వేదాన్తగ్రన్థము పూర్వాశ్రమంబున వెంపటి అమ్మన్న యను పేర బరగిన బ్రాహ్మణోత్తమునిచే విరచింప బడియె. ధర్మంబేకపాదావశిష్టమై యొప్పారు. నిక్కాలంబున లుప్తంబైన త్రిపాదంబుల తపోమహిమచే వెలయంజేసి పాదచతుష్టయ యుక్తంబగు ధర్మదేవతా నిజస్వరూపంబును బొడగాంచి చతురాశ్రమ ధర్మంబుల నిర్వర్తించిన మహనీయుండు. ఈశ్వరుండు భక్తపరీక్షార్థముగాని స్వవిలాసార్థముగాని కష్టములుగల్పించి భక్తుల శోధించుచుండునని కొందరి యభిమతము. కాని వారలు,

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాంనిత్యాభియుక్తానాం యోగక్షేమంవహామ్యహమ్ ॥

అను గీతావాక్యార్థమును గమనించరైరని ఆర్యులు వక్కాణించుదురు. అనన్యమనస్కులై ఈశ్వర ప్రణిధానంబున గాలంబు గడుపు వారలకు క్లేశంబులు సంభవింపవను విషయము వీరి చరిత్రవలననే బోద్ధవ్యము. గార్హస్థ్యంబున యద్విధమైన కష్టంబు నెరుంగని పుణ్య పురుషుండు. నేత్రంబులు భక్త్యతిశయంబుచే జనించిన ఆనన్దబాష్పంబుల స్రవింపజేసెనే కాని క్లేశానుభవజనితంబులైన అశ్రుకణంబుల ప్రవహింపజేయలేదని తజ్ఞులకు తెల్లమే. గృహస్థుడుగూడ ప్రశాన్తస్థితిని కాలము గడుపవచ్చునని వీరి చర్యవలన లోకంబునకు విదితంబయ్యెననుట అతిశయోక్తిగాదు.

ప్రీణాతియస్సుచరితైఃపితరం సపుత్రో
యద్భర్తురేవ హితమిచ్ఛతి తత్కళత్రమ్।
యన్మిత్రమాపది సుఖేచసమక్రియంతత్
దేతత్త్రయం జగతిపుణ్యకృతోలభన్తే ॥

యను యార్యవాక్యంబు వీరి జన్మయందు సార్థకమయ్యె. " వరమేకో గుణీపుత్రో నచమూర్ఖశతాన్యపి " యనువటుల శ్రీరాముంబోలె గుణియై పితృవాక్య పరిపాలనా నిరతియందు సక్తుఁడైన పుత్త్రుండును, పతిహితంబునేగోరుచు లోపాముద్రంబోలె భర్తకు జ్ఞానోదయంబును గలుగజేసి గృహిణీశబ్దంబును సార్థకంబుజేయు సాధ్వీతిలకంబగు పత్నియు, బాన్ధవ్యంబునను సాచివ్యంబునను పాణ్డవమధ్యమునకు కృష్ణునింబోలె అపర శంకరావతారుం డనదగిన శ్రీ గౌరీనాథ శాస్త్రిగారను లోకప్రదీపకుండగు మిత్రశ్రేష్ఠుండును వీరి జన్మాన్తరార్జితాత్యుత్కృష్ట పుణ్యవిశేషంబునులోకంబునకు వెల్లడి జేసిరని జెప్పక తప్పదు. గార్హస్థ్యంబు చిన్మార్గావరోధకంబుగా దలంచుట అసమంజసమని గుర్తెరింగి స్వచారిత్రంబువలన లోకంబునకు తెల్లముజేసిన పుణ్యపురుషుండు. ఐహికంబున కష్టలేశంబు నెరుంగక సుఖంబున సంసారసంద్రంబునీదిన పురుషశ్రేష్ఠుండు. " మానుషంచస్వాధ్యాయ ప్రవచనేచ " యను నుపనిషద్వాక్యాను సారంబుగ ప్రజాతన్త్వవచ్ఛేదార్థమును సాధుజన పోషణార్థమును రాజకీయోద్యోగమును స్వీకరించినను గృహస్థాశ్రమధర్మంబు లేశంబును విడనాడక షట్కర్మనిరతిని కాలంబు గడపుచు రాజసేవ స్వధర్మనిర్వర్తనంబునకు ప్రతిబన్ధక హేతువు గాదని లోకంబునకు వెల్లడిజేసిన ఉత్తమపురుషుండు. వీరి జన్మ గాంచినకొలది వీరి స్మరణచేసినకొలది శ్రుతివాక్యంబులు యథార్థంబులని బోధించుట కవతరించిన పుణ్యాత్ముండని స్పష్టమగును. " సత్యం పరంపరన్ సత్యమ్ " యను వాక్యంబును అనుభవంబున సార్థకంబుగా జేసిన సత్యవ్రతుండు. బ్రహ్మచర్యంబున ఉపమానాన్వేషణార్థము ద్వాపరంబునకు బోవనక్కరలేదు. గార్హస్థ్యంబున సామ్యంబుకొరకు త్రేతాయుగంబునకు జననవసరంబులేదు. తృతీయతురీయాశ్రమనిష్ఠుల గనుటకు ఋషివాటములకును పర్వతప్రాన్తములకు బోబనిలేదు. భీష్ముని బ్రహ్మచర్యనిష్ఠయు, జనకుని నిర్మోహత్వమును ఋషుల ప్రశాన్తస్థితియు సనకాదుల వైరాగ్యంబును కలికాలంబున వీరియందే

దర్శితములయ్యె. షష్టిహాయన పర్యన్తము ప్రథమ ద్వితీయాశ్రమం బుల కాలంబుగడపి అనన్తరము షడ్వర్షంబులు వానప్రస్థ ధర్మంబుల నిర్వర్తించి " పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయా న్నాస్త్యకృతః కృతేన " యనునటుల కర్మవిముఖులై నిర్వేదంబు నొంది బ్రహ్మనిష్ఠులైనను ఆశ్రమగౌరవంబునను "దర్శనాదేవసాధవః " యని యుండుటవలన లోకంబును పునీతంబుగా నొనర్చుటకును, లోకము తరించుటకును తురీయాశ్రమ వేషంబును స్వీకరించి " శాన్తా మహాన్తోనివసన్తి సన్తోవసన్తవల్లోక హితంచరన్తః । తీర్ణాస్స్వయం భీమభవార్ణవం జనానహేతునాన్యానపితారయన్తః॥ యనినటుల దధీచి మహామునింబోలె కేవల లోకోపకారార్థమే జీవయాత్రను గడపి అన్తేవాసుల నుత్తీర్ణులంగావించిన శ్రీమత్పరమహంస శ్రీ సదానన్దేన్ద్ర సరస్వతీస్వామివారిచే లోకానుగ్రహార్థమే ఈగ్రన్థము విరచింపబడియె.

అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా
విజ్ఞాతేచ పరే తత్త్వే శాస్త్రాధీతిస్తునిష్ఫలా ॥

యనునటుల కేవల శాస్త్రజ్ఞానము నిరర్థకమనియు, అనుభవమే ప్రధానమనియు వీరి చర్యవలనను వీరి స్వానుభవంబునే సూచించు వాక్యములవలనను ప్రత్యక్షీకరింప బడుచున్నది. ముద్రణకు పూర్వమే వారు సిద్ధినొందినందున వారిచే బరిష్కరింపబడు భాగ్యమును ఈ గ్రన్థరాజము నోచుకొనదయ్యె. కాన దీనియందు ప్రమాదంబు లుండినను ఈ దృశగ్రన్థ పఠనాభిలాషులగు విద్వదవతంసులచే దోషంబులు క్షన్తవ్యంబులు.

శ్రీమద్దుందుభి సంవత్సర
కార్తికశుక్లైకాదశీ జయవాసరము
విజయవాడ.

జమ్మి వెంకటారావు,
డిస్ట్రిక్టుమున్సిఫ్.

# గ్రంథసమర్పణము

———:O:———

మహావాక్య రత్నోత్పత్తి స్థానసూచికా గ్రంథావసరమును గూర్చి జంధ్యాల గౌరీనాథశాస్త్రులవారును నేనును వారు లోకాంతరగతులగుటకు సుమారు వారముదినముల క్రిందట ప్రస్తావించితిమి గనుకను వారికి నుపాధిసమాప్తివ్యవస్థ లేకుండ సంభవమైనది గనుకను ఈ గ్రంథము వారికి సమర్పించఁదలచి ఈ క్రింద వ్రాయువిధమున వారికి సమర్పణము చేయడమైనది.

కృష్ణయజుశ్శాఖీయులయినట్టియు, వేదాంత శాస్త్రమునందు విద్వాంసులయినట్టియు బెజవాడ యను వ్యావహారికనామముగల కృష్ణాతీరవిజయవాడనగరతీర్థవాసులయినట్టియు పరమభాగవతోత్తములయినట్టియు అపరోక్ష జ్ఞానవంతులయి బ్రహ్మసాక్షాత్కారమునొంది జీవన్ముక్తులయి అనంతరము విదేహముక్తులయినట్టియు పూర్వము హూణవిద్యావిషయమందుగూడ బీ. యె. యను బిరుదాంకము నొందినట్టియు కృష్ణాజిల్లా న్యాయసభాగ్రగణ్యవాదులలో నొకరైనట్టియు జంధ్యాల గౌరీనాథశాస్త్రులను వ్యావహారిక నామధేయధారులకు వారియందు నాకుండు యత్యంతగౌరవశల్కసూచకోపహారముగ నాచే రచియింపబడిన ఈ మహావాక్యరత్నప్రభవావళి యను గ్రంథరాజమును అత్యాదరముతో నిందుమూలముగ నివేదించుచుంటిని.

సిద్ధార్థినామసంవత్సర
మాఘబహుళ చతుర్దశి
బుధవారము మహాశివ
రాత్రి (౧౮-౨-౨౦)

అత్యంతమిత్రుఁడును బంధువుఁడునయిన
వెంపటి అమ్మన్న (తదనంతరం శ్రీసదానందేంద్ర
సరస్వతీస్వామి)

శ్రీరస్తు.

# అధోపోద్ఘాత ప్రారంభః.

—— :o: ——

అస్మన్మిత్రులార !

వేదము ఐహికాముష్మిక సుఖదాయకమును జ్ఞానప్రతి పాదకమును అసమానమును సర్వోత్కృష్టమును సర్వాస్తిక హింద్వాజనాభిమానమును మన మతమునకు ముఖ్యాధారమునునై దేదీప్యమానంబై వెలుంగుచున్నదని యందరకుం గరతలామలకముగఁ దెలిసినసంగతియే యయ్యున్నది. వేదము మంత్రమనియు బ్రాహ్మణమనియు రెండు భాగములుగ నున్నది. "మంత్రబ్రాహ్మణ యోర్వేద నామధేయం" యని యాపస్తంబులవారు చెప్పియున్నారు. ఇట్లు శ్రీ విద్యారణ్య స్వాముల వారు వేదప్రకాశిక యను తమ భాష్యములో కాండ ౧ ప్రపాఠకం ౧ క్రింద వ్రాసియున్నారు. "మంత్రబ్రాహ్మణాత్మకో వేదః" అని మాధవాచార్యులవారును వ్రాసియున్నారు. ఉపనిషత్తులు మంత్రభాగములోనైనను బ్రాహ్మణ భాగములోనైనను అంతర్గతములుగాని వేరుభాగము కాదు. ఇట్టి నమానరహితమగు వేదమంతయు నొక్కటిగ నేకరాశియై యున్నను కరుణారసపూరిత హృదయులయిన వ్యాస భగవానులు సర్వజనోపకారముగ నట్టి వేదమును రూపవిశేషముచే ఋగ్యజుస్సామలని మూడు శాఖలుగవిభజించి యుండిరి. "పాదేనార్థ్యేనచోపేతా వృత్తబద్ధా మంత్రాఃఋచః । గీతిరూప మంత్రాఃసామాని। వృత్తగీతి వర్జితత్వేనప్రశ్లిష్టపఠితా మంత్రాయజూంషి" ఇట్లు పూర్వోక్త వేదప్రకాశికయందే పూర్వోక్తస్థానమందే వ్రాయబడియున్నది. యజుస్సువిషయములో "యజురిత్యయతాక్షరపాదావసానో మంత్రవిశేషః తజ్జాతీయవచనోయజుః" అనిశంకరులవారును తైత్తిరీయానంద వల్ల్యుపనిషద్భాష్య

ములో వ్రాసిరి. అథర్వణ వేదమనునది పైనచెప్పిన మూడు రూపములు గాక వేరు రూపముగలది కాదు. గాన "వేదాశ్చత్వారః" యని వేదములు నాలుగు అయినప్పటికిని రూపమునుబట్టి "త్రయీవిద్యా" యనియే ప్రయోగములు గానంబడుచున్నవి. అందువలన "త్రయీవిద్యా" అనునపుడు అథర్వణవేదము అందులో చేరినది కాదనిన్ని ఆప్రయోగమువలన ఋగ్యజుస్సామ వేదములు మూడింటికే యర్థమనిన్ని కొందరు ప్రమాదవశమున యర్థము చేయుచున్నట్లుకనుపడుచున్నది. అథర్వణవేదీయ యగు పంచచత్వారింశత్తను సీతోపనిషత్తునందును "తత్త్రయీమయం సర్వార్థదర్శనం ఋగ్యజుస్సామరూపత్వాత్ త్రయీ పరికీర్తితా । కార్యసిద్ధేనచతుర్ధాపరికీర్తితా । ఋచోయజూంషి సామాన్య థర్వాంగిరసస్తథా । చతుర్హోతృప్రధానత్వాత్ లింగాదిత్రితయంత్రయీ । అథర్వాంగిరసంరూపంసామ ఋగ్యజురాత్మకం" అని యున్నది. గాన "త్రయీవిద్యా" మొదలగు ప్రయోగములలో అథర్వణవేదము కూడ చేరియున్నదనియే గ్రాహ్యము. అందు యజుర్వేదము శుక్ల కృష్ణ యజుర్వేదములచే రెండుశాఖలుగ ప్రస్తుతం వ్యవహారమందున్నది. అందు ఋగ్వేదము ఇరువదియొక శాఖలుగను యజుర్వేదము నూటయొన్మిదిశాఖలుగను సామవేదము వేయిశాఖలుగను అథర్వణవేదము ఏబదిశాఖలుగను ఆహత్య (మొత్తమున) వేయినూటయెనుబది శాఖలుగ విభజింపబడియున్నవి. ఒక్కొక్క శాఖకు నొక్కొక్క యుపనిషత్తు చొప్పున యుపనిషత్తులును నన్నియేయున్నవి. వానియందు సారతరమైన నూటయెనిమిది మాత్రము శ్రీరామచంద్రులవారు శ్రీహనుమంతులవారికి నుపదేశించిరి. ఆకారణంబున నిపుడు జగంబున నష్టోత్తరశతోపనిషత్తులు మాత్రమే సుప్రసిద్ధములైయున్నవి. వానినామములు శ్లోకరూపముగను ప్రత్యేకముగను

మహావాక్యరత్నావళ్యాఖ్యేయ పీఠికయందు విషయముక్రింద జూపబడియున్నవి. ఈ నూటయెనిమిది యుపనిషత్తులలో పది ఋగ్వేదగతములును పందొమ్మిది శుక్లయజుర్వేద గతములును ముప్పదిరెండు కృష్ణ యజుర్వేద గతములును పదియారు సామవేద గతములును ముప్పదియొకటి అధర్వణవేద గతములును అయ్యున్నవి. అంత్యోపనిషత్తైన ముక్తికోపనిషత్తుయందు ఈవిషయమంతయును వానివాని శాంతులును విరళముగ వ్రాయబడియున్నవి. ముముక్షువులకు ముక్తికి నొక్క మాండూక్యమే చాలుననియు దానివలన జ్ఞానము గలుగనపుడు దశోపనిషత్తులును అందువలననూ దృఢజ్ఞానముగలుగనియెడల ముప్పదిరెండుపనిషత్తులును కేవల విదేహముక్తికి అష్టోత్తర శతోపనిషత్తులునూ. చదువవలయునని మొదలగుసంగతులు ఇట్టిముక్తికోపనిషత్తుయందే వ్రాయబడియున్నవి. ఏయే యుపనిషత్తులకు నేయే శాంతులోకూడ ఆయుపనిషత్తుయందే వ్రాయబడియున్నది. వీనిలోవేనికి శ్రీమచ్ఛంకరాచార్యాది యేమహానీయులు భాష్యములు వ్యాఖ్యానములు జేసిరో పూర్వోక్త రత్నావళి పీఠికయందే వ్రాయబడియున్నది. పైనచెప్పిన ప్రకారముపదేశింపబడిన ఈనూటయెనిమిది యుపనిషత్తుల గ్రంథ బాహుళ్యమువలన పూర్ణముగ గ్రహింపనశక్తుడయి హనుమంతులవారు ఈసర్వోపనిషత్తులనుండి సారభూతమైన మహావాక్యములనేరి సంపూర్ణ జ్ఞానసిద్ధికొఱకు నుపదేశింప గోరగా శ్రీరామచంద్రులవారు అష్టోత్తర సహస్ర మహావాక్యములనేరి వానినొక హారముగజేసి మహావాక్య రత్నావళి యను వ్యావహారిక నామముచే సుప్రసిద్ధమయిన యట్టి హారమును హనుమంతునకు ధారణార్థ మనుగ్రహించిరనియు (అనగ నుపదేశించిరనియు) ను అందువలన నాతడు దుఃఖరహితుడై మహాతృప్తినిబొంది మహా జ్ఞానియై శ్రీరామునితో ఐక్యమును బొందుట యను బ్రహ్మైక్యము

నొందెను. ఈ హారము అనుగ్రహించుటకు సందర్భ మెట్లనిన శ్రీరామమూర్తి తన పట్టాభిషేక సమయమునందు మహా విద్వాంసులకును భక్తులు మొదలగు పరిచారకులకును పారితోషికముల నిచ్చుచు హనుమంతునకు మాత్రము యేమియు నియ్యకుండెను. అది సీతాదేవి కనిపెట్టి తన పతియైన శ్రీరాములవారిని ఇంతమందికి పారితోషికము లీయగా ఒక్క హనుమంతునికి మాత్రము యేమియు నొసంగకపోవుటకు కారణమేమని యడుగగ నాతడు కోతియనియు ఏమిచ్చిన ప్రయోజనమేమియనియు వానర స్వాభావిక చేష్టలచేత, వేనినైన బ్రద్దలుచేయుననియు, గాన నేమియు నవసరము లేదనియును చెప్పెను. అందుకు సీతాదేవి యా మాటల నంగీకరించక తమకత్యంత ప్రియభక్తుడు గనుక తగిన పారితోషికము నతనికిగూడ నీయవలయునని నిర్బంధించగా శ్రీరాములవారు ఒకగొప్ప నవరత్నహారమును దెచ్చి హనుమంతుని మెడయందు వేసెను. హనుమంతుడు ఆ హారమందలి ప్రతిరత్నమునుం దీసి యొకశిలచే బ్రద్దలుగొట్టెను. అది శ్రీరాములుజూచి సీతనుబిలచి చూచితివా నేనెంత జెప్పితినో యంతయయ్యెను. నీవు గొప్పవిలువగల హారమునిచ్చుదాక బాధించితివి యని యనెను. అప్పుడాదేవి హనుమంతునిబిలచి, యేమోయి, మీ అయ్యవారు చెప్పినట్లే చేసితివి. నాకు మాట దక్కించకబోతివి. నీనైసర్గికగుణము మానకపోతివి యనియన్నంతలో హనుమంతుడు, అమ్మా యేపూసలోనైన రామనామముగాని మరి యేపరమార్థతత్త్వముగాని యుండునేమో చూచుదమని ఒకొక్కటియే బ్రద్దలుచేయగా నొకదానియందును అట్టినామముగాని తత్త్వముగాని గానబడదయ్యెను. గాన నవియన్నియు యుపలములు (గులకరాళ్లు) గాని తదన్యములు గావయ్యెను. (సీతాదేవి) యని ప్రత్యుత్తరమిచ్చెను. "స్వామీ నీవట్టిహారమిస్తివేమి" యని పతిని యడుగగా

ఆయన మందస్మితముఖుఁడై కొంత సేపు యూరకుండి చతుర్వేదోపనిష న్మహావాక్యరత్నావళియను హారముదీసి తిరుగ కంఠాభరణముగ జేయ గా (ఉపదేశించగా) అప్పుడావానరమూర్తి వెనకటియట్ల ఈప్రతి వాక్య రత్నమును తిరుగ భిన్నముచేయుగా ఈప్రతిరత్నమందును తత్త్వమస్యాదిమహావాక్య లక్ష్యుఁడైన పరమాత్మ తత్త్వమును హారమధ్యమం దచ్చట చ్చట రామనామములును గనుబడగ ఆరత్నహారము నప్పుడు ధరించి అనగా పరమాత్మను సంధానముజేసి సాక్షాత్పరబ్రహ్మ స్వరూపుడై యుండెను. అని యొక పురాణగాథ వినుచున్నాము. కాబట్టి ఈమహావాక్యరత్నావళియొక్క ప్రభ, మహిమ ఇట్టిదని గ్రహించి ముముక్షువులు ఈమహాగ్రంథమును బహు శ్రద్ధాభక్తి విశ్వాసములతో పదేపదే జదివి అనుభవజ్ఞుల పరమాయిత్మను సంధానముజేసిముక్తులవుటకు ప్రయత్నించెదరని తలచెదను. ఈ హారమే హనుమంతున కుద్దేశించి మొదట సీతకివ్వగా యామె రాముని యంగీకారానుసారముగ హనుమంతున కిచ్చినదని గ్రహించదగియున్నది. మహావాక్యరత్నములు అష్టోత్తర సహస్రముగ నుండెను. రత్నములలోకి వజ్రమెట్లో యట్లు ఈరత్నములలో వేదమొకటింటికి నొక వజ్రముగా నవి ఋగ్వేదముకు "ప్రజ్ఞానంబ్రహ్మ" యనియు, యజుర్వేదముకు "అహంబ్రహ్మాస్మి" యనియు, సామవేదముకు "తత్త్వమసి" యనియు, అధర్వణవేదముకు "అయమాత్మా బ్రహ్మ" యనియు మహావాక్యములుగ స్థిరపడియుండెను. ఇవియే సాధారణముగ నందరకుం దెలిసిన మహావాక్యములై యున్నవి. ఈనాలుగు మహావాక్యములను పూర్ణముగ యనుసంధానము చేయగ బ్రహ్మసాక్షాత్కారము గలుగునుగాని యట్టి యనుసంధానముకు ఈయష్టోత్తర సహస్రరత్నములును చాలసహాకారులవును గాన వీనిని

పూర్వోక్త సందర్భములతో బాగుగశోధించి జదువగ జదువగ గలుగు జ్ఞానము ప్రస్థానత్రయశాంతిజేసి వేదాంత శాస్త్రముచు అనగ సూత్ర భాష్యగీతా భాష్యోపనిషద్భాష్యములను జదువుట మూలముగ నపరోక్షజ్ఞానసాధనము చేయుట అను ఉద్యమమువలన గలుగు జ్ఞానముకంటె సూ సూత్రములలో మోక్షమతిశయించుచున్నదని దలచెదను. సంసారతమస్సును బోగొట్టుటయందీ మహావాక్య విచారము సూర్యబింబము వంటిదగును. కర్మభక్తియోగాదులు దీపములవంటివగును. ఇదినా యపక్వప్రజ్ఞానుభవము వలన తెలిసికొనిన యంశము గనుక నా బోటియల్పజ్ఞులకుకూడ వెల్లడించుచున్నాను. ఈమహావాక్యములలో కొన్ని కొన్నిటికి సంపూర్ణగ్రహణమునకు పూర్వోత్తర సందర్భశోధనము అత్యావశ్యకమయి యుండును అట్టి శోధనమునకు తద్రత్నోత్పత్తిస్థానము తెలిసికొనుటకు దగిన మార్గమెక్కడను గానరాకుంటిని. నేనిట్టి యభావపీడితుడనయి యాకరముల సాధించవలెనని నావిద్యాదారుఢ్యముకును వయోదారుఢ్యముకును మించిన యుద్యమము నొకటిని ఉన్మత్తునివలె మొదటపైబెటుకొంటిని. కాని కేవలము ఈశ్వరుని నిర్హేతుకజాయమానకటాక్షముచేత నెటోనట్లు కార్యసిద్ధియై పదియిరువదిరత్నములకుదక్క శేషించిన రత్నములకన్నిటికి నుత్పత్తిస్థానమైన వేదమును న్నాయుపనిషత్తునున్నూ తదంతర్భాగములనున్నూ సాధిస్తిని. ఇట్లు సాధించుటకు ఈ యష్టోత్తరశతోపనిషత్తులను అయిదు యావృత్తులు జదువవలసి వచ్చినది. అన్ని యావృత్తులకును గ్రంధము సమకూర్చుటకును సార్థకవర్షముకంటె నెక్కువకాలము బట్టెను. ఇట్లు ప్రథమములో నా స్వోపయోగముకొరకు మాత్రమే నేని ప్రయత్నము నుద్దేశించినను ఇట్టి యాన్వేషణాలాభము అన్నదాదిజనసామాన్యముకు

గూడ గలుగఁజేయుట యుక్తమనితోఁచి మహావాక్య రత్నప్రభావావళి యనుపేర నీ గ్రంథరాజమును ప్రకటించబూనితిని. ఇట్లు ప్రయత్న ములోనుండ స్నేహితులు కొందరు సామాన్యజనముకు అర్థబోధకు, నితరగ్రంథావసరము లేకుండ నన్నేయాంధ్ర టీకాతాత్పర్యములుగూడ సమకూర్చునటుల యనుశాసించిరి. అట్టి ప్రయోజనమునకు దగిన గ్రంథము లిదివరకే కొన్నియున్నందున తిరుగ నేనట్టి ప్రయత్నము జేయుట పౌనరుక్త్యమని ప్రథమమున దలచినను ఉత్తరాలోచనచే నట్లు జేయుటయే యుక్తమని యభిప్రాయముగలిగి అట్టి ప్రయత్న ముగూడ జేస్తిని. ఈప్రయత్నములో సుప్రభయను పేరుగల యాంధ్ర టీకాతార్పర్యములనే కొన్నికొన్ని పరివర్తనములతోను అర్థమందు పదన్యూనాతిరిక్తనిర్వృత్తి రూపముగను చాలభాగ ముపయోగపర్చు కుంటిని. యందలి పదవిభాగము మాత్రము యనవసరమని బొత్తుగ వదలివేస్తిని. తాత్పర్యమునుకూడకొన్నిచోట్లననవసరమని కొట్టివేస్తిని. ఈ సుప్రభాఖ్యయనునది బహుదివ్యముగాను చాలసులభ బోధకము గనుయుండి నాకత్యానందము గలుగజేసి నానూతన గ్రంధరచనకు చాలసహాకారియై యున్నందుకు తద్గ్రంథకర్త యగు పులుగుర్త నృసింహామాత్యులవారికి " అపరిమిత కృత్వస్తేనమః " యను యజు రారణ్యకచతుర్థ ప్రశ్నశ్రుతి వాక్యానుసారముగ నపరిమిత నమ స్కారములు జేయుచున్నాను. ఈయమాత్యులవారు ఆక్షేయ మయిన యష్టోత్తర సహస్రసంఖ్యను విడిచి వాక్యము లన్నిటిని యంతకంటె చాల తక్కువ సంఖ్యలోనిమిడ్చిరి. వారిట్లు ం డుచేత నిమిడ్చిరో నేను గ్రహింప నశక్తుడనయి ఆక్షేయసం ఖ్యను మార్చనాకధికారములేదనితోచి ప్రతివాక్యమునకును అదిమూర్తి యనసంఖ్యావలంబనమే చేస్తిని. ఇదియు నత్యంతప్రయానకరమైనదై యిక

ర గ్రంథ సహాయముగూడ కావలసి వచ్చినది. ప్రతివాక్యమునకు క్రింద
నుత్పత్తిస్థానమును కనుపర్చుటమేగాక అన్ని వాక్యములకును ప్రకర
ణానుసారముగ అకారాదిసూచికగా ప్రతీకమును విద్యాదివిశేష ము
ఖ్యంత ప్రకరణమును తత్సంఖ్యయును తన్నామమును అందలి వాక్య
సంఖ్యయును వేదనామమును ఉపనిషత్సంఖ్యయును తన్నామమును
కొన్నిచోట్ల తదంతర్భాగములును కనుపరుచు నొకసూచిక బహువిపు
లముగ కూర్చబడి గ్రంథాంతమునందు చేర్చబడినది. ఇదియే నా ప్రధాన
ప్రథమోద్దిష్టకార్యము. ఈవాక్యములను శ్రీరామచంద్రయతీశ్వరులను
వారు సార్థాంతిక మహావాక్యములుగ విభజించి పదుమూడు ప్రకర
ణములుగ విభజించిరి. అందొక ప్రకరణము పునరపి అష్టధావిభజింప
బడినందున మొత్తము నిరువది ప్రకరణములుగా నయ్యెను. ఒక్కొ
క్క వాక్యమునకు ఆయావేదమును బట్టి పఠనాత్పూర్వమున్నూ పఠనా
నంతరమందున్నూ యథోక్తశాంతిని పఠించవలెను. ఆ యాశాంతుల
కర్థము బాగుగ గ్రహించిచెప్పుట చాల యానందకరముగ నుండును
గాన వాని కర్థమును తాత్పర్యమును గూడ వ్రాస్తిని. ఇట్టి లేఖనము
వివిధభాష్య టీకానుసారముగ జేయబడినది. వేదాంత పారిభాషిక పద
ములకున్నూ కొన్ని సంకేతిత సంఖ్యాత పదములకున్నూ మరికొన్ని
ముఖ్యమైన విశేష పదములకున్నూ ఒక యకారాదియను క్రమణిక
గూడ చదువరుల సౌలభ్యము కొరకు గ్రంథాంతమందు చేర్చబడినది.
ఈ వాక్యములు దేశభేదములచేత పాఠభేదములై యుండుటవలన ను
త్పత్తిస్థానదర్శనములో గాని సంఖ్యావిషయములో గాని నింక నేవిషయ
ములోగాని వ్యత్యాసములుండిన నుండవచ్చునుగాన నివి యవసరాను
సారముగను తమ బుద్ధ్యనుసారముగను బుద్ధిమంతులు సవరణ చేసికొన
వచ్చును. శ్రీరామచంద్ర యతీశ్వరులవారి మంగళాచరణమున్నూ

గ్రంధోపసంహారమున్ను గూడ జేర్చబడినది. మహావాక్య రత్నోత్పత్తి స్థానముల దర్శించు గ్రంధ మెక్కడనూ ఇదివరకు నెవరివలనను రచియింపబడి యున్నట్లు కనుబడదు. ఇది విద్వజ్జనమునకు నొకయభీష్ట వస్తుభావముగనున్నట్లు యెంచి "కార్యం ప్రాగభావప్రతియోగి" యను తార్కిక వాక్యాను సారముగ తదభీష్టవస్తుభావ ప్రతియోగిగ నీ గ్రంధము ప్రకటింపబూనితిని,కనుకనున్నూ ఇదియే ప్రధమప్రకటనము గనుకనున్నూ ఇందు స్ఖాలిత్యములు అనేకము లుండవచ్చును. పెద్దలట్టి స్ఖాలిత్యములను సున్నించి ముందుముద్రణలో నేను సవరించుకొనునట్లు నాకు విధించిన్ని గ్రంధముయొక్క ఉపయోగా ద్యవసరములనున్నూ ఏమైన సుగుణము లున్నయెడల వానిని గ్రహించిన్ని నాకు ప్రోత్సాహముకలుగ జేయుదురని విశేషముగ ప్రార్థించుచున్నాను. ఈగ్రంధము వ్రాయుటలో సాధారణముగ సంలాపోచిత భాషాసరణిగనే వ్రాయడమయినది. వ్యాకరణోక్తముగ వ్రాయుటకు విశేషముగ శ్రద్ధనివ్వలేదు. గనుక ఆంధ్రపండితులు క్షమించ ప్రార్థితులు.

| | |
|---|---|
| సిద్ధార్థినామసంవత్సర మాఘబహుళ చతుర్దశి బుధవారము మహా శివరాత్రిః (౧౮-౨-౨౦) | విద్వజ్జన విధేయుడు వెంపటి అమ్మన్న (తదనంతరం శ్రీసదానంద్రేంద్ర సరస్వతి స్వామి.) |

ఆదర్శ వాక్యములు - యధాజాత్యంధస్యనస్వరూప జ్ఞానంనవిద్యతే । తధాగురూపదేశేన వినాకల్పకోటిభి స్తైరపి - తత్త్వజ్ఞానం నజాయతే (౫౧ మహానారాయణోపనిషత్తు) గుశబ్ద స్త్వంధకారస్స్యాత్ । రుశబ్ద స్తన్నిరోధకః । అంధకార నిరోధిత్వా ద్గురురిత్యభిధీయతే. (౫౩ అద్వయతారకోపనిషత్తు) ఈవాక్యములను పదేపదే స్మరించుచు సత్కులప్రసూతుండు సమస్తవేదాంత సిద్ధాంతవేత్తయు, సర్వభూతహితుండును, బ్రహ్మవిదుండును, సర్వదోష రహితుండును నగు సద్గురుని వెతికి ఉపదేశించబడవలెను.

# సార్ధాంతికశబ్దప్రశంస.

———:o:———

ఈ మహావాక్యరత్నావళి యను గ్రంథమునందుండు వాక్యములు సామాన్యవాక్యములుగను, అర్ధాంతిక వాక్యములుగను విభజింపబడియున్నవి. అందు సామాన్యవాక్యములనగ నొక ఋక్కుయొక్కగాని శ్లోకముయొక్కగాని భాగముగాకుండ ప్రత్యేకముగ స్వతంత్రవాక్యమై యున్నది. అదెట్లనిన "సర్వంఖల్విదం బ్రహ్మ తజ్జలానితిశాంత ఉపాసీత" ఇట్టి వాక్యములు ప్రతి ప్రకరణములోను ప్రథమములో గొన్నియుండి యనంతరము అర్ధాంతిక వాక్యములు ప్రారంభమవును. ద్వివిధ వాక్యములును గలియుటచేత సార్ధాంతిక మహావాక్యములను పేరుచే ప్రసిద్ధమవుచున్నవి. అర్ధాంతికములనగ నొక ఋక్కుయొక్కగాని శ్లోకముయొక్కగాని సగముచే నంతమును బొందుచున్న వాక్యమని యర్థము. ఇట్టి యర్థమే కిరణావళియను మహావాక్యరత్నావళి వ్యాఖ్యానమం దిట్లు వ్రాయబడియున్నది.

"అర్ధాంతికంకిమిత్యత్ర సంహితా కాలేఋగ్వి రామా
ణామవసానమితిసంజ్ఞా। తేషామవసానాంక్రమకా
లేసంధ్య భి వాదర్ధాంతిక మితిసంజ్ఞేతివేదలతస్ఞే
భిగతం। విధివాదవిచారస్తులోచనేద్రష్టవ్యః। అవిధే
మబ్రహ్మ[illegible] వన్న వా [illegible]ని।
తానికానీత్యత్రఆహాసర్వమిత్యాదివా॥"

ప్రతి ప్ర[illegible]రణమందును ఎంతవరకు సామాన్యవాక్యములో ఎచ్చటినుండి యర్ధాంతికవాక్య ప్రారంభమో విషయసూచికయందు గనబర్చబడినను గ్రంథమధ్యమందు వివరించబడి యుండలేదు. అట్టి విభజన

సామాన్యముగ ననుభవవేద్యమే. అయితే కొన్ని గ్రంధములయందు మాత్రము యట్టి విభజనముగూడ వ్రాయబడియున్నది. అర్థాంతిక వాక్యము కుదాహరణము. "ఆత్మానం చేద్విజానీయాద యమస్మీతిపూరుషః । కిమిచ్ఛన్కస్య కామాయశరీరమనుసంజ్వరేత్ ॥ ఈ శ్లోకమునందుండు రెండువాక్యములును రెండర్థాంతిక వాక్యములై యున్నవి.

శ్రీరస్తు.

శ్రీగురుభ్యోనమః

శ్రీమహావాక్యరత్నావళ్యాక్షేయపీఠికాదయః

హరిః ఓం.

ఓమ్॥ అథఖలుఋగ్వేదాదివిభాగేనవేదాశ్చత్వారః । తత్రైకవింశతిశాఖాఋచః । నవాధికశతశాఖాయజుషః । సహస్రశాఖాస్సామ్నః । పంచాశచ్ఛాఖాఅథర్వణస్య । ఏకైకస్యాశ్శాఖాయా ఏకైకోపనిషత్ । ఆహత్యాశీతిసహితశతాధిక సహస్రసంఖ్యాకా ఉపనిషదః । తాసు శ్రీరామచంద్రేణ రామదూతాయ సారతరోపనిషదష్టోత్తర శతసంఖ్యాకా ఉపదిష్టాః । తథాచ ముక్తికోపనిషత్ స్థాష్టోత్తరశతోపనిషన్నామ శ్లోకాలిఖ్యంతే॥

ఈశ కేనకఠప్రశ్న ముండమాండూక్యతిత్తిరిః । ఐతరేయంచ ఛాందోగ్యంబృహదారణ్యకందశ ॥౧॥ బ్రహ్మకైవల్యజాబాలశ్వేతాశ్వోహంసఆరుణిః । గర్భోనారాయణోహంసో బిందునాదశిరశ్శిఖా ॥౨॥ మైత్రాయణీకౌషీతకీబృహజ్జాబాలతాపనీ । కాలాగ్నిరుద్రమైత్రేయీ సుబాలక్షురిమంత్రికా ॥౩॥ సర్వసారంనిరాలంబం రహస్యంవజ్రసూచికం । తేజోనాదధ్యానవిద్యాయోగతత్త్వాత్మబోధకం ॥౪॥ పరివ్రాట్త్రిశిఖీసీతాచూడానిర్వాణమండలం । దక్షిణాశరభం స్కందం మహానారాయణాద్వయ

యం॥౯॥ రహస్యం రామతపనం వాసుదేవఀ చముద్గలం। శాండిల్యం పైంగలంభిక్షుమహచ్ఛారీరికంశిఖా॥౬॥ తురీయాతీతసన్యాసపరివ్రాజాక్షమాలికా। అవ్యక్తాక్షరం పూర్ణాసూర్యాక్ష్యధ్యాత్మకుండికా॥౭॥ సావిత్ర్యాత్మాపాశుపతం పరబ్రహ్మావధూతకం। త్రిపురాతపనం దేవీత్రిపురాకఠభావనా॥౮॥ హృదయంకుండలీభస్మ రుద్రాక్షగణదర్శనం। సారతారంమహావాక్యం పంచబ్రహ్మాగ్నిహోత్రకం॥౯॥ గోపాలతపనం కృష్ణం యాజ్ఞవల్క్యం వరాహకం। శాట్యాయనీహయగ్రీవం దత్తాత్రేయంచగారుడం॥౧౦॥ కలిజాబాలి సౌభాగ్య రహస్యంబుచముక్తిక.౧౦౦. ఇతి (ఈశాద్యష్టోత్తరశతోపనిషదాంశాఖాభేదందర్శయతి) తత్రదశోపనిషదః ఋగ్వేదగతాః। శుక్లకృష్ణభేదేన యజుషఏకపంచాశత్। తత్ర శుక్లయజుష ఏకోనవింశతిః। కృష్ణయజుషోద్వాత్రింశత్। సామ్నఃషోడశ। అథర్వణస్యైకత్రింశత్, ఆహత్యాష్టోత్తరశతం। (అథైషాంపూర్వాచార్యప్రకాశితత్వం దర్శయతి) తత్రగౌడపాదాచార్యైర్మాండూక్యోపనిషద్వ్యాఖ్యాతా। శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యైః దశోపనిషదః। పంచరుద్రాన్నృసింహతాపనీచ శంకరానందైఃసనా శివచరణైస్స్వయంప్రకాశానందాద్యైశ్చ ద్వాత్రింశోపనిషదః। విద్యారణ్యాచార్యైరష్టోత్తరశతోపనిషదో వ్యాఖ్యాతాః। (మహావాక్యరత్నావళ్యాఖ్యాయికాయాస్త్రయోదశధావిభాగం దర్శయతి) ప్రకృతేషు। రామచంద్రేణోపదిష్టే రామదూతాయధీమతే। ఈశాద్యష్టోత్తరశతోప-నిషద్యాదసాంపతే। నిమజ్య్యాత్ర మహావాక్యరత్నావళిరుదాహృతా। విభావ్యతేవిభాగేన సాత్రయోదశధాపునః। తత్రాదావిధివాక్యాని బంధమోక్షపరాణిచ। అవిద్వద్ధేయవాక్యాని జగన్మిథ్యాపరాణిచ। అథోపదేశవాక్యాని జీవైక్యపరాణిచ। బ్రహ్మవిన్మననాఖ్యాని జీవన్ముక్తిపరాణిచ। బ్రహ్మానుభూతిగూఢాని తత్సనాథపరాణిచ। అష్టస్వరూపవాక్యా

ని ఫలవాక్యాన్యనంతరం। విదేహముక్తివాక్యాని లిఖ్యంతేఽన్వివృత
క్రమాత్। యస్స్వాశ్రమాచారద్విత పరిబ్రాజితేంద్రియః। సోధికారీ
మహావాక్యరత్నానక్యాంనచాపరః। వాక్యార్ణసహనావ్యయుం భద్రం
కర్ణేభిరేవచ। పంచశాంతీః పఠిత్వాదౌపఠేద్వాక్యా న్యనంతరం-(వాక్య
పఠనాంతేపి ఏతశ్చంచశాంతయః పునరపిపఠనీయాః)

# తాళ్చ.

## ౧. ఋగ్వేదమహావాక్యానాం.

హరిః-ఓం-వాఙ్మేమనసి ప్రతిష్ఠితా మనోమేవాచి ప్రతిష్ఠితమా
విరావీర్మఏధి॥ వేదస్యమ ఆణీస్థశ్రుతంమే మాప్రహాసీరనేనాధీతేనాహో
రాత్రాన్సంధధామ్యృతంవదిష్యామి సత్యంవదిష్యామి తన్మామవతు
తద్వక్తారమవత్వవతు మామవతువక్తారమవతు వక్తారం॥ ఓం శాంతి
శ్శాంతిశ్శాంతిః॥ హరిః-ఓం॥ఇత్యైతరేయ ద్వితీయారణ్యకేస ప్తమో
ధ్యాయః॥

దీనిస్వరముకుముంబై దేవనాగరీప్రతిలో ఆరణ్యక శాంతిపాఠ
ముచూడవలెను. ఈశాంతిఐతరేయోపనిషత్తుతో సంబంధించువరకు
చతుర్థాధ్యాయముగను ఆత్మషట్కమష్టఖండముగానూయున్నది. ఇది
యంత్యాధ్యాయముగ నొక్కపర్యాయమును శాంతిగ నొక్కపర్యా
యము మొత్తమునరెండుపర్యాయములు పఠనాంతమునచెప్పవల
యును. ఐతరేయశాంతికి నుత్తరశాంతియునుగలదు. శేషించిన ఋగ్వే
దోపనిషత్తులకు యథాప్రకారము ఆద్యంతములరెండుపర్యాయములు
చాలును. ఉత్తరశాంతియెట్లనిన,

ఉదితఃశుక్రియందధే। తమహమాత్మనిదధే। అనుమామైత్విన్ద్రి
యం। మయిశ్రీర్మయియశః। సర్వఃసప్రాణఃసబలః। ఉత్తిష్ఠా మ్యను
*మాశ్రీః॥ ఉత్తిష్ఠత్వను మాయంతు దేవతాః। అదబ్ధంచక్షురిషితంమనః।
సూర్యోజ్యోతిషాం శ్రేష్ఠోదీక్షేమామాహింసీః। తచ్చక్షుర్దేవహితం
శుక్రముచ్చరత్। పశ్యేమశరదఃశతంజీవేమశరదశ్శతం। త్వమగ్నేవ్ర
తపాఅసి దేవఆమర్త్యేష్వా। త్వంయజ్ఞేష్వీడ్యః॥ *మ్యనుశ్రీఃఇతికస్వ
చిత్పాఠః।

ఈక్రిందవ్రాయుప్రకారము "ఆనందాశ్రమ సంస్కృతగ్రంథా
వళిః-గ్రంథాంకః ౧౧. ఐతరేయోపనిషత్తు" యందున్నది.

వాఙ్మేమనసీత్యాదిమష్టఖండరూప శాంతిస్తు ఓంభూమిముప
స్పృశేదిత్యాదివాగ్రసఇత్యంతంశాంతేః పఠనేవికల్పేనసంప్రదాయః।
సేయంయథా—హరిః-ఓం-భూమిముపస్పృశేదగ్న ఇళానమ ఇళానమ
ఋషిభ్యోమంత్రకృద్భ్యోమంత్రపతిభ్యోనమోఽస్తు దేవేభ్యః। శివాన
శ్శంతమాభవసు మృళీకాసరస్వతిమాతేవ్యోమసందృశి। భద్రంకర్ణేభి
శ్శృణుయామదేవాభద్రంపశ్యేమాక్షభిర్యజత్రాః। స్థిరైరంగైస్తుష్టువాం
సస్తనూభిర్వ్యశేమదేవహితంయదాయుః॥ (౧-౬-౧౬) శన్నఇంద్రా
గ్నీభవతామవోభిశ్శన్నఇంద్రావరుణారాతహవ్యా। శమింద్రాసోమా
సువితాయశంయోశ్శన్నఇంద్రాపూషణావాజసాతౌ॥ (౫-౩-౨౮) స్తు

షేజనంపు(నతంనవ్యసీభిర్గిర్భిర్భ్రి(తాపరుణాసుమ్న యంతా। తఽఆగమ తు

తఽఇహ(శ్రువంతు సుతప్రాసోవరుణోమిత్రో అగ్నిః॥ (౪-౮-౫) కయా

నశ్చిత్రఽఆభువదూతీసదావృధస్సఖా। కయాశచిష్ఠయావృత ॥(౩-౬-౪)

కస్త్వాసత్యోమదానాం మంహిష్ఠోమత్సదంధసః। దృఢాచిదారుజేవసు॥

(౩-౬-౨౪) నాపృణి విభవాన్వృక్షరాః వేశనీ। యచ్ఛానశ్శర్మస ప

థా॥ (౧-౭-౬) ఓ స్తాపిధానకలీవంతై పరివృతాపవిః। సర్వస్యైవా

చః ఈశానాచారుమామిహావాదయేదితి నా(గసః॥

వాఙ్మేమనసీతిశాంతికి టీః:—వాక్=బ్రహ్మవిద్యను బ్రతిపాదిం

చు గ్రంథపాఠమును బ్రవర్తించు నావాక్కు, మే=నాయొక్క, మన

సి మనస్సునందు, ప్రతిష్ఠితా=సర్వదా ప్రతిష్ఠింపబడినది (అస్తు=అగుగాక)

(మమ=నాయొక్క) మనః=మనస్సు, మే=నాయొక్క, వాచి=వాక్కు

నందు, ప్రతిష్ఠితం=ప్రతిష్ఠింపబడినది (అస్తు=అగుగాక) మనస్సు సావధా

నము లేనియెడల ముందు వెనుక ప్రలాపమువలెఅసంగతముగా మాటలాడును

వాక్కునకు పాటవములేనియెడల గద్గదధ్వనితో మాట్లాడును. గాన

వాఙ్మనస్సులకు అన్యోన్యానుకూలము ప్రార్థింపబడెను. (హే) ఆవిః=ఓ

ఆవిర్భూతమగు బ్రహ్మచైతన్యమా, మే=నాకొరకు, అవిరేధి=నాయ

విద్యను బోగొట్టుము బ్రకటమగుము. (ఆవీఃయని దీర్ఘము కొన్నిపాఠ

ములందున్నది. అదియే క్రమమయిన పాఠమైనయెడల ఛాందసమై

యుండును.) (ఒకఆవిశ్శబ్దము బ్రహ్మవాచకమైన నామవాచకము.

రెండవ ఆవిశ్శబ్దము ఉపసర్గము) పూర్వోక్త ప్రకారము పరస్పరాను

కూలములగు ఓ వాఙ్మనస్సులారా మేనాయొక్క, వేదస్య=బ్రహ్మవి

ద్యను ప్రతిపాదించునట్టు నేజదివెడి గ్రంథమునకు, ఆణీ=ఆనయన సమర్థములై, స్థః=ఉండి, మే=నాయొక్క, శ్రుతం=గ్రంథము అనగా నాచేత వినబడిన గ్రంథతదర్థజాతము, మాప్రహాసీః= మరువబడినది గాక పోవుగాక. అనేన=ఈ, అధీతేన=అధ్యయనముచేయబడిన గ్రంథముచేతను, అహోరాత్రాన్=రాత్రింబగళ్లను, సందధామి=సంయుక్తముగా జేయుదును. సోమరితనమును వదిలి రాత్రింబగళ్ళయందు అధ్యయనమును జేయుదునని తాత్పర్యము. ఋతం=నేను జదివెడి గ్రంథములో పరమార్థమునే, వదిష్యామి=చెప్పెదను. సత్యం=యదార్థమునే, వదిష్యామి=చెప్పెదను. ఇచ్చట ఋతసత్యములకు మానసత్వ వాచికత్వములచేత భేదముగాన పునరుక్తిలేదు. మనస్సుచేత వస్తుయాథార్థ్యమును విచారించి వాక్కుచేత పలుకుదును. అని తాత్పర్యము. తత్ = ఆచెప్పబోవు బ్రహ్మతత్త్వము, మాం= శిష్యుడనగు నన్ను, అవతు=రక్షించుగాక, తత్ =ఆబ్రహ్మతత్త్వము, వక్తారం=బోధకులగు ఆచార్యులను, అవతు=రక్షించుగాక. మాం = శిష్యుడనగునన్ను, అవతు = బ్రహ్మము రక్షించుగాక వక్తారం = నాయాచార్యునిన్ని, అవతు = రక్షించుగాక. ఇచట తన్మామవతు తద్వక్తారమవతు అనునవి సాధనకాలమందు విద్యోత్పత్తికి ప్రతిబంధకములగు విఘ్నములయొక్క పరిహారమును ప్రార్థించువాక్యములు. అవతుమాం, అవతువక్తారం అనునవి విద్యోత్పత్త్యనంతరమునందు అసంభావనా విపరీతభావనాజనకవిఘ్నములయొక్క పరిహారమును ప్రార్థించువాక్యములు. అవతు వక్తారం అను రెండవపర్యాయము చెప్పబడిన వాక్యము అధ్యాయసమాప్తిసూచన కొరకని తెలుసుకొనదగినది. ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః యని మూమార్లు చెప్పుట ఆధ్యాత్మికాది భౌతికాధి దైవిక తాపత్రయ నివారణము కొరకును, ఇతరవిఘ్నముల యుపశాంతి కొరకునని తాత్పర్యము.

తా:-టీకాంతర్గతమయియే యున్నది గనుక వేరుగ వ్రాయబడ లేదు. (భూమి ముపన్నా శేదిత్యాది పాఠముకును నుత్తరశాంతి పాఠముకును నిచ్చట గ్రంథవిస్తరభీతిచే నర్థము వ్రాయబడలేదు.

౨ శుక్లయజుర్వేద మహావాక్యానాం.

హరిః-ఓం- పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే। పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥ ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః।

హరిః-ఓం. ఇతి ౧ బృహదారణ్యకేసప్తమాధ్యాయు ప్రథమం బ్రాహ్మణం (ఇది ౧౮ అవశిష్టస్వరూపవాక్యములలో ౩_౪ వాక్యము లుకూడ నవుచున్నది.)

౧. టీ: అదః=పరోక్షముగనున్నదియు, పూర్ణం = బ్రహ్మముచే పూర్ణమైనదియు, ఇదం=ప్రత్యక్షముగనున్నదియు, పూర్ణం=బ్రహ్మముచే పూర్ణమైనదియు, పూర్ణాత్=పూర్ణముకన్న (పూర్ణముగానున్నదని యూహింపబడిన జగత్తుకన్న) పూర్ణం=పరిపూర్ణమైన బ్రహ్మము, ఉదచ్యతే=అతిక్రమించుచున్నది. పూర్ణస్య=పూర్ణమైన బ్రహ్మముయొక్క, పూర్ణం=పూర్ణమును (అహం బ్రహ్మాస్మి యను భావమును) ఆదాయ=గ్రహించి (పొంది) పూర్ణమేవ=అసంగమైన కూటస్థస్వరూప బ్రహ్మమే, అవశిష్యతే=శేషించుచున్నది.

౧. తా: సమస్తము పరిపూర్ణమైన బ్రహ్మమే. ఒక పాదమున నుండి పూర్ణముగనున్నట్లు గనబడు మాయాకార్యమైన జగత్తు నతిక్రమించును బ్రహ్మము పూర్ణముగనున్నది. ఉపాధులు నశింపగ కూటస్థస్వరూపమే పరిపూర్ణబ్రహ్మమై శేషించుచున్నది.

౨. టీ:- ఈశాంతి పఠ "పూర్ణ" యను పదములతో కూర్చ బడియున్నది. అదః=తత్పదలక్ష్యార్థమైన పరబ్రహ్మ' పూర్ణం=దేశకాల వస్తుపరిచ్ఛేద రహితమై సర్వవ్యాపకమైనది. ఇదం=ఈనామరూపాత్మకమై కనబడుచు సోపాధికమైన జగము (వ్యవహారాపన్నము గనుక) పూర్ణం = తనరూపముచేతనే (పరమాత్మచేతనే) వ్యాపింపబడినది. పూర్ణం=కార్యాత్మకబ్రహ్మ పూర్ణాత్ =కారణాత్మక బ్రహ్మవలన, ఉదచ్యతే=అతిశయించుచున్నది (కారణమైన పరమాత్మభావమును విడిచి పెట్టుటలేదు) పూర్ణస్య=కార్యాత్మకమైన బ్రహ్మయొక్క, పూర్ణం=పూర్ణతను, ఆదాయ=తీసికొని (కారణసత్తగలదానినిగా తెలిసి అవిద్యవలన గలిగిన భేదతవ్యవహారమును పరిహరించి,) (స్థితస్య) జ్ఞానినః=ఉన్నబ్రహ్మ జ్ఞానికి, పూర్ణమేవ= ప్రజ్ఞాన ఘనైకరసస్వభావమైన కేవలబ్రహ్మమే అవశిష్యతే=మిగిలియున్నది.

౨. తా:- సకలోపనిషత్ప్రతిపాద్యమైన యీపూర్ణపదార్థమే ఈమంత్రముచేత అనువదించ బడుచున్నది. కార్యకారణాత్మకమైన నామరూపాది వ్యవహారముచే నానావిధములుగా వేరువేరు ఉపాధుల తో గూడికొనిన ఈజగత్తు అవిద్యాకల్పితమైనది గనుక దాని కధిష్ఠానమైన పరిపూర్ణబ్రహ్మస్వరూపము సర్వం ఖల్విదం బ్రహ్మయను శ్రుతిబలముచేత కార్యమైన జగము కారణబ్రహ్మకంటె వేరు సత్తగలది కాదని ఆపరిపూర్ణబ్రహ్మనిగా తెలిసికొన్న విద్వాంసుడు, ఆరోపిత దేహోపాధిభ్రాంతి నశించగా తాను పరిపూర్ణబ్రహ్మమాత్రుడై మిగిలి యుండునని తాత్పర్యము. రజ్జువునందు కల్పితమైన సర్పమును దానివలన గలిగిన భయకంపాదులును, రజ్జువును తెలియగానే యవి యచ్చటనే లయించి రజ్జుమాత్రమే శేషించి అజ్ఞాన కల్పిత సర్పభయ కంపాదులు నశించి

జ్ఞానానందములు వచ్చినట్లుగా బ్రహ్మసాక్షాత్కారము కాగానే అవిద్యకములైన భ్రాంతులునశించి స్వరూపానంద బ్రహ్మసాక్షాత్కారము నిర్బాధకముగానుండును. ముమ్మారు శాంతిని పఠించుట ఆధ్యాత్మికాది భౌతికాధిదైవిక తాపత్రయ నివారణము కొరకును ఇతర విఘ్నముల యుపశాంతికొరకునని తాత్పర్యము.

౩. కృష్ణయజుర్వేదమహావాక్యానాం.

హరిః-ఓం - సహనావవతు । సహనౌభునక్తు । సహవీర్యంకరవావహై । తేజస్వినావధీతమస్తుమావిద్విషావహై॥ ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః॥

హరిః-ఓం-కృష్ణయజుర్వేదతైత్తిరీయశాఖోపనిషదానందవల్లీశాంతిః.

టీ:- నౌ=శిష్యాచార్యులమగుమాయిద్దరిని, సహ=కూడ, అవతు =రక్షించును గాక, నౌ=శిష్యాచార్యులమగుమాయిద్దరిని, సహ=కూడ (బ్రహ్మ=పరబ్రహ్మమును) భునక్తు=అనుభవింపచేయునుగాక, సహ= కూడ, వీర్యం=సామర్థ్యమును (విద్యానిమిత్తకమైనసామర్థ్యమును) కరవావహై= చేయుదుముగాక, అధీతం=అధ్యయనముచేయబడినది (మాయిద్దరిచేతనుచదువబడినది) నౌ=మాయిద్దరికిని, తేజస్వి= తేజోవంతమైనది, అస్తు=అగునుగాక (అర్థజ్ఞానయోగ్యమైనదగునుగాక) (ఆవాం = శిష్యాచార్యులమగుమేమిద్దరమున్నూ) మావిద్విషావహై=విరోధమును పొందకపోదుముగాక (మాయిద్దరికినియేదైనను ప్రమాదమువలన ద్వేషముకలిగినేని అదిలేకుండ బోవునుగాక) శాంతిశ్శాంతిశ్శాంతిః=ఈశాంతి త్రయము ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవిక తాపత్రయముకొరకును విద్యావిఘ్నముయొక్క శమముకొరకును యని యెరుగవలయును.

తా:-ముందుపఠించబోవు పరబ్రహ్మవిద్య శిష్యాచార్యులమగు

మమ్మిద్దరిని రక్షించునుగాక - మాయిద్దరికిని పరబ్రహ్మానుభవముకలుగ జేయునుగాక - మాయిద్దరికిని బ్రహ్మవిద్యానిమిత్తమైన సామర్థ్యము కలుగునుగాక - మాచేతనధ్యయనము చేయబడినది తేజోవంతమగునుగాక - శిష్యాచార్యులమగు మాయిద్దరికిని ప్రమాదమువల్లనైనను అన్యాయమువల్లనైనను ద్వేషము కలుగకపోవునుగాక - శాంతియగునుగాక - ఇట్లు ప్రార్థనాపూర్వకముగా ముందు పలుకబోయెడి వాక్యములయొక్క విఘ్ననాశముకొరకు శాంతినిజేసి అవిఘ్నముగా శిష్యునిచేత బ్రహ్మవిద్యప్రాప్తి కోరబడుచున్నది యని తాత్పర్యము.

౪. సామవేదమహావాక్యానాం,

ఆప్యాయంతుమమాంగాని వాక్ప్రాణశ్చక్షుశ్శ్రోత్రమథోబలమింద్రియాణిచ సర్వాణిసర్వం బ్రహ్మోపనిషదం మాహంబ్రహ్మనిరాకుర్యాం మామాబ్రహ్మనిరాకరోదనిరాకరణ మస్త్వనిరాకరణంమే అస్తుతదాత్మనినిరతేయ ఉపనిషత్సుధర్మాస్తే మయిసంతు తేమయిసంతు॥ ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః॥ ఇతి ఛాందోగ్యోపనిషద్యష్టప్రపాఠకే పంచదశఖండేద్వితీయంవాక్యం। ఉపనిషదంత్యవాక్యంచ॥

టీ:-మమ=నాయొక్క, అంగాని = అవయవములును, వాక్ = వాక్కును. ప్రాణః=ప్రాణమును, చక్షుః=నేత్రమును, శ్రోత్రం=చెవియును, అథోబలం=అథోముఖవృత్తియందు సామర్థ్యముగల మనస్సును, సర్వాణి=అన్ని, ఇంద్రియాణిచ = ఇంద్రియములును, ఆప్యాయంతు= తృప్తిపొందుగాక. ఉపనిషదం=వేదాంతప్రతిపాద్యమైన, బ్రహ్మ=బ్రహ్మస్వరూపము, సర్వం=సకలమగును. అహం=నేను, బ్రహ్మ=పరమాత్మను మానిరాకుర్యాం=నిరాకరించకుందునుగాక. మాం=నన్ను, బ్రహ్మ=పర

ప్రమాత్మ, మానిరాకరోత్ =నిరాకరించక యుండుగాక. అనిరాకరణం= ఆదరము, అస్తు=కలుగుగాక. మే=నాకు, అనిరాకరణం = విశ్వాసము, (లక్ష్యభావము) అస్తు=అగుగాక. తత్=ఆ, ఆత్మని = బ్రహ్మమందు, నిరతే=ఆశక్తిగల. మయి = నాయందు, యే=ఏ, ఉపనిషత్సు= వేదాంతములందు చెప్పబడిన, ధర్మాః=ధర్మములో, తే=అవి, సంతు=ఉండుగాక. ద్విరుక్తి ఆదరమును సూచించును) ఓం=ప్రణవస్వరూపముగు పరబ్రహ్మమా, శాంతిశ్శాంతిశ్శాంతిః = విఘ్నములు పరిహరించుదువు గాక.

తా:–సామవేదార్థ సారభూతమైన తత్త్వమసి మహావాక్యార్థ నిశ్చయప్రకారము త్వంపద వాచ్యుడైన జీవునియొక్క అవయవములగు వాక్కు ప్రాణము నేత్రములు శ్రోత్రములు మనస్సు మొదలైన సకలేంద్రియములను విషయాదులందు ప్రవర్తించనివ్వక త్వంపద లక్ష్యభూతుడైన ప్రత్యగాత్మన్మాత్రు మానట్లు జేసి జహదజహల్లక్షణచేత ప్రత్యగాత్మను తత్పదలక్ష్యమైన బ్రహ్మమందు అసిపదముచేత నైక్యపరచి సర్వం బ్రహ్మమను నరుభవానందము పొందుటకై పరబ్రహ్మమే సలక్షణముచేత సద్గురుడనియు విలక్షణముచే పరమాత్మయనియు, అధికారియైన ముముక్షువు తనకు గురుబోధయందును ఆబోధకు లక్ష్యమైన పరమాత్మయందును అనిరాకరణము అనగా అలక్ష్యత లేకయుండు గాక యనియు సద్గురుడును పరమాత్మయు తన్ను నిరాకరించక (భ్రాంతి సముదాయము లోబడనివ్వక) ఆదరింతురుగాక యనియు బ్రహ్మనుభవమును అపేక్షించిన తనయందు వేదాంతములయందు చెప్పబడిన శమదమాదుల మొదలైన యావద్ధర్మములు కలిగియుండుగాక యని ఆప్యాయంతు అని శాంతిని యుచ్చరించుట ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికములయిన విఘ్నములయొక్క పరిహారనిమిత్తమని పెద్దలు చెప్పు

మరు. ఆధ్యాత్మిక మనగా శరీరము నాధారముచేసికొని పుట్టునట్టి జ్వరము తలనొప్పి వ్రణము మొదలగు వానివలన గలిగిన తాపములు ఆధిభౌతికములనగా దయ్యము రాక్షసుడు పులి సింహము మొదలగుభూతములద్వారా గలుగు బాధలు. ఆధిదైవికములనగా దైవవశముగా పిడుగు మెరుపు మొదలగు వానివలన గలుగు తాపములు. ఓం అని శాంతికి పూర్వము స్మరించుట సమస్తక్లేశ పరిహార మూలకముగా విఘ్నములేక జీవబ్రహ్మైక్య జ్ఞానోదయ లాభముకొరకని తెలియవలెను.

౫. అథర్వణ వేద మహావాక్యానాం.

భద్రంకర్ణేభిశ్శృణుయామ దేవాభద్రంపశ్యేమాక్షభిర్యజత్రాః
స్థిరైరంగైస్తుష్టువాంసస్తనూభిర్వ్యశేమ దేవహితంయదాయుః॥ స్వస్తి
నఇంద్రోవృద్ధశ్రవాః స్వస్తినఃపూషావిశ్వవేదాః। స్వస్తినస్తార్క్ష్యో।
అరిష్టనేమిః స్వస్తినోబృహస్పతిర్దధాతు॥ ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః॥
హరిః॥ ఓం॥

ఇతిఋగ్వేదేప్రథమాష్టకే షష్ఠాధ్యాయే షోడశవర్గాంతర్గతే ఋచౌ॥ తస్మిన్నేవవేదేప్రథమమండలే ఏకోనవింశతితమసూక్తాంతర్గతేఋచౌ॥

(ఈఋక్కులు మొదటిపక్షము అథర్వణవేదమందున్నట్లు పఠించవలెననియు అట్లు అందులేనియెడల ఆదిమవేదమైన ఋగ్వేదమం[దు]న్నట్లు పఠించవలయుననియు యజుర్వేదారణ్యకశాంతిపఠనము ఇచ్చట వర్తించదనియు నాయభిప్రాయమే గాక ఇప్పుడు పరలోకగతులయియున్నట్టియు యజుశ్శాఖీయులయినట్టియు వేదాంతశాస్త్రపండితులయిన

ట్టియు బెజవాడయను వాడుకపేరుగల విజయవాడకాపురస్థులయునట్టియు కృష్ణాతీరవాసులైనట్టియు బ్రహ్మశ్రీ జంధ్యాల గౌరీనాధశాస్త్రిలవారి యొక్క యభిప్రాయమునుయైయున్నది. గాన ఋగ్వేదపాఠానుసారము గనే వ్రాయడమయినది. పెద్దలెవరైననింక యజుర్వేదపాఠానుసారముగ పఠించవలెనను యభిప్రాయులయినయడల అట్లే పఠించేది.) భద్రంకర్ణేభిరితిశాంతిః అని చెప్పుటవలన ఆయొక్క ఋక్కే చెప్పవలెనా లేక స్వస్తిన ఇంద్రోయన్నదికూడ చెప్పవలెనా యను సంగతికూడ విచారణీయమై యున్నది. ఋగ్వేదములో "స్వస్తిన" యనునదియే ముందుగను "భద్రం" యనునదియే తరువాతగను వ్రాయబడి యున్నది.

టీ:- దేవాః=ఓ దేవతలార, వయం=గురుశిష్యులము ముముక్షువులమగుమేము, కర్ణేభిః=కర్ణములచేత, భద్రం=మంగళమును అనగా మంగళకరమైన వాక్యములను, శ్రుణుయామ=వినుచున్నాము-(ఓ దేవతలార, మీమంగళవాక్కులను చెవులారవినుచున్నామనియర్థము.) యజత్రాః=పూజ్యులైనయజ్ఞదేవతలారా, అక్షభిః=కన్నులచేత, భద్రం=మంగళమైనమీరూపములను, పశ్యేమ=చూచెదము-(అనగా మీమంగళమైనరూపములను కన్నులారచూతుముగాక యని యర్థము.) స్థిరైః=దృఢమైనట్టి, అంగైః=అవయవములచేతను, తనూభిః=శరీరములచేతను, తుష్టువాంసః=స్తోత్రమునుచేయుచున్నవారమగుచు, యదాయుః = ఏమాజీవితమైన ఆయుర్దాయముగలదో, తదాయుః=ఆయాయుస్సును, దేవహితం=దేవతలకు ప్రియమగునట్లు, వ్యశేమ=చేయుచున్నాము. (అనగా మాజీవితకాలమంతయు దేవతలకు కృతజ్ఞులముగానుందుమనిభావము.) వృద్ధశ్రవాః=సర్వదిగంతవిశ్రాంతమైనకీర్తిగలిగిన, ఇంద్రః=దేవేంద్రుడు, (సకలయాగభోగకర్త) నః=మాకొరకు, స్వస్తి=శుభమును, దధాతు=ఇచ్చు

గాక, విశ్వవేదాః=సర్వజ్ఞుడైన, పూషా=సూర్యుడు, స్వస్తి=శ్రేయస్సు ను, దధాతు = ఇచ్చుగాక, అరిష్టనేమిః = శుభములకు ఆధారుడైన, తార్క్ష్యః=గరుత్మంతుడు, నః=మాకొరకు, స్వస్తి=శుభమును, దధాతు= ఇచ్చుగాక, బృహస్పతిః = దేవగురువైన బృహస్పతి, నః=మాకొరకు, స్వస్తి=మంగళములను, దధాతు=ఇచ్చుగాక.

తా: ఆధ్యాత్మికాది విఘ్నపరిహారమూలకముగాను, సకల దేవత లయొక్క అనుగ్రహము తనకు సిద్ధించుటకును, సాంప్రదాయాభివృద్ధి కొరకును, అథర్వవేద శాఖాగతమైన ఉపనిషత్తులకు భద్రంకర్ణేభియను శాంతిని చదివి మరియు నుపనిషత్తును చదువుచు దానియర్థమును విని దానిప్రకార మనుసంధానము జేయుట సాంప్రదాయవిదులా రాద్ధాం తము జేసిరి. మోక్ష పురుషార్థము ఉపనిషద్విచారజనిత జ్ఞానముచేతనే సంభవించును. కర్తాదుల నీశ్వరబుద్ధితో జేసిన సకలపాపక్షయమును జ్ఞానోత్పత్తియును గలిగి అజ్ఞానముచే నజ్ఞానము నశింపగా స్వరూపావ స్థానరూపముక్తి తనంతట తానే యావిర్భవించును. మా ముముక్షువులు పలువురుగావున నిచట శృణుయామనాది బహువచనములు చెప్పబడి నవి. కర్ణైః అని చెప్పుటకు కర్ణేభిః అని ఛాందసము గనుక అపశబ్దము అనగ మార్పునొంద దగినదిగాదు. (ఈశాంతుల కర్థములున్నూ తా త్పర్యము లున్నూ ఇక్కడ గ్రంథవిస్తరభీతిచే క్లుప్తముగ వ్రాయుబడినవి. ఇంకను సద్గ్రంథములనుండియు భాష్యములనుండియు జదివి విశేషముగ గ్రహించి యానందించ గలరని కోరుచున్నాను) ఈశాంతులు మహా వాక్య పఠనమునకు పూర్వమందును పరమందును చక్కగ నర్థానుభవ ముతో పఠించగోరెదను.

సంఖ్యాశాంతిసహిత అష్టోత్తర శతోపనిషన్నామావళీ.

౧. వాజసనేయసంహితోపనిషత్ । (ఈశావాస్య) శుక్లయజుర్వేదీయా। పూర్ణమద ఇతిశాంతిః.

౨. తలవకారోపనిషత్ । (కేన) సామవేదీయా । ఆప్యాయన్త్వితిశాంతిః.

౩. కఠోపనిషత్। కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితిశాంతిః.

౪. ప్రశ్నోపనిషత్। అథర్వణవేదియా। భద్రంకర్ణేభిరితిశాంతిః.

౫. ముండకోపనిషత్। అథర్వవేదీయా। భద్రంకర్ణేభిరితిశాంతిః.

౬. మాండూక్యోపనిషత్ । అథర్వవేదీయా । భద్రంకర్ణేభిరితిశాంతిః.

౭. తైత్తిరీయోపనిషత్। కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితిశాంతిః.

౮. ఐతరేయోపనిషత్। ఋగ్వేదీయా। వాఙ్మేమనసీతిశాంతిః.

౯. ఛాందోగ్యోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితిశాంతిః.

౧౦ బృహదారణ్యకోపనిషత్ । శుక్లయజుర్వేదీయా-కాణ్వశాఖీయా। పూర్ణమద ఇతిశాంతిః.

౧౧. బ్రహ్మోపనిషత్। కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితిశాంతిః.

౧౨. కైవల్యోపనిషత్। కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితిశాంతిః.

౧౩. జాబాలోపనిషత్ । శుక్లయజుర్వేదీయా-వాజసనేయినీ । పూర్ణమద ఇతిశాంతిః.

౧౪. శ్వేతాశ్వతరోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితిశాంతిః.

౧౫. హంసోపనిషత్ । శుక్లయజుర్వేదీయా-వాజసనేయినీ । పూర్ణమద ఇతి శాంతిః

౧౬. ఆరుణేయోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౧౭. గర్భోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౧౮. నారాయణోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౧౯. పరమహంసోపనిషత్ । శుక్లయజుర్వేదీయా వాజసనేయినీ । పూర్ణమద ఇతి శాంతిః.

౨౦. అమృతబిందూపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౨౧. అమృతనాదోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౨౨. అథర్వశిఖోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౨౩. అథర్వశిఖోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౨౪. మైత్రాయణ్యుపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౨౫. కౌషీతకీబ్రాహ్మణోపనిషత్ । ఋగ్వేదీయా । వాఙ్మేమనసీతి శాంతిః.

౨౬. బృహజ్జాబాలోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౨౭. నృసింహతాపనీయోపనిషత్ । అధర్వణీయా । భద్రంకర్ణే భిరితిశాంతిః.

౨౮. కాలాగ్నిరుద్రోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా సహనావ వత్వితిశాంతిః.

౨౯. మైత్రేయోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౩౦. సుబాలోపనిషత్ । శుక్లయజుర్వేదీయా-వాజసనేయినీ । పూర్ణమదఇతిశాంతిః.

౩౧. క్షురికోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౩౨. మంత్రికోపనిషత్ । శుక్లయజుర్వేదీయా-వాజసనేయినీ । పూర్ణమద ఇతి శాంతిః.

౩౩. సర్వసారోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితిశాంతిః.

౩౪. నిరాలంబోపనిషత్ । శుక్లయజుర్వేదీయా-వాజసనేయినీ । పూర్ణమదఇతిశాంతిః.

౩౫. శుకరహస్యోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహసనావ వత్వితి శాంతిః.

౩౬. వజ్రసూచికోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౩౭. తేజోబిందూపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావ వత్వితిశాంతిః.

౩౮. నాదబిందూపనిషత్ । ఋగ్వేదీయా । వాఙ్మేమనసీతి శాంతిః.

౩౯. ధ్యానబిందూపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవ త్వితిశాంతిః.

౮౦. బ్రహ్మవిద్యోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౮౧. యోగతత్త్వోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౮౨. ఆత్మబోధోపనిషత్ । ఋగ్వేదీయా । వాఙ్మేమనసీతి శాంతిః.

౮౩. నారదపరిబ్రాజకోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౮౪. త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్ । శుక్లయజుర్వేదీయా-వాజసనేయిపి । పూర్ణమద ఇతి శాంతిః.

౮౫. సీతోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౮౬. యోగచూడామణ్యుపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౮౭. నిర్వాణోపనిషత్ । ఋగ్వేదీయా । వాఙ్మేమనసీతి శాంతిః.

౮౮. మండలబ్రాహ్మణోపనిషత్ । శుక్లయజుర్వేదీయా । పూర్ణమద ఇతి శాంతిః.

౮౯. దక్షిణామూర్త్యుపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౯౦. శరభోపనిషత్ । అథర్వణీయా । భద్రకర్ణేభిరితి శాంతిః.

౯౧. స్కందోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౯౨. త్రిపాద్విభూతిమహానారాయణోపనిషత్ । అథర్వణీయా। భద్రంకర్ణేభిరితి శాంతిః.

౯౩. అద్వయతారకోపనిషత్ । శుక్లయజుర్వేదీయా । పూర్ణమద ఇతి శాంతిః.

౫౪. రామరహస్యోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః।

౫౫. రామతాపనీయోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౫౬. వాసుదేవోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౫౭. ముద్గలోపనిషత్ । ఋగ్వేదీయా । వాఙ్మేమనసీతి శాంతిః.

౫౮. శాండిల్యోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౫౯. పైంగలోపనిషత్ । శుక్లయజుర్వేదీయా । పూర్ణమద ఇతిశాంతిః.

౬౦. భిక్షుకోపనిషత్ । శుక్లయజుర్వేదీయా । పూర్ణమదఇతి శాంతిః.

౬౧. మహోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౬౨. శారీరకోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా। సహనావవత్వితి శాంతిః.

౬౩. యోగశిఖోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౬౪. తురీయాతీతావధూతోపనిషత్ । శుక్లయజుర్వేదీయా । పూర్ణమదఇతి శాంతిః.

౬౫. సన్న్యాసోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౬౬. పరమహంస పరివ్రాజకోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౬౭. అక్షమాలికోపనిషత్ । ఋగ్వేదీయా । వాఙ్మేమనసీతి శాంతిః.

౬౮. అవ్యక్తోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౬౯. ఏకాక్షరోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౭౦. అన్నపూర్ణోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౭౧. సూర్యోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౭౨. అక్ష్యుపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౭౩. అధ్యాత్మోపనిషత్ । శుక్లయజుర్వేదీయా । వాజసనేయినీ పూర్ణమద ఇతిశాంతిః.

౭౪. కుండికోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౭౫. సావిత్ర్యుపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౭౬. ఆత్మోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౭౭. పాశుపతబ్రహ్మోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౭౮. పరబ్రహ్మోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౭౯. అవధూతోపనిత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౮౦. త్రిపురాతాపిన్యుపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౮౧. దేవ్యుపనిషత్ । ఽథర్వణీయా। భద్రంకర్ణేభిరితి శాంతిః
౮౨. త్రిపురోపనిషత్ । ఋగ్వేదీయా । వాఙ్మే మనసీతి శాంతిః.

౮౩. కఠోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౮౪. భావనోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.
౮౫. రుద్రహృదయోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౮౬. యోగకుండల్యుపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః

౮౭. భస్మజాబాలోపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౮౮. రుద్రాక్షజాబాలోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౮౯. గణపత్యుపనిషత్ । అథర్వణీయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౯౦. దర్శనోపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౯౧. తారసారోపనిషత్ । శుక్లయజుర్వేదీయా । పూర్ణమద ఇతి శాంతిః.

౯౨. మహావాక్యోపనిషత్ । అథర్వణీయా। భద్రంకర్ణేభిరితి శాంతిః.

౯౩. పంచబ్రహ్మోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౯౪. ప్రాణాగ్నిహోత్రోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితి శాంతిః.

౯౫ గోపాలతపనోపనిషత్ । అథర్వణేయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౯౬. కృష్ణోపనిషత్ । అథర్వణేయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౯౭. యాజ్ఞవల్క్యోపనిషత్ । శుక్లయజుర్వేదీయా । పూర్ణమదఇతి శాంతిః.

౯౮. వరాహోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవతిత్వతి శాంతిః.

౯౯. శాట్యాయనీయోపనిషత్ । శుక్లయజుర్వేదీయా । పూర్ణమదఇతి శాంతిః

౧౦౦ హయగ్రీవోపనిషత్ । అథర్వణేయా భద్రంకర్ణే భిరితి శాంతిః.

౧౦౧. దత్తాత్రేయోపనిషత్ । అథర్వణేయా । భద్రంకర్ణేభిరితి శాంతిః.

౧౦౨. గారుడోపనిషత్ । అథర్వణేయా భద్రంకర్ణేభిరితిశాంతిః.

౧౦౩. కలిసంతరణోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవతిత్వతిశాంతిః.

౧౦౪. జాబాల్యుపనిషత్ । సామవేదీయా । ఆప్యాయంత్వితి శాంతిః.

౧౦౫. సౌభాగ్యలక్ష్మ్యుపనిషత్ । ఋగ్వేదీయా । వాఙ్మేమనసీతిశాంతిః.

౧౦౬. సరస్వతీరహస్యోపనిషత్ । కృష్ణయజుర్వేదీయా । సహనావవత్వితిశాంతిః.

౧౦౭. బహ్వృచోపనిషత్ । ఋగ్వేదీయా । వాఙ్మేమనసీతి శాంతిః.

౧౦౮. ముక్తికోపనిషత్ । శుక్లయజుర్వేదీయా । పూర్ణమదఇతిశాంతిః.

**ఇత్యష్టోత్తరశతోపనిషదః.**

౧౨౮ సంఖ్యగల ముక్తికోపనిషత్తుప్రథమాధ్యాయమందు ఏయే యుపనిషత్తులు ఏయే వేదసంబంధములో వానిసంఖ్య యెంతయో వానికి శాంతులేవియో తెలుపబడి యున్నవి. అవసరమైనప్పుడాభాగము చూడవచ్చును.

**మహావాక్యరత్నావళిః.**

**ఆగ్నేయ మంగళాచరణం.**

ఓం. శ్రీమద్విశ్వాధిష్ఠాన పరమహంసాయనమః॥

యోవిద్యాదివిదేహాంతమహావాక్యార్థవిగ్రహః ।
శ్రీరామచంద్రరూపాయతస్మైభూమాత్మనేనమః॥౧॥

యఃప్రాజ్ఞోయతిభిస్స్వధర్మనిరతైర్ధ్యాయంతియంయోగినో
యేనాత్తంనిగమాంతవేద్యమనిశంయస్మైహావిర్దీయతే ।
యస్మాత్తత్స్థావరజంగమం సమభవద్యస్యాంశమాత్రోఽవరో
యస్మిల్లీనమిదం ప్రణామినకృతంతం వాసుదేవంగురుం॥౨॥

నత్వాశ్రీవాసుదేవేంద్రపాదపంకేరుహద్వయం ।
గ్రథ్యతేవై మహావాక్యరత్నావళిరియంమయా॥౩॥

ఇట్లు మంగళాచరణము శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య రామచంద్ర యతీశ్వరులవారి వలన చెప్పబడినది గనుక నదియే నిచ్చట వ్రాయబడినది.

**హరిః-ఓం-తత్సత్.**

———

## సద్గ్రంథ మంగళాచరణము.

హరిః-ఓం శ్రీరస్తు.

వాగీశాద్యాస్సుమనసస్సర్వార్థానాముపక్రమే । యన్నత్వాకృతకృత్యాస్స్యుస్తన్నమామిగజాననం॥

అభీప్సితార్థసిద్ధ్యర్థం పూజితోయస్సురైరపి । సర్వవిఘ్నఛిదేతస్మై గణాధిపతయేనమః॥

హరశంభోమహాదేవ విశ్వేశామరవల్లభ । శివశంకరసర్వాత్మన్ నీలకంఠనమోస్తుతే॥ రామాయరామభద్రాయరామచంద్రాయవేధసే। రఘునాథాయనాథాయసీతాయాఃపతయేనమః॥ మనోజవంమారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాంవరిష్ఠం । వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసానమామి॥ నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తించతత్పుత్రపరాశరంచ । వ్యాసంశుకంగౌడపదం మహాంతం గోవిందయోగీంద్రమథాస్యశిష్యం॥ శ్రీ శంకరాచార్యమథాస్యపద్మపాదంచ హస్తామలకంచశిష్యం । తంత్రోటకం వార్త్తికకారమన్యానస్మద్గురూన్సంతతమానతోస్మి॥ ఓంనమో బ్రహ్మాదిభ్యోబ్రహ్మవిద్యాసంప్రదాయకర్త్రుభ్యోవంశఋషిభ్యోనమోమహద్భ్యోనమో గురుభ్యః

పూర్వాశ్రమే శ్రీపరమేష్ఠిహవిర్యాజినే తురీయాశ్రమే శ్రీశివానంద సరస్వతీస్వామినే శ్రీమదఖండైకరసాయ శ్రీసద్గురవేనమః॥

శ్రీపరమశివేంద్ర సరస్వతీస్వామి సద్గురవేనమః.

శ్రీసదాశివేంద్రాదిసమస్త సరస్వతీస్వామిభ్యోనమః.

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీసదానంద సరస్వతీస్వామిభిః ప్రకటీకృత శ్రీచిచ్ఛిదాత్మాష్టోత్తర శతసిద్ధనామావలిః.
(శ్లోకసంఖ్యాభిస్సహా)

ఈసిద్ధనామములు అధ్యయనార్థముగాని పూజార్థముగాని పురుషులు స్వార్థము స్వంతముగ పఠనము చేయవచ్చును. ఇతరపురుషులకు అధ్యయనార్థముగాని పూజార్థముగాని స్త్రీలకు పూజార్థముగాని ఇతరులు పఠనముచేయునెడల తాము స్వయముగ యత్యుపదేశమును పొందిగాని లేక యతిసాన్నిధ్యమందుగాని బ్రాహ్మణులు పఠనముచేయవలెను. పఠనముకుగాని పాఠనముకుగాని యతికి నేవిధమైన నియమమునూలేదు. ఇదియంతయు ద్విజవిషయము. ద్విజేతరులకు పూజార్హత యున్నదిగాని పైనచెప్పిన ప్రకారము అధికారవంతులయిన బ్రాహ్మణుల వలననేతప్ప నన్యథాలేదు. ఈనామములు దశావృత్తిగాని శక్త్యభావమందు త్రిరావృత్తికి తక్కువగాకుండగాని సహస్రనామతుల్యము. మహావాక్యరత్నావళ్యధ్యయనాధ్యాపక ప్రారంభమందు ప్రప్రథమమున పూజావిధిగా ఈసిద్ధనామపఠన పాఠనములు ప్రశస్తములు గనుక ఓంకారాది నమోంతముగను శ్లోకరూపముగను ఇందు ప్రకటింప బడెను. ప్రత్యేక సహస్రనామసిద్ధియగువరకు నిట్లు గ్రాహ్యము. అట్టి సహస్రనామ సిద్ధమైన తరువాత నవిప్రత్యేకముగ నొక చిన్న గ్రంథరూపముగ ముద్రింపించి ప్రకటింపబడును. సిద్ధినామము లనగ శుద్ధనిర్గుణ పరబ్రహ్మతత్త్వపరముగఁ జెప్పిన నామములని యర్థము,

శ్రీ చిచ్చిదాత్మాష్టోత్తరశత సిద్ధనామావళి ప్రారంభః.

ఓం శ్రీ దక్షిణామూర్తిగురవే నమః.

ఓం-శ్రీ చిదంబరప్రభవే నమః.

౧. ఓం-చిచ్ఛివాయ నమః.-౧

౨. ఓం-చిత్స్వరూపాయనమః.-౧

౩. ఓం-అచింత్యాయనమః.-౧

౪. ఓం-చిదంబర మహాలయాయనమః.-౧

౫. ఓం-చిదాకార మహాద్వీప మధ్యదేశ సదాలయాయనమః,

౬. ఓం-చిదంబుధి మహోద్భూత చిత్సారమణిమండ లాయ నమః. -౨

౭. ఓం-చిదానందమహాసింధు మధ్యరత్నశిఖామణయే నమః.-౩

౮. ఓం-విజ్ఞానకోశవిలసదానందామృతమండలాయనమః.-౪

౯. ఓం-వాచామగోచరానంత శుద్ధచైతన్యవిగ్రహాయనమః.-౪

౧౦. ఓం-మూలకందస్థచిద్దేశ మహాతాండవ పండితాయనమః.-

౧౧. ఓం-షట్కోణ మార్గవిలసత్పురమండలసుస్థితాయనమః.

౧౨. ఓం-దశారాఖ్య మహాచక్రమధ్యమండల చిన్మణయే నమః.-౫

౧౩. ఓం-ద్వాదశార మహాపద్మస్థితి చిద్వ్యోమభాసురాయ నమః.-౬

౧౪. ఓం-షోడశారమహాపీఠ స్థిత చిచ్ఛక్తినాయకాయనమః.-౬

౧౫. ఓం-దళద్వయ మహాసంధిస్థిత చిద్వహ్నిరంధ్ర గాయ నమః.-౭

౧౬. ఓం-బిందుమండల మధ్యస్థచిద్విలాస ప్రకాశకాయనమః.

౧౭. ఓందశారాఖ్య మహాచక్రమధ్య స్తంభశిరోమణయేనమః.౮

౧౮. ఓం-ప్రథమాంకుర సిద్ధాష్ట పరమార్థార్థ విగ్రహాయ నమః.-౮

౧౯. ఓం భువనమండల మధ్యస్థమహా చిత్పూర సంగ్రహాయ నమః.-౮

౨౦. ఓం-ద్వీపకూటమహాపీఠ మధ్యవర్తిమహామణయేనమః.-౯

౨౧. ఓం-సదాశివ మహాకాశచక్ర మండలమధ్య గాయ నమః.-౧౦

౨౨. ఓం-గ్రంథిత్రయ మహాభేద చతురాయ నమః.-౧౦

౨౩. ఓం-శక్తిపాలకాయనమః.-౧౧

౨౪. ఓం-హృదయాంబుజ మధ్యస్థవిరజవ్యోమ నాయకాయ నమః -౧౧

౨౫. ఓం-లలాటమండలాంతస్థ్సమహామాయా విభాసకాయ నమః.-౧౧

౨౬. ఓం-కపాలకుహరాంతస్థ్స విశుద్ధగ్రామ నిశ్చితాయనమః.

౨౭. ఓం-మహానంద మహాపూర్ణ బోధాచల విరాజితాయ నమః -౧౨

౨౮. ఓం-మాయాతీతాయనమః.-౧౩

౨౯. ఓం-మహాదేవాయనమః.-౧౩

౩౦. ఓం-మహానందాయ నమః.-౧౩

౩౧. ఓం-మలాపహాయ నమః.-౧౩

౩౨. ఓం-మూలాధారమహాక్షేత్రస్థ్సన్న బ్రహ్మగ్రంధి విదారణా యనమః.-౧౩

౩౩. ఓం-మధ్యనాడీ మహామార్గస్థిత మండలమధ్య గాయ నమః.-౧౪

౩౪. ఓం-హంసమార్గైక నిరతజ్ఞానమార్గల చిద్రసాయనమః.

౩౫. ఓం-హిరణ్మయ మహాకాశ దివ్యమండల మధ్యగాయ నమః.-౧౫

౩౬. ఓం-సదోదిత మహాప్రజ్ఞా ప్రపంచాధారమండలాయ నమః.-౧౫.

౩౭. ఓం-సహస్రకమలాంతస్థ్సబిందుకూటమహాగుర వేనమః.-౧౬

౩౮. స్వాత్మన్యారోపితా శేషజగదాధారవిగ్రహాయనమః.-౧౬

౩౯. ఓం-సర్వాధిష్ఠాన చిన్మాత్రస్థానమధ్య విరాజితాయ నమః.-౧౭

౪౦. ఓ-సర్వోపనిషదుద్ఘుష్టమహాకీర్తిధరాయనమః.-౧౭

౪౧. ఓం-పరస్మైనమః.-౧౭

౪౨. ఓం-స్వాత్మరాజ్యసుఖాసీన స్వయంజ్యోతి స్స్వరూపకాయనమః -౧౮

౪౩. ఓం-సర్వవేదాంత సిద్ధాంతమహా సామ్రాజ్య దీక్షితాయనమః.-

౪౪. ఓం-స్వప్రకాశ మహాశైలశృంగరంధ్ర నివాసకాయనమః.

౪౫. ఓం-ఉన్మన్యంతమహామార్గ సీమాగ్రాచలమండలాయనమః.-౧౯

౪౬. ఓం-శుద్ధచైతన్య కాంతార సిద్ధాయనమః.-౨౦

౪౭. ఓం-సత్యాదిలక్షణాయనమః.-౨౦

౪౮. ఓం-భానుకూట ప్రతీకాశ చిత్పర్వత శిఖామణయేనమః.

౪౯. ఓం-భావాభావకళాతీత శూన్యగ్రామమహేశ్వరాయనమః.-౨౧

౫౦. ఓం-బ్రహ్మవిద్యామయగ్రామచిదాలయమహాప్రభవేనమః

౫౧. ఓం-ప్రత్యగ్భ్యాతి మహామానగోచరాయనమః.-౨౨

౫౨. ఓం-శుద్ధచిద్రసాయనమః -౨౨

౫౩. ఓం-అజ్ఞానహృదయ గ్రంధిభేద విద్యావిశారదాయనమః.

౫౪. ఓం-అనేకకోటి సూర్యాభబిందుచక్రవిభాసకాయనమః-

౫౫. ఓం-అంగుష్ఠమాత్రదేశస్థ బ్రహ్మనాడైక గోచరాయనమః-౨౩

౫౬. ఓం-అత్యంతనిర్మలాకాశ చైతన్యగిరిమధ్యగాయనమః ౨౪

౫౭ ఓం-అద్వైతపరమానంద చిద్విలాసమహానిధయేనమః-౨౪

౫౮. ఓం-అనేకకోటిబ్రహ్మాండధారిణేనమః-౨౫

౫౯. ఓం-సర్వాత్మకాయనమః-౨౫

౬౦. ఓం.విభవేనమః-౨౫

౬౧. ఓం-ఆదిమధ్యాంతరహిత బ్రహ్మానందనిధయేనమః- ౨౫

౬౨. ఓం.ఆధారమార్గసీమాంతవాసినేనమః-౨౬

౬౩. ఓం-నిత్యనిరంతరాయనమః-౨౬

౬౪. ఓం-అత్యచ్ఛనిర్మలాకారాయనమః--౨౬

౬౫. ఓం-అత్యాశ్చర్యాయనమః-౨౬

౬౬. ఓం-అజరాయనమః-౨౬

౬౭. ఓం-అమరాయనమః-౨౬

౬౮. ఓం-అనామకులగోత్రాయనమః-౨౭

౬౯. ఓం-అప్రమేయమహాగురవేనమః-౨౭

౭౦. ఓం-ఆబ్రహ్మరంధ్రదేశస్థాయనమః ౨౭

౭౧. ఓం-నిస్తరంగసుఖార్ణవాయనమః-౨౭

౭౨. ఓం-అప్రమేయపరానందప్రత్యక్షరూప చిదంబుధయేనమః-

౭౩. ఓం-అవిముక్తమహాపీఠస్థితచిద్రూప విగ్రహాయనమః ౨౮

౭౪. ఓం-ఆజ్ఞాచక్రనివిష్టాయనమః-౨౯

౭౫. ఓం-అతిహర్షచిదాలయాయనమః-౨౯

౭౬. ఓం-అమితానందబోధాంతనాదాంతస్థితమండలాయనమః-

౭౭. ఓం అఖండశుద్ధచైతన్యపంజరస్థమహాశుకాయనమః-౩౦

౭౮. ఓం-ఆగమాంతైకవేద్యాయనమః-౩౦

౭౯. ఓం-అణుమండలసుస్థితాయనమః-౩౦

౮౦. ఓం-అనేకకోటిహృత్పద్మప్రకాశకమహారవయేనమః-౩౧

౮౧. ఓం-షడంబుజమహాచక్రాంత స్ఫూర్తిసౌదామనీప్రభాయ
నమః-౩౧

౮౨. ఓం-షడ్విధైక్యానుసంధానపరహృద్వ్యోమ సంస్థితాయ నమః-౩౨

౮౩. ఓం-నిస్త్రైగుణ్యమహామార్గగామినేనమః-౩౨

౮౪. ఓం-జ్ఞానైకగోచరాయనమః-౩౨

౮౫. ఓం-నిత్యైశ్వర్యచిదానందనిర్మలాఖండముదాయనమః౩౩

౮౬. ఓం-నిరాధారమహాదేశస్థితచిన్మండలాయనమః-౩౩

౮౭. ఓం.నిత్యశుద్ధచిదానంద నిరాకారసుప్రసిద్ధాయనమః-౩౪

౮౮. ఓం-నిత్యపూర్ణచిదాకాశస్థితనిర్వాణసుందరాయనమః

౮౯. ఓం-నిర్వికల్పనిరాభాస శుద్ధాత్మస్వరూపకాయనమః-౩౫

౯౦. ఓం-నిరవద్యనిరాధారనిస్సాశ్రయ నిరంకుశాయనమః-౩౫

౯౧. ఓం-నాదబిందుకళాతీతాయనమః-౩౬

౯౨. ఓం-పరాత్పరగ్రహప్రభవేనమః-౩౬

౯౩. ఓం-నిత్యపూర్ణసుఖాకారహృత్పంకజ మనోరమాయనమః

౯౪ ఓం-నిర్వాణశైలనిలయమహాచిన్మంటపస్థితాయనమః-౩౭

౯౫. ఓం కోటిసూర్యప్రతీకాశమహాచిన్మండలస్థితాయనమః-౩౭

౯౬. ఓం-కార్యకారణనిర్ముక్తాయనమః-౩౮

౯౭. ఓం-దివ్యనాదాంతభాసురాయనమః-౩౮

౯౮. ఓం-పరమండలమధ్యస్థ చిత్కాంతాగ్ర విభాసకాయనమః

౯౯. ఓం-పరాత్పరమహావ్యోమభాసమాన మహారవయేనమః

౧౦౦. ఓం-ప్రత్యగాత్మస్వరూపాయనమః-౩౯

౧౦౧. ఓం-సచ్చిదానంద విగ్రహాయనమః-౩౯

౧౦౨. ఓం-ప్రాదేశమాత్ర సంలగ్నపశుపాశ విమోచకాయ నమః-౪౦

౧౦౩ ఓం-ప్రాణాపానమహామార్గ ధ్యానతత్పరసేవితాయనమః

౧౧౪. ఓం-ప్రణవాబ్ధిమథోత్పన్న జ్ఞానపీయూష విగ్రహాయ నమః-౪౧

౧౧౫. ఓం-పరిపూర్ణపరానంద ప్రజ్ఞానఘనలక్షణాయనమః-౪౧

౧౧౬. ఓం-పూర్ణానందమహాసింధు మధ్యస్థిత మహాచలాయ నమః-౪౨

౧౧౭. ఓం-అఖండైకరససూర్తి ప్రవాహాశ్రయమండలాయనమః

౧౧౮. ఓం-పరిశిష్టపరానంద పరాశ్రీగురువేనమః-౪౨

ఓం-అఖండైకరసపరమాత్మనేనమః.

ఓం-పరబ్రహ్మణేనమః.

ఓం-తత్సద్బ్రహ్మార్పణమస్తు.

హరిః ఓమ్

ఇతి శ్రీ చిచ్చిదాత్మాష్టోత్తర శతసిద్ధనామావళిస్సంపూర్ణా.

అథ శ్రీచిచ్చిదాత్మాష్టోత్తర శతసిద్ధనామావళి మూలప్రారంభః.

(నామసంఖ్యాభిస్సహ)

ఓం-శ్రీదక్షిణామూర్తిగురవేనమః.

ఓం-చిదంబరప్రభవేనమః

౧. ఓం-చిచ్ఛివాయనమస్తుభ్యం చిద్ఘనాయనమోనమః । అచింత్యాయనమస్తేస్తుచిదంబర మహాలయ॥౧ । ౨ । ౩ । ౪.

౨. చిదాకారమహాద్వీప మధ్యదేశసదాలయః । చిదంబుధిమథోద్భూత చిత్సారమణి మండలః॥౫-౬

౩. చిదానందమహాసింధు మధ్యరత్నశిఖామణిః । విజ్ఞానకోశ విలసదానందామృతమండలః॥౭-౮.

౪. వాచామగోచరానంత శుద్ధచైతన్యవిగ్రహః । మూలకందస్థ చిద్దేశమహాతాండవ సాక్షికః॥ ౯ । ౧౦.

౫. షట్కోణమార్గవిలసత్పర మండలసుస్థితః । దశారాఖ్య
మహాచక్రమధ్య మండలచిన్మణిః॥౧౧ । ౧౨

౬. ద్వాదశారమహాపద్మస్థిత చిద్వ్యోమభాస్కరః । షోడశార
మహాపీఠస్థితచిచ్ఛక్తినాయకః॥౧౩ । ౧౪.

౭. దళద్వయమహాసంస్థిత చిద్వహ్నిరంధ్రగః । బిందుమండల
మధ్యస్థ చిద్విలాసప్రకాశకః॥౧౫ । ౧౬.

౮. దహరాఖ్యమహాచక్రమధ్య స్తంభశిరోమణిః । ప్రథమాంకుర
నిర్దిష్ట పరమార్థార్థవిగ్రహః॥౧౭ । ౧౮.

౯. శైవమండలమధ్యస్థ మహాచిత్స్వారసంగ్రహః । దీపకూట
మహాపేటీ మధ్యవర్తి మహామణిః॥౧౯ । ౨౦.

౧౦. సదాశివమహాకాశచక్రమండలమధ్యగః । గ్రంథిత్రయమహా
భేదచతురశ్శక్తిపాలకః॥౨౧ । ౨౨ । ౨౩.

౧౧. హృదయాంబుజ మధ్యస్థవిరజోవ్యోమనాయకః । లలాట
మండలాంతస్థ మహామాయావినాశకః॥౨౪ । ౨౫.

౧౨. కపాలకుహరాంతస్థ విశుద్ధగ్రామదీక్షితః । మహానంద
మహాపూర్ణబోధాచల విరాజితః ॥౨౬ । ౨౭.

౧౩. మాయాతీతమహాదేవ మహానందమలాపహః । మూలా
ధారముఖోత్పన్న బ్రహ్మరంధ్రచిదాలయః॥౨౮ । ౨౯ । ౩౦ । ౩౧ । ౩౨.

౧౪. మధ్యనాడీమహామార్గ స్థితిమండలమధ్యగః । హంసమా
ర్గైకనిరత జ్ఞానమండలచిద్రసః॥౩౩ । ౩౪.

౧౫. హిరణ్మయమహాకాశదివ్యమండల మధ్యగః । సదోదిత
మహాప్రజ్ఞాప్రపంచాధారమండలః॥౩౫ । ౩౬.

౧౬. సహస్రకమలాంతస్థ బిందుకూటమహాగురుః । స్వాత్మ
న్యారోపితాశేషజగదాధారవిగ్రహః॥౩౭ । ౩౮.

౧౭. సర్వాధిష్ఠాన చిన్మాత్రస్థానమధ్యవిరాజకః । సర్వోపనిషదుఘుష్టమహాకీర్తి ధరఃపరః॥౩౯ । ౪౦ । ౪౧.

౧౮. స్వాత్మరాజ్యసుఖాసీన స్వయంజ్యోతిస్స్వరూపకః । సర్వవేదాంతసిద్ధాంత మహాసామ్రాజ్య దీక్షితః॥౪౨ । ౪౩.

౧౯. స్వప్రకాశమహాశైల శృంగరంధ్రనివాసకః । ఉన్మన్యంత మహామార్గ సీమాగ్రచలమండలః॥౪౪ । ౪౫.

౨౦. శుద్ధచైతన్య కాంతారసిద్ధసత్యాదిలక్షణః । భానుకూట ప్రతీకాశ చిత్పర్వతశిఖామణిః॥ ౪౬ । ౪౭ । ౪౮.

౨౧. భావాభావకళాతీత శూన్యగ్రామమహేశ్వరః । బ్రహ్మవిద్యామయగ్రామచిదాలయ మహాప్రభుః॥౪౯ । ౫౦.

౨౨. ప్రత్యగ్భూతమహామౌన గోచరశ్శుద్ధచిద్రసః । అజ్ఞానహృదయగ్రంథి భేదవిద్యావిశారదః॥౫౧ । ౫౨ । ౫౩.

౨౩. అనేకకోటిసూర్యాభబిందు చక్రవిభాసకః । అంగుష్ఠమాత్ర దేశస్థ బ్రహ్మనాడ్యైకగోచరః॥౫౪ । ౫౫.

౨౪. అత్యంతనిర్మలాకాశచైతన్యగిరిమధ్యగః । అద్వైతపరమానంద చిద్విలాసమహానిధిః॥౫౬ । ౫౭.

౨౫. అనేకకోటిబ్రహ్మాండధారీ సర్వాత్మకోవిభుః । ఆదిమధ్యాంతరహిత బ్రహ్మానందనిధిస్తథా॥౫౮ । ౫౯ । ౬౦ । ౬౧.

౨౬. ఆధారమార్గసీమాంతవాసీ నిత్యనిరంతరః । అత్యచ్ఛనిర్మలాకాశే అత్యాశ్చర్యోఽజరోఽమరః॥ ౬౨ । ౬౩ । ౬౪ । ౬౫ । ౬౬ । ౬౭.

౨౭. అనామకులగోత్రశ్చ అప్రమేయమహాగురుః । ఆబ్రహ్మారంధ్రదేశస్థ నిస్తరంగసుఖార్ణవః॥౬౮ । ౬౯ । ౭౦ । ౭౧.

౨౮. అప్రమేయపరానంద ప్రత్యగ్రూపచిదంబుధిః । అవిముక్త మహాపీఠస్థిత చిద్రూపవిగ్రహః॥ ౭౩ । ౭౦ ।

౨౯. ఆజ్ఞాచక్రనివిష్టశ్చ అతిహృష్ట చిదాలయః । అమితానంద బోధాంతనాదాంతస్థిత మండలః ౭౮ । ౭౯ ।

౩౦ అఖండశుద్ధచైతన్య పంజరస్థమహాశుకః । ఆగమాంతైకవేద్యశ్చ అణుమండలసుస్థితః॥ ౭౭ । ౭౫ । ౭౯.

౩౧. అనేకకోటి హృత్పద్మప్రకాశక మహారవిః । షడంబురుహ చక్రాంతస్ఫూర్తి సౌదామినీప్రభః॥ ౮౦ । ౮౧ ।

౩౨. షడ్విధైక్యానుసంధానపరవ్యోమసుస్థితః । నిస్త్రైగుణ్యమహావాగ్జగా మిన్యాసైక గోచరః॥ ౮౨ । ౮౩ । ౮౪.

౩౩. నిత్యాశ్చర్యచిదానంద నిర్మలాఖండమండలః । నిరాధార మహాదేవస్థిత చిన్మండలస్తథా॥ ౮౫ । ౮౬.

౩౪. నిత్యశుద్ధచిదానంద నిరాకారసుధోదధిః । నిత్యపూర్ణచిదాకాశస్థిత నిర్వాణమందిర ॥ ౮౭ । ౮౮.

౩౫. నిర్వికల్పనిరాభాస శుద్ధచైతన్యరూపకః । నిరవద్యనిరాధారనిస్సాశయ నిరంకుశః॥ ౮౯ । ౯౦.

౩౬. నాదబిందుకళాతీతః పరాత్పరగ్రహప్రభుః । నిత్యపూర్ణసుఖాకార హృత్పంకజ మనోరమః॥ ౯౧ । ౯౨ । ౯౩.

౩౭ నిర్వాణశైలనిలయమహాచిన్మంటపస్థితః । కోటిసూర్యప్రతీకాశ మహాచిన్మండల స్థితః॥ ౯౪ । ౯౫.

౩౮. కార్యకారణ నిర్ముక్త దివ్యనాదాంతభాసురః । పరమండల మధ్యస్థ చిత్కూటాగ్రవిభాసకః॥ ౯౬ । ౯౭ । ౯౮.

౩౯. పరాత్పరమహావ్యోమ భాసమాన మహారవిః । ప్రత్యగాత్మ స్వరూపశ్చ సచ్చిదానంద విగ్రహః॥ ౯౯ । ౧౦౦ । ౧౦౧.

౪౦. ప్రాదేశమాత్ర సంలగ్న పశుపాశవిమోచకః । ప్రాణాపాన మహామార్గ ధ్యానతత్పర సేవితః॥ ౧౦౨ । ౧౦౩.

౪౧. ప్రణవాబ్ధిముక్తోత్పన్న జ్ఞాన పీయూషవిగ్రహః । పరిపూర్ణ పరానంద ప్రజ్ఞానఘనలక్షణః॥ ౧౦౪। ౧౦౫.

౪౨. పూర్ణానంద మహాసింధుమధ్యస్థితమహాచలః । అఖండైకరసస్ఫూర్తి ప్రవాహాశ్రితమండలః॥ ౧౦౬ । ౧౦౭.

౪౨॥. పరిశిష్టపరానంద పరాశ్రీ గురవేనమః॥ ౧౦౮.

ఓం-అఖండైకరస పరమాత్మనేనమః॥

ఓం పరబ్రహ్మణేనమః॥

ఓం-తత్సద్బ్రహ్మార్పణమస్తు॥

ఇతి శ్రీ చిచ్చిదాత్మాష్టోత్తరశత సిద్ధనామావళి మూలం సంపూర్ణం॥

---

# మ హా వా క్య ప్ర క ర ణ సూ చి కా.

| | సార్వాంతిక మహా వాక్యములు. | సామాన్య మహా వాక్యములు. | ఆర్ధాంతిక మహా వాక్యములు. |
|---|---|---|---|
| ౧. విధివాక్యములు | ౯౬ – | ౧౪ + | ౫౨ |
| ౨. బంధమోక్షవాక్యములు | ౧౩ – | ౬ + | ౨౨ |
| ౩. అవిద్యానిందావాక్యములు | ౨౧ – | ౩ + | ౧౮ |
| ౪. జగన్మిథ్యావాక్యములు | ౩౩ – | ౮ + | ౨౫ |
| ౫. ఉపదేశవాక్యములు | ౫౪ – | ౪ + | ౫౦ |
| ౬. జీవబ్రహ్మైక్యవాక్యములు | ౩౮ – | ౭ + | ౩౧ |
| ౭. మననవాక్యములు | ౩౬ – | ౪ + | ౩౫ |
| ౮. జీవన్ముక్తివాక్యములు | ౧౧౬ – | ౧౧ + | ౧౦౮ |
| ౯. స్వానుభూతివాక్యములు | ౧౧౮ | ౧౦ + | ౧౦౮ |

| | | | |
|---|---|---|---|
| ౧౦. సమాధివాక్యములు | ౫౦ = | ౬ + | ౪౪ |
| ౧౧. అష్టవిధస్వరూపవాక్యములు ౩౨౨ అందు నానాలింగస్వరూపవాక్యములు | ౩౨ = | ౫ + | ౨౬ |
| ౧౨. పుంలింగస్వరూపవాక్యములు | ౩౦ = | ౧౭ + | ౧౩ |
| ౧౩. స్త్రీలింగస్వరూపవాక్యములు | ౧౨ = | ౨ + | ౧౯ |
| ౧౪. నపుంసక లింగస్వరూప వాక్యములు. | ౩౬ = | ౨ + | ౧౦ |
| ౧౫. ఆత్మస్వరూపవాక్యములు | ౪౧ = | ౧౦ + | ౩౧ |
| ౧౬. సర్వరూపవాక్యములు | ౪౦ = | ౧౧ + | ౩౦ |
| ౧౭. బ్రహ్మస్వరూపవాక్యములు | ౧౦౩ = | ౩౬ + | ౬౭ |
| ౧౮. విశిష్టస్వరూపవాక్యములు | ౩౬ = | ౨ + | ౩౪ |
| ౧౯. ఫలవాక్యములు | ౪౧ = | ౧౦ + | ౩౧ |
| ౨౦. విగ్రహముక్తివాక్యములు | ౭౭ = | ౮ + | ౬౯ |
| ఆహత్య | ౧౦౦౮ = | ౧౮౫ + | ౮౨౩ |

ఇవి నిజముగా ౧౩ ప్రకరణములే ౧౧ వ ప్రకరణము ౮ వ భాగములుగనుండుటచే అట్టి భాగములను వేరు వేరుగ లెక్కించిన ౨౧ ప్రకరణములు సౌలభ్యము కొరకు ఈసంఖ్యనే నేనవలంబించినాను ముంబయిదేవనాగరీ ప్రతులలో నొక దానియందు ప్రకరణమను నామమున ఈ సంఖ్యయే యవలంబించబడియున్నందున ఆ ప్రమాణమును బట్టి ఇచ్చుటయును అట్లే యవలంబించ బడినది.

ఒక హొక వ్రాతగ్రంధమందీ క్రిందవ్రాయు ప్రకారము వ్రాయబడియున్నది. గనుక నది సర్వజనోపయోగము కొరకు నిచ్చట వ్రాయుచున్నాను.

“ ఇతి శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ వాసుదేవేంద్ర సరస్వతీ చరణకమల మకరంద తృప్తస్వాంత రామచంద్రేంద్ర గ్రధితాయా ఈశాద్యష్టోత్తరశతోపనిషత్సారసంగ్రహభూతాయాం మహావాక్య రత్నావళ్యాం పంచత్రింశదధిక సప్తశత పంచసహస్రవాక్యాత్మికాయాం సారతరభూతాష్టోత్తర సహస్ర మహావాక్యరత్నావళిః సంపూర్ణా. ”

శ్రీ

సద్గురవేనమః.

# మహావాక్యరత్నప్రభావావళిప్రారంభః.

## ౧. విధివాక్యప్రకరణము.

"సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంతఉపాసీత" ౧

(సామ ౯. ఛాందోగ్య 3-౧౪)

టీ. ఇదం సర్వం=ఈజగమంతయును ; బ్రహ్మఖలు=బ్రహ్మమే ; తజ్జలాని=తజ్జలాని ; ఇతి=అని ; శాంతః=మనోవికారము లేనివాడై ; ఉపాసీత=ఉపాసించవలయును.

తా. పంచజ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, మనస్సు అను పదునొకం డింద్రియముల చేతను, యుక్తిచేతను, శాస్త్రముచేతను తెలియబడు యావత్తు దృశ్యమయిన జగత్తున్నూ ఇదం శబ్దముచేత చెప్పియున్నారు. ఈజగత్తు బ్రహ్మమని చెప్పగా బ్రహ్మముగాని జగత్తు బ్రహ్మ మెట్లగునని శంకకలుగును. సద్వస్తువైన బ్రహ్మమున భ్రాంతిచే కల్పింపఁబడిన జగత్తు భ్రాంతినాశమున మిథ్యగాగా భ్రాంతితోనున్నపుడు జగత్తని యూహింపఁబడినది ఇప్పుడు బ్రహ్మమగు చున్నదని నిశ్చయింపవలెను. త్రాడునుజూచి యది త్రాడనుకొనక దానిని మఱియొకటియయ్యు పాముగా (అనఁగా "రజ్జుసర్ప" న్యాయముగా) దలఁచి భీతినొంది పిదప వస్తువిచారమున పాముకాదని యెఱిఁగి భ్రాంతితో జూచిన యూపామంతయును త్రాడేయని నిశ్చయించినటుల సమస్తజగమును బ్రహ్మమని యీవాక్యమున జెప్పఁబడెను. ఆరోపింపఁబడిన పామునకు త్రాడెట్లు లాధారమయ్యెనో భ్రాంతి యెట్లుకారణమయ్యెనో, యటులే కార్యమయిన జగత్తునకు మాయకారణమై బ్రహ్మమధిష్ఠానమై యున్నది. ఇట్లు కారణములేని కార్యమును అధిష్ఠానము

లేని భ్రాంతియు నుండదని యూహింపవలెను. మార్పునొందక బ్రహ్మము జగద్రూపముగా దోచుచున్నందున నది బ్రహ్మముయొక్క వివర్తమనఁ బడును. ఇటుల జగద్రూపము నిశ్చయించుట వివర్తవాద మనఁబడును. మాయయే లేనిదిగాన మాయాకార్యమయిన జగత్తును లేనిదానిగ నింద్రజాలమునలె నూహింపవలయును. వస్తువిచారమున భ్రాంతియును భ్రాంతికార్యమైన సర్వమును మిథ్యలయినటులను ద్రాడు శేషించినటులను జ్ఞానమున మాయయు మాయాకార్యమైన జగత్తును మిథ్యగాగా నధిష్ఠానమైన పరిపూర్ణబ్రహ్మమే శేషించును. కాన జగత్తు బ్రహ్మమనఁబడెను — "తజ్జలాని: — తజ్జత్వాత్ = దానివలన పుట్టినదిఅగుటవల్ల నుండి, తల్లత్వాత్ = దానియందు లయించునది అగుటవల్ల నుండి, తన్నిష్ఠత్వాత్ = దానియందు నిష్ఠ (స్థితి) గలిగియుండుటవల్ల నుండి అనఁగా బ్రహ్మమువలనఁ గలిగి, బ్రహ్మమునందు లీనమై, ఆబ్రహ్మమందే నిష్ఠఁగలదికావున "తజ్జలాని" యనఁబడును. (దృష్టాంతము) బుద్బుదములు సముద్రమందుబుట్టి సముద్రమందు లీనమై సముద్రమందు స్థితి గలిగియున్న చందమున దృశ్యమైన యీజగమంతయు బ్రహ్మమందుపుట్టి బ్రహ్మమందులీనమై బ్రహ్మమందే నిష్ఠఁగలదియై యుంచున్నది. బ్రహ్మము కన్న నితరవెద్దియును లేదని శాంతుఁడై అనఁగ మనోవికారము లేనివాఁడై బ్రహ్మనిశ్చయము చేయవలెను.

"తజ్జలాని" యను దానికి తజ్జలాన్ అని ఛాందోగ్యోపనిషచ్ఛంకరభాష్యమునందు వ్రాయబడి యుందుకర్థము వ్రాయబడ్డది. అదియును జూడవలెను.

"ఆత్మానమేవ వేదాహంబ్రహ్మాస్మీతి" ౨

టీ. అహం = నేను ; బ్రహ్మ = బ్రహ్మమును ; అస్మి = అగుచున్నాను ; ఇతి = ఈరీతిగను ; ఆత్మానమేవ = తననే ; వేద = తెలిసికొనుచున్నాఁడు.

తా. బ్రహ్మమే బుద్ధివృత్తులకు సాక్షియై సంవిదూపమున ప్రదేహమునందునున్నది. ఆసంవిత్తే (తెలివి) నేనను శబ్దమునకు వాచ్య

మైయున్నది. కావున బ్రహ్మమనఁగా నెక్కడనోయుండునని యూహింపక తానే బ్రహ్మమని సనసే గురూప దేశమునఁ దెలిసికొనవలెను.

“ ఆత్మావాఅరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః” 3
(శు-య ; ౧౦ బృహదారణ్యకే ; అ ౪ ; బ్రా ౪ ; అ ౬ ; బ్రా ౫.)

టీ. అరే=ఓమైత్రేయీ ; ఆత్మావా=ఆత్మయే ; ద్రష్టవ్యః=(మిథ్యారూప జగన్నిరసనపూర్వకముగు జ్ఞానదృష్టిచే) చూడఁదగినది ; శ్రోతవ్యః=(వేదాంతవాక్యములచే)వినఁదగినది ; మంతవ్యః=(యుక్తులచే) మననము చేయ దగినది. నిదిధ్యాసితవ్యః=ధ్యానముచేఁబొందఁదగినది.

తా. ఆత్మసాక్షాత్కారమునకు వేదాంత శ్రవణ మనన నిదిధ్యాసనములు చేయవలయుననియు ఇతరవృత్తిని విడువవలయు ననియుఁ దెలియునది.

“ మహాత్పదం జ్ఞాత్వా వృక్షమూలే వసేత్ ” ౪
(శు-య ; 3౦సుబాల ; ఖ ౧3.)

టీ. మహాత్పదం=“ మహద్భిర్యత్పద్యతే తన్మహాత్పదం ” మహాత్ములగు బ్రహ్మవిదులచే నేది పొందఁబడుచున్నదో యది మహాత్పదము ; అట్టిమహాత్పదమును ; జ్ఞాత్వా=తెలిసి ; వృక్షమూలే=చెట్టుమొదట ; వసేత్ =నివసింపవలెను.

తా. ఇచట “ వృక్షమూలే ” అనియున్నందున వనమందనిగాని బ్రహ్మమందనిగాని అర్థముచెప్పఁదగి యున్నది. “ వనమందు ” అనిచెప్పినపుడు వృక్షమునకు ఉపలక్షణముచేత (అఖండార్థేఖండః ; ఖండార్థేఅఖండః=యావత్తుకు నొక భాగము నొక భాగమునకు యావత్తును) వనమని చెప్పఁదగియున్నది. లేక సంసారవృక్షము నెక్కడ దానికి మూలమైన బ్రహ్మమందేయనియు నర్థము చెప్పఁదగియున్నది కాబట్టి బ్రహ్మమునెఱిఁగిన పిదప గృహాదులందు దాసక్తిలేక సన్యాసియై యేకాకియై వనమందుం

డవలయును అని గాని లేక బ్రహ్మమునొక్కింగిన పిదప వైషయిక సుఖ దుఃఖములను ఫలములను పొందక బ్రహ్మమునందే సర్వదాధ్యాస గల వాఁడై మఱియొక దానినాశింపక యుండవలెననిగాని భావము.

"సచ్చిదానంద మాత్మాన మద్వితీయం బ్రహ్మభావయేత్" ॥
(సాను ; ౩౬ వజ్రసూచిక ;)

టీ. సత్ = కాలత్రయమునను బాధింపఁబడనిదియు (సత్యమైనది) చిత్ = ఇతర సహాయములేక తనంతటతానే ప్రకాశించుచు, సర్వమును దెలిసికొనునదియు (జ్ఞానమైనది) ; ఆనందం=నిరతిశయ సౌఖ్యస్వరూపమైనదియునగు ; ఆత్మానం=ఆత్మను, అద్వితీయం=తనకంటె రెండవది లేనిదగు, బ్రహ్మ=బ్రహ్మముగా ; భావయేత్=భావింపవలెను.

తా. "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ"యని బ్రహ్మస్వరూపము వేదాంతమునందుఁ జెప్పఁబడియున్నది. ఈ జ్ఞానము పరోక్షము. ఆత్మయును సత్యజ్ఞానానందమని చెప్పుటచే బ్రహ్మమునాత్మయు నొకటియని తెలియవలెను. బ్రహ్మమే యుపాధులను ప్రవేశించుటచే నాత్మయనఁబడును. (ప్రత్యగాత్మ) ఈయాత్మకు సత్యజ్ఞానానందస్వరూపము సిద్ధించుట యనుభవమున దెలియనగును. ప్రతిదేహమందును బుద్ధి వృత్తులకు సాక్షిగనుండు సంవిత్తు తెలిసి) ప్రత్యగాత్మయనఁబడును. జాగ్రదవస్థయందు శబ్దస్పర్శరూపరసగంధములను విషయములు నానావిధములుగా నుండుటవలన వేఱువేఱుగా గ్రహింపఁబడుచున్నవి. వానినెఱుఁగు సంవిత్తుమాత్రమేకరూపముగా నున్నందున భేదింపఁబడక యున్నది. విషయములవలె సంవిత్తు భేదింపఁబడదు. స్వప్నావస్థయందును విషయములు నానావిధములుగా నుండుటవలన వేఱువేఱుగా గ్రహింపఁబడుచున్నవి. అక్కడను సంవిత్తుమాత్రమేకరూపముగ భేదింపఁబడక యున్నది. జాగ్రదవస్థయందలి దృశ్యములు స్థిరములు, స్వప్నావస్థయందలి దృశ్యములు లస్థిరములు నగుటఁజేసి రెండవస్థలకును భేదముఁ గలదు. సుషుప్తియందు

తమోరూపముగనున్న యజ్ఞానము సంవిత్తుచే నెఱుఁగఁబడుచున్నది. ఆ యెఱుఁగఁబడుట నిద్రనుండి లేచినపుడు స్మృతికి వచ్చుచున్నది. అనుభవింపనివిషయము స్మృతికి రాదు. అనుభవింపఁబడినదే స్మృతికివచ్చును. గాన సుషుప్తియం దజ్ఞానము సంవిత్తుచే నెఱుఁగఁబడుట నిక్కము. అక్కడ సంవిత్తుమాత్రమే యేకరూపముగ భాసింపఁబడుచు నున్నది. ఇటు లేకయవస్థయందున్నటుల మఱియొండవస్థయం దుండక దృశ్యములు బాధింపఁబడుటవలన నసత్యములగుచున్నవి. అవస్థాత్రయమందును బాధింపఁబడక సంవిత్తున్నందున నది సత్యమగును. కావున నది సత్తనఁ బడును. విషయములు తెలియఁబడునవి. తెలిసికొనునవి కానందున నవి జడములనఁబడును. ఇతరసహాయము లేక తనంతట ప్రకాశించుచు సర్వము నెఱుఁగుచున్నందున సంవిత్తు జ్ఞానమనఁబడును. కావున నదిచిత్తనఁబడును. ఉపాధియందుండి నేనను శబ్దమునకు వాచ్యమై నాకెప్పుడును నాశము లేకుండుఁగాక యని ప్రేమ స్వరూపముగ నున్నందున నానందమనఁ బడును. ఇట్లీ సత్తాగన్యములైన మూఁడునుగకల్పములందును సంవి ద్రూపమగు నాత్మ యుత్పత్తినాశములు లేక స్వయంప్రకాశమానమై యున్నది. పరబ్రహ్మము నిట్టిదే కావున ప్రత్యగాత్మబ్రహ్మలకు వేదాంతములందైక్యము బోధింపఁబడుచున్నది. ఆకాశ మనంతమైనను ఘటాద్యుపాధులనుండుటచే సాంతముగా గనఁబడునట్లు ప్రత్యగాత్మ సాంతముగాఁ గనఁబడుచున్నట్లున్న ననంతమైనదే. ఇట్లు సత్యజ్ఞానానంద మైన యీయాత్మ యేలక్షణములేఁగల బ్రహ్మముకన్న వేఱుకాదు కావున నద్వితీయమని చెప్పఁబడును. ఇట్లనుభవమునఁ దెలిసికొనుట యపరోక్ష జ్ఞానము. తానే బ్రహ్మమను నీజ్ఞానమున బ్రహ్మమగుచున్నాఁడు.

" అహంబ్రహ్మాస్మీత్యను సంధానం కుర్యాత్ "

(శా-య ; ౫౬ పైంగల ; అ ౩)

టీ. అహం = నేను ; బ్రహ్మ = బ్రహ్మము ; అస్మి = అగుచున్నాను ; ఇతి = అని ; అనుసంధానం యోజనము ; కుర్యాత్ = చేయవలెను.

తా. బుద్ధివృత్తులకు సాక్షియై బ్రహ్మమే యహంశబ్దవాచ్యమై యున్నందున నే నన గా జీవుడని గాని, దేహమని గాని, యంతఃకరణమని గాని యనుకొనక బ్రహ్మమే నని యెల్లప్పుడును యోజింపవలయును.

“సతద్జ్ఞో బాలోన్మత్తపిశాచవజ్జడవృత్త్యాలోకమాచరేత్” ౭

(సామ రహ ; మండలబ్రాహ్మణ బ్రా ౫)

టీ. నామరూపాత్మకమైన సృష్టికిపూర్వము సద్వస్తువైన యేబ్రహ్మముకలదో యాబ్రహ్మమే యిపుడు సృష్టియైయున్నదను నర్థము తత్ అను పదముచే జెప్పబడుచున్నది. దానినెఱిగిన వాడు, తద్జ్ఞుడు, సఃతద్జ్ఞః= ఆబ్రహ్మజ్ఞాని ; బాలోన్మత్తపిశాచవత్ = బాలుడు, వెఱ్ఱివాడు, పిశాచము, వీనివలె ; జడవృత్త్యా=జడవృత్తిచే ; లోకంఆచరేత్ =లోకమందు సంచరించవలెను.

తా. జ్ఞాని సర్వజనులు నత్యంతాదరణీయములని యత్యాతురతతో జూచు విషయములందు నిస్పృహుడగువాడై లోకులు తననుజడుడనునటు లాచరింపవలెను. సర్వజ్ఞుడయ్యును బాలోన్మత్తపిశాచముల చందమున సంచరించును.

“బ్రాహ్మణస్సమాహితోభూత్వా తత్త్వంపదైక్యమేవసదాకుర్యాత్”

(శుయ ; పైంగల)

టీ బ్రాహ్మణః=బ్రహ్మజ్ఞాని ; సమాహితః=స్వస్థచిత్తముగలవాడు ; భూత్వా=అయి ; తత్త్వంపదైక్యమేవ, తత్త్వంపద=తత్పదవాచ్యుడగు నీశ్వరునకు ; త్వంపద వాచ్యుడగు జీవునకు ; ఐక్యమేవ =ఏకత్వమునే ; సదా=ఎల్లప్పుడు ; కుర్యాత్ =చేయునలెను

తా. బ్రహ్మమును గురుముఖమున నెఱుగువాడుబ్రాహ్మణుడు. బ్రహ్మమునెఱిగిన యోగి యెల్లప్పుడు జీవేశ్వరైక్యాను సంధానమును చేయుచుండవలెనుగాని వాడు గొప్పవాడు వీడు తక్కువవాడను భేదబుద్ధితో నుండరాదు.

సర్వత్రాద్వైతబ్రహ్మబుద్ధిం కుర్యాత్ " ౯

టీ. సర్వత్ర=అంతటను ; అద్వైతబ్రహ్మబుద్ధిం=అద్వితీయమైన బ్రహ్మనిశ్చయమును ; కుర్యాత్=చేయవలయును.

తా. అంతటను బ్రహ్మముదక్క ఇతరమేద్దియును లేదని దృఢ నిశ్చయముతో నుండవలయును.

" ఆశాంబరో ననమస్కారో న స్వాహాకారో న స్వధాకారో
న నిందాస్తుతిర్యాదృచ్ఛికో భవేత్ " ౧౦

(శు-య ; ౧౯ పరమహంస)

టీ. ఆశాంబరః=దిగంబరుఁడును (మానాభిమానములు లేని వాఁడును) ననమస్కారః=నమస్కారము లేనివాఁడును (ఒకఁడు తనకు నమస్కరించవలయునను కోరిక లేనివాఁడును) నస్వాహాకారః=స్వాహాకారములేనివాఁడును, నస్వధాకారః=స్వధాకారములేనివాఁడును (స్వాహా స్వధావషట్కార గోచరమైన వైదికకర్మను విధ్యుక్తముగ నభ్యసించని వాఁడును) ; ననిందాస్తుతిః=నిందాస్తుతులు లేనివాఁడును (లోకులు తన్ను స్తుతించినను నిందించినను వానియం దలక్ష్యముగలవాఁడై) ; యాదృచ్ఛికః=యదృచ్ఛాపరుఁడును (దొరికినదానితో తుష్టినొందువాఁడును) ; భవేత్=కావలయును.

తా. జ్ఞాని బట్టలు మొదలైనవి కావలయునను భోగాపేక్షలేని వాఁడై, తనకొకఁడు నమస్కరింపవలయునను కోరికలేనివాఁడై, విధ్యుక్తముగ వైదికకర్మమును విడిచినవాఁడై, లోకనిందాస్తుతులందు లక్ష్యములేనివాఁడై, యదృచ్ఛాలాభ సంతుష్టుఁడై యుండవలయును. కాని వ్యామోహముగలవాఁడై యుండరాదు.

" సర్వేశస్స్వరూపమేవ పశ్యన్ జీవన్ముక్తి మవాప్య ప్రారబ్ధ
ప్రతిభాసనాశపర్యంతం స్వస్వరూపానుసంధానేనవసేత్ " ౧౧

(అధర్వ ; ౪౩ నారదపరివ్రాజక ;)

టీ. సర్వతః=అంతటను ; స్వరూపమేవ=పరమాత్మ రూపమునే ; పశ్యన్=చూచుచు, ప్రారబ్ధ ప్రతిభానసాశ పర్యంతం=ప్రారబ్ధ ప్రతిభాసమునాశమగుదాక (స్థూలశరీరము నశించుట ప్రారబ్ధక్షయము) ; స్వరూపానుసంధానేన=బ్రహ్మానుసంధానముచే ; జీవన్ముక్తిం=జీవన్ముక్తిని ; అవాప్య=పొంది ; వసేత్=నివసింప వలయును.

తా. తానే బ్రహ్మమని జగత్తుమిథ్యయని ఖేదమోదముల నొందక జీవించి స్థూలశరీరముతోనుండుట జీవన్ముక్తి. జ్ఞానిక్రి ప్రారబ్ధము న్నటుల పరులు తలచెదరుకానిజ్ఞానితలపడు. ఆత్మజ్ఞానమున కర్మమేనశించును కావున జ్ఞానికి ప్రారబ్ధము ప్రారబ్ధప్రతిభాస మనఁబడును. ప్రతిభాసమనఁగా లేనిదియున్నటుల కనబడుట.

"స్వరూపానుసంధానం వినాన్యథాచార పరోనభవేత్" ౧౨
(అథర్వ ; ౪౩ నారదపరివ్రాజక.)

టీ. స్వరూపానుసంధానం=పరమాత్మానుసంధానము (తాను పరమాత్మయేయని యోచించుట) ; వినా=విడిచి ; అన్యథా=మఱియొక తీరైన ; ఆచార=ఆచారమందు ; పరః=ఆసక్తుఁడు ; నభవేత్=కాఁగూడదు.

తా. తాను పరమాత్మయని అనుసంధానమును చేయుటను మాని యితరదేవతల నుపాసింపగూడదని యభిప్రాయము.

"వేదాన్తశ్రవణం కుర్వన్యోగంసమారభేత్" ౧౩
(అథర్వ ; ౫౮ శాండిల్య)

టీ. వేదాంత=ఉపనిషత్తులయొక్క ; శ్రవణం = వాక్యార్థానుసంధానమును ; కుర్వన్=చేయుచు, యోగం=అస్పర్శయోగమను పేరుగల నిర్వికల్పసమాధిని ; సమారభేత్=ఆరంభింపవలయును.

తా. వేదాన్త వాక్యార్థమును వినుచు, మారకుండక నిర్వికల్ప సమాధి సిద్ధింప ప్రయత్నింపవలయును. యోగమనఁగా నిర్వికల్ప

సమాధమైన యస్పర్శయోగమనుటకు " అస్పర్శయోగో నామైష దుర్ద
ర్శస్సర్వయోగిభిః " అని గౌడపాదవాక్యముగలదు.

" ఆకుంచనేనకుండలిన్యాః కవాటముద్ఘాట్య మోక్షద్వారం
విభేదయేత్ " ౧౪

(అథర్వ ; గీ॥ శాండిల్య ; అ. ౧.)

టీ. ఆకుంచనేన=గుదస్థానమందలి యపానమును పైకిలాగుటచేతను ; కుండలిన్యాః=కుండలినీశక్తిచే ; కవాటం=బ్రహ్మనాడియైన సుషుమ్నా కవాటమును ; ఉద్ఘాట్య=తెఱచి ; మోక్షద్వారం=మోక్షద్వారమైన బ్రహ్మరంధ్రమును ; విభేదయేత్=భేదింపవలెను.

తా. రహస్యప్రదేశమున ముక్తాసనమున గూర్చుండి రేచకపూరకములు మాని గుదస్థానమందలి యపానమును లాగవలయును. అట్లు లాగి కుంభించుటచే నాభికి తిర్యగ్భాగమున నధోముఖముగనుండు కుండలినీశక్తిమేల్కొనును. కుండలినీశక్తి మేల్కొనిన కుంభకస్థితియుండగా వాయువు బహిఃప్రచారముమాని విశుద్ధచక్రము దాటి వెనుకకు తిరిగి సుషుమ్నానాడిని తెఱచి, యందు సంచరించును. అప్పుడు మనఃప్రచారమణగియుండును. పిదప బ్రహ్మరంధ్రమును భేదించి వాయువుతోగూడి మనస్సు చిదాకాశమున లీనమగును. గురుకటాక్షమునగాని యిది సంప్రాప్తించదు.

" యచ్ఛేద్వాఙ్మనసి ప్రాజ్ఞస్తద్యచ్ఛేజ్జ్ఞాన ఆత్మని " ౧౫
" జ్ఞానమాత్మని మహతినియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని" ౧౬
(కృ-య ; ౩ కఠ ; అ౧ ; వ ౩)

టీ. ప్రాజ్ఞః=బ్రహ్మాత్మైక్యమున గలిగిన చిత్తైకాగ్రత ప్రజ్ఞయనబడును. ఆ ప్రజ్ఞగలవాడు ప్రాజ్ఞుడు ; అనగా బ్రహ్మజ్ఞాని ; వాక్=వాగాదీంద్రియములను ; మనసి=మనసునందు , యచ్ఛేత్=నియమింప

వలయును ; తత్ = ఆ మనసును ; జ్ఞానఆత్మని=నిశ్చయాత్మికమైన బుద్ధి యందు; యచ్ఛేత్ =నియమింపవలయును; జ్ఞానం=ఆబుద్ధిని; మహతి= గొప్పదియైన ; ఆత్మని=ప్రత్యగాత్మయందు ; నియచ్ఛేత్ =నియమింప వలయును ; తత్ =ఆప్రత్యగాత్మను ; శాంత ఆత్మని=నిర్వికారమైన పర బ్రహ్మమున ; నియచ్ఛేత్ =నియమింప వలెను.

ఈపదముండగూడదనితోంంది ఉంటే శ్లోకము నడవదు.

తా ఇంద్రియములను విషయములందు దగులనీయక వానిని వానికధికారియైన మనసునందే యుంచవలయును. సంకల్పరూపమైన మనసును నిశ్చయరూపము గలుగుటకై నిశ్చయాత్మికమైన బుద్ధియందు గూర్చవలయును. ఇతరనిశ్చయములు గలుగనీక "అహం బ్రహ్మాస్మి" అను నిశ్చయము గలుగుటకై యాబుద్ధిని ప్రత్యగాత్మయందు గూర్చ వలయును. అట్లుగూర్చి ప్రత్యగాత్మరూప పరబ్రహ్మమునినొకటిగ నిర్వి కారముగా నిర్వికల్పముగా నుండవలయును.

" ఆత్మానంచే ద్విజానీయా దయమస్మీతిపూరుషః " ౧౭
" కిమిచ్ఛన్కస్యకామాయ శరీరమనుసంజ్వరేత్ " ౧౮
(శు-య ; ౬౬ శాట్యాయనీయ ; ౧౦ బృహదారణ్యక ; ౭ ౬)

టీ. పూరుషః=పురుషుడు ; అయం=ఈయాత్మ ; అస్మీతి=అగు చున్నానని ; ఆత్మానం=తనను ; విజానీయాచ్చేత్= తెలిసికొనునేని ; కిమిచ్ఛన్ =ఏభోగమును కోరుచు ; కస్య=ఏభోక్తయొక్క ; కామాయ=కో రికకొరకు ; శరీరం= దేహమునుగూర్చి ; అనుసంజ్వరేత్ =తపించవల యును.

తా. పురుషుడు స్వయంప్రకాశ స్వరూపుడయిన యాత్మయే తానని యెఱిగినపిమ్మట నెవరినిమిత్తము దేనికొఱకు పరితపించును?పర మార్థదశయందు భోగ్యభోక్తృస్వరూపమైన ద్వైతము మిథ్యయగును

గాన నాత్మస్వరూపుఁడగు తాను నిరతిశయతృప్తిచే దేనిని గోర్చియు పరితపించఁడు.

" తమేవధీరో విజ్ఞాయప్రజ్ఞాం కుర్వీతబ్రాహ్మణః " ౧౯
" నానుధ్యాయేద్బహూన్ఛబ్దాన్ వాచో విగ్లాపనంహితత్ " ౨౦
(శ్రు-య ౬౮ వరాహ ; అ ౪ ; శు-య ; ౧౧ బృహదారణ్యక ; అ ౬.

అధర్వ ; ౭౦ అన్నపూర్ణ ; అ ౪.)

టీ. ధీరః=ఇంద్రియనిగ్రహముగలిగిన ; బ్రాహ్మణః=బ్రహ్మవేత్త ; తమేవ=ఆపరమాత్మనే ; విజ్ఞాయ=తెలిసికొని ; ప్రజ్ఞాం = చిత్తైకాగ్రతను ; కుర్వీత=సంపాదింపవలయును ; బహూన్=అనేకములయిన ; శబ్దాన్= శబ్దములను ; నానుధ్యాయేత్ = పఠింపఁగూడదు ; తత్ = అపఠనము ; వాచః=వాగింద్రియమునకు ; విగ్లాపనం=శ్రమముకొఱకు ; హి=నిశ్చయము.

తా. ఆత్మస్వరూపమెఱిఁగినవాఁడు నిర్వికల్పసమాధి సిద్ధింప బ్రయత్నింపవలయునుగాని యాత్మస్వరూపము నెఱిఁగించు శాస్త్రములను జదివిన లాభములేదు. అనుభవములేక యటు చదువుట నోటికి శ్రమమేగాని వేఱుగాదు.

" యతోనిర్విషయస్యాస్య మనసోముక్తిరిష్యతే " ౨౧
" అతోనిర్విషయంనిత్యం మనఃకార్యంముముక్షుణా " ౨౨

(కృ-య ; ౨౧ అమృతబిందు ; అధర్వణం, త్రిపురాతాపినీ)

టీ. యతః=ఏకారణమున ; నిర్విషయస్య=నిర్విషయమైన (విషయాసక్తిలేని) ; అస్యమనసః = ఈమనస్సుకు ; ముక్తిః = మోక్షము ; ఇష్యతే=ఇచ్ఛయింపఁబడుచున్నదో ; అతః=ఆకారణమున; ముముక్షుణా= మోక్షేచ్ఛ గలవానిచే ; నిత్యం=ఎల్లపుడు ; మనః=మనస్సు ; నిర్విషయం=నిర్విషయముగానే ; కార్యం=చేయదగినది.

తా. నిర్విషయమైన మనసునకు మోక్షము కలుగుచున్నది. కావున మోక్షమందు కోరికగలవాఁడు మనసును విషయములందుఁ దగులనీకయుండ వలయును.

"చిత్తమేవహి సంసారస్తత్ప్రయత్నేన శోధయేత్" ౨౬
(శు-య; ౬౬ శాట్యాయనీయ-కృ-య; ౯౮ వరాహ సామ; ౪౮ మైత్రాయణీ.

"దృశ్యంహ్యదృశ్యతాంనీత్వా బ్రహ్మాకారేణచిన్తయేత్" ౨౮
(కృయ; ౩౭ తేజోబిందు.

టీ. చిత్తమేవహి=చిత్తమేనిశ్చయముగ; సంసారః=సంసారము, తత్=దానిని (ఆచిత్తమును) ప్రయత్నేన ప్రయత్నమున; శోధయేత్= శోధించవలయును; దృశ్యంహి=చూడబడునిశ్వమును; అదృశ్యతాం= దృశ్యముకాని దానిగ; నీత్వా=గడపి (నిశ్చయించి, బ్రహ్మాకారేణ= బ్రహ్మస్వరూపమున; చింతయేత్=చింతింపవలయును.

తా. చిత్తమే సంసారము. ఆచిత్తమును వృత్తులులేనిదానిగ ప్రయత్నమున చేయవలయును. దృశ్యమును దాని కధిష్ఠానమగుయున బ్రహ్మముగానెంచి దృశ్యముగా నెంచకుండ వలయును.

"మాయాకార్యమిదం భేదమస్తిచే ద్బ్రహ్మభావనం" ౨౫
"దేహోహమితి దుఃఖీచేద్బ్రహ్మాహమితినిశ్చను" ౨౬
(కృ-య; ౩౭ తేజోబిందు)

టీ. మాయాకార్యం=మాయచే కల్పింపబడిన; ఇదంభేదం= ఈదృశ్యభేదము; అస్తిచేత్=ఉన్నదేని; బ్రహ్మభావనం=అది బ్రహ్మ మని తలఁచవలెను; అహం=నేను; దేహాఇతిచేత్=దేహమనితలచునేని, దుఃఖీ=దుఃఖవంతుఁడగును. అహం=నేను బ్రహ్మేతి=బ్రహ్మమని;నిశ్చను= నిశ్చయింపుము.

తా. ఈ దృశ్యభేదము మాయాకార్యముగాన మిథ్యయగుచున్నది. ఆభేదము కనుపడినేని దానిని బ్రహ్మముగా నూహింప వలయును. దేహమే తానని తలంచినయెడల నా దేహధర్మముల తనయందారోపించుకొని దుఃఖవంతుఁడగును. కావున తానే బ్రహ్మమని యెఱుంగవలెను. తాను బ్రహ్మమని యెఱింగిన సమస్తదుఃఖ నివృత్తియగును.

"హృదయగ్రంథిర స్తిత్వే ఛేదనే బ్రహ్మచక్రకం" ౨౭
"సంశయే సమనుప్రాప్తే బ్రహ్మనిశ్చయమాశ్రయాత్" ౨౮
(కృ-య ; ౩౭ తేజోబిందు.)

టీ. హృదయగ్రంథః=హృదయమునముడివంటియజ్ఞానము; అస్తిత్వే=ఉండగా; ఛేదనే=దానిని ఛేదించుటయందు; బ్రహ్మచక్రకం=బ్రహ్మచక్రము ప్రయోగించవలయును ; సంశయే=సందేహము ; సమనుప్రాప్తే=సంప్రాప్తించుచుండగా ; బ్రహ్మనిశ్చయం=బ్రహ్మమనునిశ్చయమును; ఆశ్రయాత్=పొందవలెను.

తా. హృదయమునయున్న ముడివంటి యజ్ఞానమును ఛేదించుటకు బ్రహ్మజ్ఞానచక్రమును ప్రయోగింపవలెను. బ్రహ్మమాజగత్తాయనుసందేహము గలుగునపుడు బ్రహ్మమని నిశ్చయించవలయును.

"విజ్ఞేయోఽక్షరతన్మాత్రో జీవితంచాతిచంచలం" ౨౯
"విహాయ శాస్త్రజాలాని యత్సత్యం తదుపాస్యతాం" ౩౦

(శుయ ; ౪౫ పైంగల. అ. ౩)

టీ. అక్షరతన్మాత్రః=అక్షరస్వభావుఁడయినకూటస్థుఁడు (ప్రత్యగాత్మ); విజ్ఞేయః=తెలిసికొనఁదగినవాఁడు ; జీవితంచ=ఆయుష్కాలమును ; అతిచంచలం=మిక్కిలిచంచలమయినది ; శాస్త్రజాలాని=శాస్త్రసమూహములను ; విహాయ=విడిచి ; యత్=ఏది ; సత్యం=సత్యమో ; తత్=అది ; ఉపాస్యతాం=ఉపాసింపబడుగాక.

తా. ఆయాపాత్రలము కల్పితమై అస్థిరమయినది నాశములేని కూటస్థుఁడే తెలియదగినవాఁడు కావున శాస్త్రప్రపఠనముమాని సత్యమైన కూటస్థాత్మనే యెఱిఁగి యుపాసన చేయవలయును.

ఈవిషయములో నుత్తరగీతలలో శ్రీకృష్ణులవారు చెప్పిన "అనంతశాస్త్రం" అను శ్లోకమును చూడవలెను.

"యస్య స్త్రీ తస్య భోగేచ్ఛా నిస్త్రీకస్య క్వ భోగభూః" ౩౧
"స్త్రియం త్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీ భవేత్" ౩౨
(సామ ; ౬౧ మహా ; ౩ అధ్యాయం. శు-య ; యాజ్ఞవల్క్య)

టీ. యస్య=ఎవనికి ; స్త్రీ=స్త్రీ కలదో ; తస్య=వానికి ; భోగేచ్ఛా=భోగాభిలాషయుండును ; నిస్త్రీకస్య=స్త్రీ లేనివానికి ; భోగభూః=భోగానుభవస్థానము ; క్వ=యెక్కడిది ; స్త్రియం=స్త్రీని ; త్యక్త్వా=విడిచి ; జగత్=జగత్తు ; త్యక్తం=విడువబడినది ; జగత్=జగత్తును ; త్యక్త్వా=విడిచి, సుఖీ=సుఖవంతుఁడు ; భవేత్=అగుచున్నాఁడు.

తా. స్త్రీవాంఛ యెవనికుండునో వానికి భోగమును భోగకార్యమయిన దుఃఖమును గలుగును. స్త్రీవాంఛ లేనివానికి భోగము దాని ఫలమయిన దుఃఖము నెట్లుండును? ఉండవు; స్త్రీని జయించినవానిచే జగత్తు జయింపబడును. జగత్తు జయించినవాఁడే సుఖవంతుఁడు. మనస్సే జగత్తు గాన మనసును జయింపవలెను.

"చిత్తం కారణమర్థానాం తస్మిన్సతి జగత్త్రయం" ౩౩
"తస్మిన్ క్షీణే జగత్ క్షీణం తచ్చికిత్స్యం ప్రయత్నతః" ౩౪
(సామ ; ౬౧ మహా ; అ ౫. కృ-య ; ౬౩ యోగశిఖా)

టీ. చిత్తం=చిత్తము ; అర్థానాం=పదార్థములకు ; కారణం=హేతువగును ; తస్మిన్సతి=ఆచిత్తముండఁగా ; జగత్త్రయం=మూఁడులోకములున్నవి ; తస్మిన్ క్షీణే=ఆచిత్తము క్షీణించియుండఁగా ; జగత్ క్షీణం=జగ

క్షిత్రుణించినదియగును ; ప్రయత్నతః=ప్రయత్నముచే; తత్=ఆచిత్తము; చికిత్స్యం=బాగుచేయవలసినది.

తా. చిత్తమే సమస్తసంసారములకు హేతువగును. చిత్తమే మూడులోకములుగాన చిత్తముండిన జగత్తుండును. చిత్తమునశించిన జగత్తు నశించును. కరిగించబడినరాగి మూసయందుజొచ్చి దానియాకారమును బొందునటులు చిత్తము రూపాదివిషయములందు వ్యాపించి వాని రూపమును బొందును. "మూషాసిక్తం యథాతామ్రం తన్నిభం జాయతే తథా। రూపాదీన్ వ్యాప్నువచ్చిత్తం తన్నిభం దృశ్యతే ధ్రువం" అని శంకరాచార్యులవారు చెప్పియున్నారు. కావున చిత్తమును నశింపజేసిన జగత్తులేనివాడగును. జగత్తులేమిచే సుఖవంతుడగును.

"సుప్తేరుత్థాయ సుప్త్యంతం బ్రహ్మైకం పరిచింత్యతాం" ౩౫

కృ-య ౯౨ వరాహ

టీ. సుప్తేః=నిద్రనుండి ; ఉత్థాయ=లేచి ; సుప్త్యంతం=నిద్రపోవువరకు ; బ్రహ్మ=బ్రహ్మము ; ఏకం=ఒక్కటియే ; పరిచింత్యతాం=చింతింపబడవలయును.

తా. నిద్రనుండిలేచి నిద్రపోవువరకు గల కాలమున నితరాసక్తి లేక యాకాలమును వ్యర్థపుచ్చక బ్రహ్మమునే ధ్యానింపవలయును.

"గచ్ఛం స్తిష్ఠన్నుపవిశన్ శయానో వాన్యథాపివా" ౩౬
"యథేచ్ఛయావసేద్విద్వానాత్మారామః సదామునిః" ౩౭

(సామ; ౭౮ కుండిన్య-చివరవాక్యం)

టీ. విద్వాన్=బ్రహ్మవేత్తయగు పురుషుడు ; గచ్ఛన్=నడుచుచున్నను ; తిష్ఠన్=నిలుచున్నను ; ఉపవిశన్=కూర్చున్నను ; శయానో వా=పడుకొనియున్నవాడయినను ; అన్యథాపివా=మరియొకరీతిగా

నున్నవాడై నను, సదా=ఎల్లప్పుడు, మునిః=మునియై; ఆత్మారామః=ఆత్మయందే రమించువాడై; యథేచ్ఛయా=చిత్తము వచ్చినటుల; వసేత్=ఉండవలయును.

"జ్యోతిర్లింగం భ్రువోర్మధ్యే నిత్యం ధ్యాయేత్సదాయతిః" ౩౮
(కృ-య. ౧౧ బ్రహ్మవిద్యా.)

టీ. సదా=ఎల్లప్పుడు, యతిః=యతి, భ్రువోర్మధ్యే=భ్రూమధ్యమందు, జ్యోతిర్లింగం=ప్రకాశలక్షణమైన, నిత్యం=నిత్యమైన యాత్మను, ధ్యాయేత్=ధ్యానింపవలయును.

తా. భ్రూమధ్యమందు దృష్టినిలిపిన చిత్తముస్థిరముగా నుండును. షణ్ముఖిచేగాని, శాంభవిచేగాని నీవారశూకమువలె ప్రకాశస్వరూపమైన యణువువలెనున్న కలాగ్రమందు శుద్ధస్ఫటికసంకాశముగు నాత్మ ధ్యానించదగినది.

"ఆత్మానమాత్మనాసాక్షాద్బ్రహ్మ బుద్ధ్వాసునిశ్చలం" ౩౯
"దేహజాత్యాదిసంబంధాన్ వర్ణాశ్రమసమన్వితాన్" ౪౦
"వేదశాస్త్రపురాణాని పదపాంసుమివత్యజేత్" ౪౧
(కృ-య॥౧౧ బ్రహ్మవిద్యా.)

టీ. ఆత్మనా=నిశ్చయాత్మికయగుబుద్ధిచే, ఆత్మానం = తనను, సాక్షాత్=ప్రత్యక్షముగ, బ్రహ్మ=బ్రహ్మముగ, సునిశ్చలం=దృఢముగ, బుద్ధ్వా=తెలుసుకొని, దేహజాత్యాదిసంబంధాన్=దేహముజాతిమొదలైనసంబంధములైన, వర్ణాశ్రమసమన్వితాన్=వర్ణాశ్రమములతో గూడిన, వేదశాస్త్రపురాణాని=వేదశాస్త్రపురాణములను, పదపాంసుమివ=పాదధూళివలెనే, త్యజేత్=విడువవలయును.

తా. తాను బ్రహ్మమని యెరిగినపిదప శక్తునవానికి ప్రయోజనములేదుగావున, వర్ణాశ్రమాదులను, వేదశాస్త్ర పురాణములను

పాదధూళివలె విడువవలయును. బ్రహ్మమునెరుగకుండిన వేదశాస్త్రము లవలన ప్రయోజనములేదు. బ్రహ్మమునెరిగినపిదప వేదశాస్త్రముల వలనప్రయోజనములేదు. బ్రహ్మమునెరుగుటకువేదశాస్త్రములను చదువు కొనవలయును. బ్రహ్మము నెరుగకుండినను ఎరిగినపిదపను వేదశాస్త్ర ములవలన ప్రయోజనములేదని "అవిజ్ఞాతే పరేతత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా। విజ్ఞాతేఽపి పరేతత్త్వే శాస్త్రాధీతిస్తునిష్ఫలా" అను వాక్యము లచేత శంకరాచార్యులవారు చెప్పియున్నారు. వివేకచూడామణిశ్లో. ౬౧

శాస్త్రనిష్ఫలత్వమునుగురించి శ్రీకృష్ణులవారు ఉత్తరగీతల యందు కొన్ని శ్లోకములను చెప్పిరి. అవిచూడవలెను.

"ఏకాకీనిస్స్పృహాస్తిష్ఠేన్నహికేనసహాలపేత్" ౪౨
"దద్యాన్నారాయణేత్యేవం ప్రతివాక్యంసదాయతిః" ౪౩

(అథర్వ-౪౩ నారద పరివ్రాజక)

టీ. యతిః=సన్యాసి, సదా=ఎల్లప్పుడు, ఏకాకీ= ఒంటిగనుండు వాడై, నిస్స్పృహః=దేనియందు కోరికలేనివాడై; తిష్ఠేత్ =ఉండవలెను, కేనసహ=ఎవనితోను, నాలపేత్ =మాటలాడగూడదు, నారాయణేతి=నా రాయణయని, ఏవం=ఈరీతుగ, ప్రతివాక్యం=మారుమాటను, దద్యాత్ = ఇయ్యవలెను.

తా. యతి సంగమును నపేక్షించక నిష్కాముడై ఎవనితోను మా టలాడక యుండవలయును. ఎవ్వరేమియనినను నారాయణయని ప్రత్యు త్తరముగ చెప్పవలయును గాని వారితో వ్యర్థముగ మాటలాడగూడదు.

"మునిః కౌపీనవాసాస్స్యాన్నగ్నోవాధ్యాన తత్పరః" ౪౪

(అథర్వ.౪౩ నారదపరివ్రాజక)

టీ. ధ్యానతత్పరః=ధ్యానాసక్తుడైన, మునిః=ముని, కౌపీనవా సాః=గోచిపెట్టినవాడైనను, నగ్నోవా=దిగంబరుడైనను, స్యాత్ =అగును.

తా. ధ్యానమందే యాసక్తిగలయోగి మృదువస్త్రాదులను గోరక గోచినిబూని యుండవలయును.

" అధ్యాత్మరతిరాసీనో నిరపేక్షో నిరాశిషః " ౪౫
" ఆత్మనైవసహాయేన సుఖార్థీ విచరేదిహ " ౪౬
(అథర్వ ౪౩ నారదపరివ్రాజక.)

టీ. సుఖార్థీ = అఖండబ్రహ్మసుఖమునుగోరుయోగి, అధ్యాత్మరతిః=ఆత్మయందాసక్తిగలవాడును, ఆసీనః=స్థిరమైన సుఖాసనముగలవాడును, నిరపేక్షః=విషయములందపేక్షలేనివాడును, నిరాశిషః=ఆశీర్వచనము లేనివాడును, ఆత్మనా=ఆత్మరూపమైన, సహాయేనైవ=సహాయముచేతనే (ఆత్మసహాయముచేతనే) ఇహ=ఈలోకమందు, విచరేత్=సంచరించవలయును.

తా. అఖండబ్రహ్మసుఖమునుగోరు యోగి విషయసుఖమును గోరక నారాయణయనుమాటదక్క నాశీర్వచనములేనివాడై తనదేహసహాయముదక్క నితరసహాయములేక ఈలోకమున చరింపవలయును. సంగము నపేక్షించరాదు.

" సంధిగ్ధస్సర్వభూతానాం వర్ణాశ్రమవివర్జితః. " ౪౭
" అంధవజ్జడవచ్చాపి మూకవచ్చ మహీంచరేత్ " ౪౮
(అథర్వ-౪౩ నారద పరివ్రాజక.)

టీ. వర్ణాశ్రమ వివర్జితః=వర్ణాశ్రమముల విడిచినయోగి, సర్వభూతానాం=సర్వభూతములకు, సంధిగ్ధః=సందిగ్ధముగలుగు వేషముగలవాడై, అంధవచ్చ=గుడ్డివానివలెను, జడవచ్చాపి=జడునివలెను, మూకవచ్చ=మూగవానివలెను, మహీం=భూమియందు, చరేత్=చరింపవలెను.

తా. ఈతడెట్టివాడోయని సర్వజనులకు సందేహము గలిగించు వేషముగలవాడై విషయములను జూచియు చూడక గ్రుడ్డివానివలెను,

ఎవ్వరేమియనినను మాటలాడక మూగవానివలెను, దేనియందు స్పృహ లేక జడునివలెను ప్రవర్తింపవలెను.

" యద్యత్పశ్యతిచ చక్షుర్భ్యాం తత్తదాత్మేతిభావయేత్. " ౪౯
" యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతిభావయేత్. " ౫౦
(కృ-య-౪౧ యోగతత్త్వ.)

టీ. యద్యత్=ఏయేపదార్థమును, చక్షుర్భ్యాం=నేత్రములచేత, పశ్యతి=చూచుచున్నాడో, తత్తత్=ఆయాపదార్థమునే, ఆత్మేతి = ఆత్మ భావయేత్=భావింపవలెను; యద్యత్=ఏయేపదార్థమును, కర్ణాభ్యాం= యని, కర్ణములచే, శృణోతి=వినుచున్నాడో, తత్తత్= ఆయా పదార్థమునే, ఆత్మేతి=ఆత్మయని, భావయేత్=భావింపవలెను, సమస్తవిషయములను వానికిస్థానమైన బ్రహ్మముగా భావింపవలయును.

తా. నేత్రములతో దేనిని చూచుచున్నాడో చెవులతో దేనిని వినుచున్నాడో దానినంతయు నాత్మకంటె నితరమెద్దియును లేదని ఆత్మగానే భావింపవలయును.

" లభతేనాసయాయద్యత్తత్తదాత్మేతిభావయేత్ " ౫౧
" జిహ్వయాయద్రసంహ్యత్తి తత్తదాత్మేతిభావయేత్ " ౫౨
(కృ-య; ౪౧ యోగతత్త్వ.)

టీ. నాసయా=ముక్కుచే, యద్యత్=యేయేగంధమును, లభతే= పొందుచున్నాడో, తత్తత్=ఆయాగంధమునే, ఆత్మేతి = ఆత్మయని, భావయేత్=భావింపవలెను, జిహ్వయా=నాలుకచేత, యత్=ఏ, రసం= రసమును, హి=నిశ్చయముగా, అత్తి=పొందుచున్నాడో, తత్తత్= ఆయారసమును, ఆత్మేతి=ఆత్మయని, భావయేత్=భావింపవలెను.

తా. స్పష్టము.

"త్వచాయద్యత్స్పృశేద్యోగీ తత్తదాత్మేతిభావయేత్" ౫౩
(కృ-య ; ౭౧ యోగతత్త్వ.)

టీ. యోగీ=ఆత్మానుసంధానముచేయువాడు, త్వచా=చర్మము చేత, యద్యత్=ఏయేస్పర్శమును, స్పృశేత్ = ముట్టునో, తత్తత్=ఆ యాస్పర్శమునే, ఆత్మేతి=ఆత్మయని, భావయేత్=భావింపవలయును.

తా. సమస్తవిషయములను వాని కధిష్ఠానమైన బ్రహ్మముగా భావింపవలయుననియు ఏప్రజ్ఞానముచే విషయముల నెరుగుచున్నాడో దానిని ఆత్మయనియు భావింపవలయును. పైనఁజెప్పిన చక్షురాదులు అయిదును ప్రత్యాహారములు.

(౫౮ శాండిల్యోపనిషత్-అ ౧ చివరచూడవలయును.)

"దృష్టింజ్ఞానమయీంకృత్వా పశ్యేద్బ్రహ్మమయంజగత్" ౫౪
(కృ-య ; ౩౭ తేజోబిందు)

టీ. దృష్టిం=దృష్టిని (బుద్ధిని) జ్ఞానమయీం=జ్ఞానమయమైనదానినిగా, కృత్వా=చేసి, జగత్=జగత్తును, బ్రహ్మమయం = బ్రహ్మమయమైనదానినిగా, పశ్యేత్=చూడవలెను.

తా. బుద్ధిని భేదములేనిదానినిగ జేసి జగత్తును బ్రహ్మమొక్క వివర్తముగా నూహింపవలయును.

"ద్రష్టృదర్శనదృశ్యానాం విరామోయత్రవాభవేత్" ౫౫
"దృష్టిస్తత్రైవకర్తవ్యా ననాసాగ్రావలోకినీ" ౫౬
(కృ-య ; ౩౭ తేజోబిందు)

టీ. ద్రష్టృదర్శనదృశ్యానాం=చూచువాఁడు, చూచుట, చూడబడునది, యీమూటియొక్క ; విరామః=నాశము ; యత్రవా=ఎక్కడ; భవేత్=అగునో ; దృష్టిః=దృష్టి ; తత్రైవ=అక్కడనే ; కర్తవ్యా=చే

యుదగినది ; నాసాగ్రావలోకీ=ముక్కుకొనను చూచుదానిగ ; న=చేయదగదు.

తా. అభేదమైన బ్రహ్మమునందు, ద్రష్ట, దర్శనము, దృశ్యము నను త్రిపుటియుండదు. అట్టిబ్రహ్మమునందే దృష్టియుండవలయును. గాని నాసాగ్రమందు దృష్టినిల్పరాదు. బ్రహ్మము నుద్దేశింపక కేవలము నాసాగ్రమున దృష్టినిలిపిన ప్రయోజనములేదు.

" దేవాగ్న్యగారే తరుమూలే గుహాయాం వసేదసంగోఽలక్షితశీలవృత్తః " ౫౭

(శు య ; ౯౯ శాట్యాయనీయ)

టీ అసంగః=సంగములేనట్టి ; అలక్షితశీలవృత్తః = పరులకు తెలియబడని స్వభావము నడవడియు గలయోగి ; దేవాగ్న్యగారే=దేవాగ్నిగృహములందును ; తరుమూలే=వృక్షమూలమునందును ; గుహాయాం= గుహాయందును ; వసేత్=నివసింపవలయును.

తా. యోగిసంగమునుగోరక యితరులకు తెలియబడని స్వభావప్రవర్తనముగలవాఁడై, వృక్షమూలమందైనను, గుహాయందైనను, దేవాలయమందైన నుండవలయును.

" నిరింధనజ్యోతిరివోపశాంతో నచోద్విజే దుద్విజేద్యత్రకుత్ర "

(శు-య ; ౯౯ శాట్యాయనీయ)

టీ. యత్రకుత్ర=స్వాతిరిక్తమేదో చెడు జగత్తునెక్కడనైనను; ఉద్విజేత్=భయపడవలయును ; నిరింధనజ్యోతిరివ=కట్టెలులేనియగ్నిజ్వాలవలె ; ఉపశాంతః=శాంతుఁడై ; నోద్విజేత్=భయపడరాదు.

తా. జగత్తు సత్యమని న భయపడవలెను. తనకంటె నన్యములేదని కట్టెలేని యగ్నివలె శాంతుఁడై భయాభినివేశము విడువవలయును.

" శాంతో దాంత ఉపరత స్తితిక్షుర్యోఽనూచానోహ్యభిజ్ఞోఽసౌసమానః " ౫౯

(శు-య; ౯౯ శాట్యాయనీయ:—)

టీ. శాంతః=అంతరింద్రియనిగ్రహము గలవాఁడును; దాన్తః=బాహ్యేంద్రియనిగ్రహము గలవాఁడును, ఉపరతః = యథావిధిగ కర్మసన్యాసమును చేసినవాఁడును; తితిక్షుః=శీతాతపవాతక్లేశములకు సప్రతీకారపూర్వకముగ చింతింపక యోర్చువాఁడును; అనూచానః=వేదశాస్త్రములను సంపూర్ణముగ దెలిసినవాఁడును; యః=ఎవ్వఁడో; అసౌ=ఈపురుషుఁడు; సమానః=సర్వత్రసముఁడై; ప్రత్యగభిన్నుఁడై; అభిజ్ఞః=సర్వజ్ఞుఁడగును, హి=నిశ్చయము.

తా. ఆత్మజ్ఞాని మొట్టమొదట శమదమాదులుగల యధికారి కావలయునని యీశ్రుతియభిప్రాయము.

" త్యక్తైషణో హ్యనృణ స్తం విదిత్వా మౌనీవసేదాశ్రమే యత్ర కుత్ర " ౬౦

టీ. త్యక్తైషణః=ఈషణత్రయములేనివాఁడై; అనృణః=ఋణములేనివాఁడై; తం=ఆయాత్మను; విదిత్వా=తెలిసికొని; మౌనీ=ఇతరసంకల్పములేనివాఁడై; యత్రకుత్రాశ్రమే=ఏయాశ్రమమందైనను; వసేత్=నివసింపవలయును.

తా. భార్యకావలెనను కోరిక దారేషణ, పుత్త్రుడుకావలెనను కోరిక పుత్త్రైషణ, ధనముకావలయుననుకోరిక ధనేషణ, ఈమూడు కోరికలు ఈషణత్రయమనబడును. అన్నదానాది యజ్ఞముచేసిన దేవఋణము తీరును. పుత్త్రునిగాంచిన పితౄణములేదు. వేదాధ్యయనము వలనగాని తీర్థయాత్రలవలనగాని ఋషిఋణము తీరును. ఈమూడు ఋణములు లేనివాఁడనృణుఁడు. యోగి యీషణత్రయమును త్యజించిన

వాఁడై, ఋణత్రయము లేనివాఁడై, యాత్మను తెలిసికొని, యితర సంకల్పములు లేక యేయాశ్రమమునందైనను నివసింపవలయును.

“ యమైశ్చనియమైశ్చైవ ధ్యానైశ్చైవసుసంయుతః ” ౬౧
“ నాడీశుద్ధించకృత్వాదౌ ప్రాణాయామంసమాచరేత్ ” ౬౨

(శు-య ; ౪౪ త్రిశిఖబ్రాహ్మణ)

టీ. యమైశ్చ=యమములతోడను ; నియమైశ్చైవ = నియమములతోడను ; ధ్యానైశ్చైవ=ధ్యానములతోడను ; సుసంయుతః=లెస్సగగూడినయోగి ; ఆదౌ=మొదట ; నాడీశుద్ధించ=నాడీశుద్ధిని, కృత్వా=చేసి; ప్రాణాయామం=ప్రాణాయామ యోగమును, సమాచరేత్=ఆచరింపవలెను.

తా. యమనియమధ్యానములతోఁగూడిన యోగి మొదటను నాడీశుద్ధిని జేసి పిదప ప్రాణాయామమును జేయవలయును. యమనియమధ్యానములు లేనివాఁడు ప్రాణాయామము జేయరాదు. చేసిన గరిడీవానివలెనగును. అహింస, అస్తేయము, బ్రహ్మచర్యము, సత్యము, అపరిగ్రహము, ఇవి యమములు. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము, ఇవి నియమములు. మంత్రాదులచే ధ్యానించుట ధ్యానము (ధ్యేయముదక్క ఇతరము గోచరముకాక యుండుట-ధ్యానము) ఏజంతువునైనను హింసింపక, ఇతరులు హింసించుచుండ సహింపకయుండుట యహింస. పరద్రవ్యము నపహరింపక యుండుటయు, నన్యాయముగ గ్రహింపకయుండుటయు, నస్తేయము. యథార్థముజెప్పుట సత్యము. స్త్రీవాంఛలేక యూర్ధ్వరేతస్కుఁడై యుండుట బ్రహ్మచర్యము. దానాదులను ప్రతిగ్రహింపక, భక్తిపూర్వకముగ శిష్యాదులిచ్చు విత్తమును గ్రహించుట యపరిగ్రహము. స్నానాదులచే దేహమును శుద్ధిచేయుచు మనసును దుర్వృత్తులజొరనీక యుండుట శౌచము. ఏదిదొరకిన దానితో దృప్తినొందుచు నాశలేక

యుండుట సంతోషము. ఉపవాస చాంద్రాయణ వ్రతాదులచే దేహమును శుష్కింపజేయుట తపస్సు. వేదాధ్యయనము, మంత్రధ్యానాదుల జేయుట స్వాధ్యాయము. కర్మములందు కర్తృత్వభోక్తృత్వాది ధర్మములుగల యభిమానమును విడిచి యీశ్వరార్పణము చేయుట యీశ్వరప్రణిధానము. ప్రాణాయామము రేచక, పూరక, కుంభకసాధ్యమైనది. వాయువును విడచుట రేచకము. పూరించుట పూరకము. రేచకపూరకములులేక వాయువును నిలుపుట కుంభకము దీనివిధము గురుముఖమున నెఱిగి యభ్యసింపవలయును.

"సర్వచింతాంపరిత్యజ్య సావధానేనచేతసా" ౬౩
(కృ-యు; ౯౦ వరాహ అ ౨)

"నిర్వికల్పఃప్రసన్నాత్మా ప్రాణాయామంసమాచరేత్" ౬౪
(కృ-యు; ౯౦ వరాహ అ ౫)

టీ. సర్వచింతాం=సర్వచింతను, పరిత్యజ్య=విడిచి, సావధానేన=వృత్తులులేక తెలివిగలిగిన, చేతసా=చిత్తముతో, నిర్వికల్పః=వికల్పములేని, ప్రసన్నాత్మా=ప్రత్యక్షమైన యాత్మస్వరూపముగలయోగి, ప్రాణాయామం=ప్రాణాయామమును, సమాచరేత్=ఆచరింపవలయును.

తా. చింతలులేని స్థిరచిత్తముతో, నాత్మజ్ఞుడైన యోగిప్రాణాయామమును చేయవలయునుగాని యితరులు చేయగూడదు.

"మరుదభ్యసనంసర్వం మనోయుక్తంసమభ్యసేత్" ౬౫
"ఇతరత్రనకర్తవ్యా మనోవృత్తిర్మనీషిణా" ౬౬

(అథర్వ; ౫౮ శాండిల్య అ ౧)

టీ. సర్వం = సమస్తమైన, మరుదభ్యసనం=కుంభకరూపమైన వాయుధారణను, మనోయుక్తం=సంకల్పరహితమగు మనోయుక్తముగ,

సమభ్యసేత్ =అభ్యసింపవలయును, మనోవృత్తిః = మనోవ్యాపారము, ఇతరత్ర=బ్రహ్మవ్యతిరిక్తమైన విషయమందు, మనీషిణా = యోగిచేత, నకర్తవ్యా=ప్రసరింపచేయదగినది కాదు

తా. వాయుధారణను మనోయుక్తముగ నభ్యసింపవలయును. మనస్సు స్థిరముగా నుండుటకే యభ్యసింపవలయును. ఆమనస్సును బ్రహ్మమున దక్క ఇతరవిషయమున నిలుపరాదు. అప్పుడు కుంభకమున బ్రహ్మమునందుస్థిరముగ నుండును

ఇతి సార్ధాంతిక విధివాక్యానిషట్షష్టిః.

ఇట్లు సార్ధాంతిక విధివాక్యములు అరువదియారు.

ఇతిప్రథమం ప్రకరణం సమాప్తమ్

ఇట్లు ప్రథమ ప్రకరణము సమాప్తము.

---



సద్గురవేనమః.

# ౨. బంధమోక్ష వాక్యప్రకరణము.

"దేహాదీనాత్మత్వేనాభిమన్యతే సోభిమానఆత్మనోబంధః" ౧
(కృ-య; ౩౨ సర్వసార.)

టీ. దేహాదీన్=దేహము మొదలయినవానిని, ఆత్మత్వేన=ఆత్మత్వముచేత (తానేయని), అభిమన్యతే=తలచబడుచున్నదో, సః=ఆ, అభిమానః=దేహాద్యభిమానము, ఆత్మనః=తనకు, బంధః=బంధము.

తా. స్పష్టము.

"తన్నివృత్తిర్మోక్షః" ౨
(కృ-య ; ౩౩ సర్వసార)

టీ. తన్నివృత్తిః=ఆయభిమానముపోవుట; మోక్షః=మోక్షము.

తా. స్పష్టము.

"కర్తృత్వాద్యహంకార సంకల్పోబంధః" ౩
(శు-య ; ౩౫ నిరాలంబ.)

టీ. కర్తృత్వాది=కర్తృత్వభోక్తృత్వాది కర్మములందు ; అహంకారసంకల్పః=నేను నేనని చేయు సంకల్పమే ; బంధః=బంధము.

తా. సర్వకర్మములను నేను చేయుచున్నాను, నే ననుభవించుచున్నానను భావముతో గూడిన సంకల్పమే బంధము.

"అణిమాద్యష్టైశ్వర్యాశాసిద్ధసంకల్పోబంధః" ౪

(శు-య; ౩౪ నిరాలంబ.)

టీ. అణిమాద్యష్టైశ్వర్యాశా సిద్ధసంకల్పః, అణిమాది=అణిమ మొదలగు, అష్టైశ్వర్య = అష్టైశ్వర్యములందు, ఆశాసిద్ధ=కోరికవలన గలిగిన, సంకల్పః=సంకల్పము, బంధః=బంధమగును.

తా. అణిమాద్యష్టసిద్ధులు తనకు గావలయునని కోరుటయే బంధము. అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము వశిత్వము ఇవి యష్టసిద్ధులు.

"యమాద్యష్టాంగయోగ సంకల్పోబంధః" ౫

(శు-య ; ౩౪ నిరాలంబ.)

టీ. యమాది=యమము మొదలయిన, అష్టాంగ=ఎనిమిది అంగములతోగూడిన, యోగసంకల్పః=యోగవిషయమైన తలంపు, బంధః=బంధము.

తా. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, సమాధి ఇవి అష్టాంగయోగములు. ఇట్టి యోగములు సిద్ధింపవలయునను తలంపే బంధము

"దేవమనుష్యాద్యుపాసనా సంకల్పోబంధః" ౬

(శు-య ; ౩౪ నిరాలంబ.)

టీ. దేవమనుష్యాది = దేవతలు, మనుష్యులు మొదలగువారి యొక్క, ఉపాసనా=ఉపాసనా విషయమైన, కామసంకల్పః=కోరికతో గూడినతలంపు, బంధః=బంధము.

తా. తాను బ్రహ్మమని తెలియక దేవతా మనుష్యాదుల నుపాసించుటయే బంధము.

"కేవలమోక్షాపేక్షా సంకల్పోబంధః"

(శు-య ; ౩౮ నిరాలంబ)

టీ. కేవలమోక్షాపేక్షా సంకల్పః, కేవల=భేదత్రయరహితమైన, మోక్ష=మోక్షమందలి అపేక్షా=ఆశతోఁగూడిన, సంకల్పః=తలంపు, బంధః=బంధము. ౭

తా. స్వతస్సిద్ధముగా తాను ముక్తస్వరూపుఁడై యున్నందున, తనకు మోక్షము కావలయునని యజ్ఞానముతోఁ దలఁచుటే బంధము.

"సంకల్పమాత్ర సంభవోబంధః" ౮

(శు-య ; ౩౮ నిరాలంబ.)

టీ. సంకల్పమాత్ర సంభవః-సంకల్పమాత్ర=ఒక్క సంకల్పము యొక్క, సంభవః=ఉదయము, బంధః=బంధము.

తా. కేవలము సంకల్పము కలుగుటయే బంధము.

"నిత్యానిత్య వస్తువిచారా దనిత్యసంసారసుఖదుఃఖవిషయ సమస్తక్షేత్రమమతా బంధక్షయోమోక్షః" ౯

(శు-య ; ౩౮ నిరాలంబ.)

టీ. నిత్యానిత్య వస్తువిచారాత్ = నిత్యానిత్య వస్తువిచారము వలన, అనిత్య సంసార సుఖదుఃఖవిషయ సమస్తక్షేత్రమమతా బంధక్షయః-అనిత్య=అశాశ్వతమైన, సంసార=సంసారమున, సుఖదుఃఖవిషయ= సుఖదుఃఖముల నిచ్చు విషయములైన, సమస్తక్షేత్ర=సమస్తక్షేత్రము లందుగల, మమతాబంధక్షయః = మమకారమను బంధము యొక్క క్షయము (నాశము), మోక్షః=మోక్షము.

తా. బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య యని విచారించుట నిత్యానిత్య వస్తువిచారము. జగత్తు మిథ్య గావున, సంసారమున సుఖ

దుఃఖముల నిచ్చు విషయములైన పుత్రకళత్రక్షేత్రాదులందు మమకారము నశించుటయే మోక్షము. ఈ వస్తువు నాదియని అభిమానించుటే మమకారము. అదియేబంధము. అది నశించుటయే మోక్షము. ఆమమకారము నిత్యానిత్యవస్తు విచారమువలన నశించును గాని మఱియొక దానివలన నశించదు.

“ మనఏవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః ” ౧౦

“ బంధాయవిషయాసక్తం ముక్త్యైనిర్విషయంస్మృతం ” ౧౧

(శు-౮౫ ; ౯౯ శాట్యాయనీయ; అథర్వ ౮౦ త్రిపురాతాపని)

(సామ ౨౪ మైత్రాయణీ; కృ-య; ౨౧ అమృతబిందు)

టీ. మనుష్యాణాం=మనుష్యులకు, మనఏవ=మనస్సే, బంధమోక్షయోః=బంధమోక్షములకు, కారణం=హేతువగును, విషయాసక్తం=విషయాసక్తిగలమనస్సు, బంధాయ= బంధమునకొనియు, నిర్విషయం = విషయాసక్తిలేనిమనస్సు ముక్త్యై=ముక్తికనియు, స్మృతం=చెప్పబడెను.

తా. మనుష్యులకు మనస్సే బంధమోక్షములకు హేతువగుచున్నది. కాని ఇతరు లెవ్వరుకారు. విషయములందు దగిలిన మనసు బంధమునిచ్చును. విషయములందు దగులని మనసు మోక్షమునకు హేతువగును. కావున ఇతరు లెవరైనను తనకు మోక్షమునిత్తురని విషయాసక్తితో నుండుట మూర్ఖత్వము.

“ మమేతిబధ్యతేజంతు న్నిర్మమేతి విముచ్యతే ” ౧౨

“ మమత్వేన భవేజ్జీవో నిర్మమత్వేనకేవలః ” ౧౩

(సామ ; ౬౧ మహా ; అ ౪-కృ-య ; ౬౮ వరాహ)

(శు-య ; ౫౯ పైంగల అ ౪-సామ ; ౪౬ యోగచూడామణి)

టీ. జంతుః=మనుష్యుడు, మమేతి=నాదియని, బధ్యతే=బంధింపబడుచున్నాఁడు, నిర్మమేతి=నాదికాదని; విముచ్యతే=బాధమునుండి విడువబడుచున్నాఁడు; మమత్వేన=మమకారముచే, జీవః=జీవుఁడు, భవేత్=అగును, నిర్మమత్వేన=మమకారము లేకపోవుటచేత, కేవలః=అద్వితీయమైన పరమాత్మయగును.

తా. తనకంటె నితరవస్తువున్నదని దలఁచుట మమకారమునకు హేతువగును. ఆ మమకారముచే జీవత్వము గలుగుచున్నది. అద్వితీయబ్రహ్మమైన తనకంటె నితరములేదని తలఁచుట నిర్మమత్వమునకు హేతువగును. దానిచే తాను బ్రహ్మమగును.

" స్వసంకల్పవశాద్బద్ధో నిస్సంకల్పాద్విముచ్యతే " ౧౮
(సామ; ౬౧ మహా; అ ౨)

టీ. స్వసంకల్పవశాత్=తన సంకల్పమువలన, బద్ధః=బద్ధుఁడగుచున్నాఁడు. నిస్సంకల్పాత్=సంకల్పించకపోవుటవలన, విముచ్యతే=బంధముక్తుఁడగుచున్నాఁడు.

తా. స్పష్టము.

" ద్రష్టాదృశ్యవశాద్బద్ధో దృశ్యాభావేవిముచ్యతే " ౧౯
(సామ ; ౬౧ మహా ; అ ౪)

టీ. ద్రష్టా=చూచువాఁడు, దృశ్యవశాత్ = దృశ్యవశుఁడగుటవలన, బద్ధః=బద్ధుఁడగుచున్నాఁడు, దృశ్యాభావే=దృశ్యములేనపుడు, విముచ్యతే=ముక్తుఁడగుచున్నాఁడు.

తా. చూడబడుపదార్థమునకు వశుఁడైయున్నందున చూచువాఁడు బద్ధుఁడగుచున్నాఁడు. చూడబడు వస్తువులేనపుడతనివేఱులేనివాఁడై ముక్తుఁడగును. కావునతనకంటె నన్యమైనదృశ్యము లేదనియు సమస్తము బ్రహ్మముయొక్క వివర్తమనియు నిశ్చయింపవలయును.

" ఇచ్ఛామాత్రమవిద్యేయం తన్నాశో మోక్షఉచ్యతే " ౧౬
(సామ ; ౬౧ మహా ; అ ౪)

టీ. ఇయమవిద్యా=ఈయవిద్య ; ఇచ్ఛామాత్రం=ఇచ్ఛారూపమైనది ; తన్నాశః=ఇచ్ఛామాత్రమైన యీయవిద్యానాశమే ; మోక్షః=మోక్షమని ; ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తా. ఇచ్ఛామాత్రమైనది (రాగాత్మకమైనది) యవిద్యయనబడును. ఈయవిద్యచేతనే తాను బద్ధుఁడగుచున్నాఁడు. అవిద్యానాశమున తాను బ్రహ్మమేయగుచున్నాఁడు.

" భోగేచ్ఛామాత్రకో బంధః తత్త్యాగో మోక్షఉచ్యతే " ౧౭
(సామ ; ౬౧ మహా ; అ ౫)

టీ. భోగేచ్ఛామాత్రకః = భోగము కావలయుననునిచ్ఛయే, బంధః=బంధము, తత్త్యాగః=ఆభోగేచ్ఛను విడుచుటయే, మోక్షః=మోక్షమని, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తా. సహజములైన యాహార నిద్రాదులనుగాక భోగమును గోరుట బంధము. భోగములనుగోరక యదృచ్ఛాలాభసంతుష్టుఁడగుట మోక్షము.

" చిచ్చైత్యకలితో బంధః తన్ముక్తిర్ముక్తిరుచ్యతే " ౧౮
(సామ ; ౬౧ మహా ; అ ౬)

టీ. చిత్=జీవునకు, చైత్య=చిత్తవృత్తులతో, కలిత=కూడుకొనుట, బంధః = బంధమగును, తన్ముక్తిః = దానినుండి గలిగినముక్తి, ముక్తిః=ముక్తియని, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తా. స్పష్టము.

"అనాస్థైవహినిర్వాణం దుఃఖమాస్థాపరిగ్రహః" ౧౯

(సామ; ౬౧ మహో; అ ర)

టీ. అనాస్థైవహి=సంకల్పము లేకపోవుటయే, నిర్వాణం=మోక్షము, ఆస్థాపరిగ్రహః=సంకల్పించుటయే, దుఃఖం=దుఃఖము.

తా. స్పష్టము.

"కర్మణాబధ్యతే జంతుర్విద్యయాచ విముచ్యతే" ౨౦

(శు-య; ౬౬ సన్యాస; అ ౨)

టీ. జంతుః=మనుష్యుఁడు, కర్మణా=కర్మముచేత, బధ్యతే=బంధింపబడుచున్నాఁడు, విద్యయా=జ్ఞానముచేత, విముచ్యతే=ముక్తుఁడగుచున్నాఁడు.

తా. స్పష్టము.

"స్వరూపావస్థతిర్ముక్తిస్తద్భ్రంశోఽహంత్వవేదనం" ౨౧

(సామ; ౬౧ మహో; అ ౫)

టీ. స్వరూప=పరమాత్మస్వరూపమున; అవస్థతిః=ఉండుట; ముక్తిః=మోక్షము; అహంత్వ=అహంతయొక్క (నేనను) వేదనం=జ్ఞానము, తద్భ్రంశః=ఆముక్తిభంగము.

తా. తానే పరమాత్మయని నిశ్చయించుట మోక్షము. నేనను భేదబుద్ధిగలిగి యుండుటే ముక్తికి భంగమై బంధహేతువగును.

"చిత్తేచలతిసంసారో నిశ్చలే మోక్షఉచ్యతే" ౨౨

(కృ-య; ౬౩ యోగశిఖ; అ ౬)

టీ. చిత్తే=చిత్తము; చలతి=చలించుచుండగా; సంసారః=సంసారమగును; నిశ్చలే=నిశ్చలమౌచుండగా; మోక్షః=మోక్షమని; ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తా. స్పష్టము.

" బంధోహి వాసనాబంధో మోక్షస్స్యాద్వాసనాక్షయః" ౨౩

(శు-య; ౧౧౮ ముక్తిక ; అ ౨)

టీ. వాసనాబంధః=వాసనాబంధమే, బంధోహి=బంధము నిశ్చయము, వాసనాక్షయః= వాసనలు క్షీణించుటయే, మోక్షః=మోక్షము, స్యాత్=అగును.

తా. చిత్తవృత్తికి హేతువై బీజరూపముననుండు సంస్కారమే వాసనయనబడును. బీజము వృక్షమగునటుల వాసనయే వృత్తిరూపమునబరిణమించును. కావున వాసనా సముదాయమే బంధహేతువగును. వాసనాక్షయమే మోక్షహేతువగును.

" పదార్థభావనాదార్ఢ్యం బంధఇత్యభిధీయతే " ౨౪

(సామ; ౬౧ మహా ; అ ౨)

టీ. పదార్థభావనాదార్ఢ్యం = విషయచింతాది దృఢత్వమే ; బంధఇతి=బంధమని; అభిధీయతే=చెప్పబడుచున్నది.

తా. దృఢముగా విషయములను చింతించుటయగు మనోరాజ్యమే బంధహేతువగును.

" వాసనాతానవం బ్రహ్మన్ మోక్షఇత్యభిధీయతే " ౨౫

(సామ; ౬౧ మహా.)

టీ. బ్రహ్మన్=ఓబ్రహ్మమా; వాసనాతానవం=వాసనలు కృశించుటయే; మోక్షఇతి=మోక్షమని; అభిధీయతే=చెప్పబడుచున్నది.

తా. వాసనలు క్షీణించుటయే మోక్షము, లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసన యని వాసన మూడువిధములు. లోకమున తనకు

సర్వవిధములైన గౌరవము గలుగవలయునని డంభమునగాని మఱియెట్లు గాని చింతించుచు ప్రవర్తించుట లోకవాసన. సర్వవిధముల తన దేహము మంచిస్థితిలో నుండవలయుననియు, తనయంత సౌందర్యము గలవాఁడు లేడనుటయును దేహవాసన. శాస్త్రమునందు తనపాటివాఁడు లేఁడనియు సమస్తశాస్త్రములు తనకు తెలియవలయుననియు కోరుట శాస్త్రవాసనయనబడును.

"నమోక్షో నభసః పృష్ఠేనపాతాలేనభూతలే" ౧౬

"సర్వాశాసంక్షయేచేతః క్షయోమోక్షఇతీర్యతే" ౧౭

(అధర్వ; ౭౦ అన్నపూర్ణ; అ ౨.)

టీ. మోక్షః=మోక్షము, నభసః=ఆకాశముయొక్క, పృష్ఠే=వెనుకభాగమున, న=లేదు, పాతాలే=పాతాలమందు, న=లేదు, భూతలే=భూలోకమున, న=లేదు, సర్వాశాసంక్షయే=సమస్తాశలు క్షీణించు సమయమున, చేతఃక్షయః=చిత్తనాశము గలుగుట, మోక్షఇతి=మోక్షమని, ఈర్యతే=చెప్పబడుచున్నది.

తా. వృత్తులతోగూడిన చిత్తము నశించుటయే మోక్షము గాని మోక్షమనఁగా నాకాశము వెనుకగాని పాతాళమునగాని భూలోకమునగానియుండు స్థానవిశేషముగాదు. స్థానవిశేషమనుట యవివేకము.

"మోక్షో మేఽస్త్వితిచింతాంతర్జాతా చేదుత్థితం మనః" ౧౮

"మననోత్థేమనస్యేష బంధస్సాంసారికోమతః" ౧౯

(అధర్వ; ౭౦ అన్నపూర్ణ; అ ౨)

టీ. మోక్షః=మోక్షము; మే=నాకు; అస్తు=అగుగాక; ఇతి చింతా=అనుచింత; అంతః=లోపల; జాతాచేత్=పుట్టెనేని; మనః=మనస్సు, ఉత్థితం=పుట్టినదగును; మనసి=మనస్సు; మననోత్థే=మననమువలన

విజృంభించుచుండగా; ఏషః=ఈమనోజృంభణము; సాంసారికః=సంసార రూపమైన; బంధః=బంధము; మతః=ఇష్టము;

తా. మోక్షము నాకు గావలెనని కోరుటచే మనస్సు పుట్టును. ఆమనస్సుపుట్టుటయే సంసారరూపమైన బంధమగును. తాను ముక్తుఁడైన పరమాత్మయని తలఁపక మోక్షము కావలయునని కోరుటయే సంసారరూపమైన బంధము.

"తదమార్జనమాత్రం హిమహాసంసారతాంగతం" 30
"తత్ప్రమార్జనమాత్రం తుమోక్షఇత్యభిధీయతే" 31
(అధర్వ; ౭౦ అన్నపూర్ణ; అ ౪)

టీ. తదమార్జనమాత్రంహి, తత్ = ఆమనోజృంభణముయొక్క; అమార్జనమాత్రంహి=తొలగించకపోవుటయే; మహాసంసారతాం=మహాసంసారత్వమును; గతం=పొందినది; తత్ప్రమార్జనమాత్రంతు, తత్=ఆమనోజృంభణముయొక్క; ప్రమార్జనమాత్రంతు=తొలఁగించుటయే; మోక్షఇతి=మోక్షమని; అభిధీయతే=చెప్పబడుచున్నది.

తా. వృత్తులతోగూడిన చిత్తమే సంసారము. వృత్తులతోగూడిన చిత్తము నశించుటయే మోక్షము.

ఇతి సార్థాంతికబంధమోక్షవాక్యాన్యేకత్రింశత్

ఇట్లు సార్థాంతిక బంధమోక్షవాక్యములు ముప్పదియొకటి

ఇతి ద్వితీయం ప్రకరణం సమాప్తమ్.

ఇట్లు రెండవప్రకరణము సమాప్తము.



సద్గురవేనమః.

# 3 అవిద్వన్నిందావాక్య ప్రకరణము.

" అథ యోఽన్యాం దేవతాముపాసతేఽన్యోసావన్యోహమస్మీతి
నసవేద యథాపశుః " ౧

(శు.య; ౧౦ బృహదారణ్యక; అ 3; బ్రా ౪)

టీ. అసౌ=వీఁడు, అన్యః=నాకంటె పరుఁడనియు, అహం=నేను అన్యః=పరుఁడననియు, యః=ఎవఁడు, అన్యాం=ఇతరమైన, దేవతాం=దేవతను, ఉపాసతే = ఉపాసించుచున్నాఁడో, సః=వాఁడు, యథాపశుః=పశువువలెనే, నవేద=తెలిసినవాఁడుకాఁడు.

తా. తాను బ్రహ్మమని తెలియక వాఁడీశ్వరుఁడు, గొప్పవాఁడు, నేను జీవుఁడను తక్కువవాఁడనని, యెవఁడన్య దేవత నుపాసించుచున్నాఁడో వాఁడు తత్వజ్ఞుఁడుకాఁడు. వాఁడేపశువు.

" అత్రభిదామివమన్యమానః శతధాసహస్రధాభిన్నో మృత్యో
స్సమృత్యుమాప్నోతి. ౨

(అథర్వణ ; ౨౭ నృసింహోత్తరతాపనీ ; ఖం ౮)

టీ. అత్ర=భేదత్రయములేని యీ బహ్మమందు, భిదామివ=భేదమున్నట్లు, మన్యమానః=తలచుచున్న, సః= వాఁడు, మృత్యోః=మృత్యుదేవతవలన, శతధా=నూరురీతులుగను, సహస్రధా=వేయిరీతులుగను, భిన్నః=పగిలినవాఁడై, మృత్యుం=నాశమును, ఆప్నోతి=పొందును.

తా. స్వజాతీయ విజాతీయ స్వగతభేదములులేని బ్రహ్మమునయెవఁడు జగజ్జీవేశ్వరాది భేదమును తలఁచుచున్నాఁడో వాఁడు నూరు

వేయిరీతులుగ భిన్నుఁడై నశించునుగాన భేదమును తలఁచరాదు. వినరాదు.

"కర్తృత్వాద్యహంకార భావనా రూఢోమూఢః" ౩

(శు-యు ; ౭౮ నిరాలంబ.)

టీ. కర్తృత్వాద్యహంకారభావనారూఢః, కర్తృత్వాది = చేయుటమొదలగు పనులందు, అహంకారభావనా= నేనను వృత్తిపైని, ఆరూఢః= ఎక్కినవాఁడు, మూఢః= మూఢుఁడు.

తా. కర్తృత్వభోక్తృత్వాదులందు అహంకారభావనముగలవాఁడు మూఢుఁడు, తత్త్వజ్ఞుఁడుకాఁడు.

"మృత్యోస్సమృత్యుమాప్నోతియ ఇహనానేవపశ్యతి" ౪

(కృ-యు ; ౩ కఠ ; అ ౨) (ఋ ; ౭౨ ఆత్మబోధ)

(శు-యు ; ౧౦ బృహదారణ్యక ; అ ౬ ; బ్రా ౪)

టీ. యః=ఎవఁడు, ఇహ= ఈ బ్రహ్మమందు, నానేవ=నానాత్వమున్నట్లు, పశ్యతి=చూచుచున్నాఁడో, సః=వాఁడు, మృత్యోః=మృత్యువువలన, మృత్యుం=నాశమును, ఆప్నోతి=పొందుచున్నాఁడు.

తా. అద్వితీయమైన బ్రహ్మమున నెవఁడు నానాత్వమున్నట్లు చూచునో, వాఁడు సంసారరూపమైన మృత్యువున నశించును.

"అనుభూతిం వినామూఢో వృథాబ్రహ్మణిమోదతే" ౫

"ప్రతిబింబితశాఖాగ్ర ఫలాస్వాదనమోదవత్" ౬

(సామ ; ౨౯ మైత్రేయ ; అ ౨)

టీ. ప్రతిబింబితశాఖాగ్రఫలాస్వాదన మోదవత్:-ప్రతిబింబిత= నీటియందుప్రతిఫలించిన, శాఖాగ్ర=కొమ్మకొనలందుండు, ఫలాస్వాదన

మోదవత్:-ఫల=ఫలముయొక్క, ఆస్వాదన = అనుభవించుటచే నైన, మోదవత్=సంతోషముగలవాఁడు వలెను, అనుభూతింవినా=బ్రహ్మానుభవములేక, బ్రహ్మణి=వేదాన్తశాస్త్రమందు, మూఢః = మూఢుఁడు, వృథా=వ్యర్థముగా, మోదతే=సంతోషించుచున్నాఁడు.

తా. నీటియందు ప్రతిఫలించిన ఫలమును జూచి సంతోషించినవానివలె, అనుభవములేక వేదాన్తశాస్త్రమును చదివినంతమాత్రమున మూఢుఁడు తాను కృతకృత్యుఁడగుచున్నాఁడు. అందువలన ప్రయోజనములేదు. వేదాన్తశాస్త్రమెట్లు ప్రవర్తించమని చెప్పనో యట్లు ప్రవర్తించుటకు శాస్త్రమును జదువవలయును. అట్లు వర్తింపవలెను.

" అష్టాంగంచ చతుష్పాదంత్రిస్థానం పంచదైవతం " ౭

" ఓంకారంయోనజానాతి బ్రాహ్మణోనభవేత్తుసః " ౮

(కృ-య ; ౩౯ ధ్యానబిందు.)

టీ. అష్టాంగంచ=ఎనిమిదియంగములు, చతుష్పాదం=నాలుగుపాదములు, త్రిస్థానం=మూఁడుస్థానములు, పంచదైవతం=పంచదేవతలును, స్వరూపముగాఁగల, ఓంకారం=ఓంకారమును, యః=ఎవఁడు, నజానాతి= ఎఱుఁగఁడో, సః=వాఁడు, బ్రాహ్మణః=బ్రహ్మవేత్త, నభవేత్తు=కానేకాదు.

తా. విశ్వతైజసప్రాజ్ఞ విరాడ్ఢిరణ్యగర్భాన్తర్యామికూటస్థ పరమాత్మలను నెనిమిది అంగములును, " అకారోకార మకారార్ధమాత్రలు " అను నాలుగుపాదములును, జాగ్రత్స్వప్నసుషుప్తులను మూఁడుస్థానములును, బ్రహ్మవిష్ణుమహేశ్వరరుద్ర సదాశివులను పంచదైవతములను స్వరూపముగా గలది "ఓం" కారము. అట్టి ఓంకారమును జపించనివాఁడు బ్రాహ్మణుఁడు కాఁడు సమస్తము నోంకారముగా భావింపవలెను.

" అతివర్ణాశ్రమం రూపం సచ్చిదానందలక్షణం " ౯
" యోనజానాతిసోఽవిద్వాన్కదాముక్తోభవిష్యతి " ౧౦
(కృ-యు; ౯౮ వరాహ; అ ౨)

టీ. అతివర్ణాశ్రమంరూపం=వర్ణాశ్రమరూపముల నతిక్రమించిన దియు, సచ్చిదానందలక్షణం=సత్యజ్ఞానానందస్వరూపమునైన యాత్మను; యః=ఎవఁడు; నజానాతి=తెలిసికొనఁడో; సః=ఆ; అవిద్వాన్=మూర్ఖుఁడు; కదా=ఎప్పుడు; ముక్తః=ముక్తుఁడు; భవిష్యతి=కాగలఁడు (అనఁగా కాఁడు)

తా. స్పష్టము.

"కుశలాబ్రహ్మవార్తాయాం వృత్తిహీనాస్సురాగిణః " ౧౧
" తేప్యజ్ఞానతయానూనం పునరాయాన్తియాన్తిచ" ౧౨
(కృ-యు; 32 తేజోబిందు; అ ౧)

టీ. సురాగిణః=విషయములందు గాఢానురాగముగలవారును; వృత్తిహీనాః=బ్రహ్మానుభవములేనివారును; బ్రహ్మవార్తాయాం=వేదాన్తశాస్త్రమందు; కుశలాఅపి=సమర్థులైనను; తే=వారు; అజ్ఞానతయా=తెలియమిచే; పునః=మఱల; ఆయాన్తి=వచ్చుచున్నారు; యాన్తి=పోవుచున్నారు.

తా. వేదాన్తశాస్త్రమందు ప్రావీణ్యముగలవారైనను, విషయములందు రాగముగలవారై రేని వారు జననమరణములను బొందుచుందురు గాని మోక్షమునొందరు. వేదాన్తశాస్త్రము లెస్సఁగనెఱిగియట్లు నడువవలయును. కేవల శాస్త్రజ్ఞానమున ప్రయోజనములేదు.

"కాష్ఠదండోధృతోయేన సర్వాశీజ్ఞానవర్జితః" ౧౩
(శు-యు; ౧౯ పరమహంస) (అథర్వణ; ౪3 నారదపరివ్రాజక)

"స్వాయత్తమేకాంతహితం స్వేప్సితం త్యాగవేదనం" ౧౪

"యస్యదుష్కరతాం యాతం ధిక్తం పురుషకీటకం" ౧౫

(సామ; ౬౧ మహా; అ ౪)

టీ. యేన=ఎవనిచే, కాష్ఠదండః = కఱ్ఱతోచేయబడిన దండము, ధృతః=ధరింపబడునో, సర్వాశీ=అన్నిటినితినువాఁడును, జ్ఞానవర్జితః=ఆత్మజ్ఞానము లేనివాఁడును, స్వాయత్తం = తనయధీనమున నున్నదానిని, ఏకాంతహితం = జగద్విషయమై తనకు మిక్కిలి హితమునిచ్చునదియు, స్వేప్సితం=తనచే గోరబడినదియునగు వస్తువును, త్యాగవేదనం=విడుచుటకు జ్ఞానము, యస్య=ఏమనుష్యునకు, దుష్కరతాంయాతం=దుష్కరమగునో, పురుషకీటకం=పురుషాకృతిని దాల్చిన పురుగువంటి, తం=వానిని, ధిక్=నిందింపవలయును.

తా. సన్యాసలక్షణమైన దండమునుధరించి యెవఁడు భిక్షులకు మాత్రము తిరుగునో ధనమునిమిత్త ముపదేశించునో గృహస్థులకంటె నెక్కుడు శయ్యాదిభోగములనుగోరునో యేసన్యాసితన కిష్టమైన విషయమును విడువఁడో యాసన్యాసి మేకవన్నెపులి. వాఁడు పురుఁగువంటి వాఁడు. పూజ్యుఁడుకాఁడు కావున వానిని విడువవలయును. ఆదరింపఁగూడదు.

'అద్వితీయంబ్రహ్మతత్త్వం నజానంతియదాతదా" ౧౬

'భ్రాన్తాఏవాఖిలాస్తేషాం క్వముక్తిః క్వేహవాసుఖం" ౧౭

(కృ-యు ; ౯౨ వరాహ-అ ౨)

టీ. అద్వితీయం=తనకంటె రెండవదిలేనిదైన ; బ్రహ్మతత్త్వం = బ్రహ్మస్వరూపమును; యదా=ఎప్పుడు ; నజానంతి=ఎఱుఁగరో ; తదా=అప్పుడు ; అఖిలాః(అపి)=అందఱును ; భ్రాంతాఃఏవ=భ్రాంతిగలవారే; తేషాం=ఆభ్రాంతిగలవారికి ; క్వముక్తిః=ముక్తిఎక్కడిది ? ఇహవా=ఈలోకమందైనను ; సుఖంక్వ=ఎక్కడసుఖము.

తా. బ్రహ్మస్వరూప మెఱుఁగనంతవరకు నందఱును భ్రాంతులే. ఆయజ్ఞానులకు మోక్షమెక్కడిది ? మోక్షములేకున్నను సంసారమందైనను వారికి సుఖములేదు. కావున, స్థిరచిత్తముగలవారై యుండవలయును. స్థిరచిత్తములేనివారికి గడియగడియకు భ్రాంతియే గలుగుచుండును. ఆ భ్రాంతిగలవారికెవరేమిచెప్పినను దానియందు విశ్వాసముండదు. అట్టివారికి మోక్షముగలుగదు. సంసారమునను సుఖమును గలుగదు.

"అజ్ఞానోపహతో బాల్యే యౌవనే వనితాహృతః" ౧౮

"శేషే కళత్రచింతార్తః కింకరోతి నరాధమః" ౧౯

(సామ-౬-౧ మహో-అ ౬)

టీ. బాల్యే=బాల్యమందు; అజ్ఞాన=అజ్ఞానముచేత; ఉపహతః=కొట్టబడినవాఁడు; యౌవనే=యౌవనకాలమందు; వనితాహృతః=స్త్రీలచేజయింపబడినవాఁడు; శేషే=మిగిలినముసలితనమందు; కళత్రచింతార్తః=భార్యావిషయమైన చింతచే పీడింపబడినవాఁడు; నరాధమః=అట్టి నరాధముఁడు; కింకరోతి=ఏమిచేయువాఁడు?

తా. బాల్యమున నజ్ఞానముతోనుండును. యౌవనమున స్త్రీలోలుఁడైయుండును. ముసలితనమున పుత్రకళత్రాదులవిషయమై పాటుపడుచు చింతించుచుండును. ఇట్లుండుట యధమునిలక్షణము. అట్టి నరాధముఁడు బ్రహ్మధ్యాన మెట్లుచేయగలఁడు? బ్రహ్మస్వరూప మెఱుఁగుటకు ముఖ్యముగ యౌవనమును తరువాత ముసలితనమును తగిన కాలములు. అట్టికాలమందు తత్త్వవిచారణను చేయుటను మాని భార్యాపుత్రులనిమిత్తమై ఏడ్చుచుండు నరాధముఁడు ముక్తిని బొందలేడు.

ఈవిషయములో శ్రీకృష్ణులవారు ఉత్తరగీతలలో చెప్పినకొన్ని శ్లోకములను చూడవలెను.

"ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేనజంతవః" ౨౦
"ధరావివరమగ్నానాం కీటానాం సమతాంగతాః" ౨౧

(సామ; ఉగీ సన్న్యాస)

టీ. ఇచ్ఛా=కోరిక (రాగము) చేతను, ద్వేష=ద్వేషముచేతను, సముత్థేన=పుట్టిన, ద్వంద్వమోహేన=సుఖదుఃఖాది ద్వంద్వమోహము చేతను, జంతవః=మూఢులగు మనుష్యులు, ధరా = భూమియందలి, వివర=రంధ్రములందు, మగ్నానాం=దిగబడియున్న, కీటానాం=పురుగుల యొక్క, సమతాం=సమత్వమును, గతాః=పొందినవారగుచున్నారు.

తా. రాగద్వేషములచే గలుగు సుఖదుఃఖాది ద్వంద్వములందు గల మోహముచే జనులు భూమికన్నములలో నుండు పురుగులవంటి వారై యధోగతిని పొందుదురు. కావున మోహము విడచి తత్త్వ విచారము చేయవలయును. ఇచ్ఛాద్వేషములు, సుఖదుఃఖములు, కలిమి లేములు, పుణ్యపాపములు, ఇత్యాదులు ద్వంద్వములనబడును. ఇవి రాగద్వేషములవలనగలుగును. సుఖానుశయీరాగః, దుఃఖానుశయీ ద్వేషః, అని రాగద్వేషముల లక్షణములుపతంజలిచే జెప్పబడెను.

ఇతిసార్థాంతికా విద్వన్నిందావాక్యాన్యేక వింశతిః.

ఇట్లు సార్థాంతికా విద్వన్నిందావాక్యము లిఱువదియొకటి.

ఇతి తృతీయం ప్రకరణం సమాప్తమ్.

ఇట్లు మూడవప్రకరణము సమాప్తము.

---



సద్గురవేనమః.

# ౪ జగన్మిథ్యావాక్యప్రకరణము.

"నాన్యత్కించనమిషత్" ౧

(ఋ; ౮ ఐతరేయ.)

టీ. అన్యత్=బ్రహ్మమునకన్న నితరమైనది; కించన=ఏమియును; న=లేదు; మిషత్=వ్యాజముగను.

తా. బ్రహ్మమొక్కటియేగాని బ్రహ్మమునకన్న వ్యతిరేకమైనది మఱియొకటిలేదు. మఱియొకటియున్నట్లు కనబడునేని యది మృగతృష్ణలోని జలమువలె మిథ్యయైనది.

"వాచారంభణం వికారోనామధేయం" ౨

(సామ; ఛాందోగ్య; ప ౬; ఖ౧.)

టీ. వాచారంభణం=వాక్కువారంభమును (నామము) వికారః=పరిణామాదివికారమును (రూపము) నామధేయం=పేరుమాత్రము.

తా. వస్తువున నామరూపములు కల్పింపబడినవి యదార్థములు కావు. మన్నువంటి కారణమైనబ్రహ్మ, నామరూపములుగలిగి కుండవంటి కార్యమైన జగత్తు కల్పింపబడెను. కార్యము నశించును. దానితో నామరూపములును నశించును. మిగుల వస్తుధర్మములైన అస్తిభాతిప్రియములే యుండును. అస్తిభాతి ప్రియస్వరూపమైన బ్రహ్మము నిత్యమనియు, నామరూపాత్మకమై దానియందు కల్పింపబడిన జగత్తు మిథ్యయనియును, తత్వజ్ఞానమున దెలియవలయును. ఈశ్రుత్యర్థము పంచదశి ౧౩ వ ప్రకరణమైన అద్వైతానందములో ౩౮, ౪౯ శ్లోకములయందు

చెప్పబడియున్నది. "వ్యక్తిన వాగ్విష్ప్రాద్యం. నామమాత్రం వికారోః స్యస_త్యతా" చిత్రదీపము ౧౫౫ శ్లోకముగూడ చూడవలయును.

" అతోఽన్యదార్తం "

(శు-య; ౧౦ బృహదారణ్యక; అ ౫ బ్రా ౪; ౫)

టీః అతః=ఈ కారణమువలన; అన్యత్=ఇతరమైనది; మార్తం=మట్టిసంబంధమైనది.

తా. నామరూపములు మిథ్యలు. సమస్తము నామరూపముల తో గూడినదే గావున నామరూపములులేని బ్రహ్మమునకన్న నితరమైన దంతయును నశించును. జగత్తునశించునని "మిథ్య" యనఁగా నున్నట్లు కనుపడునది, వాస్తవముగ లేనిది.

పాఠాంతరము ; " అతోఽన్యదార్తం " ఈ పాఠమందు "ఆర్త" శబ్దమునకు "నశించునది" యనునర్థము.)

" నతుతద్ద్వితీయమస్తి " ౪

(శు=య ; ౧౦ బృహదారణ్యక ; అ ౬ ; బ్రా ౩)

టీ. ద్వితీయం=బ్రహ్మమునకన్న రెండవది, నత్వస్తి=లేనేలేదు.

తా. బ్రహ్మమునకన్న సజాతీయమైన రెండవవస్తువుకాని విజాతీయమైన రెండవవస్తువుకాని స్వగతమైన రెండవవస్తువుగాని నిజముగ లేదు.

" నాత్రకాచనభిదాస్తి " ౫

(అథర్వ ; ౨౭ నృసింహోత్తరతాపినీ ; ఖం ౮)

టీ. అత్ర=ఇక్కడ (నామరూపాత్మకమైన జగత్తు తనయందు కల్పింపబడఁగా నా జగత్తున బ్రవేశించిన ప్రత్యగాత్మస్వరూపుఁడైన తన యందు) భిదా=భేదము, కాచన=ఒకింతయైనను, నాస్తి=లేదు.

తా. ఉపాధు లనేకములుగా నున్నందున వానియందు ప్రత్యగాత్మ వేఱువేఱుగా నున్నటుల కనబడుచున్నను నానాఘటములందుండు ఆకాశమువలె నొకటియేగాని వేఱుగాదు. కావున నిక్కడ భేదము లేదు.

" నైవతత్ర కాచనభిదాస్తి " ౬

(అధర్వణ; ౨౭ నృసింహోత్తరతాపినీ; ఖం ౮; ౨)

టీ తత్ర=అక్కడను (నామరూపాత్మకమైన జగత్తు తోచక ముందున్న బ్రహ్మమందు) కాచన=ఒకింతయును; భిదా=భేదము; నాస్త్యేవ=లేనేలేదు.

తా. సృష్టికిముందు బ్రహ్మము సజాతీయ విజాతీయ స్వగతభేదములులేక యుండెను. సృష్టియైన తరువాతను నట్లేయున్నది. తనయందవయవాదులచే గలుగు భేదము స్వగతభేదమనబడును. తనవంటిది మఱియొకటియుండ సజాతీయ భేదమగును. తనకంటె నన్యమైనది మఱి యొకటియుండ విజాతీయభేదమనబడును. బ్రహ్మము భేదములేనిది గాన జగత్తు మిథ్యయగును.

" సర్వం వికారజాతం మాయామాత్రం " ౭

టీ. వికారజాతం=నామరూపవికారములు కలిగి యుద్భవించినది, సర్వం=సమస్తమును; మాయామాత్రం = మాయాస్వరూపమైనది. (లేనిదే)

తా. బ్రహ్మము భేదత్రయములేనిది. కావున దానికివ్యతిరిక్తమై నామరూపవికారములతో గూడిన జగత్తంతయు నింద్రజాలమువంటిది గాని వాస్తవముకాదు. యా, మా, సా=మాయా, ఏదిలేనిదోయది "మాయ" యని మాయాశబ్దార్థము.

"సర్వత్రనహ్యస్తిద్వైతసిద్ధిర్నాస్తిద్వైతం కుతోమర్త్యాః"

(అథర్వణ; ౨౭ నృసింహోత్తరతాపినీ; ఖం-౮)

(శు-య; ౩౦ సుబాల; ఖం -౫)

టీ. సర్వత్ర=సర్వవ్యాపకమైన (అనంతమైన) బ్రహ్మమందు; ద్వైతసిద్ధిః=ద్వైతమైన ప్రపంచోత్పత్తి; నాస్తి హి=నిశ్చయముగాలేదు; ద్వైతం=ప్రపంచము; నాస్తి=లేదు; మర్త్యం=మనుష్యాదిభేదము, కుతః=ఎట్లుండును.

తా. ప్రపంచము బ్రహ్మమునలేదు. ప్రపంచమే మిథ్యయగు నపుడందలి యవాంతరభేదమైన మనుష్యాదిక మెట్లు నిజమగును.

"ప్రపంచో యది విద్యేత నివర్తేత నసంశయః" ౯

"మాయామాత్రమిదం ద్వైత మద్వైతం పరమార్థతః" ౧౦

(అథర్వణ; ౬ మాండూక్య; శ్రీగౌడపాదీయకారికాంతర్గతం.)

టీ. ప్రపంచః=ప్రపంచము; విద్యేత యది=ఉన్నదేని; నివర్తేత=నివర్తించును; నసంశయః=సంశయములేదు; ఇదం ద్వైతం=ద్వైతమైన యీజగత్తు; మాయామాత్రం=మాయాస్వరూపమైనది; పరమార్థతః=వాస్తవముగ; అద్వైతం=అద్వితీయమైనబ్రహ్మమే నిత్యమైనది.

తా. ఈప్రపంచములేదు. ఉన్నట్లు గనుపడునేని నిత్యానిత్యవస్తు విచారమున నివర్తించును. ద్వైతము మాయాకార్యము. వాస్తవము న నద్వైతమైన బ్రహ్మమే నిత్యము.

"వికల్పో వినివర్తేత కల్పితో యది కేనచిత్" ౧౧

"ఉపదేశాదయం వాదో జ్ఞాతే ద్వైతం నవిద్యతే" ౧౨

(అథర్వణ; ౬ మాండూక్య; గౌడపాదీయోపనిషత్కారికాంతర్గతం)

టీ. కేనచిత్=ఒకానొకనిచేతను; వికల్పః=ఒకప్పుడుతోఁచి మఱియొకప్పుడు కనఁబడని ప్రపంచము; కల్పితో యది=కల్పింపబడినదగు నేని; పనివర్తేత=నివర్తించును; ఉపదేశాత్=తత్త్వోపదేశమువలన; అయంవాదః=ఈకార్యకారణవిచారరూపమైన వాదము; జ్ఞాతే=తెలియబడుచుండగా; ద్వైతం=జగత్తు; నవిద్యతే=ఉండదు.

తా. నిర్వికల్పమైన బ్రహ్మమందు వికల్పమైన జగత్తెవనిచే కల్పింపబడినను, నిత్యానిత్య వస్తువిచారమున నా జగత్తు నివర్తించును. మఱియును గురూపదేశమున కార్యకారణవిచారము తెలియబడుచుండగా ద్వైతమైనజగత్తు మిథ్యయని తోఁచును.

"ద్వితీయకారణాభావాదనుత్పన్నమిదంజగత్" ౧౩

"యథైవహి నభశ్శూన్యం జగచ్ఛూన్యం తథైవహి" ౧౪

(సామ; ౬౧ మహా; ౬ ౫)

టీ. ద్వితీయకారణాభావాత్ = రెండవకారణము లేమివలన, ఇదంజగత్ = ఈ జగత్తు, అనుత్పన్నం=పుట్టనిదే, నభః = ఆకాశము, యథైవ=ఏరీతిన, శూన్యం=శూన్యమో, తథైవ=ఆరీతిగానే, జగత్= జగత్తు, శూన్యంహి=శూన్యమేకదా.

తా. ఉపాదాన నిమిత్తములను రెండు కారణములు లేనిది, కార్యము కలుగదు. బ్రహ్మముకన్న సజాతీయ కారణముగాని, విజాతీయ కారణముగాని రెండవది లేనందునను స్వగతభేదమైనను బ్రహ్మమునకు లేనందునను జగత్తు పుట్టలేదు. ఆకాశము నీలిరంగుగా నున్నట్టు గనబడుచున్నను శూన్యమైనటులు జగత్తు కనబడుచున్నను మిథ్యయే.

"ఇదంప్రపంచం యత్కించిద్యద్యజ్జగతివిద్యతే" ౧౫

"దృశ్యరూపంచదృగ్రూపం సర్వంశశవిషాణవత్" ౧౬

(కృ-య; ౩౭ తేజోబిందు.)

టీ. జగతి=జగత్తునందు, యత్కించిత్=ఏకొంచెమైనను, ఇదం ప్రపంచం = పాంచభౌతికమైనది, యద్యత్=ఏదియేదైనను, వీక్ష్యతే= చూడబడుచున్నదో, దృశ్యరూపంచ=దృశ్యరూపమైనదియును, దృగ్రూపం=చూచునదియును, సర్వం=సమస్తమును, శశవిషాణవత్=కుందేటికొమ్మువంటిది

తా. తెలియబడునది యంతయును దృశ్యము చూచుచున్నఁ తెలిసికొనుచున్నఁ జీవుఁడు దృగ్రూపము. జగత్తును, జీవుఁడును సర్వము కుందేటికొమ్మువలెనే శూన్యమైనది.

"అయంప్రపంచో నాస్త్యేవనోత్పన్నంనోత్థితంజగత్" ౧౭
"చిత్తంప్రపంచఇత్యాహుర్నాస్తి నాస్త్యేవసర్వదా" ౧౮
(కృ-యు; ౩౭ తేజోబిందు ; అ ౫)

టీ. అయంప్రపంచః = ఈప్రపంచము, నాస్తి న = లేనేలేదు, జగత్=జగత్తు, నోత్పన్నం=పుట్టినదికాదు, నోత్థితం=విజృంభణముగాదు, చిత్తం=చిత్తమే, ప్రపంచఇతి=ప్రపంచమని, ఆహుః=చెప్పెదరు, నాస్తి= లేదు, సర్వదా=ఎల్లప్పుడు, నాస్త్యేవ=నిశ్చయముగాలేదు.

తా. నిర్వికారమైన బ్రహ్మమున జగత్తుపుట్టలేదు. చిత్తమేజగత్తుగాని, చిత్తముకన్న వేఱుగాదు. చిత్తమింద్రజాలమువంటిది. వాస్తవముకాదు.

"మాయాకార్యమిదంనాస్తి మాయానాస్తిభయంనహి" ౧౯
"పరంబ్రహ్మాహమస్మీతి స్మరణస్యమనోనహి" ౨౦
(కృ-యు ; ౩౭ తేజోబిందు ; అ ౫)

టీ. మాయాకార్యం=మాయచే కల్పించబడిన, ఇదం=ఈజగత్తు, నాస్తి=లేదు, మాయా=మాయయును, నాస్తి=లేదు, భయం=భయము,

నహి=లేదు, అహం=నేను; పరబ్రహ్మ=పరబ్రహ్మము; అస్మీతి=అగుచు న్నానని; స్మరణస్య=తలచుటకు; మనః=మనస్సు; నహి=లేదు.

తా. మాయయనఁగా లేదనియర్థముగావున మాయలేనిదే ఇఁక దానిచే గల్పింపబడిన జగత్తెటులుండును? జగత్తులేనిదే గావున భయము లేదు. నేను బ్రహ్మమని తలఁచుటకు మనస్సును లేదు. పరమార్థమున తానే బ్రహ్మము. అన్యములేనేలేదు.

"వంధ్యాకుమారవచనే భీతిశ్చేద స్త్విదంజగత్" ౨౧

"శశశృంగేణ నాగేంద్రో మృతశ్చేద స్త్విదంజగత్" ౨౨

(కృ-ను; 32 తేజోబిందు; అ ౬)

టీ. వంధ్యాకుమారవచనే=గొడ్రాలిపుత్త్రునిమాటయందు; భీతిశ్చేత్=భయముండునేని; ఇదంజగత్=ఈజగత్తు; అస్తు=ఉండుగాక; శశశృంగేణ=కుందేటికొమ్ముచేత; నాగేంద్రః=మత్తగజము, మృతశ్చేత్=చచ్చినదగునేని; ఇదంజగత్=ఈజగత్తు; అస్తు=ఉండుఁగాక.

తా. గొడ్రాలికొడుకును, వానిమాటయు, దానియందు భయమును, కుందేటికొమ్మును, దానిచే మదపుటేనుఁగు చచ్చుటయు నెంత నిజమో జగత్తుండుటయు నంతనిజమే. జగత్తు మిథ్యయైనది.

" మృగతృష్ణా జలంపీత్వా తృప్తశ్చేద స్త్విదంజగత్ " ౨౩

" గంధర్వనగరే సత్యే జగద్భవతి సర్వదా " ౨౪

(కృ-య; 32 తేజోబిందు; అ ౬)

టీ. మృగతృష్ణాజలం=ఎండమావులం దారోపింపబడిన జలమును; పీత్వా=త్రాగి; తృప్తశ్చేత్=తృప్తుఁడగునేని; ఇదంజగత్=ఈజగత్తు; అస్తు=ఉండుగాక; గంధర్వనగరే=ఇంద్రజాలనిర్మితమైనపట్టణము; సత్యే=సత్యమగుచుండగా; జగత్=జగత్తు; సర్వదా=ఎల్లప్పుడు; భవతి=నిజమగుచున్నది.

తా. ఎండమావులందు నీరును ఆనీటిని త్రాగుటవలన తృప్తి యును గంధర్వనగరము నెటుల సత్యములు గావో యటుల జగత్తును సత్యముగాదు

" గగనేనీలిమాసత్త్వే జగత్సత్యం భవిష్యతి " ౨౫
(కృ యు; 32 తేజోబిందు; అ ౬)

" మాసాత్పూర్వం మృతోమర్త్యస్సాగతశ్చే జ్జగద్భవేత్ " ౨౬

టీ. గగనే=ఆకాశమంద, నీలిమాసత్త్వే=నీలిమయొక్క యుని కిగలుగుచుండఁగా, జగత్=జగత్తు, సత్యం=కాలత్రయమందు బాధింప బడనిది, భవిష్యతి=కాగలదు, మాసాత్పూర్వం=నెలదినములకుముందు, మృతః=చచ్చిన, మర్త్యః=మనుష్యుఁడు, ఆగతశ్చేత్=వచ్చినవాఁడగు నేని, జగత్=జగత్తు, సత్యం = కాలత్రయమందు బాధింపఁబడనిది, భవేత్=అగును (అనఁగా:— జగత్తు "మిథ్య" యనుట)

తా. స్పష్టము.

" గోస్తనాదుద్భవం క్షీరంపునరారోపణేజగత్ " ౨౭
" జ్వాలాగ్నిమండలే పద్మవృద్ధిశ్చే జ్జగదస్త్విదం" ౨౮
(కృ-యు; 32 తేజోబిందు; అ ౬)

టీ. గోస్తనాత్=ఆవుపొదుగునుండి; ఉద్భవం=పుట్టిన; క్షీరం= పాలు; ఘనః=మఱల; ఆరోపణే=పొదుగున నింపుటకుశక్యమేని; జగత్=జగత్తు; అస్తు=ఉండుఁగాక; జ్వాలాగ్నిమండలే=జ్వాలలతోగూడిన యగ్నిమండలమున; పద్మవృద్ధిశ్చేత్=పద్మవృద్ధియగునేని; ఇదంజగత్= ఈజగత్తు; అస్తు=ఉండుఁగాక.

తా. ఆవుపాలు మఱల నావుపొదుగున నుంచుట యెంతయసాధ్యమో యగ్నిమండలమున బద్మవృద్ధిగలుగుట యెట్లసంభవమో జగత్తు సత్యముగనుండుట యంత యసంభవము.

"జ్ఞానినోహృదయం మూఢై ర్జ్ఞాతం చేద స్త్విదం జగత్" ౨౯

(కృ-య; ౩౭ తేజోబిందు; అ ౬)

టీ. జ్ఞానినః=జ్ఞానియొక్క; హృదయం=హృదయము; మూఢైః=అజ్ఞానులచే; జ్ఞాతంచేత్=తెలియబడినదగునేని; ఇదంజగత్=ఈజగత్తు; అస్తు=ఉండుఁగాక.

తా. జ్ఞాని మనస్సు మూఢునిచే నెఱుఁగఁబడుట యెట్లసత్యమో యట్లే జగత్తుండుట యసత్యము. జ్ఞానియొక్క సుగుణములను దురాగ్రహుడైన మూఢుఁడు విపరీతభావనచే దుర్గుణములుగాఁ దలఁచును. కాని జ్ఞానియొక్క యభిప్రాయమును ఎన్నఁటికిని తెలిసికొనఁజాలఁడు.

"అజకుక్షౌ జగన్నాస్తి హ్యాత్మకుక్షౌ జగన్నహి" ౩౦

"సర్వదా భేదకలనం ద్వైతాద్వైతం నవిద్యతే" ౩౧

(కృ-య; ౩౭ తేజోబిందు; అ ౬)

టీ. అజకుక్షౌ=బ్రహ్మకుక్షియందు; జగత్=జగత్తు; నాస్తిహి=లేదు, నిశ్చయము; ఆత్మకుక్షౌ=ఆత్మకుక్షియందు; జగత్=జగత్తు; నహి=నిశ్చయముగ లేదు; సర్వదా=ఎప్పుడును; భేదకలనం=భేదవ్యవహారమైన, ద్వైతాద్వైతం=ద్వైతాద్వైతవిధము; నవిద్యతే=లేదు.

తా. జగత్తు బ్రహ్మదేవుని యుదరమునలేదు. ఆత్మకుక్షియందును లేదు. ద్వైతము "అద్వైతము" అను భేదమును లేదు. బోధార్థమద్వైతమని చెప్పబడెనుగాని వాస్తవమున నామరూపములు లేవు.

"నాస్తినాస్తిజగత్సర్వం గురుశిష్యాదికం నహి" ౩౭

"సచ్చిదానందమాత్రోఽహ మనుత్పన్న మిదంజగత్" ౩౮

(కృ-యు; తేజోబిందు; అ ౫)

టీ. జగత్సర్వం=జగత్తంతయును; నాస్తి=లేదు; నాస్తి=లేదు; గురుశిష్యాదికం = గురుశిష్యాదిభేదమును; నహి = నిశ్చయముగలేదు; అహం=నేను; సచ్చిదానందమాత్రః=సత్యజ్ఞానానంద స్వరూపుఁడను; ఇదంజగత్ = ఈజగత్తు; అనుత్పన్నం=పుట్టనిది.

తా. గురుశిష్యాదిభేదమంతయును వ్యావహారికముగాని పారమార్థికముకాదు. పరమార్థమున సత్యజ్ఞానానందమైన బ్రహ్మముఁదక్క మఱియొకటి లేదు. పారమార్థికదశ జాగ్రత్స్వప్నసుషుప్తులకంటె వేరైనది. సుషుప్తియందే సర్వము నశించుచుండఁగా నిఁక తురీయమందు చెప్పవలసినదేమున్నది. ఇట్లు బుద్ధిమంతులు చక్కఁగ బుద్ధిచే నూహింపవలయును.

ఇతి సార్ధాంతిక జగన్మిథ్యావాక్యాని త్రయస్త్రింశత్

ఇట్లు సార్ధాంతిక జగన్మిథ్యావాక్యములు ముప్పదిమూఁడు.

ఇతి చతుర్థంప్రకరణం సమాప్తమ్.

ఇట్లు నాలుగవప్రకరణము సమాప్తము.

— —

శ్రీ

సద్గురవేనమః.

# ౫ ఉపదేశవాక్యప్రకరణము.

"సయఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వంతత్సత్యం" ౧

స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో"

(సామ; ౬ ఛాందోగ్య; ప్ర ౬ ఖ ౮; ౯; ౧౦; ౧౧; ౧౨; ౧౩; ౧౪; ౧౫)

టీ. యః=ఎవఁడు; ఏషోఽణిమా=ఈయణుస్వరూపుఁడో; (అణుధర్మము, అణిమ=జగత్తునకు కారణస్వరూపుడే యీయణురూపుఁడైనయాత్మ) సః=వాఁడే; సద్రూపమైనబ్రహ్మము; ఇదంసర్వం=ఈప్రపంచమంతయును; ఐతదాత్మ్యం=ఈఆత్మస్వరూపమే; తత్=ఆబ్రహ్మము, సత్యం=కాలత్రయమందు బాధింపఁబడనిది; సః=ఆబ్రహ్మమే; ఆత్మా=ప్రత్యగాత్మ; శ్వేతకేతో=శ్వేతకేతువా!; తత్=ఆబ్రహ్మము; త్వం=నీవు; అసి=అగుచున్నావు.

తా. జగత్తునకణురూపమువలన కారణుఁడైనవాఁడెవఁడో వాఁడే సద్రూపమైన బ్రహ్మము. జగమంతయు నైతదాత్మ్యమైనది. (ఈజగత్తు దానిసంబంధమై దానినే యాత్మగాఁగలది) ఆబ్రహ్మము సత్యమైనది. అదియే ప్రత్యగాత్మయై సర్వభూతముల నున్నది. కావున నో శ్వేతకేతువా! యాబ్రహ్మమే నీవు; బ్రహ్మమే యుపాధులఁ బ్రవేశించి "యాత్మ" యనఁబడుచున్నది. 'ఆత్మ' యనఁగా బ్రత్యగాత్మయనియే తెలియవలెను. ఉపాధులలోనున్న యీప్రత్యగాత్మయే, నేను, నీవు, వాఁడు, అని చెప్పఁబడుచున్నది. ప్రత్యగాత్మ బ్రహ్మములకు భేదములేదు. నీవు ప్రత్యగాత్ముఁడవు గావున నో శ్వేతకేతువా! నీవేబ్రహ్మావు. జహదజహల్ల

క్షణచే నుపాధులను విడువఁగా బ్రహ్మమే శేషించును. కావున నేను బ్రహ్మను. నీవు బ్రహ్మవని చెప్పవచ్చును.

"అభయంవైజనక ప్రాప్తోసి" ౨

(శు-య; ౧౦ బృహదారణ్యక; అ ౬ బ్రా ౨)

టీ జనక=ఓజనకమహారాజా; అభయం=నిర్భయమైనబ్రహ్మమును; ప్రాప్తోసి=పొందినవాఁడవగుచున్నావు.

తా. బ్రహ్మము మూఁడుశరీరములులేని యభయస్వరూపము అదియేనీవు.

"బ్రహ్మచర్యమహింసాంచ సత్యంచా పరిగ్రహం
యత్నేనరక్షతరక్షతరక్షతేతి" 3

(సామ; ౧౬ గూఢారుణిక)

టీ. బ్రహ్మచర్యం=బ్రహ్మచర్యమును; అహింసాంచ=అహింసను, సత్యంచ=సత్యమును, అపరిగ్రహం=అపరిగ్రహమును, యత్నేన=ప్రయత్నముచేత, రక్షత=రక్షించుకొనుఁడు, రక్షత=రక్షించుకొనుఁడు, రక్షత=రక్షించుకొనుఁడు. ఇతి=అని,

తా. యమములైన యహింసా సత్యబ్రహ్మచర్యా పరిగ్రహములనొకప్పుడైనను విడువక ప్రయత్నమున రక్షించుకొనుఁడు. అహింసా వ్రతము సిద్ధించినవాని సన్నిధియందు, పులి, ఆవు, ఇట్టి పరస్పర విరోధములుగల జంతువులును, మైత్రి గలిగియుండును. (అహింసాప్రతిష్ఠాయాంతత్సన్నిధౌవైరత్యాగః) అని, అపరిగ్రహము సిద్ధించిన బూర్వజన్మజ్ఞానముఁగలుగును. (అపరిగ్రహ స్థైర్యేజన్మ కథంతా సంబోధః) అని, బ్రహ్మచర్యముగలవానికి తేజస్సు వృద్ధియగును. (బహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః) అని, సత్యవ్రతునకు సత్య

ర్మచేయకపోయినను దత్ఫలము గలుగును (సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వం) అని, అస్తేయ వ్రతముగలవానికి ప్రయత్నము లేకయే సమస్తరత్నములు ప్రాప్తించును (అస్తేయప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానం) అని, పతంజలిచే యోగశాస్త్రమందు చెప్పఁబడెను గావున నహింసాసత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహముల నేమఱక జాగరూకులై కాపాడుకొనవలయును.

"తత్త్వమసిత్వంతదసి" ౭

(శు-య ; ౫౯ పైంగల ; అ 3)

టీ. తత్=ఆపరబ్రహ్మము, త్వం=నీవు, అసి=అగుచున్నావు, త్వం=నీవు, తత్=ఆపరబ్రహ్మము, అసి=అగుచున్నావు.

తా. ఆబ్రహ్మమే నీవు, నీవే ఆ బ్రహ్మముగాని యన్యమేద్దియును లేదు. తత్పదలక్ష్యము బ్రహ్మము, తత్పదవాచ్యుఁ డీశ్వరుఁడు. త్వంపదలక్ష్యము ప్రత్యగాత్మ, త్వంపదవాచ్యుఁడు జీవుఁడు. బ్రహ్మమే మాయోపాధిని గ్రహించుటచే నీశ్వరుఁడనియు, మాయాభేదమైన యవిద్యను గ్రహించుటచే జీవుఁడనియు, చెప్పబడుచున్నది. భాగలక్షణచే నుపాధులైన మాయావిద్యలను విడువఁగా, బ్రహ్మమొకటియై, జీవేశ్వరులు మిథ్యాభూతులగుచున్నారు. జహల్లక్షణ, యజహల్లక్షణ, భాగలక్షణ యని లక్షణావృత్తి మూఁడువిధములు. గంగాయాంఘోషః, గంగయందు గొల్లపల్లి, ఇక్కడ గంగను విడచి గంగాతీరముననున్న గొల్లపల్లియని యర్థము చెప్పవలయును. ఇది జహల్లక్షణ కుదాహరణము. జహల్లక్షణమనఁగా స్వార్థమును విడిచి పరార్థమును చెప్పునది. ఈ లక్షణముచే తత్త్వమసియను వాక్యమున కర్థమును చెప్పరాదు. తత్పదలక్ష్యమైన బ్రహ్మము పరిపూర్ణము గావున దానిని విడువ నవకాశములేదు. మంచాఃక్రోశంతి, మంచములు మొఱబెట్టుచున్నవి. మంచములను విడువక మంచములపై

నున్న మనుష్యు లేడ్చుచున్నారని యర్థము జెప్పవలెను. ఇది 'యజహల్లక్షణ' కుదాహరణము. 'అజహల్లక్షణ' యనఁగా స్వార్థమును విడువని లక్షణ. ఈ లక్షణచే 'తత్త్వమసి' యను వాక్యమున కర్థము జెప్పరాదు. (త్వం) పదముచే జెప్పబడుచున్నది తత్పదముచే జెప్పబడుదానికి భిన్నమైనయెడల, 'ఏకమేవాద్వితీయంబ్రహ్మ' యను శ్రుతికి బాధకమువచ్చును. "సోఽయం దేవదత్తః" ఆ దేవదత్తుఁడే యీ దేవదత్తుఁడు. కళింగదేశమున సార్వభౌముఁడైన దేవదత్తుఁడే కర్ణాట దేశమున భిక్షుకుఁడుగాగనబడుచున్నాఁడనిన, నా దేశము నా సార్వభౌమత్వము, నీ దేశము నీభిక్షుకత్వమును విడిచిన నక్కడ నిక్కడ నొక్కఁడైన దేవదత్తుఁడే గ్రహింపఁబడుచున్నాఁడు. ఇది భాగలక్షణ కుదాహరణము. విరుద్ధభాగములను విడిచి సామాన్యమును గ్రహించుటగాని (ఐక్యమును గ్రహించుటగాని) భాగలక్షణావృత్తి యనఁబడును. దీనినే కొందఱు 'జహదజహల్లక్షణ' మని చెప్పుదురు.

ఇట్లే మాయాభేదములైన యుపాధులను, నాయుపాధులవలన గలిగిన సర్వజ్ఞత్వ కించిజ్జ్ఞత్వాది ధర్మములను విడువఁగా, జీవేశ్వరాది భేదములేక, కేవలబ్రహ్మమే పరిపూర్ణమైయుండును. ఉపాధుల సత్తులుగావున, విడువవచ్చును. ఈలక్షణచే 'తత్త్వమసి' యను వాక్యమున కర్థము చెప్పవలయును.

" యన్మనసా నమనుతే యేనాహుర్మనో మతం " ౫
" తదేవ బ్రహ్మత్వంవిద్ధి నేదం యదిదముపాసతే " ౬

(సామ; కేన, ఖం ౧.)

టీ. యత్ = ఏది, మనసా = మనస్సుచే, నమనుతే = తెలియబడదో, యేన = దేనిచేత, మనః = మనస్సు, మతం = తెలిసికొనబడునని, ఆహుః = చెప్పుదురో, తదేవ = అదిగాని, బ్రహ్మ = బ్రహ్మమని, త్వం =

నీవు, విద్ధి= తెలిసికొనుము, యత్ =నామరూపములుగ బ్రహ్మవిష్ణ్వాది రూపము గల యేవస్తువును, ఇదం= ఈ బ్రహ్మమని, ఉపాసతే=ఉపాసించుచున్నారో, ఇదం= ఈ బ్రహ్మము, న= కాదు.

తా. ఏది మనస్సును తెలిసికొనుచున్నదో, దేనిని మనస్సు తెలిసికొనలేదో, యదిగో బ్రహ్మమని తెలిసికొనుము. అజ్ఞానిచే బ్రహ్మమని నామరూపములు గలిగి పూజింపబడుచున్న బ్రహ్మవిష్ణ్వాది స్వరూపము మనస్సుచే దెలియబడక మనస్సును తెలిసికొను నీ బ్రహ్మము కాదు.

"యత్పరంబ్రహ్మసర్వాత్మా విశ్వస్యాయతనంమహాత్" ౭

(కృ-య ; ౧౨ కైవల్య)

టీ. యత్ =ఏది. సర్వాత్మా=సమస్తభూతములకు నాత్మయై యున్నదో, విశ్వస్య=సమస్తమునకు, మహాత్ =గొప్పదియైన, ఆయతనం=ఆధార (గృహము) మై యున్నదియో యది, పరంబ్రహ్మ= పరబ్రహ్మము.

తా. సర్వమునకు నాత్మయై విశ్వాధారమైనదే పరబ్రహ్మము.

"సూక్ష్మాత్సూక్ష్మతరంనిత్యం తత్త్వమేవత్వమేవతత్" ౮

(కృ-య ; ౧౨ కైవల్య)

టీ. సూక్ష్మాత్ = సూక్ష్మమైన యణువునకన్నను, సూక్ష్మతరం=మిక్కిలిసూక్ష్మమైనది, నిత్యం=నాశములేనిదియునగు, తత్ = ఆబ్రహ్మము, త్వమేవ=నీవే, త్వమేవ=నీవే, తత్ =ఆబ్రహ్మము,

తా. నిత్యమైన యా బ్రహ్మమే నీవు నీవే యా బ్రహ్మము.

"అంతఃపూర్ణో బహిఃపూర్ణః పూర్ణకుంభ ఇవాంబుధౌ" ౯

"అంతశ్శూన్యో బహిశ్శూన్య శ్శూన్యకుంభ ఇవాంబరే" ౧౦

(సామ, ౨౯ మైత్రేయ; అ ౨)—(కృ-య; ౨౮ వరాహ; అ ౪)

టీ. అంబుధౌ=సముద్రమందు. పూర్ణకుంభ ఇవ=నిండుకుండ వలె, అంతఃపూర్ణః=లోపలనిండియున్నది. బహిఃపూర్ణః=పైని నిండియున్నది, అంబరే=ఆకాశమందు, శూన్యకుంభ ఇవ=శూన్యఘటము వలె, అంతశ్శూన్యః=లోపల శూన్యమైనది. బహిశ్శూన్యః=పైని నేమియును లేనిది–బ్రహ్మమంతర్బాహ్యములందు తానే నిండియున్నది. ఆబ్రహ్మ మంతర్బాహ్యములందు తాను గాక తనకన్న నితరమైన జగత్తును లేనిది.

తా. స్పష్టము.

" మాభవగ్రాహ్యభావాత్మా గ్రాహకాత్మాచమాభవ " ౧౧

" భావనామఖిలాంత్యక్త్వాయచ్ఛేషం తన్మయోభవ " ౧౨

(సామ, ౨౯ మైత్రేయ: అ ౨) (కృ-య : ౨౮ వరాహ: అ ౪)

(అథర్వణ : ౭౧ అన్నపూర్ణ)

టీ. గ్రాహ్యభావాత్మా=గ్రహింపబడువాఁడవు, మాభవ=కాకుము, గ్రాహకాత్మాచ=గ్రహించువాఁడవును. మాభవ=కాకుము, అఖిలాం=సమస్తమైన, భావనాం=చింతను. త్యక్త్వా=విడిచి, యత్=ఏది, శేషం=మిగులునదియగునో, తన్మయః=ఆరూపుఁడవు, భవ=అగుము.

తా. మనస్సుచే గోరబడు పశుధాన్యాది విషయములు గ్రాహ్యము లనఁబడును. ఆపశుధాన్యములను గోరుమనస్సు గ్రాహక మనబడును. నీవు విషయ స్వరూపుఁడవు మనః స్వరూపుఁడవు కాకుము. సమస్తచింతలను విడువఁగా. నేది శేషించునో, అట్టి స్వరూపముగల వాఁడవగుము. మనస్సు బ్రహ్మము నెఱుఁగలేదు. కావున మనోవృత్తులు నశింపజేసిన బ్రహ్మమే స్ఫురించును. అదియేనీవు.

" ద్రష్టృదర్శనదృశ్యాని త్యక్త్వా వాసనయాసహ "　　౧౩

" దర్శనప్రథమాభాసమాత్మానం కేవలంభజ "　　౧౪

(సామ : ౬౧ మహా ; అ ౬-౭౫ మైత్రేయ అ ౨)

(క్ర-య ; ౯౮ వరాహ ; అ ౪)

టీ. ద్రష్టృదర్శనదృశ్యాని=చూచువాఁడు, చూచుట, చూడబడునది, యీమూఁటిని, వాసనయాసహ=వాసనతోఁగూడా, త్యక్త్వా=విడిచి, దర్శన=జ్ఞానమునకు, ప్రథమాభాసం=ఆభాసుఁడైన జీవుని కల్పించుటకు ప్రథమచిద్రూపుఁడైన, ఆత్మానం=ప్రత్యగాత్మరూపుఁడైన, కేవలం=అద్వితీయబ్రహ్మమును, భజ=పొందుము.

తా. ద్రష్టయనఁగా చూచువాఁడు, చిదాభాసుఁడైనజీవుఁడు. దర్శనమనఁగా ఘటాదివిషయజ్ఞానము. దృశ్యమనఁగా ఘటాదివిషయము. ఆత్మయొక్క చిదంశయు, బుద్ధియొక్క వృత్తియు గూడినందున నేను తెలిసికొనుచున్నానను జ్ఞానముగల జీవత్వము గలుగుచున్నది. ఈజీవుఁడు చిచ్ఛాయయు నాభాసుఁడునని చెప్పబడును. ఈతని గలిగించు నాత్మ ప్రథమ చిద్రూప మనబడును. నీవు చిదాభాసదర్శన దృశ్యములను విడిచి చిదాభాసను కల్పించు కేవలాత్మను పొందుము.

" చిత్తాకాశం చిదాకాశం ఆకాశంచ తృతీయకం "　　౧౫

" ద్వాభ్యాంశూన్యతరంవిద్ధి చిదాకాశంమహామునే "　　౧౬

(సామ ; ౬౧ మహా ; అ ౪)

టీ. మహామునే=ఓ మునీంద్రుఁడా, చిత్తాకాశం=చిత్తాకాశమును, చిదాకాశం=చిదాకాశమును, తృతీయకం=మూఁడవదియైన, ఆకాశం=భూతాకాశమును గలవు. ద్వాభ్యాం=ఆకాశచిత్తాకాశముల

క్షన్న, చిదాకాశం=చిదాకాశమును, శూన్యతరం=ఎక్కువశూన్యమైన దానిగా, విద్ధి=తెలిసికొనుము.

తా. శబ్దగుణప్రధానమైన ... కాశము భూతాకాశ మన బడును. వృత్తులతో గూడినది చిత్తాకాశమనబడును. ఇవి జడములు. ఇట్టి వికారములు లేనిది చిదాకాశము, ఒక సంకల్పమును విడిచి మనస్సు మఱియొక సంకల్పమునకుఁ బోవునప్పుడా రెండు సంకల్పముల నడుమ నాగెంటిని దెలిసికొనుచు, నేది యఖండాకారమై యున్నదో యదియే చిదాకాశము అట్టి చిదాకాశమున నితర సంకల్పములు లేక యుండవలయును.

"ధ్యానతో హృదయాకాశే చితిచిచ్చక్రధారయా" ౧౭

"మనోమారయనిశ్శంకం త్వాం ప్రబధ్నన్తినారయః" ౧౮

(సామ : ౬౧ మహా; అ ర)

టీ. చితి=చిన్మయమైన. హృదయాకాశే = హృదయాకాశ మందు, ధ్యానతః="అహంబ్రహ్మాస్మి" అను ధ్యానమున, చిచ్చక్ర ధారయా=జ్ఞానమను చక్రధారచే, నిశ్శంకం=సందేహము నశించు నట్లు, మనః=మనస్సును, మారయ=కొట్టుము. త్వాం=నిన్ను, అర యః = కామాది శత్రువులు, నప్రబధ్నంతి = బంధింప లేనివా రగు చున్నారు.

తా. జ్ఞానమయమైన హృదయమున బ్రహ్మధ్యానము సేయుచు బ్రహ్మచక్రమున మనస్సును వధింపుము. అప్పుడు మనఃపరివారమైన కామక్రోధలోభ మోహమదమాత్సర్యలను నీశత్రువు లెవ్వరును నిన్నేమియుజేయక తొలఁగును.

"భోగైకవాసనాంత్యక్త్వా త్యజత్వంభేదవాసనామ్" ౧౯

(సామ ; ౬౧ మహా ; అ ర)

"భావాభావౌ తత స్త్యక్త్వా నిర్వికల్పస్థిరో భవ"	౨౦

టీ. భోగైక వాసనాం, భోగ=భోగమును, ఏక=ముఖ్యమైన, వాసనాం=వాసనను, త్యక్త్వా=విడిచి, త్వం=నీవు, భేద వాసనాం=భేద వాసనను, త్యజ=విడువుము, తతః=తరువాత, భావాభావౌ=విషయా విషయములను, త్యక్త్వా=విడిచి, నిర్వికల్పస్థిరః=నిర్వికల్ప బ్రహ్మస్వరూపమున స్థిరుఁడవు, భవ=అగుము.

తా. మొదట భోగములను మాని గురూపదేశమున బ్రహ్మము కన్న నితరమైనది లేదని. జగదీశ్వరాది భేదవాసనను విడువుము. పిదప విషయా విషయములను విడిచి యపరోక్షానుభవమున నేనే బ్రహ్మమని నిర్వికల్పుఁడవై యుండుము. ఒకప్పుడుండి మఱియొకప్పుడు లేకయుండుట 'వికల్ప' మనఁబడును.

"త్యజధర్మమధర్మంచ ఉభేసత్యానృతేత్యజ"	౨౧

"ఉభేసత్యానృతేత్యక్త్వా యేనత్యజసితత్త్యజ"	౨౨

(సామ; ౬౩ సన్యాస; అ ౨)

టీ. ధర్మం=శ్రుతిసిద్ధమైన ధర్మమును. అధర్మంచ=శ్రుతినిషిద్ధమైన యధర్మమును, త్యజ=విడువుము. సత్యానృతే-సత్య=బాహ్యేంద్రియ గోచరమైన జాగ్రత్ప్రపంచమును, అనృతే=అంతరింద్రియగోచరమైన స్వప్నప్రపంచమును, ఉభే=అనునీరెంటిని, త్యజ=విడువుము, ఉభేసత్యానృతే=రెండైనయాబాహ్యాంతః ప్రపంచములను, త్యక్త్వా=విడిచి, యేన=ఏజ్ఞానముచే, త్యజసి=ఆప్రపంచములను విడుచుచున్నావో, తత్=ఆజ్ఞానమును, త్యజ=విడువుము.

తా. వ్యావహారిక యోగ్యములగు ధర్మాధర్మములం దభిమానము లేనివాఁడవై గురుముఖమున, 'బ్రహ్మము సత్యము' 'జగ

త్వం మిథ్యా' యని యెఱిఁగి, యంతర్బాహ్య జగత్తును విషవృము 'బ్రహ్మ సత్య' మను జ్ఞానమును విడిచి నృత్తిశూన్యుఁడవై బ్రహ్మ మగుము.

" ఆత్మవ్యతీతే సర్వస్మాత్సర్వరూపేఽథవాతతే " —౧౩
" కోబంధః కశ్చవామోక్షో నిర్మాలమననంకురు " —౧౪

(అథర్వణ ; ౭౦ అన్నపూర్ణ)

టీ. సర్వస్మాత్ = సర్వముకన్న, అతీతే = అతీతమైనట్టియు. సర్వరూపే = సర్వరూపమైనట్టియు అథవా = లేక, తతే = సర్వవ్యాపకమైనట్టియు, ఆత్మని = ఆత్మయందు, బంధః = బంధము, కః = ఏమి ? మోక్షః = మోక్షము, కశ్చవా = ఏమి ? యని, నిర్మాలమననం = గాఢమైనమననమును, కురు = చేయుమా.

తా. బ్రహ్మము సర్వవ్యాపకమైనది, సర్వరూపమైనది. భేదత్రయము లేనిది, అద్వితీయమైనది. అట్టి యాత్మయందు బంధమేమి ? మోక్షమేమి ? యెవనికి బంధమోక్షములు ? అంతయును మాయ. యథార్థముగాఁగని గాఢమననముఁ జేయుము.

" ఆశాయాతునిరాశత్వ మభావంయాతుభావనా " —౧౫
" అమనస్త్వం మనోయాతు తవాసంగేనజీవతః " —౧౬.

(అథర్వణ ; ౭౦ అన్నపూర్ణ ; అ ౫)

టీ. అసంగేన = సంగములేమిచే, జీవతః = జీవించుచున్న, తవ = నీయొక్క, ఆశా = ఆశ, నిరాశత్వం = ఆశాభంగమును, యాతు = పొందుఁగాక, భావనా = వృత్తి, అభావం = నిర్విషయస్థితిని, యాతు = పొందుఁగాక, మనః = మనస్సు, అమనస్త్వం = అమనస్కస్థితిని, యాతు = పొందుఁగాక,

తా. ఇతరాపేక్ష లేక బ్రహ్మస్వరూపమున నున్న, నీయాశ నిరాశయగును. విషయములఁ జింతింపని నీ భావన నిర్విషయస్థితినిఁ జెందును. సంకల్పము గల నీ మనస్సు నిస్సంకల్పమై యమనస్క మగును.

"ఏకమాద్యంతరహితం చిన్మాత్రమమలంతతం" ౨౭
"ఖాదప్యతితరాంసూక్ష్మం తద్బ్రహ్మాసినసంశయః" ౨౮
(అధర్వణ ; ౭౦ అన్నపూర్ణ ; అ ౫)

టీ. ఏకం=ఒక్కటియు, అద్యంతరహితం=మొదలు తుద లేనిదియు. చిన్మాత్రం=జ్ఞానమాత్రమైనదియు, అమలం=స్వచ్ఛమైనదియు, తతం=సర్వవ్యాపకమైనదియు, ఖాదపి=ఆకాశముకన్నను, అతితరాం=మిక్కిలి, సూక్ష్మం=సూక్ష్మమైనదియునగు, తద్బ్రహ్మ=ఆబ్రహ్మము, అసి=అగుచున్నావు, నసంశయః=సంశయము లేదు.

తా. సత్యజ్ఞానానంత స్వరూపమును నిర్వికారము బరిశుద్ధము నైన బ్రహ్మమే నీవు. సంశయములేదు.

"రక్షకోవిష్ణురిత్యాది బ్రహ్మసృష్టేస్తుకారణం" ౨౯
"సంహారేరుద్ర ఇత్యేవం సర్వంమిథ్యేతినిశ్చిను" ౩౦
(కృ-య ; ౩౭ తేజోబిందు ; అ ౫)

టీ. రక్షకః=రక్షించువాఁడు, విష్ణురితి=విష్ణువనియు, బ్రహ్మ=చతుర్ముఖుఁడు, సృష్టేః=సృష్టికి, కారణం=కారణమనియు, సంహారే=సంహరించుటయందు, రుద్రః=రుద్రుడనియు, ఇతి=ఇట్టి భేదవ్యవహారము, ఏవం = వేదాంతశాస్త్రప్రకారమున, మిథ్యేతి='మిథ్య' అని, నిశ్చిను=నిశ్చయింపుము.

తా. పరమార్థమున బ్రహ్మమొకటియే సత్యము, తక్కినదంతయు నింద్రజాలమువలె మిథ్య. ఇది వేదాన్తసిద్ధాన్తము. ఈ సిద్ధాంత

ప్రకారము విష్ణువు రక్షకుడగుటయు, బ్రహ్మ సృష్టికర్తయగుటయు, రుద్రుఁడు సంహారకర్తయగుటయు, 'మిథ్య' యని నిశ్చయించుము.

"మత్తోన్యం నాస్తి కించిద్వా మత్తోన్యా పృథివీతు వా" ౩౧
"మయాంతరిక్షం యస్యైవ ద్వారా తస్మాన్నాస్తీతి నిశ్చిను" ౩౨

(కృ-య : ౩౭ తేజోబిందు ; అ ౩; )

టీ. మత్తోన్యం = నాకంటెను వేఱై విడువఁబడినది. కించిద్వా= కొంచెమైనను, నాస్తి=లేదు. మత్తోన్యా=నాకంటెను వేఱై విడువఁబడి నది. పృథివీతువా=పృథివియైనను. (లేదు) మయాంతరిక్షం=నాచే విడువఁబడి వ్యతిరిక్తమైనది, యస్యైవద్వారా=దేనివలనను, తస్మాత్ = ఆయది, నాస్తీతి=లేదని, నిశ్చిను=నిశ్చయించుము.

తా. సమస్తము నేనేగావున నాకు వ్యతిరిక్తమైన దేదియును లేదని నిశ్చయించుము.

"అనాత్మేతి ప్రసంగోవా అనాత్మేతి మనోపివా" ౩౩
"అనాత్మేతి జగద్వాపి నాస్త్యనాత్మేతి నిశ్చిను" ౩౪

(కృ-య ; తేజోబిందు ౩౭)

టీ. అనాత్మేతి ప్రసంగోవా=ఆత్మ వ్యతిరిక్తమైన ప్రసంగమును, అనాత్మేతి మనోపివా=ఆత్మవ్యతిరిక్తమైన మనస్సును, అనాత్మేతి జగద్వాపి=ఆత్మ వ్యతిరిక్తమైన జగత్తును, అనాత్మ = ఆత్మ వ్యతిరిక్తమైన దేదియు, నాస్తీతి=లేదని, నిశ్చిను=నిశ్చయించుము.

తా. ఆత్మకన్నను వ్యతిరిక్తమైనది లేదని నిశ్చయించుము. ఆత్మకంటె నితరమైన దించుకంతయును లేదు. ఆత్మయే యున్నది. ఇతరము లేదు.

" ఆదిమధ్యావసానేషు దుఃఖంసర్వమిదంయతః " 3౫
" అతస్సర్వం పరిత్యజ్య తత్వనిష్ఠోభవానఘ '' 3౬
(కృ-య ; ౭౨ అ.కీ.)

టీ. అనఘా=ఓ పాపరహితుడా ! యతః = ఏకారణమువలన, ఇదంసర్వం=ఇదియంతయును, ఆదిమధ్యావసానేషు=ఆది మధ్యాంతము లందు, దుఃఖం=దుఃఖమైయున్నదో, అతః=ఆకారణమువలన, సర్వం=యీ సర్వవిషయ స్వరూపమును, పరిత్యజ్య=విడిచి, తత్వనిష్ఠః=బ్రహ్మ నిష్ఠుఁడవు, భవ=అగుము.

తా. విషయము లెప్పుడును దుఃఖము నిచ్చునవి. కావున విషయములను విడిచి బ్రహ్మనిష్ఠుఁడ వగుము. పరిణామ దుఃఖమని యును, తాపదుఃఖమనియును సంసారదుఃఖమనియు దుఃఖము మూఁడు విధములు. తాననుభవించినది ముగియుటవలనను, దానిని సంపాదిం చుటకు మొదట బ్రయత్నించుట వలనను గలుగు దుఃఖము పరిణామ దుఃఖము. ఇది యాద్యంతములందు గలుగును. అనుభవించు చుండఁ గా నది 'ముగియునో' యని దుఃఖించుట తాపదుఃఖము. అనుభవిం చుచున్న దానికి 'ప్రతిబంధము రాఁగూడదు. ప్రతిబంధము పోలేదు' అని దుఃఖించుట సంస్కార దుఃఖము. ఈ రెండు ననుభవ మధ్యకా లమున గలుగుగావున వివేకులకు సర్వవిషయానుభవమును దుఃఖమే. "పరిణామతాప సంస్కార దుఃఖైర్గుణవృత్తి విరోధాచ్చ దుఃఖమేవ సర్వంవివేకినః" అని యోగశాస్త్రమందు పతంజలిచే జెప్పబడియెను. కావున నన్నృతదుఃఖ జడరూపమైన విషయానుభవము విడిచి సత్యజ్ఞా నానంద స్వరూపమైన బ్రహ్మానుభవముఁ బొందుము.

" నిద్రాయాంలోకవార్తాయాః శ్శబ్దాదేరాత్మవిస్మృతేః '' 3౭
" క్వచిన్నావసరంగత్వా చింతయాత్మానమాత్మని '' 3౮
(శు-య ; 23 అధ్యాయే)

టీ. నిద్రాయాః=నిద్రకును, లోకవార్తయాః = లోకసంబంధమైన ప్రసంగమునకును, శబ్దాదేః = శబ్దాది విషయములకును, ఆత్మవిస్మృతేః=ఆత్మను మఱపించు నజ్ఞానమునకును, క్వచిత్ =ఒకప్పుడును, అవసరం= అవకాశమును, నదత్వా=ఇయ్యక, ఆత్మని = ఆత్మయందే, ఆత్మానం=ఆత్మను, చింతయ=చింతింపుము.

తా. నిద్రచేతను, లౌకిక ప్రసంగములచేతను, విషయానుభవముచేతను, నజ్ఞానముచేతను, కాలమును వ్యర్థముచేయక ఆత్మనే ధ్యానించు చుండుము.

"సర్వవ్యాపారముత్సృజ్య అహంబ్రహ్మేతిభావయ" ౩౯
"అహంబ్రహ్మేతినిశ్చిత్య అహంభావంపరిత్యజ" ౪౦
(కృ-య; 32 తేజోబిందు,)

టీ. సర్వవ్యాపారం=సర్వేంద్రియ వ్యాపారమును, ఉత్సృజ్య=విడిచి, అహంబ్రహ్మేతి = నేనే 'బ్రహ్మము' ని, భావయ=భావింపుము, అహంబ్రహ్మేతి=నేనే 'బ్రహ్మము' ని, నిశ్చిత్య = నిశ్చయించి, అహంభావం=నేనను భావమును, పరిత్యజ=విడువుము.

తా. ఇంద్రియ వృత్తులను విడిచి నేనే 'బ్రహ్మ' మని భావింపుము. నేనే బ్రహ్మమనిభావించి యీ నేనను జ్ఞానమునుకూడ విడువుము అట్లహంకార నిరసనము కలుగగానే బ్రహ్మమగు నీవు బ్రహ్మమే యగుదువు.

"ఘటాకాశం మహాకాశే ఇవాత్మానం పరాత్మని" ౪౧
"విలాప్యాఖండభావేన తూష్ణీంభవసదామునే" ౪౨
(శు-య; 23 అధ్యాత్మ.)

టీ. మునే=మునీంద్రుఁడా; ఘటాకాశం = ఘటాకాశమును; మహాకాశే ఇవ=మహాకాశమందు కలుపునటులు; ఆత్మానం=ఉ

పాధియందున్న ప్రత్యగాత్మను ; పరమాత్మని = పరబ్రహ్మయందు ; అఖండభావేన=భేదములేనిజ్ఞానమున ; విలాప్య=కలిపి ; సదా=ఎల్లప్పుడు ; తూష్ణీంభవ=నిర్వాసనా మౌనముగలవాఁడవుగమ్ము.

తా. స్పష్టము.

" చిదిహాస్తీతి చిన్మాత్ర మిదంచిన్మయమేవచ " ౪౩

" చిత్త్వంచిదహమేతేచ లోకాశ్చిదితిభావయ " ౪౪

(కృ-య ; వరాహ ; అ ౨)—(శు-య ; యాజ్ఞవల్క్య.)

టీ. ఇహ=ఇక్కడ ; చిదస్తీతి=చిత్తున్నదనియును ; చిన్మాత్రం=కేవలచిత్తేయనియును ; ఇదం=ఈజగత్తు ; చిన్మయమేవచ=చిన్మయమేయనియును ; త్వం=నీవు ; చిత్=చిత్తనియును ; అహం=నేనును ; చిత్=చిత్తేయనియును ; ఏతేలోకాశ్చ=యీలోకములును ; చిదితి=చిత్తేయనియును ; భావయ=భావింపుము.

తా. సమస్తము చిద్రూపమని భావింపుము.

" సత్యచిద్ఘనమఖండమద్వయం సర్వదృశ్యరహితంనిరామయం " ౪౫

" యత్పదంవిమలమద్వయంశివంతత్సదాహమితిమౌనమాశ్రయ " ౪౬

(కృ-య ; వరాహ ; అ౩.)

టీ. సత్యచిద్ఘనం= సత్యజ్ఞానములు తక్క రెండవది లేనిది ; అఖండం=ఖండముగానిది ; అద్వితీయం=అద్వితీయమైనది ; సర్వదృశ్యరహితం=సమస్త దృశ్యములు లేనిది ; నిరామయం=రోగములేనిది ; విమలం=స్వచ్ఛమైనది ; అద్వయం=రెండవదిలేనిది; శివం=మంగళస్వరూపమైనది ; యత్పదం=ఏస్థానమో ; తత్=ఆపదమే . అహమితి=నేనని ; సదా=ఎల్లప్పుడు; మౌనం=నిర్వాసనా మౌనమును ; ఆశ్రయ=ఆశ్రయింపుము.

తా. వడగండ్లు ఘనీభవించిననీటిని తక్క నితరముఁ గలిగి యుండక జలఘనమని చెప్పబడునట్లు, సత్యజ్ఞానములు దక్క నితర మునుఁగలుగనిది, సత్యజ్ఞానఘన మనఁబడును. అట్టి బ్రహ్మామే నేనని నిర్వాసనా మానమునుఁబూనుము. అన్నింటియందు నహంకారమును విడిచి, బ్రహ్మాకారముగ నుండవలయును.

"జన్మమృత్యుసుఖదుఃఖ వర్జితం జాతినీతికులగోత్ర దూరగం" ౭౭
"చిద్వివర్తజగతోఽస్యకారణంతత్సదాహమితి మానమాశ్రయః" ౭౮
(క్రి-య : ౯౮ వరాహ : అ ౩)

ట. జన్మమృత్యు సుఖదుఃఖ వర్జితం=పుట్టువు చావుసుఖము దుఃఖము లేనిది ; జాతినీతికులగోత్ర దూరగం=జాతినీతికులగోత్రములకు దూరమైనది : అస్య=ఈ, చిద్వివర్తజగతః, చిద్వివర్త=చిద్వివర్తరూప మైన : జగతః=జగత్తునకు : కారణం=కారణమైనదియునగు : తత్= ఆబ్రహ్మము : అహమితి=నేనని : సదా=ఎల్లప్పుడు : మానం=నిర్వాస నామానమును ; ఆశ్రయ=ఆశ్రయింపుము.

తా. అద్వితీయమగు బ్రహ్మము నేనేయని నిశ్చయించుకొని మానముగా నుండవలెను.

"పూర్ణమద్వయ మఖండచేతనం విశ్వభేదకలనాది వర్జితం" ౭౯
"అద్వితీయపరసం విదంశకంతత్సదాహమితి మానమాశ్రయః" ౮౦

(క్రి-య : ౯౦ ; వరాహ ; అ ౩)

ట. పూర్ణం=అంతటను నిండియున్నదియును ; అద్వయం=రెం డవదిలేనిదియును; అఖండచేతనం=అఖండచైతన్యస్వరూపమైనదియును; విశ్వభేదకల నాదివర్జితం=జగద్వైశ్వాది భేదము లేనిదియును; అ యం=రెండవదలేని ; పరసంవిదంశకం=ఉత్కృష్టమైన జ్ఞానమేయంశ ముగా గలదియునగు; తత్=ఆ బ్రహ్మము : అహమితి=నేనేయని ;

సదా=ఎల్లప్పుడు ; మౌనం-నిర్వాసనా మౌనమును ; ఆశ్రయ= ఆశ్రయింపుము.

తా. అద్వితీయ పరిపూర్ణమైన బ్రహ్మమే నేనని సంకల్పము లేకయచలుఁడవై యుండుము.

"స్వాత్మనోఽన్యతయాభాతం చరాచరమిదం జగత్" ౫౧

"స్వాత్మమాత్రతయా బుద్ధ్వా తదస్మీతి విభావయ" ౫౨

(కృ-య; ౯౮ వరాహ; అ ౨.)

టీ. స్వాత్మనః= స్వాత్మకంటె ; అన్యతయా=అన్యత్వముచే ; భాతం=తోఁచుచున్న ; చరాచరం=చరాచరస్వరూపమైన ; ఇదంజగత్=ఈ జగత్తును ; స్వాత్మమాత్రతయా=స్వాత్మ మాత్రత్వముచేతనే ; బుద్ధ్వా=తెలిసి ; తత్=ఆపరమాత్మ ; అస్మీతి=అగుచున్నానని ; విభావయ=బాగుగ భావింపుము.

తా. ఆత్మకంటె వేఱుగఁదోఁచుచున్న జగత్తు నాత్మగానే (యాత్మకంటె వేఱుగాదని) యెఱిఁగి, యాపరమాత్మ నేనేయని యోచింపుము.

"విలాప్యవికృతింకృత్స్నాం సంభవవ్యత్యయక్రమాత్" ౫౩

"పరిశిష్టంచ చిన్మాత్రం చిదానందం విచిన్తయ" ౫౪

(శు-య ; ౧౦౮ ముక్తిక.)

టీ. కృత్స్నాం=పరిపూర్ణమైన : వికృతిం = జగద్వికారమును ; సంభవవ్యత్యయక్రమాత్=ఉత్పత్తిలయక్రమమున ; విలాప్య=కలిపి ; పరిశిష్టంచ=మిగిలియున్న ; చిన్మాత్రం=జ్ఞానమాత్రమును ; చిదానందం=జ్ఞానానందస్వరూపమునగు బ్రహ్మమును; విచిన్తయ=చింతింపుము.

తా. ప్రకృతి వికారములైన పంచభూతములలో నేభూతమున నేభూతముపుట్టుచున్నదో, యా భూతమును దానియందుకలిపి, యనఁగా, భూమిని నీటియందు, నీటి నగ్నియందు, నగ్నిని వాయువందు, వాయువు నాకాశమందు కలిపి, దానిని మహత్తత్వమునను, దానిస వ్యక్తమునను, దానిని ప్రకృతియందును జేర్చి, ప్రకృతిని బ్రహ్మమునఁగూర్చి, యాబ్రహ్మస్వరూపమున నచలుఁడవై యుండుము.

ఇతి సార్థాంతి కోపదేశవాక్యానిచతుః పంచాశత్

ఇట్లు సార్థాంతికోపదేశవాక్యము లేబదినాలుగు.

ఇతి పంచమం ప్రకరణం సమాప్తమ్.

అయిదవ ప్రకరణము సమాప్తము.



శ్రీ

సద్గురవేనమః.

# ౬ జీవబ్రహ్మైక్యవాక్య ప్రకరణము.

"సయశ్చాయంపురుషే" ౧

"యశ్చాసావాదిత్యే" ౨

"సఏకః" ౩

(కృ-య ; ౭ తైత్తిరీయ ; ఆనందవల్లి)

టీ. పురుషే=పురుషునియందు; సోయం=ఉన్నవాఁడు; యశ్చ=ఎవఁడో; ఆదిత్యే=సూర్యునియందున్నవాఁడు; యశ్చ=ఎవఁడో; సః=వాఁడు; ఏకః=ఒకఁడే.

తా. పురుషునియందు నీవారశూకమువలె నగ్నిశిఖగానుండు పరమాత్మయే సూర్యమండలమున దేజోరాశిగనున్నది. ఉపాధినిబట్టి వేఱువేఱు రూపములుగానున్నను, నొక్కటియేగాని భిన్నములుకావు

"సత్యమాత్మాబ్రహ్మైవ బ్రహ్మాత్మైవాత్రనవిచికిత్స్యం"

(అధర్వణ; నృసింహోత్తరతాపిని; ౯ రఖ.)

టీ. ఆత్మా=ప్రత్యగాత్మస్వరూపము; బ్రహ్మైవ = బ్రహ్మమే; సత్యం=నిక్కము; బ్రహ్మ=బ్రహ్మము; ఆత్మైవ=ప్రత్యగాత్మయే; అత్ర=ఇక్కడ; నవిచికిత్స్యం=సందేహింపఁగూడదు.

తా. ఘటాకాశ మహాకాశములవలె, ప్రత్యగాత్మయును, బ్రహ్మము నొక్కటియేగాని వేఱుఁగావు. సందేహింపఁబనిలేదు.

"త్వం బ్రహ్మాస్మి" ౫

(అధర్వ; ౫౨ మహానారాయణ; అ ౬.)

టీ. త్వం=నీవు; బ్రహ్మా=బ్రహ్మము; అసి=అగుచున్నావు.

తా. స్పష్టము.

"అహం బ్రహ్మాస్మి" ౬

(శుక్లయ; బృహదారణ్యక; అ 3; —అధర్వణ; ౫౨ మహానారాయణ; అ ౬.)

టీ. అహం=నేను; బ్రహ్మా=బ్రహ్మము; అస్మి= అగుచున్నాను.

తా. స్పష్టము.

"ఆవయోరంతరంన విద్యతేత్వమేవాహమహమేవత్వం" ౭

(అధర్వణ; ౫౨ మహానారాయణ: అ ౬;)

టీ. ఆవయోః=మనయిద్దఱికిని; అంతరం=భేదము; నవిద్యతే=లేదు; త్వమేవ=నీవే; అహం=నేను; అహమేవ=నేనే, త్వం=నీవు

తా. ఉపాధిభేదముల చేతను, నేను నీవు వాఁడనుభేదము లాత్మకు గలుగుచున్నవి. ఉపాధులు విడిచిననంతయును బ్రహ్మమే.

"గతాఃకలాః పంచదశ ప్రతిష్ఠా దేవాశ్చ సర్వేప్రతి దేవతాసు" ౮

కర్మాణివిజ్ఞానమయశ్చ ఆత్మాపరేఽవ్యయే సర్వఏకీభవన్తి" ౯

(అధర్వ; ౫ ముండక ముం3; ఖం ౧;)

టీ. పంచదశకలాః = పదునేనుకళలును; గతాః=పోయినవి; ప్రతిష్ఠాః=కళలకధిష్ఠానమైన స్వరూపముగల; దేవాశ్చ=దేవతలును; సర్వే=అందఱును; ప్రతిదేవతాసు=ప్రతిదేవతలందును; గతాః=పొందినవారైరి; కర్మాణి కర్మములును; విజ్ఞానమయశ్చ=జీవుఁడును; ఆత్మా

-ఆత్మయును: సర్వే=అందఱును: అవ్యయే=నాశము లేని: పరే=పరమాత్మయందు; ఏకీభవన్తి=ఐక్యమగుచున్నారు.

తా. జ్ఞానేంద్రియములును, కర్మేంద్రియములును, పంచప్రాణములును, అంతరింద్రియములను ఇవి పదునారుకళలు. బ్రహ్మవేత్తయైన పురుషునకీ కళలునశించును: దేహమందలి యింద్రియాధిష్ఠాన దేవతలా దేవతలందు గలియుచుందురు. శ్రోత్రమునకు దిక్కు అధిదేవత; ఆదిక్కుదిక్కులందు కలియును. నేత్రేంద్రియాధిదేవతయైన సూర్యుడు సూర్యునియందు గలియును. ఇట్లే అన్నియు నూహింపవలయును. కర్మములు, జీవుడు, సర్వమును బరమాత్మయం దైక్యమగును.

" యేనేక్షతే శృణోతీదం జిఘ్రతివ్యాకరోతిచ " ౧౦

" స్వాద్వస్వాదూవిజానాతి తత్ప్రజ్ఞానముదీరితం " ౧౧

(కృ-య; 3౫ శుకరహస్య.)

టీ. ప్రజ్ఞానం బ్రహ్మయను మహావాక్యమునందలి ప్రజ్ఞానమను శబ్దమునకు ఈ వాక్యముచే నర్థము చెప్పబడు చున్నది. ఇది ఋగ్వేదమందలి ఐతరేయోపనిషత్తులో చివరనున్నది. యేన=నేత్రేంద్రియముల ద్వారా వ్యాపించిన యంతఃకరణ వృత్తులతో గూడిన యే చైతన్యముచేత, ఈక్షతే=రూపమునుచూచుచున్నాడో, ఇదం=ఈ శబ్దమును, శృణోతి=శ్రవణేంద్రియముద్వారా వ్యాపించిన యంతఃకరణ వృత్తులతో గూడిన యే చైతన్యముచేత వినుచున్నాడో, జిఘ్రతి=వాసన చూచుచున్నాడో. స్వాద్వస్వాదూ=మధురరసమును మధురేతరరసమును (రుచిని, అరుచిని), విజానాతి=ఎఱుగుచున్నాడో, వ్యాకరోతిచ = వాగింద్రియముచే వ్యవహరించుచున్నాడో, తత్=ఆ చైతన్యము, ప్రజ్ఞానం=ప్రజ్ఞానమని. ఉదీరితం=చెప్పబడుచున్నది.

తా. సంవిద్రూపమైన చైతన్యమే యంతఃకరణ వృత్తులతోఁ గూడి బాహ్యేంద్రియములద్వారా వ్యాపించి, యాయావిషయముల దెలిసికొను చున్నది.

ఆ తెలివియేఁ ప్రజ్ఞాన మనఁబడును.

"చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వగవాదిషు" ౧౨

"చైతన్యమేకంబ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి" ౧౩

(కృ-య ; ౩౫ శుకరహస్య.)

టీ. చతుర్ముఖేంద్ర దేవేషు=చతుర్ముఖేంద్రాది దేవతలందును, మనుష్యాశ్వగవాదిషు=మనుష్యులందును గోహయాది సర్వజంతువు లందును నున్న, చైతన్యం = చైతన్యము, ఏకం=ఒక్కటి, బ్రహ్మ= అదియే బ్రహ్మము, అతః = ఆకారణమున, మయ్యపి, నాయందును గల, ప్రజ్ఞానం=ప్రజ్ఞానము, బ్రహ్మ=బ్రహ్మమగును.

తా. సమస్తభూతములందును జైతన్యమొక్కటియై యున్నది. సమస్త భూతములందున్న యా చైతన్యమే బ్రహ్మము. ఆ కారణ మున బ్రజ్ఞానమని చెప్పబడు నాయందున్న చైతన్యము బ్రహ్మమే యగును. కాని వేఱుఁగాదు.

"పరిపూర్ణః పరాత్మాస్మిన్ దేహేవిద్యాధికారిణి" ౧౪

"బుద్ధేస్సాక్షి తయాస్థిత్వాస్ఫురన్నహమితీర్యతే" ౧౫

(కృ-య ; ౩౫ శుకరహస్య.)

టీ. 'అహంబ్రహ్మాస్మి' యనుమహావాక్యమందలిఁ యహం' శబ్దమున కర్థముచెప్పబడు చున్నది. ఈ మహావాక్యము శుక్లయజు ర్వేదమందలి బృహదారణ్యకమున నున్నది. పరిపూర్ణః=అంతటనునిం డియున్న ; పరాత్మా=పరబ్రహ్మము ; విద్యాధికారిణి=జ్ఞానసంపాదన

మునకు దగిన ; అస్మిన్ దేహే=ఈ దేహమందు ; బుద్ధేః=బుద్ధికి ; సాక్షితయా=సాక్షిభావముచేత ; స్థిత్వా=ఉండి ; స్ఫురన్=ప్రకాశించుచు ; అహమితి=నేనని ; ఈర్యతే=చెప్పఁబడుచున్నది.

తా. అంతటను నిండియున్న బ్రహ్మమే యీ దేహమందు బుద్ధి వృత్తులకు సాక్షియై, వానినెఱుఁగుచు, బ్రకాశించుచుండి, నేనను పదముచే జెప్పఁబడుచున్నది. నేననఁగా నా బ్రహ్మమేకాని దేహాదులు కావని యెఱుఁగవలయును.

" స్వతఃపూర్ణః పరాత్మాత్ర బ్రహ్మశబ్దేనవర్ణితః " ౧౬
" అస్మీత్యైక పరామర్శస్తేన బ్రహ్మభవామ్యహం " ౧౭
(కృ-య ; ౩౫ శుకరహస్య)

టీ. 'అహంబ్రహ్మాస్మి' యను మహావాక్యమందలి బ్రహ్మ శబ్దమునకును, అస్మియనుశబ్దమునకును ఈ మహావాక్యముచే నర్థము చెప్పఁబడుచున్నది. స్వతః=స్వాభావికముగ ; పూర్ణః=అంతటనునిండియున్న ; పరాత్మా=పరబ్రహ్మము ; అత్ర=ఈ వాక్యమందు ; బ్రహ్మశబ్దేన='బ్రహ్మ' యనుపదముచే ; వర్ణితః=చెప్పఁబడెను ; అస్మీతి='అగుచున్నా' నను పదము ; ఐక్యపరామర్శః=ఏకత్వముఁ దెలుపునది యగును. తేన=ఆ హేతువుచే ; అహం=నేను ; బ్రహ్మ=బ్రహ్మము భవామి=అగుచున్నాను.

తా. ఒక దేహమందుండుటచే నాబ్రహ్మము నేనని చెప్పఁబడుచున్నది. బ్రహ్మమనఁగా స్వాభావికముగ సర్వపరిపూర్ణమైనది. ఆ హేతువుచే నేనే బ్రహ్మము.

" ఏకమేవాద్వితీయం సన్నామరూపవివర్జితం " ౧౮
" సృష్టేఃపురాధునాప్యస్య తాదృక్త్వంత దితీర్యతే " ౧౯
(కృ-య ; ౩౫ శుకరహస్య.)

టీ. 'తత్త్వమసి' యను మహావాక్యమందలి 'తత్' అను పదమున కర్థము చెప్పఁబడుచున్నది. ఈమహావాక్యము సామవేద మందలి ఛాందోగ్యమందున్నది. సృష్టేః=సృష్టికి; పురా = పూర్వ మందు, నామరూపవివర్జితం = నామరూపములేనిదియు: ఏకమేవ= ఒక్కటియేయైనదియు; అద్వితీయం=తనకంటెను రెండవది లేనిదియు నగు; సత్ =ఏసద్వస్తువుకలదో; అస్య=ఈసద్వస్తువునకు; అధు నాపి=ఇప్పుడును (సృష్టియైన తరువాత); తాదృక్త్వం = అట్టిధర్మ మును; తదితి = 'తత్' అను పదముచే; ఈర్యతే = చెప్పఁబడు చున్నది.

తా. నామరూపములు, సజాతీయ విజాతీయ, స్వగతభేద ములు. లేని యేసద్వస్తువు సృష్టికిముందున్నదో. యాసద్వస్తువే నామరూపములును, భేదత్రయముగలిగిన సృష్టియైన తరువాతగూడ 'తత్' అను పదముచే జెప్పఁబడుచున్నది.

"శ్రోతుర్దేహేంద్రియాతీతం వస్త్వత్రత్వం పదేరితం" ౨౦
"ఏకతా గ్రాహ్యతేసీతిత దైక్యమనుభూయతాం". ౨౧
(కృ-య; ౩౫ శుకరహస్య.)

టీ. 'తత్త్వమసి' యను మహావాక్యమందలి 'త్వం' పదము నకును 'అసి' యను పదమునకును అర్థము చెప్పబడుచున్నది. శ్రోతుః= వినువానియొక్క (ముముక్షువైన శిష్యునియొక్క); దేహేంద్రియా తీతం= దేహేంద్రియముల కతీతమైన వానికి సాక్షిగానుండు చైతన్య మను; వస్తు=వస్తువు; త్వంపద=త్వం అను పదముచే. ఈరితం=చెప్ప బడుచున్నది. ఏకతా=ఐక్యము. అత్ర=ఈవాక్యమందు; అసీతి='అసి' యను పదముచే గ్రాహ్యతే=గ్రహింపబడుచున్నది. తదైక్యం=ఆయై క్యము; అనుభూయతాం=అనుభవింపఁబడుగాక.

తా. సృష్టికి పూర్వమందున్న సద్వస్తువే తనయందుగల్పింపఁబడిన యుపాధులందు ప్రవేశించి 'త్వం' అనుపదముచేఁ జెప్పఁబడుచున్నది. భాగలక్షణచే నుపాధుల బరిత్యజింపఁగా బ్రహ్మమొక్కటియె గావున 'తత్త్వమసి' యని చెప్పఁబడెను. ఇదియుపదేశవాక్యము.

" స్వప్రకాశం పరోక్షత్వమయ మిత్యుక్తితో మతం " ౨౨
" అహంకారాది దేహాన్తా త్ప్రత్యగాత్మేతిగీయతే " ౨౩
(కృ యు; ౩౫ శుకరహస్య)

టీ. 'అయమాత్మాబ్రహ్మ' యను మహావాక్యమందలి 'అయమాత్మా' యను పదముల కర్థము చెప్పఁబడుచున్నది. ఈమహావాక్యమథర్వణవేదమందలి మాండూక్యమునయున్నది. అయమితి='అయం' అను ; ఉక్తిః=మాటవలన; స్వప్రకాశపరోక్షత్వం=స్వప్రకాశమును; ప్రత్యక్షత్వమును; మతం = అంగీకరింపబడును: అహంకారాది దేహాన్తాత్ =అహంకారమాదియును దేహామంతముఁగాఁగల ప్రపంచములోనుండుటవలన; ఆత్మేతి='ప్రత్యగాత్మ' యని; గీయతే=చెప్పఁబడుచున్నది.

తా. బ్రహ్మమే యహంకారాది దేహాన్తమైన ప్రపంచములోనుండుటచేఁ 'బ్రత్యగాత్మ' యనియు 'నాత్మ' యనియుఁ జెప్పఁబడును 'అయ' మను విశేషము స్వప్రకాశమును; బ్రత్యక్షత్వమును తెలియజేయుచున్నది. మనకెదుట స్పష్టముగఁగనుపడువస్తువు నీవస్తువని చెప్పుదుము కదా.

" దృశ్యమానస్య సర్వస్య జగతస్తత్త్వమీర్యతే " ౨౪
" బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకం " ౨౫
(కృ-యు; ౩౫ శుకరహస్య.)

టీ. 'అయామాత్మాబ్రహ్మ' యను మహావాక్యమందలి 'బ్రహ్మ' శబ్దమునకర్థము చెప్పఁబడుచున్నది. దృశ్యమానస్య=కనంబడుచున్న;

సర్వస్య=సమస్తమైన; జగతః=జగత్తునకు; తత్త్వం=అధిష్ఠానమైనవస్తువు; బ్రహ్మశబ్దేన='బ్రహ్మ' యను శబ్దముచే; ఈర్యతే=చెప్పఁబడుచున్నది. తత్ బ్రహ్మ=ఆబ్రహ్మము; స్వప్రకాశాత్మరూపకం=ప్రకాశాపరోక్షములుగల ప్రత్యగాత్మయే.

తా. జగత్తునకధిష్ఠానమైనది బ్రహ్మము. అదియే దనయందారోపింపఁబడిన జగత్తులో బ్రవేశించి, 'ప్రత్యగాత్మ' యనఁబడెను. ప్రత్యగాత్మ బ్రహ్మలొక్కటియే. వేఱుగావు.

" మాయావిద్యేవిహాయైవ ముపాధీపరజీవయోః " ౨౬

" అఖండంసచ్చిదానందం పరబ్రహ్మైవలక్ష్యతే " ౨౭

(శు-య; 23 అధ్యాత్మ.)

టీ. ఏవం=భాగలక్షణావృత్తిచే; పరజీవయోః=పరమాత్మజీవాత్మలకు; ఉపాధీ=ఉపాధులైన; మాయావిద్యే=మాయావిద్యలను; విహాయ=విడిచి (విడువఁగ;) అఖండ=ఖండముఁగాక పరిపూర్ణమైనదియు; సచ్చిదానందం=సత్యజ్ఞానానందస్వరూపమునైన; పరబ్రహ్మైవ=పరబ్రహ్మమొక్కటియే; లక్ష్యతే=కనఁబడుచున్నది.

తా. బ్రహ్మమేమాయోపాధిని గ్రహించి యీశ్వరుఁడనియు, నవిద్యోపాధినిగ్రహించి జీవుఁడనియు, జెప్పబడుచున్నందున భాగలక్షణచే, నుపాధులైన మాయావిద్యలను విడువఁగా జీవేశ్వరాది భేదము లేక బ్రహ్మమొక్కటియే యుండును. సత్యజ్ఞానానందస్వరూపమైనది బ్రహ్మము. బ్రహ్మ ప్రతిబింబముతోఁగూడినదియును సత్వరజస్తమోగుణముల సామ్యావస్థయైనదియు 'బ్రకృతి' యనఁబడును. ఈ ప్రకృతి బ్రహ్మమువలె సత్యమైనది కాదు. మాయా స్వరూపమైనది. ఆత్మజ్ఞానముచే నశించును గావున సత్తుగాదు. ఉన్నట్లు తోఁచుచుండుటచే నసత్తుగాదు. జడమైనది. అనిర్వచనీయము. సత్వగుణ ముద్రేకించు

నపుడు శుద్ధసత్త్వమనియును, మాయయనియుఁ జెప్పఁబడును. రజోగుణ ముద్రేకించునపుడు మలినసత్త్వమనియు, నవిద్యయనియుఁ జెప్పబడును. తమోగుణ ముద్రేకించునపుడు తమఃప్రధాన మనఁబడును. ప్రకాశ నిర్మలత్వములు గలది సత్త్వము. రాగాత్మకమైనది రజోగుణము. మాఢ్యమైనది తమోగుణము మాయయందు ప్రతిబింబించి యా మాయను స్వాధీనము చేసికొనిన బ్రహ్మమే యీశ్వరుఁడనబడును. ఆ యీశ్వరుఁడు సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదులు కలవాఁడు. అతఁడే సమస్తమును సృజించెను. అతఁడే 'యంతర్యామి' యనియు నవ్యాకృతుఁడనియుఁ జెప్పఁబడును. అవిద్యయందు ప్రతిబింబించి దానికి వశమైన బ్రహ్మమే జీవుఁడనఁబడును. ఆజీవుఁడు కించిత్ జ్ఞత్వాదులుగలవాఁడు. ఈశ్వర మాయామోహితుఁడై యీశ్వరునిచే సృజింపఁబడిన జగత్తును భోగ్యముగాఁజూచుచున్నాఁడు. ఆజీవుఁడు ప్రాజ్ఞుఁడను పేర నొప్పును. ఆ యవిద్యయే కారణశరీరము. దానికి సుషుప్తి యవస్థ. ఆ యవిద్యావైచిత్ర్యమున నాజీవు లనేక విధములుగ నున్నారు. ఆజీవుల భోగమునకు నీశ్వరుఁడు తమః ప్రధానమైన ప్రకృతినీక్షించి యాకాశ వాయు తేజోజల పృథువులను నపంచీకృత సూక్ష్మభూతములఁ బుట్టించెను. ఈశ్వరుఁడు (మాయా ప్రతిబింబిత బ్రహ్మమే) జగత్తునకు నిమిత్తకారణమును, తమఃప్రధాన ప్రకృతి (అందు ప్రతిబింబించిన బ్రహ్మమే) యుపాదాన కారణమును జీవుడు (అవిద్యాప్రతిబింబిత బ్రహ్మము) భోక్తయునగుచున్నాఁడని తెలియవలయును. కావున బ్రహ్మమే మాయాభేదమున భోజ్యము భోక్తయు నగుచున్నది. ఆయపంచీకృతభూతములయిదును సత్త్వరజస్తమోగుణములు గలవి. అందాకాశసత్త్వమున శ్రోత్రమును, వాయుసత్త్వమున 'త్వక్కు' అగ్నిసత్త్వమున నేత్రము, జలసత్త్వమున జిహ్వ, పృథివీసత్త్వమున ఘ్రాణము, ననుజ్ఞానేంద్రియములైదునుఁ గలిగెను. పంచభూతములయొక్క సమష్టిసత్త్వ గుణమువలన నంతరింద్రియము గలిగెను. అదియే వృత్తిభేదమున మనస్సనియును బుద్ధియనియును

రెండువిధములుగనున్నది. మనస్సువిమర్శరూపమైనది. బుద్ధినిశ్చయాత్మకమైనది. మనస్సుయొక్క యంశమే చిత్తము. బుద్ధియొక్కయంశమే యహంకారము. ఆకాశరజోగుణమువలన వాక్కును, వాయురజోంశమువలనఁ బాణియును, వహ్నిరజోంశమువలన బాదమును, జలరజోగుణమువలనఁ బాయువును, భూరజోంశమువలన నుపస్థయునను కర్మేంద్రియయములైదునుగలిగెను. పంచభూతములయొక్క సమష్టి రజోగుణమున ప్రాణముపుట్టెను. వృత్తిభేదముననది ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానముననియైదువిధములాయెను. ఇవియేపంచప్రాణములనఁబడును. జ్ఞానేంద్రియములైన శ్రోత్రత్వక్చక్షు జిహ్వాఘ్రాణములకు క్రమముగా, శబ్దస్పర్శరూప రసగంధములు విషయములగును, విషయములఁ దెలిసికొనుటకు సాధనములుగావున జ్ఞానేంద్రియములనఁబడును. కర్మేంద్రియములైన వాక్పాణి పాదపాయూపస్థలకు క్రమముగా, వచనాదానగమన విసర్గానందములు విషయములగును. కర్మముచేయుటకు సాధనములుగావున కర్మేంద్రియము లనఁబడును. రజోగుణము వలన గర్మమును సత్వమువలన జ్ఞానమునుగలుగునని దీనినిబట్టి తెలియవలయును. జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు పంచప్రాణములు మనోబుద్ధులు అను, పదియేడవయవములు గలది సూక్ష్మశరీరమనఁబడును. అదియే లింగశరీరమని జెప్పబడెను. ఈ లింగశరీరము జీవునకు భోగసాధనమైయున్నది. ఆ లింగశరీరములు నానావిధములుగ గలిగెను. ఆ లింగశరీరమున నభిమానముగలిగిన యీశ్వరుఁడు హిరణ్యగర్భుఁడను పేరనొప్పుచున్నాఁడు అతఁడే సూత్రాత్మ ఆలింగశరీరమున నభిమానముబూని ప్రాజ్ఞుఁడను జీవుఁడు తైజసుఁడనుపేర నొప్పుచున్నాఁడు. లింగశరీరమునకవస్థ స్వప్నము. ఈశ్వరునకు జీవులనందరిని నెఱుఁగు సర్వజ్ఞత్వమున సమష్టి లింగశరీరాభిమానము గలదని తెలియవలయును. కావున హిరణ్యగర్భుఁడొక్కడేగాని యనేకులుకారు. ప్రాజ్ఞుఁడను జీవునకు కించిత్ జ్ఞత్వమువలన వ్యష్టిలింగశరీరమున నభిమానముఁగలదని తెలియవలయును. కావున

తైజసులనేకులున్నారు. వ్యష్టి ఒక వృక్షమువంటిది. సమష్టి తోటవంటిది. ఆజీవుల భోగముకొఱ కీశ్వరుఁడా యపంచీకృత తమోగుణ ప్రధానములైన పంచభూతములను పంచీకృతములు చేసెను ఒక్కొక్క భూతము రెండు భాగములై రెండు భాగములలో మొదటిది నాలుఁ భాగములై యా నాలుగు నాలుగు భాగములు తమకంటె నితరమైన నాలుగు భూతములయొక్క రెండవ భాగములోఁగూడినందున ప్రతి భూతమును పంచీకృతమాను. అనఁగా నొక భూతమున నైదు భూత గుణములును నుండెనని తెలియవలయును. ఆ భూతములవలన భువనములును భోగధామములైన స్థూలశరీరములును, భోగ్యములైన యన్నాదులునుఁ గలిగెను ఆ స్థూలశరీరములు రక్తాస్థి మాంసమయములు. సమష్టి స్థూలశరీరమున నభిమానముగల యీశ్వరుఁడు హిరణ్యగర్భుఁడు విరాట్టనియును వైశ్వానరుఁడనియుఁ జెప్పఁబడును. తైజసులీ స్థూలశరీరముల నభిమానముగలవారై విశ్వులను నామములను బొందిరి. వారు దేవమానవ తిర్యగాదిభేదముల నొప్పుచుందురు. ఈ స్థూలశరీరమునకు జాగ్రదవస్థ యగును. ఇందు స్థూలశరీరమన్న మయకోశ మనఁబడును. లింగశరీర ముప్రాణమయ మనోమయ విజ్ఞానమయములను మూఁడు కోశము లనబడును. కారణ శరీరమందలి సత్వమానంద మయకోశ మనఁబడును ప్రియమోద ప్రమోదములను మూఁడు వృత్తులచే నానందమయ కోశమొప్పును. లింగశరీరమునందు బంచప్రాణములు గర్మేంద్రియములుగూడి ప్రాణమయకోశమయ్యెను. మనస్సును జ్ఞానేంద్రియములునుఁగూడి విజ్ఞాన కోశమయ్యెను. ఇట్లు మాయావిద్యాద్యుపాధులఁబట్టి యొక్కబ్రహ్మమే విరాడ్ఢిరణ్యగర్భాద్యా కృతులను నీశ్వరులుగను విశ్వతైజ సప్రాజ్ఞులను జీవులుగను, వ్యవహరింపఁబడుచున్నది. భాగలక్షణచే నీయుపాధులను విడువఁగా, సత్యజ్ఞానానందమైన బ్రహ్మమొక్కటియే శేషించును. ఆహేతువుచే జీవబ్రహ్మైక్యముఁదెలుపు 'తత్త్వమసి' యను వాక్యమును వేదాంతము లుపదేశించుచున్నవి. "శ్లో. జగతోయదు

పాదానం మాయామాదాయతామసీం। నిమిత్తశుద్ధసత్వాంతాం డుచ్యతే బ్రహ్మతద్గిరా. " ఏబ్రహ్మము మాయ నుపాధిగాఁ గైకొని యీశ్వరుఁ డనుపేర జగత్తునకు నిమిత్తకారణమును, తమఃప్రధానప్రకృతి నుపాధిగాఁ గైకొని యుపాదానకారణమగుచున్నదో యాబ్రహ్మ మీవాక్యమున 'తత్' అను పదముచేఁ జెప్పబడుచున్నది. మన్నుకుండైనట్లు కారణమైన తాను కార్యరూపముగ బరిణమించినను దాను నశింపక యుండునది యుపాదానకారణము. కార్యము నశించిన నుపాదానకారణము నశింపదు. కార్యమును చేయువాఁడు (కుండకు కుమ్మరియైనట్లు) నిమిత్తకారణము (యదామలినసత్వాంతాం కామకర్మాదిదూషితాం, ఆదత్తేతత్పరంబ్రహ్మ, త్వంపదేనతదోచ్యతే) ఏబ్రహ్మమెప్పుడు మలిన సత్వమైన యవిద్య నుపాధిగాఁగ్రహించి జీవుఁడనుపేర భోక్తృత్వాద్యభిమానముకు బూనెనో యప్పుడాబ్రహ్మము త్వంపదముచేఁ జెప్పఁబడుచున్నది. అసిపదము, తత్త్వంపదవాచ్యులైన బ్రహ్మజీవుల కైక్యము చేయుచున్నది. లక్షణావృత్తిచే నామాయావిద్యలను విడువఁగా బ్రహ్మమొక్కటియే శేషించును. ప్రకృతి సదసద్విలక్షణము గావున దాని భేదములైన మాయావిద్యలను విడువవచ్చును.

" సకారఃఖేచరీప్రోక్తస్త్వం పదంచేతినిశ్చితం " ౨౮

" హకారఃపరమేశస్స్యాత్ తత్పదంచేతి నిశ్చితం " ౨౯

(సామ ; ౪౬ యోగచూడామణి)

టీ. ఖేచరీప్రోక్తః=ఖేచరీబీజమని చెప్పఁబడుఁ హృదయాకాశమునబక్షివలె దిరుగునని చెప్పఁబడు) సకారః=సకారము (జీవుఁడు) త్వంపదంచేతి=త్వంపదమని, నిశ్చితం=నిశ్చయింపఁబడినది, హకారః=హకారము ; పరమేశః=బ్రహ్మము; స్యాత్ =అగును ; తత్పదంచేతి= తత్పదమని ; నిశ్చితం=(హకారము) నిశ్చయింపఁబడినది.

తా. సకారముజీవుఁడు 'త్వం' పదవాచ్యుఁడు. హకారము. బ్రహ్మముతత్పదవాచ్యము. తదుభయులకు నైక్యముఁగలుగఁజేయునని

పదముబిందువనియును బుద్ధియనియుఁ జెప్పఁబడును. ఇట్లుహంసమం త్రము ప్రతిభూతహృదయమునుండి వెడలుచుజీవబ్రహ్మైక్యమునుబోధించుచున్నది. సద్గురు కటాక్షమున దానిరహస్యము నెఱిఁగి బ్రహ్మానుసంధానము జేయుచుండ వలయును.

"సకారో ధ్యాయతే జంతుర్హకారో హి భవేద్ధ్రువం" ౩౦

(సామ ; ౪౬ యోగచూడామణి.)

టీ. సకారః=సకారవాచ్యుఁడైన, జంతుః=జీవుఁడు, ధ్యాయతే=ధ్యానించుచున్నాడు,హి=ఆహేతువుచేత, హకారః=హకారవాచ్యమైన బ్రహ్మము, భవేద్ధ్రువం=నిశ్చయముగ నగుచున్నాఁడు.

తా. కీటకము భ్రమరము చేయుచున్న ధ్వనిని వినుచు తదేకధ్యానమున భ్రమర మగుచున్నది. ఇదియె భ్రమర కీటకన్యాయము. ఇట్లే జీవుఁడు నోంకార స్వరూపమైన బ్రహ్మమును ధ్యానింపఁగా బ్రహ్మమే యగుచున్నాడు.

"అథో రాతత్పదార్థస్స్యాన్మకారస్త్వం పదార్థవాన్" ౩౧

"తయోస్సంయోజనమసీత్యర్థే తత్త్వవిదో విదుః" ౩౨

(అధర్వ-శిర రామరహస్య ; అ ౫.)

టీ. రా=రాయను అక్షరము, తత్పదార్థస్స్యాత్ = తత్పదార్థమగును, మకారః=మకారము,త్వంపదార్థవాన్=త్వంపదార్థముగలది, తయోః=ఆ రెండక్షరముల యొక్క, సంయోజనం=కూర్చుట, అసి='అసి' పదార్థమగును, ఇత్యర్థే = 'అసి' యను పదార్థమందు సంయోజనమును, తత్త్వవిదః=తత్త్వవేత్తలు, విదుః= తెలియుచున్నారు.

తా. రాయను అక్షరము తత్పదవాచ్యమైన బ్రహ్మము. మకారము త్వంపదవాచ్యుఁడైన జీవుఁడు. రామయని కూర్చుటే యసి

పదార్థ మగును. ఇట్లుతత్త్వవేత్తలు'తత్త్వమసి' యను వాక్యమువలనఁ గల యర్థమునే రామయను శబ్దమందును దెలిసికొందురు.

" నమస్త్వమర్థోవిజ్ఞేయో రామ స్తత్పదముచ్యతే " 33
" అసీత్యర్థేచతుర్థీస్యాత్ ఏవంమంత్రేషుయోజయేత్ " 3౪
(అధర్వ ; ౫౪ రామరహస్య ; అ ౫)

టీ. నమః=నమశ్శబ్దము ; త్వమర్థః='త్వం' పదార్థముగల దిగ్యై ; విజ్ఞేయః=తెలియదగినది ; రామః = రామశబ్దము ; తత్పదం=తత్పదార్థమని ; ఉచ్యతే=చెప్పఁబడుచున్నది ; అసీత్యర్థే='అసి' పదార్థమున ; చతుర్థీస్యాత్=చతుర్థీవిభక్తియగును ; ఏవం=ఈప్రకారము ; మంత్రేషు=సమస్తమంత్రములందు ; యోజయేత్=కూర్చవలెను.

తా. 'నమోరామాయ'యను మంత్రమున, నమశ్శబ్దమునకు 'త్వం' పదార్థమగును. రామశబ్దమునకు 'తత్ప' దార్థమగును. చతుర్థీ 'విభక్తి యసి పదార్థమును దెలియఁజేయునదిగఁ దలఁపవలయును.ఇట్లే నమః' శబ్దమునకు 'అహం' శబ్దార్థమును, రామపదమునకు బ్రహ్మశబ్దార్థమును, చతుర్థీవిభక్తి 'కస్మి' శబ్దార్థము నుపయోగింపవలయును. ఇట్లే సమస్తమంత్రములకు నుపయోగింపవలయును. ఏమంత్రమునైనను శిష్యుల కుపదేశించునపుడు'తత్త్వమసి' యనియు దాను జపించునపుడు 'అహంబ్రహ్మాస్మి' యనియును యోజింపవలెను. అట్లు యోజించినదానేది యుపదేశించినను, బ్రహ్మోపదేశమగును. తానేదిజపించినను బ్రహ్మానుసంధాన మగును.

"క్షీరంక్షీరే యథాక్షిప్తం తైలంతైలేజలంజలే" 3౫
"సంయుక్తమేకతాంయాతి తథాత్మన్యాత్మవిన్మునిః" 3౬
(అధర్వ; ౭౬ ఆత్మ.)

టీ. క్షీరే=పాలయందు; క్షిప్తం=ఉంచబడిన; క్షీరం=పాలును; తైలే=తైలమందు; క్షిప్తం=ఉంచఁబడిన; తైలం=నూనెయు; జలే=జలమందు; సంయుక్తం=కూడిన; జలం=నీరును; ఏకతాం=ఏకత్వమును; యాతి=ఏలాగునఁబొందునో; తథా=అట్లే; ఆత్మవిత్=ఆత్మజ్ఞానియైన; మునిః=మునియును; ఆత్మని=ఆత్మయందైక్యమునుజెందును.

తా. జలము జలమందును, తైలము తైలమందును, క్షీరము క్షీరమందును, గలిసి యెట్లు లేకత్వమొందునో యట్లే, యాత్మజ్ఞాని యాత్మయందైక్యమొందును.

"ఘటేనష్టేయథావ్యోమ వ్యోమైవభవతిస్వయం" .　　　38

"తద్వదోపాధివిలయే బ్రహ్మైవబ్రహ్మవిత్స్వయం"　　　39

(అథర్వ; ౭౬ ఆత్మ.)

టీ. ఘటే=కుండ; నష్టే=నష్టమగుచుండగా; వ్యోమ=ఘటాకాశము; యథా=ఏప్రకారము; వ్యోమైవ=మహాకాశమే; స్వయం=తాను; భవతి=అగుచున్నదో; తద్వైవ=ఆప్రకారమే; ఉపాధివిలయే=స్థూలసూక్ష్మకారణ శరీరములు మూడును నశింపఁగ; బ్రహ్మవిత్=బ్రహ్మవిదుఁడు; స్వయం=తాను; బ్రహ్మైవ=పరబ్రహ్మమేయగును.

తా. అవిద్యాప్రతిబింబిత బ్రహ్మచైతన్యమే జీవుఁడు. ఆజీవుఁడే లింగశరీరమునందై జసుఁడనియు, స్థూలశరీరమున విశ్వుఁడనియుఁ, జెప్పఁబడును గావున, అవిద్యయైన కారణశరీరము నశింపఁగా దాని కార్యములైన స్థూలసూక్ష్మములు నశించును. అప్పుడు ఘటమునశింప నందలి యాకాశము మహాకాశమెట్లగునో యట్లే ప్రత్యగాత్మ స్వరూపుఁడగుతాను పరబ్రహ్మమగును.

ఇతి సార్థాంతిక జీవబ్రహ్మైక్య వాక్యాన్యష్టత్రింశత్.

ఇట్లు సార్థాంతిక జీవబ్రహ్మైక్య వాక్యములు ముప్పదియెనిమిది.

ఇతి షష్ఠంప్రకరణం సమాప్తమ్.

ఇట్లు ఆరవప్రకరణము సమాప్తము.

శ్రీ

సద్గురవేనమః.

# ౭ మనన వాక్య ప్రకరణము.

" అహమన్న మహమన్న మహమన్నమ్ " ౧

" అహమన్నాదో౽హ మన్నాదో౽హమన్నాదః " ౨

(కృ-యు; ౭ తైత్తిరీయ-భృగువల్లి.)

టీ॥ అహం=నేను; అన్నం=భోజ్యస్వరూపమైనయన్నమును; అహం=నేను; అన్నం=భోజ్యస్వరూపమైనయన్నమును; అహం=నేను; అన్నాదః=అన్నమును భక్షించువాడను.

తా. భోజ్యమును నేనే, భోక్తను నేనే, తమఃప్రధానమైన ప్రకృతినిగూడి బ్రహ్మమే భోగ్యపదార్థములయ్యెను; మలిన సత్వప్రధానమైన యవిద్యనుగూడి జీవరూపమున భోక్తయయ్యెను. అనగా బ్రహ్మమేభోజ్యము, భోక్తయునని యెఱుగవలయును.

" అహమ్మను రభవంసూర్యశ్చ " ౩

(శు=యు, ౧౦ బృహదారణ్యక-అ ౩ బ్రా-౬.)

" అహమేవేదం సర్వమశ్నామి " ౪

(శు-యు; ౧౦ బృహదారణ్యక-అ ౮ బ్రా-౩.)

టీ. అహం=నేను; మనుః=మనువును; సూర్యశ్చ=సూర్యుడను; అభవం=అయితిని; అహమేవ=నేనే; ఇదంసర్వం=భోగ్యరూపమైన దీనినంతను; అశ్నామి=తినుచున్నాను.

తా. బ్రహ్మమే మను సూర్యచంద్ర దేవేంద్రాదులయ్యెను. బ్రహ్మమే సమస్తభోక్త.

" యథాఫేనతరంగాది సముద్రాదుత్థితంపునః " ౫

" సముద్రేలీయతే తద్వజ్జగన్మయ్యనులీయతే " ౬

(సామ-౯౦ దశ ౬ న-ఖం-౧౦)

టీ. యథా=ఏప్రకారము, సముద్రాత్ = సముద్రమునుండి, ఉత్థితం=పుట్టిన, ఫేనతరంగాది=నురుగుకెరటము మొదలైనది, పునః= మరల, సముద్రే=సముద్రమునందు, లీయతే= లయించుచున్నదో, తద్వత్ =అట్లే, జగత్ =(నాయందుపుట్టిన) జగత్తు, మయి=నాయందు, అనులీయతే=లయించుచున్నది.

తా. ఫేనతరంగబుద్బుదాదులు సముద్రమందుబుట్టి సముద్రమున లయించునట్లు జగత్తు బ్రహ్మమునదోచి బ్రహ్మమునందే లయించుచుండును.

"అనాత్మదృష్టిరవివేకనిద్రామహంమమస్వప్నగతింగతోహం" ౭

(కృ-య-3శి శుకరహస్య)

టీ. అహం=నేను, అనాత్మదృష్టిః = ఆత్మజ్ఞానములేనివాడనై అవివేకనిద్రాం=అవివేకమను నిద్రను, గతః = పొందినవాడనైతిని, మమ=నాయొక్క. స్వప్నగతిం=స్వప్నావస్థను, అహం=నేను, (గతః= పొందినవాడనైతిని.)

తా. అవిద్యావశమున మొదట నన్ను నే నెరుగక యుంటిని. అదియే యవివేకమను-సుషుప్తి. పిదప మరియొకడ ననుకుని విపర్యయజ్ఞానమున స్వప్నమును జెందితిని. అదియే సంసారము. ఇందు మొదటిది యవిద్యయొక్క యావృతి. రెండవది యవిద్యయొక్క విక్షేపశక్తి ఆవృతి విక్షేపరూపమగు నవిద్యజ్ఞానముననే నశించును గాని కర్మాదుల నశింపదు. తన స్వప్నము తన జాగ్రదవస్థవలన నశించునట్లే యవిద్య యాత్మజ్ఞానముననే నశించును.

" స్వరూపసూర్యేభ్యుదితే స్ఫుటోక్తైర్గురోర్మహావాక్య పదైః ప్రబుద్ధః " ౮

(కృ-య-3శి శుకరహస్య.)

టీ. స్వరూపసూర్యే=పరమాత్మయను సూర్యుడు, అభ్యుదితే=హృదయాకాశమున నుదయించుచుండగా, గురోః=సద్గురునియొక్క, స్ఫుటోక్తైః=సంశయములను బోగొట్టు స్పష్టవాక్యములు అను, మహావాక్యపదైః=మహావాక్యములచేత, ప్రబుద్ధః=మేల్కొనినవాడనైతిని.

తా. గురుబోధమున పరమాత్మయను సూర్యు డుదయించుచుండగా నావృతి విక్షేపాత్మకమైన యవిద్యయను చీకటి నశింపగా మేల్కొని నన్ను నే నెరిగినవాడనైతిని.

"ప్రాణాశ్చలంతు తద్ధర్మైః కామైర్వా హన్యతాంమనః" ౯
"ఆనందబుద్ధి పూర్ణస్య మమదుఃఖం కథంభవేత్" ౧౦

(బు-౪౨ ఆత్మబోధ.)

టీ. ప్రాణాః=పంచప్రాణములు, తద్ధర్మైః=వానిస్వభావ ధర్మములతో, చలంతు=చలింపనిమ్ము-కామైర్వా= కోరికలచేతనైనను, మనః=మనస్సు, హన్యతాం=కొట్టబడనిమ్ము, ఆనందబుద్ధిపూర్ణస్య=ఆనందబుద్ధి పూర్ణుడనగు, మమ=నాకు, దుఃఖం=దుఃఖము, కథంభవేత్=ఎట్లగును.

తా. అహంకారశూన్యుడనై యానంద పూర్ణుడనైయున్నందున ప్రాణస్వాభావిక ధర్మములు, మనోధర్మములు, నాకంటవు కావున దుఃఖమెట్లు నాకుగలుగును, నావారుకారను కొనినవారికి కష్టమువచ్చినను నేను నిశ్చింతగా నెట్లుందునో యట్లే దేహేంద్రియములపై నభిమానములేని నాకు దాని సంబంధమైన దుఃఖముండదు.

"నమేబంధోనమేముక్తిః నమేశాస్త్రం నమేగురుః" ౧౧
"మాయామాత్ర వికాసత్వాన్మాయాతీతోహమవ్యయః౧౨

(బు-౪౨ ఆత్మబోధ.)

టీక. అహం = నేను, మాయాతీతః=మాయ నతిక్రమించినవాడను, అవ్యయః=నాశములేనివాడను మే=నాకు. బంధః = బం

ధము, న=లేదు, మే=నాకు, ముక్తిః = ముక్తి, న=లేదు, మే=నాకు శాస్త్రం=శాస్త్రము, న=లేదు- మాయామాత్రవికాసత్వాత్ =(గురు శాస్త్రబంధమోక్ష జగదాదిక మంతయు) మాయావిజృంభణమగుట వలన, మే=నాకు, నగురుః=గురువు లేదు.

తా. సర్వమును మాయచే గల్పించబడినది, మాయావిజృంభణమే- నేను మాయాతీతుడను, నాశము లేనివాడనుగావున నాకు బంధమోక్షములు లేవు, శాస్త్రము లేదు, గురువులేదు, నేననగా బ్రహ్మమని తెలియవలెను.

"కర్తృత్వమపిమేనష్టం కర్తవ్యంవాపినక్వచిత్ " ౧౩
" ఆత్మానమంజసావేద్మిక్వాప్యజ్ఞానంపలాయితం " ౧౪
(ఋ-౪౨ ఆత్మబోధ)

టీ. మే=నాకు, కర్తృత్వమపి=చేయుటయు (అహంకారము) నష్టం=నాశమైనది, కర్తవ్యంవాపి=చేయతగిన పనియు, క్వచిత్ =ఒకప్పుడైనను, న=లేదు, ఆత్మానం = ఆత్మను, అంజసా = శీఘ్రముగ, వేద్మి= తెలుసుకొనుచున్నాను, అజ్ఞానం=అజ్ఞానము, క్వాపి=ఎక్కడికో, పలాయితం=తొలగిపోయినది.

తా. సూర్యోదయము గలుగగా చీకటి యెక్కడికో పోయినట్లు ఆత్మజ్ఞానము గలుగగా నజ్ఞానమెక్కడికో పోయినది. నిర్వికల్ప బ్రహ్మస్వరూపుడనగు నాకు కర్తృత్వము లేదు. కర్తవ్యమును లేదు.

" బ్రాహ్మణ్యంకులగోత్రేచ నామ సౌందర్యజాతయః " ౧౫
" స్థూలదేహగతాఏతే స్థూలాద్భిన్నస్యమేనహి " ౧౬
(ఋ-౪౨ ఆత్మబోధ)

టీ. బ్రాహ్మణ్యం=బ్రాహ్మణత్వము; కులగోత్రేచ=కులగోత్రములును; నామసౌందర్యజాతయః=పేరు సౌందర్యముజాతియు; స్థూలదేహగతాః=స్థూలదేహమును పొందినవి - ఏతే=ఈ సౌందర్యాదులు;

స్థూలాత్=స్థూలదేహముకన్న; భిన్నస్య=వేరైన ఆత్మస్వరూపుడనైన: మే=నాకు; నహి=నిశ్చయముగా లేవు.

తా. స్పష్టము.

" క్షుత్పిపాసాంధ్యబాధిర్య కామక్రోధాదయోఽఖిలాః " ౧౭

" లింగదేహగతా ఏతే హ్యలింగస్యనవిద్యతే " ౧౮

(ఋ-౪౨ ఆత్మబోధ)

టీ. క్షుత్పిపాసాంధ్యబాధిర్య కామక్రోధాదయః; క్షుత్=ఆకలియును; పిపాసా=దప్పికయును; ఆంధ్య=గుడ్డితనమును, బాధిర్య=చెవుడును, కామ=కోరికయును; క్రోధః=క్రోధమును; ఆదయః=ఈమొదలైనవి;లింగదేహగతాః = లింగదేహమును పొందినవి - అలింగస్య=(ఆత్మస్వరూపుడనైన) లింగదేహమునుగాని నాకు; ఏతే=ఈ కామక్రోధాదులు; నవిద్యతేహి=నిశ్చయముగా లేవు.

తా. స్పష్టము.

" జడత్వప్రియమోదత్వధర్మాః కారణ దేహగాః " ౧౯

" నసంతి మమనిత్యస్య నిర్వికారస్వరూపిణః " ౨౦

(ఋ-౪౨ ఆత్మబోధ.)

టీ. జడత్వప్రియమోదత్వధర్మాః - జడత్వ= జాడ్యమును, ప్రియ=ప్రియమును, మోదత్వ=మోదమును, అను, ధర్మాః=ధర్మములు, కారణదేహగాః=కారణశరీరమును బొందినవి, నిత్యస్య=నిత్యుడనైనట్టియు, నిర్వికారస్వరూపిణః=వికారములేని స్వరూపము గలిగినట్టియు, మమ=నాకు, నసంతి=లేవు.

తా. ఆత్మస్వరూపుడనగు నేను కారణ శరీరముకన్న భిన్నుడనుగాన కారణశరీర ధర్మములైన జాడ్యప్రియమోద ప్రమోదములునాకు లేవు. ఆత్మ మూడుశరీరములుకానిది. మూడుశరీరములకు సాక్షియైనది. కావున శరీరత్రయధర్మములు ఆత్మకులేవు. ప్రియమనగా

తనకిష్టమైన వస్తువును జూడగాగలుగు సుఖము. ఆయిష్టమైన వస్తువు తనకు లభింపగా గలుగుసుఖము మోదమన బడును. ఆయిష్టమైన వస్తువు ననుభవింపగా గలుగు సుఖము ప్రమోదము జాడ్యమనగా తెలియకుండుట, ఇవిఆనందమయకోశముగల కారణశరీరలక్షణములు ఆత్మ కేవల సత్యజ్ఞానానంద స్వరూపమైనది. నేననగా నాయాత్మయని తెలియవలెను.

"చిద్రూపత్వాన్నమేజాడ్యం సత్యత్వాన్నానృతంమమ" ౨౧

"ఆనందత్వాన్నమేదుఃఖ మజ్ఞానాద్భాతిసత్యవత్" ౨౨

(ఋ-ర౨ ఆత్మబోధ.)

టీ. చిద్రూపత్వాత్=జ్ఞానస్వరూపము కలిగి యుండుటవలన, మే=నాకు, జాడ్యం=జడత్వము, న=లేదు, సత్యత్వాత్=సద్రూపము కలిగియుండుటవలన,మమ=నాకు, అనృతం = అసత్యము, న = లేదు, ఆనందత్వాత్ = ఆనందరూపము కలిగియుండుటవలన, మే = నాకు, దుఃఖం=దుఃఖము, న=లేదు, అజ్ఞానాత్=అజ్ఞానమువలన, సత్యవత్ = ఉన్నట్లు, భాతి=ఆదుఃఖాదికము తోచుచున్నది.

తా. నేను సత్యజ్ఞానానంద స్వరూపుడను, అట్టి నాయందు జడదుఃఖానృతత్వము లున్నట్టు లజ్ఞానమున తోచుచున్నది గాని వాస్తవమున లేదు. సత్యజ్ఞానానంద స్వరూపమైన బ్రహ్మమందు ననృతదుఃఖ స్వరూపమైన జగత్తు మాయచే కల్పించబడినది గాని నిజముగాదు.

"నాహందేహోహ్య జన్మమృత్యూకుతోమేనాహంప్రాణః క్షుత్పిపాసేకుతోమే"

"నాహంచేతశ్శోకమోహౌ కుతోమేనాహంకర్తాబంధమోక్షౌకుతోమే"

(కృ-య-33 సర్వసార.)

ఆత్మజ్ఞానముకు తక్కువయనియు, ఆత్మనెరుగక వానిని చేసినను ప్రయోజనము లేదనియు తాత్పర్యము.

" జ్ఞాతంజ్ఞాతవ్యమధునా దృష్టంద్రష్టవ్య మద్భుతం " 3౧
" విశ్రాంతోఽస్మిచిరంశ్రాంతః చిన్మాత్రాన్నాస్తికించన " 3౨
(సామ-౬౧ మహో- అ-౫.)

టీ. అధునా=ఇప్పుడు, జ్ఞాతవ్యం=తెలియతగినది, జ్ఞాతం=తెలియబడెను, ద్రష్టవ్యం=చూడతగినది, దృష్టం=చూడబడెను, అద్భుతం=ఆశ్చర్యము, చిరంశ్రాంతః = చిరకాలమునుండి శ్రమపడుచున్న నేను, విశ్రాంతోఽస్మి=బడలికతీరినవాడనగుచున్నాను. చిన్మాత్రాత్=చిన్మాత్రమైన బ్రహ్మముకన్న, కించన=ఏమియును, నాస్తి=లేదు.

తా. తెలియతగిన బ్రహ్మ తెలియబడెను. దానిని గూర్చి మిక్కిలి నేను శ్రమపడితిని. నాశ్రమము గట్టెక్కెను. ఇక విశ్రమించెదను. చిన్మాత్రమైన బ్రహ్మముకన్న నితరమేమియును లేదు. నేనే యాబ్రహ్మమును. ఆహా యేమి యాశ్చర్యమైన సంగతి. ఇవి బ్రహ్మానుభవప్రాప్తిచే గలిగిన యుత్సాహవాక్యములు.

" నభూతంనభవిష్యచ్చచింతయామి కదాచన. " 33
" నస్తౌమినచనిందామిహ్యాత్మనోన్యంనహిక్వచిత్. " 3౪
(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ౫.)

టీ. భూతం=జరిగినదానిని, భవిష్యచ్చ=కాబోవుదానిని, నచింతయామి=చింతించువాడనుగాను, గాన, కదాచన=ఒక్కప్పుడైనను, నస్తౌమి=స్తుతించువాడనుగాను, నచనిందామి=నిందింపను, హి = నిశ్చయము, ఆత్మనః=ఆత్మకన్న, అన్యం=ఇతరమైనది, క్వచిత్=ఎక్కడను గాని, నహి=లేదు.

తా. స్పష్టము.

" అలేపకోహమజరోవిరాగశ్శాంతవాసనః "                    3౩

(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ౫)

టీ. అహం=ఆత్మస్వరూపుడనగు నేను, అలేపకః=నిరంజనుడను, అజరః=ముదిమిలేనివాడను, విరాగః=రాగములేనివాడను, శాంతవాసనః=శాంతమునొందిన వాసనలు గలవాడను.

తా. స్పష్టము.

" స్వపూర్ణాత్మాతిరేకేణజగజ్జీవేశ్వరాదయః "                    3౬

" నసంతినాస్తిమాయాచతేభ్యశ్చాహంవిలక్షణః "                    3౭

(కృ-య-౯౮ వరాహ-అ౨)

టీ. స్వ=తనరూపముచే, పూర్ణ=అంతటనిండియున్న, ఆత్మాతిరేకేణ=ఆత్మకంటె భిన్నముగా, జగజ్జీవేశ్వరాదయః=జగత్తు జీవుడు ఈశ్వరుడు మొదలగునవి, నసంతి=లేవు, మాయాచ=మాయయును, నాస్తి=లేదు, తేభ్యః=ఆజగజ్జీవేశ్వరాదుల కంటె, అహం=నేను, విలక్షణః=వేరైనవాడను.

తా. పరిపూర్ణమైన పరమాత్మకంటె నన్యములేదు. గావున మాయా జగజ్జీవేశ్వరులులేరు. వానికి నేను విలక్షణమైన పరమాత్మను. జగజ్జీవేశ్వరులుండు టప్రతీతిమాత్రమేగాని వాస్తవముగా నేరదు.

" కింకరోమికక్వగచ్ఛామికిం గృహ్ణామిత్యజామికిం "                    3౮

" యన్మయాపూరితం విశ్వం మహాకల్పాంబునాయథా." 3౯

(కృ-య-౯౮ వరాహ.)

టీ. మహాకల్పాంబు నాయథా=మహాకల్పాంతమున సముద్రముచే పూరితమైనట్లు, మయా=పరిపూర్ణాత్మ స్వరూపుడనగు నాచే,

యద్విశ్వం=ఏవిశ్వము, పూరితం=పూరితమైయున్నదో (ఆ హేతువుచే) కింకరోమి=ఏమిచేయుచున్నాను. క్వగచ్ఛామి=ఎక్కడికివెళ్లుచున్నాను కింగృహ్ణామి=ఏమిగ్రహించుచున్నాను, త్యజామికిం=ఏమి విడుచుచు న్నాను.

తా. పరిపూర్ణస్వరూపుడనగు నేను లేనిచోటులేదు. గావున నాకు చేయుటకు కార్యములేదు. పోవుటకు స్థలములేదు. గ్రహించుట కు వస్తువును అవయవములును లేవు. విడుచుటకేమియును లేదు. అని తాత్పర్యము.

ఇతిసార్థాంతిక మనన వాక్యాన్యేకో నచత్వారింశత్.

ఇట్లు సార్థాంతికమనన వాక్యములు ముప్పదితొమ్మిది.

ఇతి సప్తమం ప్రకరణం సమాప్తమ్.

ఇట్లు యేడవ ప్రకరణము సమాప్తము.

---

శ్రీ

సద్గురవేనమః.

# ౨ జీవన్ముక్తి వాక్య ప్రకరణము

" సతత్ర పర్యేతి జక్షన్ క్రీడన్ రమమాణః స్త్రీభిర్వాజ్ఞానిభిర్వా వయస్యైర్వాఽవయస్యైర్వానోపజనం స్మరన్నిదంశరీరం " ౧

(సామ ; ౯ ఛాందోగ్య, ప్ర ౮, ఖం ౧౨)

టీ. తత్ర=అక్కడ, (అపరోక్షజ్ఞానదశయందు) సః=ఆజీవన్ముక్తుడు, స్త్రీభిర్వా=స్త్రీలతోనైనను, జ్ఞానిభిర్వా=జ్ఞానులతోనైనను, వయస్యైర్వా=ఈడైనవారితోనైనను, అవయస్యైర్వా=ఈడుకానివారలతోనైనను రమమాణః=సంతోషించుచున్నవాడై, క్రీడన్=విహారించుచున్నను, జక్షన్=భక్షించుచున్నను, ఉపజనం=జనులసమీపమందున్నను, ఇదంశరీరం=ఈశరీరమును, నస్మరన్=స్మరింపక, పర్యేతి=ప్రవర్తించుచున్నాడు.

తా. స్త్రీ పురుషాదులతోగూడి విహారించుచున్నను, భక్షించుచున్నను, వ్యామోహమునుజెందక, దేహాభిమానములేక కర్తృత్వ భోక్తృత్వాద్యభిమానము లేక సుఖదుఃఖముల నొందక జీవన్ముక్తుడు ప్రవర్తించును.

" సవాఏషఏవంపశ్యన్నేవం మన్వానఏవం విజానన్నాత్మరతి రాత్మక్రీడఆత్మమిధున ఆత్మానందస్స్వరాడ్భవతి " ౨

(సామ ; ౯ ఛాందోగ్య, ప్ర ౭, ఖం ౨౫)

టీ. సవఏషః=ఇట్లున్నయాజీవన్ముక్తుడు, ఏవంపశ్యన్=సర్వము నాత్మగాచూచుచు, మన్వానః=(జగజ్జీవేశ్వరాదిభేదము ప్రతీతిమాత్ర

మేగాని వాస్తవముగాదని) తలచుచున్నవాడై, ఏవంవిజానన్=ప్రపంచము మిథ్యయని విచారించుచు, ఆత్మరతిః=ఆత్మయందాసక్తిగలవాడౌచును, ఆత్మక్రీడః=ఆత్మయందు క్రీడగలవాడును, ఆత్మమిథునః=ఆత్మయందు ద్వంద్వముగలవాడును, ఆత్మానందః=ఆత్మానందము గలవాడునునై, స్వరాడ్భవతి=స్వయంప్రకాశమానుడగును.

తా. జీవన్ముక్తుఁడు సమస్తము నాత్మగజూచుచు జగజ్జీవేశ్వరాదిభేదము ప్రతీతిమాత్రమని తలచుచు జగత్తు మిథ్యయని యెరుగుచు నాత్మయందే సమస్తక్రియలు గలవాఁడై స్వయంప్రకాశమానుడగును.

" తేదేవాఃపుత్రైషణాయాశ్చవిత్తైషణాయాశ్చలోకైషణాయాశ్చససాధనేభ్యో వ్యుత్థాయనిరగారాఃనిష్పరిగ్రహా అశిఖాఅయజ్ఞోపవీతా అంధాఃబధిరాఃముగ్ధాక్లీబామూకాఉన్మత్తా ఇవపరివర్తమానాఃశాన్తాదాన్తాఉపరతాస్తితిక్షవః సమాహితా ఆత్మరతయశ్చాత్మక్రీడా ఆత్మమిథునా ఆత్మానందాః ప్రణవమేవ పరంబ్రహ్మప్రకాశం శూన్యంవిజానంతః తత్రైవపరిసమాప్తాః"

(అథర్వ—౨౭ నృసింహోత్తరతాపినీ—ఖం ౬.)

టీ. తేదేవాః=ఆప్రజాపతి శిష్యులయిన దేవతలు, పుత్రైషణాయాః=పుత్రైషణనుండి, విత్తైషణాయాః = ధనేషణనుండి, లోకైషణాయాః = లోకేషణనుండి, ససాధనేభ్యః = ఆ పుత్రధనలోకములకు సాధనములైన భార్యాకృషి వాణిజ్య వర్ణాశ్రమాదులనుండి, వ్యుత్థాయ=లేచి (ఆవృత్తులను విడిచి) నిరగారాః=ఇండ్లులేనివారును, నిష్పరిగ్రహాః=ప్రతిగ్రహము లేనివారును, అశిఖాః=శిఖలు లేనివారును, అయజ్ఞోపవీతాః=యజ్ఞోపవీతము లేనివారును, అంధాఇవ = గ్రుడ్డివారివలె, బధిరాఇవ=చెవిటివారివలె, ముగ్ధాఇవ=తెలియనివారివలె, క్లీబాఇవ=

నపుంసకులవలె, మూకాఇవ=మూగవారివలె, పరివర్తమానాః=తిరుగు చున్నవారై, శాంతాః=అంతరింద్రియ నిగ్రహము గలవారై, దాంతాః=బాహ్యేంద్రియ నిగ్రహము గలవారై, ఉపరతాః=కర్మసన్యాస మొనర్చినవారై, తితిక్షవః=శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వక్లేశములను ప్రతిక్రియలేక సహించువారై, సమాహితాః=స్వస్థచిత్తముగలవారై, ఆత్మరతయః=ఆత్మయందాసక్తిగలవారై, ఆత్మక్రీడాః=ఆత్మయందు క్రీడగలవారై, ఆత్మమిథునాః = ఆత్మయే మిథునముగాగలవారై, ఆత్మానందాః=ఆత్మానందము గలవారునై, ప్రణవమేవ=ఓంకారమునే, పరం=ఉత్కృష్టమైనదిగను, బ్రహ్మప్రకాశం=బ్రహ్మప్రకాశముగలదిగను, శూన్యం=నిర్వికారమైనదిగను, విజానంతః=ఎరిగినవారై, తత్రైవ= ఆ ఓంకారరూప పరబ్రహ్మమందే, పరిసమాప్తాః=సిద్ధిబొందినవారైరి.

తా. ప్రజాపతి శిష్యులవలె ముముక్షువులట్లు మొదట వర్ణాశ్రమాచారవిధుల ననుసరించి పిదప వైరాగ్యమునుబూని గృహాదుల నువిడిచి వేదాంతవిచారమునుచేసి శమదమోపరతితితిక్షలుగలవారై బాలోన్మత్త పిశాచములవలె తిరుగుచు బ్రహ్మస్వరూపమైన యోంకారము నెరిగి దానిని బొందవలయును

"కుచేలోఽసహాయ ఏకాకీసమాధిస్థ ఆత్మకామఆప్తకామోనిష్కామో జీర్ణకామోహస్తిని సింహేదంశేమశకేనకులేసర్పరాక్షసగంధర్వేమృత్యోర్‌రూపాణివిదిత్వాన బిభేతికుతశ్చనేతి."

(శు-య-౩౦ సుబాల-అ. ౩.)

టీ. కుచేలః=కుత్సితవస్త్రము గలవాడును (బట్టమాసినది దీనిని శుభ్రపర్చవలయు, శుభ్రవస్త్రముగావలెనని కోరికలేనివాఁడు), అసహాయః=దండము మొదలగువాని తోడులేనివాడును, ఏకాకీ= ఒక్కడును (సంగములేనివాడును), సమాధిస్థః= జీవబ్రహ్మైక్యమను

యోగమున నుండువాడును, ఆత్మకామః=ఆత్మయందు కోరికగల వాడును, ఆప్తకామః=తీరినకోరిక గలవాడును, నిష్కామః=కోరిక లేని వాడును,జీర్ణకామః=నశించిన కోరికగలవాడునునై, హస్తిని=ఏనుగ నందును, సింహే=సింహమందును, దంశే=అడవియీగ యందును, మశకే=దోమయందును, నకులే=ముంగియందును, సర్పరాక్షస గంధ ర్వే=సర్పరాక్షస పిశాచకులమందును, మృత్యోః=మృత్యువుయొక్క, రూపాణి=రూపములను, విదిత్వా=తెలిసి, కుతశ్చన-దేనివలనను, నబి భేతి=భయపడడు.

తా. జీవన్ముక్తుడు భోగేచ్ఛలేనివాడై శరీరమున నభిమాన ములేక ఇక్కడ నసించిన వీని చంపుదురు. ఇక్కడ వసించినదుష్ట జంతువు వలన మరణము గలుగునను భయములేనివాడై సమస్తము బ్రహ్మమని నిశ్చయించి నిత్యసంతోషియై ప్రవర్తించును. అట్లుండుట యే జీవన్ముక్తి యనబడును.

> " సర్వధర్మాన్పరిత్యజ్య నిర్మమోనిరహంకారోభూత్వా బ్రహ్మ నిష్ఠంశరణముపగమ్యతత్త్వమసి సర్వంఖల్విదం బ్రహ్మనేహనా నాస్తికించననేతి మహావాక్యార్థ మనుభవజ్ఞానాత్ బ్రహ్మైవాహ మస్మీతినిశ్చిత్యనిర్వికల్ప సమాధి నాయస్స్వతంత్రశ్చరతిస సన్న్యాసీసముక్తః సపూజ్యః సయోగీసపరమహంసఃసావధూతః సబ్రాహ్మణఇతి." ౫

(శు-య-౪౦ నిరాలంబ.)

టీ. సర్వధర్మాన్=సమస్తధర్మములను, పరిత్యజ్య=విడిచి (విధి నిషేధములందభిమానములేనివాడై),నిర్మమః=మమకారములేనివాడై, నిరహంకారః=అహంకారములేనివాడును, భూత్వా=అయి, బ్రహ్మ నిష్ఠం=బ్రహ్మనిష్ఠుడగు సద్గురుని, శరణం = శరణమును, ఉపగమ్య= పొంది, తత్త్వమసి, సర్వంఖల్విదంబ్రహ్మ, నేహనానాస్తికించననేతి,

మహావాక్యార్థానుభవాత్ = సద్గురూపదిష్టతత్త్వమస్యాది మహావాక్యార్థానుభవజ్ఞానమున, బ్రహ్మైవాహం = బ్రహ్మమే నేను, అస్మీతి = అగుచున్నానని, నిర్వికల్పసమాధినా = నిర్వికల్పసమాధిచే, యః = ఎవడు, స్వతంత్రః = పరాధీనుడుగాక స్వతంత్రుడై, చరతి = తిరుగుచున్నాడో, సః = వాడే, సన్యాసీ = సన్యాసి, సముక్తః = వాడేముక్తుడు, సపూజ్యః = వాడే పూజ్యుడు, సయోగీ = వాడేయోగి, సపరమహంసః = వాడే పరమహంస సన్యాసి, సోఽవధూతః = వాడేయవధూత, సబ్రాహ్మణః = వాడేబ్రాహ్మణుడు, ఇతి = అని.

తా. లోకవ్యవహార యోగ్యములగు ధర్మాధర్మములయందభిమానములేనివాడై యహంకార మమకారములులేక సద్గురువు నాశ్రయించి యతనియుపదేశమున తత్త్వమస్యాది వాక్యార్థానుభవజ్ఞానమున తానే బ్రహ్మమని నిశ్చయించి స్వతంత్రుడై ఎవడుతిరుగునో వాడే సన్యాసి వాడే యోగి వాడే యవధూత వాడే పూజ్యుడు వాడే బ్రాహ్మణుడు వాడే ముక్తుడు వాడే పరమహంస.

" జీవః పంచవింశతికః స్వకల్పితచతుర్వింశతి తత్త్వంపరిత్యజ్య షడ్వింశకః పరమాత్మాహమితినిశ్చయాజ్జీవన్ముక్తో భవతి " ౬

(సామ-౮౮ మండల బ్రాహ్మ-బ్రా ౧.)

టీ. జీవః = జీవుడు, పంచవింశతికః = ఇరువదియైదవవాడు, స్వకల్పిత చతుర్వింశతితత్త్వం, స్వకల్పిత = పరమాత్మచే కల్పింపబడిన, చతుర్వింశతితత్త్వం = ఇరువదినాలుగు తత్త్వములతోగూడిన దేహమును, పరిత్యజ్య = విడిచి, షడ్వింశకః = ఇరువదియారవవాడగు, పరమాత్మా = పరమాత్మయే, అహమితి = నేనను, నిశ్చయాత్ = నిశ్చయజ్ఞానమున, జీవన్ముక్తః = జీవన్ముక్తుడు, భవేత్ = అగుచున్నాడు.

తా. చిదాభాసుడైన జీవుడు ఇరువదియైదవ వాడనియు పరమాత్మచే నిరువది నాలుగు తత్త్వములుగల దేహముసృజించబడెనని

యుతానే పరమాత్మయనియు నిశ్చయించువాడు జీవన్ముక్తుడు, పంచ భూతదశేంద్రియ పంచప్రాణాంతః కరణచతుష్టయములు చతుర్వింశ తితత్త్వములు

"తురీయమక్షర మితిజ్ఞాత్వాజాగరితే సుషుప్త్యవస్థాపన్న ఇవయచ్ఛ్రుతం యద్దృష్టం తత్సర్వమవిజ్ఞాతమి వయోవ సేత్ తస్యస్వప్నావస్థాయా మపితాదృగవస్థా భవతిసజీవన్ముక్తో భవతి" ౮

(అధర్వ-౭౨ నారదపరివ్రాజక.)

టీ. తురీయం=నాలగనవానిని (జాగ్రత్స్వప్న సుషుప్తులుగాక వాని విలక్షణమైన యాత్మను) అక్షరమితి= (మూడవస్థలయందుమ రెప్పుడును) నశించనిదానినిగ, జ్ఞాత్వా=ఎరిగి, జాగరితే=జాగ్రదవస్థ యందు, సుషుప్త్యవస్థాపన్నఇవ=నిద్రావస్థను పొందినవానివలె, య చ్ఛ్రుతం=ఏదేదివినబడెనో, యద్దృష్టం=ఏదేదికనబడెనో, తత్స ర్వం=అదంతయు, అవిజ్ఞాతమివ=తెలియబడనట్లు, యః = ఎవడు, వసేత్=వసించునో, తస్య=వానికి, స్వప్నావస్థాయామపి=కలయందును తాదృగవస్థాభవతి=మీాద చెప్పినస్థితియే గలుగుచున్నదో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడు, భవతి=అగుచున్నాడు.

తా. జాగ్రదవస్థయందే నిద్రావస్థనుబొందినవానివలె విషయ ములను తెలియక యాత్మయందేదృష్టిగలవాడై స్వప్నమందునట్లేయెవ డుండునోవాడు జీవన్ముక్తుడు.

"సకృద్విభాతః సదానందైకగోచరోబ్రహ్మవిత్తద్వాన్ చక్షు రాదిబాహ్య ప్రపంచోపరతస్సర్వం జగదాత్మత్వే నపశ్యన్నా త్మేతి విభావయన్ కృతకృత్యోభవతి." ౮

(సామ।౭౮ మండలబ్రాహ్మణ-బ్రా-౨-౩)

టీ. సకృద్విభాతః=(సదస్ఫూర్తి, అసస్ఫూర్తి, సదసదస్ఫూర్తి యను

(త్రివృత్తులులేక) యొక్కమారుగ ప్రకాశించువాడును, సదానందైకగోచరః, సదానంద=నిరంతరానందముచే,ఏక=ముఖ్యముగ, గోచరః= కనబడువాడును, బ్రహ్మవిత్ = బ్రహ్మముగలదని యెరిగినవాడును, తద్వాన్=ఆబ్రహ్మముకలవాడును (తానేయనియెరిగినవాడును) చక్షురాదిబాహ్యప్రపంచోపరతః= నేత్రేంద్రియాదిబాహ్యప్రపంచమునుండి విముక్తుడై (నేత్రేంద్రియాదికముబాహ్యమునకు ప్రసరించుగాన నది బాహ్యప్రపంచమనబడును. మనస్సంతః ప్రపంచమనబడును.) సర్వం జగత్=సమస్తజగత్తును, ఆత్మత్వేన=ఆత్మరూపముగ,పశ్యన్=చూచుచు, ఆత్మేతి=సమస్తము ఆత్మయని, భావయన్=భావించుచు, కృతకృత్యోభవతి = సిద్ధించిన కృత్యముగలవాడగును-జీవన్ముక్తుడగునని భావము.

తా. స్పష్టము.

"నిర్ద్వంద్వఃసదాచంచలగాత్రః పరమశాంతింస్వీకృత్య నిత్యశుద్ధఃపరమాత్మాహమేవేత్యఖండానందపూర్ణః కృతార్థఃపరిపూర్ణః పరమాకాశమగ్నమనాః ప్రాప్తోన్మన్యవస్థః సన్న్యస్తసర్వేంద్రియవర్గోనేకజన్మార్జిత పుణ్యపుంజపక్వ కైవల్యఫలోఖండానందనిరస్త సర్వక్లేశకశ్మలో బ్రహ్మాహమస్మీతికృతకృత్యోభవతి"

(సామ-౮౮ మండలబ్రాహ్మణ, బ్రా 3-ఇదికొంచంహెచ్చు తగ్గుగా సరిపోతుంది.)

టీ. నిర్ద్వంద్వః=శీతోష్ణాదిద్వంద్వములులేనివాడును, సదా=ఎల్లప్పుడును,అచంచలగాత్రః=కదలనిశరీరము గలవాడై,పరమశాంతిం= ఉత్కృష్టమైనశాంతిని, స్వీకృత్య=పూని, నిత్యశుద్ధః=కాలత్రయమందును శుద్ధుడైన, పరమాత్మా=పరమాత్మ, అహమేవేతి=నేనేయని,

అఖండానందపూర్ణః=అఖండానందముచే నిండియున్నవాడును, కృతార్థః=చేయతగిన సమస్త కార్యములు చేశినవాడును, పరిపూర్ణః=అంతటనిండి యుండువాడును, పరమాకాశ మగ్నమనాః=చిదాకాశమున నగిలిన మనస్సుగలవాడును, ప్రాప్తోన్మన్యవస్థః ప్రాప్త=పొందబడిన ఉన్మన్యవస్థః=ఉన్మన్యవస్థగలవాడు,సన్న్యస్తసర్వేంద్రియవర్గః,సన్న్యస్త=విడువబడిన, సర్వేంద్రియవర్గః =సమస్తేంద్రియ సమూహముగలవాడును, అనేకజన్మార్జిత పుణ్యపుంజపక్వ కైవల్యఫలః, అనేకజన్మార్జిత=బహుజన్మములచే నార్జింపబడిన, పుణ్యపుంజ = పుణ్యసమూహముచే, పక్వ-పండిన, కైవల్యఫలః=మోక్షమను ఫలముగలవాడును, అఖండానంద నిరస్తసర్వక్లేశకశ్మలః, అఖండానంద=బ్రహ్మానందముచే, నిరస్త=కొట్టబడిన(జయించబడిన),సర్వక్లేశకశ్మలః=సమస్తదుఃఖములను మాలిన్యముగలవాడునై, బ్రహ్మాహమస్మీతి = బ్రహ్మమే నేనని, కృతకృత్యో భవతి=కృతార్థుడగుచున్నాడు. సంకల్పములేని యవస్థ యున్మన్యవస్థయనబడును.

తా. స్పష్టము.

"బ్రహ్మైవాహమస్మీత్యనవరతంబ్రహ్మప్రణవానుసంధానేన కృతకృత్యో భవతి సపరమహంసపరివ్రాట్." ౧౦

(అధర్వ-౬౭ పరమహంస పరివ్రాజక.)

టీ. బ్రహ్మైవాహమస్మీతి = బ్రహ్మమే నేనగుచున్నానని, అనవరతం=ఎల్లప్పుడు, బ్రహ్మప్రణవానుసంధానేన, బ్రహ్మప్రణవ=బ్రహ్మమైన ఓంకారముయొక్క, అనుసంధానేన=యోజించుటచే (ధ్యానముచే) యః=ఎవడు, కృతకృత్యః=చేయబడిన కార్యములుగలవాడు, భవతి=అగుచున్నాడో, సః=వాడు, పరమహంసపరివ్రాట్=పరమహంసుడను సన్యాసి.

తా. స్పష్టము.

" భావాభావకళావినిర్ముక్త స్సర్వసంశయధ్వంసకః పూర్ణాహంభావః కృతకృత్యోభవతి. " ౧౧

టీ. భావాభావకళావినిర్ముక్తః = భావాభావ కళలులేని వాడును, సర్వసంశయధ్వంసకః=సమస్తసంశయములను నాశనముచేయువాడును, పూర్ణాహంభావః=పూర్ణమైనబ్రహ్మమే నేనను భావము గలవాడును, కృతకృత్యోభవతి=(కైవల్యము నొందుటచే) కృతార్థుడగుచున్నాడు. జ్ఞానేంద్రియగ్రాహ్యములగు విషయములు భావకళలు అభావకళలు అనగా నంతఃకరణవృత్తులు.

తా. స్పష్టము.

" ప్రాణోహ్యేషయస్సర్వభూతైర్విభాతి విజానన్ విద్వాన్భవతేనాతివాదీ. " ౧౨

(అధర్వ-౫ ముండక-ముం-3 ఖం-౨.)

టీ. ఏషప్రాణః=ఈసూత్రాత్మ (హిరణ్యగర్భుడు) సర్వభూతైః=సమస్తభూతరూపముచే, (సమష్టిరూపముచే) విభాతిహి=ప్రకాశించుచున్నాడు. (అని) విద్వాన్=విద్వాంసుడు, విజానన్=జ్ఞానముచే నెరుగుచు, నాతివాదీ=మౌనముగలవాడు, భవతే=అగుచున్నాడు.

తా. తనయందున్న సూత్రాత్మయే సర్వభూతములందున్నాడని సమస్తమును సమబుద్ధిచే చూచుచుమౌనమును బూనియుండును. (మితముగ మాటలాడును.)

" ఆత్మక్రీడఆత్మరతిః క్రియావానేషబ్రహ్మవిదాంవరిష్ఠః " ౧3

(అధర్వ-౫ ముండక. ముం-3 ఖం-౨.)

టీ. ఆత్మక్రీడః = ఆత్మయందే క్రీడగలవాడును, ఆత్మరతిః=

ఆత్మయందే ఆసక్తిగలవాడును, క్రియావాన్ = క్రియావంతుడగు, ఏషః=ఈపురుషుడు, బ్రహ్మవిదాం=బ్రహ్మవేత్తలలో, వరిష్ఠః=శ్రేష్ఠుడు.

తా. క్రియావంతుడైనను (సంసారమునందు మెలగుచున్నను) ఆత్మయందే ఆశక్తిగలవాడు బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడు.

" నిమిషార్ధంనతిష్ఠంతి వృత్తింబ్రహ్మమయీంవినా " ౧౪
" యథాతిష్ఠంతి బ్రహ్మాద్యాస్సనకాద్యాశ్శుకాదయః " ౧౫
(కృ-య-౩౭ తేజోబిందు. ౫౧.)

టీ. బ్రహ్మాద్యాః=బ్రహ్మాదులును, సనకాద్యాః=సనకాదులును, శుకాదయః=శుకాదులును, యథా=ఏప్రకారము, నతిష్ఠంతి=బ్రహ్మవృత్తిని విడిచి నిమిషార్ధమైననుండరో, యట్లే, బ్రహ్మమయీం=బ్రహ్మమయమైన, వృత్తిం=వృత్తిని, వినా=విడిచి, నిమిషార్ధం=నిమిషార్ధమైనను, నతిష్ఠంతి=జీవన్ముక్తులుండరు.

తా. బ్రహ్మాదులెట్లు బ్రహ్మవృత్తిని విడువకుందురో యట్లు జీవన్ముక్తులు బ్రహ్మవృత్తిని విడిచియుండరు.

"అధ్యాత్మరతిరాసీనో నిరపేక్షో నిరాశిషః " ౧౬
" సర్వద్వంద్వైర్వినిర్ముక్తో బ్రహ్మణ్యేవావతిష్ఠతే. " ౧౭
(అధర్వ-౪౩ నారదపరివ్రాజక.)

టీ. అధ్యాత్మరతిః= ఇతరసంకల్పములులేక ఆత్మయందాసక్తిగలవాడును, ఆసీనః=సుఖాసనముగలవాడును, నిరపేక్షః=అన్యాపేక్షలేనివాడును, నిరాశిషః=ఆశీర్వచనములేనివాడును, సర్వద్వంద్వైః=సమస్తద్వంద్వములచేతను, వినిర్ముక్తః=విడువబడినవాడున్నునై, బ్రహ్మణ్యేవ=బ్రహ్మమందే, అవతిష్ఠతే=ఉంచున్నాడు.

తా. స్పష్టము.

"కపాలంవృక్షమూలాని కుచేలాన్యసహాయతా" ౧౮
"సమతాచైవసర్వస్మిన్నే తన్ముక్తస్యలక్షణం" ౧౯
(అథర్వ-౮౩ నారదపరివ్రాజక.)

టి. కపాలం=పుర్రెయును, వృక్షమూలాని=వృక్షమూలప్రదేశములును, కుచేలాని=మలినవస్త్రములును, అసహాయతా = ఏకాకిత్వమును, సర్వస్మిన్=సమస్తభూతసముదాయమందు, సమతాచైవ=సమత్వమును, ఏతత్=ఇట్టివ్యాపారమును, ముక్తస్య = ముక్తునియొక్క, లక్షణం=లక్షణము.

తా. భోగాసక్తిలేక సమస్తభూతములయందు సమబుద్ధిగలిగియుండుటయే ముక్తుని లక్షణము.

"స్వప్నేఽపియోహియుక్తస్స్యాజ్జాగ్రతీవవిశేషతః" ౨౦
"ఈదృక్చేష్టస్స్మృతశ్శ్రేష్ఠోవరిష్ఠోబ్రహ్మవాదినాం" ౨౧
(అథర్వ-౮౩ నారదపరివ్రాజక.)

టీ. జాగ్రతీవ=జాగ్రదవస్థయందువలెనె, విశేషతః=విశేషజ్ఞానముచే, స్వప్నేపి=స్వప్నమందును, యః=ఎవడు, హి=నిశ్చయముగ, యుక్తస్స్యాత్ = యుక్తుడగునో, ఈదృక్చేష్టః = ఇట్టిక్రియగలవాడు, శ్రేష్ఠః=శ్రేష్ఠుడనియు, బ్రహ్మవాదినాం=బ్రహ్మవాదులలో, వరిష్ఠః=ఉత్తముడనియు, స్మృతః=చెప్పబడును.

జాగ్రదవస్థయందెట్లు యుక్తముగ వ్యవహరించునో యట్లే యెవడు స్వప్నమందును వ్యవహరించునో, వాడే శ్రేష్ఠుడు. బ్రహ్మవాదులలో ఉత్తముడు.

"నిర్మానశ్చానహంకారోనిర్ద్వంద్వశ్ఛిన్నసంశయః" ౨౨
ఆత్మక్రీడఆత్మరతిః ఆత్మవాన్ సమదర్శనః" ౨౩
(అథర్వ-౮౩ నారదపరివ్రాజక-ఉ౫)

టీ. నిర్మానః=మానములేనివాడును, అనహంకారః=అహంకారములేనివాడును, నిర్ద్వంద్వః= ద్వంద్వములు లేనివాడును, ఛిన్నసంశయః=నశించిన సంశయములుగలవాడును, ఆత్మక్రీడః=ఆత్మయందు క్రీడగలవాడును ఆత్మరతిః=ఆత్మయందాసక్తిగలవాడును, ఆత్మవాన్ = ఆత్మవంతుడును, సమదర్శనః=సమబుద్ధిగలవాడునగును.

తా. జీవన్ముక్తుడు మానములేనివాడును. అహంకారములేనివాడును, సంశయములులేనివాడును, ఆత్మస్వరూపుడునై యుండును.

"స్మృత్వాస్పృష్ట్వాచభుక్త్వాచదృష్ట్వాజ్ఞాత్వాశుభాశుభం" ౨౮
"నహృష్యతిగ్లాయతియః సశాంతఇతికథ్యతే" ౨౯

(సామ-౬౧ మహా-౮౨.)

టీ. శుభాశుభం=శుభాశుభరూప కర్మఫలమును, స్మృత్వా=స్మరించియు, స్పృష్ట్వాచ=ముట్టుకొనియు, భుక్త్వాచ=అనుభవించియు, దృష్ట్వా=చూచియు, జ్ఞాత్వా=ఎరిగియు, యః=ఎవడు, నహృష్యతి=సంతోషింపడో, (న) గ్లాయతి=దుఃఖపడడో, సః=వాడు, శాంతఇవ=శాంతుడని, కథ్యతే= చెప్పబడుచున్నాడు.

తా. స్పష్టము.

"అప్రాప్తంహిపరిత్యజ్య సంప్రాప్తేసమతాంగతః" ౩౦
"అదృష్టఖేదాఖేదోయస్ససంతుష్టఇతికథ్యతే." ౩౧

(సామ ౬౧ - మహా - ౮౨)

టీ. అప్రాప్తం=లభించనిదానిని, పరిత్యజ్యహి=విడిచియు, సంప్రాప్తే=లభించినదానియందు, సమతాం=సమత్వమును, గతః=పొందినవాడును, అదృష్టఖేదాఖేదః=కనబడని దుఃఖాదుఃఖములు గలవా

డును. యః=ఎవఁడో, సః=వాఁడు. సంతుష్టఇతి=సంతుష్టుఁడని, కథ్యతే=చెప్పబడుచున్నాఁడు.

తా. లభించనిదానిని గూర్చి చింతింపక ప్రాప్తించిన దానికి తొందరపడక ఖేదమోదములు లేనివాఁడు సంతుష్టుఁడనబడును,

"నాకృతేనకృతేనార్థోనశ్రుతిస్మృతివిభ్రమైః" ౨౮
"నిర్మంథరఇవాంభోధి స్సతిష్ఠతియథాస్థితః" ౨౯
(సామ ౬౧-మహా-అ ౪)

టీ. అకృతేన=చేయబడనిదానిచేతను, కృతేన = చేయబడిన దానిచేతను, శృతిస్మృతివిభ్రమైః = శ్రుతిస్మృతులను భ్రమలచేతను, నార్థః=ప్రయోజనములేనివాఁడగునో, సః=వాఁడు, నిర్మంథరః=మథించబడని, (నిశ్చలమగు) అంభోధిరివ = సముద్రమువలె, యథాస్థితః = ఏప్రకారముగనున్నవాఁడో యట్లే, తిష్ఠతి=ఉంచున్నాఁడు.

తా. వేదశాస్త్రములచేతను, ప్రయోజనములేనివాఁడై నిరంతరాత్మానుసంధానముగల పురుషుడు అడ్డులేని సముద్రమువలె తానే ప్రకారముగనుండునో యట్లే నిరంతరమునుండు. జీవన్ముక్తుఁడు.

"సమ్యగ్జ్ఞానావరోధేననిత్యమేకసమాధినా" ౩౦
"సాంఖ్యఏవావబుద్ధాయతేవై సాంఖ్యాయనాఃస్మృతాః" ౩౧
(అథర్వ-౭౦ అన్నపూర్ణ-అ౫.)

టీ. నిత్యం=ఎల్లప్పుడును, సమ్యగ్జ్ఞానావరోధేన=దృఢజ్ఞానముచే కట్టుబడిన, ఏక=ముఖ్యమైన, సమాధినా=సమాధిచేత, యే = ఎవరు, సాఖ్యఏవ=సాంఖ్యమందే, అవబుద్ధాః = తెలిసికొన్నవారో, తేవై = వారే, సాంఖ్యాయనాః=సాంఖ్యాయనులని, స్మృతాః=చెప్పబడిరి.

తా. పృథగ్జ్ఞానమున ప్రకృతి నెరింగి తాను పురుషుడనని దానిని సాంఖ్యమతప్రకారమున, నిరసించివిడిచిరో, వారే సాంఖ్యాయనులని చెప్పబడుచున్నారని యభిప్రాయము. (ఇచ్చట పురుషుడనగా జీవుడని అర్థముగాని మానవస్త్రీ భిన్నజాతీయుడని యర్థముకాదు.)

" ప్రాణాద్యనిలసంశాంతౌ యుక్తా యేపదమాగతాః " ౩౨
" అనామయమనాద్యంతం తేస్మృతా యోగయోగినః " ౩౩
(అథర్వ-౭౦ అన్నపూర్ణ-అ౫.)

టీ. ప్రాణాద్యనిలసంశాంతౌ=ప్రాణాదివాయువులు నిలిచినకాలమందు, అనామయం=రోగక్లేశరహితమైనదియు, అనాద్యంతం=ఆద్యంతములు లేనిదియునగు, పదం=మహాస్థానమును, యే=ఎవరు, ఆగతాః=పొందినవారో, తే=వారు, యోగయోగినః=యోగము నవలంబించిన యోగులు, యుక్తాః=ఆరూఢులు. అనగ బ్రహ్మజ్ఞానులయిన ఋషులు.

తా. ఎవరు వాయుధారణచే వాయువు నిల్చియుండగా చిదాకాశమున చిత్తము జేర్చెదరో వారే యుక్తులు, యోగమతస్థులు. అని యభిప్రాయము.

"సుఖదుఃఖదశాధీరం సామ్యాన్నప్రోద్ధరంతియం" ౩౪
"నిశ్వాసా ఇవశైలేంద్రం చిత్తంతస్యమృతంవిదుః" ౩౫
(అథర్వ-౭౦ అన్నపూర్ణ. అ౪.)

టీ. సామ్యాత్=సమత్వమున, సమబుద్ధియుండుటవలన, యం ధీరం=ఏధీరుని, సుఖదుఃఖదశాః=సుఖదుఃఖసమయములు, శైలేంద్రం=మేరుపర్వతమును, నిశ్వాసాఇవ=నిశ్వాసవాయువులువలె, నప్రోద్ధరంతి హరింపజాలవో, తస్య=ఆధీరునియొక్క, చిత్తం=చిత్తము, మృతం=చచ్చినదానిగ, విదుః=తెలియుదురు.

తా. నిశ్వాసవాయువులు మేరుపర్వతమును హరింపనట్లు, సుఖదుఃఖదశలు సర్వత్రసమబుద్ధిగలిగిన యోధీరుని చిత్తము హరింపజాలవో అతని చిత్తము నశించిన దానిగ బుధులు తెలియుచున్నారని యభిప్రాయము.

"వాచామతీత విషయోవిషయాశాదశోర్ఝితః" ౩౬
"పరానందరసాత్క్షుబ్ధోరమతే స్వాత్మనాత్మని" ౩౭
(అధర్వ-౭౦ అన్నపూర్ణ.)

టీ. వాచామతీతవిషయః = వాగింద్రియముల కగోచరమైన బ్రహ్మమును బొందినవాడును, విషయాశాదశోర్ఝితః=శబ్దాదివిషయాశావస్థచే, విడువబడినవాడును, పరానందరసాత్ =బ్రహ్మానందరసమువలన, అక్షుబ్ధః=క్షోభించనివాడునునై, ఆత్మని=ఆత్మయందు, స్వాత్మనా=తనయాత్మచే, రమతే=రమించుచున్నాడు.

తా. విషయాశను విడిచి బ్రహ్మానందరసానుభవమున తనయందు తానే జీవన్ముక్తుడు క్రీడించుచుండును.

"నిర్గ్రంధిశ్శాంత సందేహో జీవన్ముక్తోవిభావనః" ౩౮
"అనిర్వాణో౽పినిర్వాణ శ్చిత్రదీపఇవస్థితః" ౩౯
(కృ-య ౭౭ అక్షి.)

టీ. నిర్గ్రంధిః=అజ్ఞానమనుముడిలేనివాడును, శాంతసందేహః=నశించిన సందేహములుగలవాడును, జీవన్ముక్తః = జీవన్ముక్తుడును (జీవించియుండగా ముక్తినిపొందినవాడును) విభావనః = వృత్తులులేనివాడును, అనిర్వాణో౽పి=నాశములేనివాడైనను, నిర్వాణః = నాశమునొందినవాడునునై, చిత్రదీపఇవ = చిత్రపటమునందలి దీపమువలె, స్థితః=ఉన్నవాడగును.

తా. స్పష్టము.

"నిర్ధనోపిసదాతుష్టోప్య సహాయోమహాబలః" ౮౦
"నిత్యతృప్తోప్య భుంజానోప్య సమస్సమదర్శనః" ౮౧

(అధర్వ-౭౬ ఆత్మ.)

టీ. నిర్ధనోపి=ధనములేనివాడైనను, సదా=ఎల్లప్పుడును, తుష్టః=తృప్తిగలవాడగును, అసహాయోపి=జనసహాయ్యములేనివాడైనను, మహాబలః-మహాబలవంతుడగును. అభుంజానోపి-భోజనము చెయ్యనివాడయ్యును, నిత్యతృప్తః=నిత్యతృప్తుడగును,అసమోపి=ప్రపంచమునకసముడయ్యును, సమదర్శనః=సమస్తమును సమదృష్టిచే చూచువాడగును.

తా. బ్రహ్మానుసంధానపరుడైన జీవన్ముక్తుడు ధనహీనుడైనను, సంతోషియైనను, అసహాయుడైనను, మహాబలవంతుడును, భుజింపకున్నను తృప్తికలవాడును అసముడైనను సమస్తమును సమదృష్టిచే చూచువాడును నగునని తాత్పర్యము.

"కుర్వన్నపినకుర్వాణశ్చా భోక్తాఫలభోగ్యపి" ౮౨
"శరీర్యప్య శరీర్యేష పరిచ్ఛిన్నోపి సర్వగః" ౮౩

(అధర్వ-౭౬ ఆత్మ.)

టీ. ఏషః=ఈజీవన్ముక్తుడు, కుర్వన్నపి=కర్మమును చేయుచున్నను, నకుర్వాణః=(కర్మఫలమును గోరనివాడగుటచే) చేయనివాడును, ఫలభోగ్యపి=కర్మఫలమును అనుభవించుచున్నవాడైనప్పటికి, అభోక్తా=(భోక్తృత్వాభిమానములేమి) భుజింపనివాడును, శరీర్యపి=శరీరముగలవాడైనను, అశరీరీ=(దేహాభిమానములేమిచే) శరీరములేనివాడును, పరిచ్ఛిన్నోపి=శరీరముచే వేర్పర్చబడినను, సర్వగః=ఆత్మరూపమున నంతటనుండువాడును, జీవన్ముక్తుడు.

తా. పరులదృష్టికి కర్మముచేయువాడైనను, చేయనివాడే, శరీరముకలవాడైనను, లేనివాడే, కర్మఫలము ననుభవించినవాడైనను

అనుభవించనివాఁడే, కర్తృత్వాదికము లేనివాఁడు వేరుశరీరము గల వాఁడైనను అన్నిశరీరములయం దున్నవాఁడు.

" అధ్యాత్మరతిరాసీనో పూర్ణఃపావనమానసః " ౪౪
(సామ-౬౧ మహా-అ ౨)

" నైష్కర్మ్యేణనతస్యార్థ స్తస్యార్థోస్తినకర్మభిః " ౪౫
(శు-య-౧౦౮ ముక్తిక-అ ౨)

టీ. అధ్యాత్మరతిః=ఆత్మానక్తిగలవాఁడును, ఆసీనః=బ్రహ్మమం దున్న బుద్ధిగలవాఁడును, పూర్ణః=సమబుద్ధిచే పరిపూర్ణమైనవాఁడును, పావనమానసః=పవిత్రమైన మనస్సుగలవాఁడును అగు, తస్య=ఆజీవన్ముక్తునకు, నైష్కర్మ్యేణ=కర్మముచేయకపోవుటచేతను, కర్మభిః=కర్మలచేతనైనను, నార్థః=ప్రయోజనములేదు.

తా. జీవన్ముక్తుఁడైన బ్రహ్మజ్ఞానికి కర్మముచేసినను చేయకున్నను ప్రయోజనములేదు. అని తాత్పర్యము.

" నసమాధానజాప్యాభ్యాం అస్యనిర్వాసనంమనః " ౪౬
(శు-య-౧౦౮ ముక్తిక-అ౨.)

టీ. అస్య = ఈజీవన్ముక్తునకు, మనః=మనస్సు, నిర్వాసనం= వాసనలులేనిదిగావున, సమాధానజాప్యాభ్యాం=సమాధానజాప్యముల చేతను, న=ప్రయోజనములేదు.

తా. జీవన్ముక్తునకు మనస్సు వాసనలులేనిదిగావున నతనికి సమాధాన జపాదులవలన ప్రయోజనములేదు.

" జగజ్జీవాదిరూపేణపశ్యన్నపిపరాత్మవిత్. " ౪౭
" నతత్పశ్యతిచిద్రూపం బ్రహ్మవస్త్వేవపశ్యతి. " ౪౮
(అధర్వ-౭౭ పాశుపతబ్రహ్మ.)

టీ. పరాత్మవిత్ = ఆత్మజ్ఞాని అయిన జీవన్ముక్తుడు, జగజ్జీవాది రూపేణ = జగత్తుజీవుడుననుభేదబుద్ధితో, పశ్యన్నపి = (ఇతరులను కొందరు నట్లు) చూచుచున్నను, నతత్పశ్యతి = అట్లు భేదబుద్ధిచే జూడడు, చిద్రూపం = జ్ఞానస్వరూపమైన, బ్రహ్మైవస్వేవ = బ్రహ్మమునే, పశ్యతి = చూచుచున్నాడు.

తా. జనులు తామెట్లు భేదబుద్ధితో జగజ్జీవాదులను చూచుచుందురో, అట్లే జీవన్ముక్తుడు అగు జ్ఞానియు చూచుచున్నాడని తల చెదరుగాని యతడట్లు నిజముగా చూడడు. సమస్తము బ్రహ్మమనియే చూచును.

"అహమన్నంసదాన్నాదఇతిహి బ్రహ్మవేదనం" ౪౯
(అధర్వ-౭౭ పాశుపతబ్రహ్మ.)

టీ. సదా = ఎల్లపుడు, అహం = నేనే, అన్నం = భోజ్యమైనయన్నమనియు, అన్నాదః = నేనేయన్నమునుతిను భోక్తననియు, ఇతి = ఇట్లు నిశ్చయించుట, బ్రహ్మవేదనం = బ్రహ్మజ్ఞానము, హి = నిశ్చయము.

తా. భోజ్యభోక్తృస్వరూపము బ్రహ్మమేయని తెలియుట బ్రహ్మజ్ఞానము. బ్రహ్మమే యవిద్యోపాధిని గ్రహించి భోక్తయును తామసీప్రకృతిని గ్రహించి భోజ్యమునయ్యెను.

"బ్రహ్మవిద్గ్రసతిజ్ఞానా త్సర్వం బ్రహ్మాత్మనైవతత్" ౫౦
(అధర్వ-౭౭ పాశుపతబ్రహ్మ)

"సమాధిమథకర్మాణి మాకరోతుకరోతువా." ౫౧
(శు-య-౧౦౮ ముక్తిక.)

టీ. సమాధిం = సమాధినిగాని, అథకర్మాణి = కర్మలనుగాని, మాకరోతు = చేయకపోవుగాక, కరోతువా = చేయుగాక, బ్రహ్మవిత్ = బ్రహ్మవిదుడైన జీవన్ముక్తుడు, బ్రహ్మాత్మనా = బ్రహ్మాత్మబుద్ధిచే గలిగిన,

జ్ఞానాదేవ=జ్ఞానమువల్లనే, తత్సర్వం = సమస్తభేదములను, గ్రసతి= గ్రసించుచున్నాడు.

తా. సమస్తము బ్రహ్మమను జ్ఞానమున సర్వభేదములను, జీవన్ముక్తుడు పరిహరించుచున్నాడు.

" హృదయేత్యక్తసర్వేహాముక్తఏవోత్తమాశయః " ౫౨

(శు-య-౧౦౮ ముక్తిక)

టీ. హృదయే=హృదయమునందు, త్యక్త=విడువబడిన, సర్వ= సమస్తమైన, ఈహాః=ఇచ్ఛలుగలవాడును, ఉత్తమాశయః = ఉత్తమమయిన, బ్రహ్మబుద్ధిగలవాడును, ముక్తఏవ=ముక్తుడే.

తా. స్పష్టము.

" అక్షరత్వాద్వరేణ్యత్వాద్ధూతసంసారబంధనాత్. " ౫౩
" తత్త్వమస్యాదిలక్ష్యత్వాదవధూతఇతీర్యతే " ౫౪

(కృ-య-౭౯ అవధూత.)

టీ. అక్షరత్వాత్ = నాశములేని ప్రత్యగాత్మ స్వరూపమగుట వలననున్నూ, వరేణ్యత్వాత్ = శ్రేష్ఠమైనదాటవల్లనున్నూ, ధూతసంసారబంధనాత్ = ఎగరగొట్టబడిన సంసారబంధము గలిగియుండుటవల్లనున్నూ, తత్త్వమస్యాదిలక్ష్యత్వాత్ = తత్త్వమస్యాదివాక్యములకు లక్ష్యమైనవాడగుటవల్లనున్నూ; అవధూతఇతి=అవధూతయని, ఈర్యతే=చెప్పబడుచున్నాడు.

తా. అవధూతలక్షణము ఆపదమునకుగల యక్షరములచే నీవాక్యమున చెప్పబడెను. అక్షరుడువరేణ్యుడు ధూతసంసారబంధనుడు తత్త్వమస్యాదిలక్ష్యుడు అవధూత.

"యోవిలంఘ్యాశ్రమాన్వర్ణా నాత్మన్యేవస్థితఃపుమాన్" ౫౫
"అతివర్ణాశ్రమీయోగీ అవధూతస్సకథ్యతే." ౫౬

(కృ-య-౭౬ అవధూత.)

టీ. యః=ఏ, పుమాన్=పురుషుడు, ఆశ్రమాన్=ఆశ్రమములను, వర్ణాన్=బ్రాహ్మణాదివర్ణములను, విలంఘ్య=దాటి, ఆత్మన్యేవ=ఆత్మయందే, స్థితః=ఉన్నవాడగునో, అతివర్ణాశ్రమీ=వర్ణాశ్రమముల నతిక్రమించిన, యోగీ=యోగియైన, సః=వాడు, అవధూతః=అవధూతయని, కథ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. ఎవడువర్ణాశ్రమాభిమానమును, విడిచి బ్రహ్మమునందే ఉన్నవాడై స్వతంత్రముగ విహరించునో, వాడేయవధూత.

"యథారవిస్సర్వరసాన్ప్రభుంక్తేహుతాశనశ్చాపిహి
సర్వభక్షః" ౫౭
"తథైవయోగీవిషయాన్ప్రభుంక్తేనలిప్యతే పుణ్యపాపైశ్చ
శుద్ధః" ౫౮

(కృ-య-౭౭ అవధూత.)

టీ. యథా=ఏప్రకారము, రవిః=సూర్యుడు, సర్వరసాన్=సమస్తరసములను, ప్రభుంక్తే=అనుభవించుచున్నాడో, హుతాశనః=అగ్నిహోత్రుడు, సర్వభక్షః= సర్వభక్షకుడగుచున్నాడో, తథైవ=అట్లే, యోగీ=యోగియును, విషయాన్=విషయములను; ప్రభుంక్తే=అనుభవించుచున్నాడు, పుణ్యపాపైశ్చ=పుణ్యపాపములచేత, నలిప్యతే=అంటబడడు. శుద్ధః=పరిశుద్ధుడుగనుండును.

తా. కర్తృత్వభోక్తృత్వాద్యభిమానములు లేనివాడగుటచే రసముల ననుభవించు సూర్యునివలెను సర్వమును భక్షించు అగ్ని.

హోత్రుని వలెను పరిశుద్ధుడై యుండును గాని యేపాపపుణ్యములచేత నంటబడడు.

"కేవలం సుసమస్స్వచ్ఛో మౌనీముదితమానసః" ౫౯

(సామ-౬౧ మహో-అ ౨)

టీ. కేవలం=ముఖ్యముగ, సుసమః=సమబుద్ధిగలవాడును, స్వచ్ఛః=పరిశుద్ధాంతఃకరణముగలవాడును, మౌనీ=సంకల్పములేనివాడును, ముదితమానసః=నిత్యసంతోషముతోగూడినమనస్సుగలవాడును.

తా. జీవన్ముక్తుడు నిర్మలాంతఃకరణముగలవాడును సమబుద్ధిగలవాడును నిత్యసంతోషియు నగును.

"సంతోషామృతపానేన యేశాన్తా స్తృప్తిమాగతాః" ౬౦
"ఆత్మారామామహాత్మానస్తే మహాపదమాగతాః" ౬౧

(సామ-౬౧ మహో)

టీ. యేశాన్తాః=ఏశాంతులు, సంతోషామృతపానేన=సంతోషమను నమృతమును త్రాగుటచే, తృప్తిం=సంతుష్టిని, ఆగతాః=పొందినవారో, తే=వారు, ఆత్మారామాః=ఆత్మయందు రమించుచున్నవారు, మహాత్మానః=మహాత్ములు, మహాపదం = మహాస్థానమైనబ్రహ్మమును, ఆగతాః=పొందినవారు.

తా. శాంతమును సంతోషమును గలవారే, యాత్మారాములు మహాత్ములు కైవల్యమొందినవారు.

"హర్షామర్షభయక్రోధ కామకార్పణ్య దృష్టిభిః" ౬౨
"నహృష్యతి నగ్లపతి నజీవన్ ముక్తఉచ్యతే" ౬౩

(సామ-౬౧ మహో-అ ౨)

టీ. హర్షామర్షభయక్రోధ కామకార్పణ్య దృష్టిభిః=హర్ష=సంతోషము, అమర్ష=అసహనము, భయ=భయము, క్రోధ=కోపము, కామ=కోరిక, కార్పణ్య=కృపణత్వము, వీనియొక్క, దృష్టిభిః=బుద్ధులచేత, నహృష్యతి=ఎవడుసంతోషింపడో, నగ్లపతి=ఎవడు ఖేదమునొందడో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. స్పష్టము.

"మానవాన్నిరహంభావో నిర్ముక్తోముక్తమత్సరః" ౬౪

"యఃకరోతి గతోద్వేగస్సజీవన్ముక్తఉచ్యతే" ౬౫

(సామ-౬౧-మహా అ ౨)

టీ. మానవాన్=నిస్సంకల్పుడును, నిరహంభావః = అహంకారములేనివాడును, నిర్ముక్తః=సంసారబంధవినిర్ముక్తుడును, ముక్తమత్సరః=పోయినమత్సరము గలవాడును, గతోద్వేగః=సంభ్రమములేనివాడునునై, యః=ఎవడు, కరోతి=కర్మమును జేయుచున్నాడో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. స్పష్టము.

"అహంకారమయీంత్యక్త్వావాసనాం లీలయైవయః" ౬౬

"తిష్ఠతిధ్యేయసంత్యాగీ సజీవన్ముక్తఉచ్యతే" ౬౭

(సామ-౬౧ మహా-అ ౨-౬.)

టీ. లీలయైవ=లీలచేతనే, అహంకారమయీం=అహంకారప్రచురమైన, వాసనాం=వాసనను, త్యక్త్వా=విడిచి, ధ్యేయసంత్యాగీ=ధ్యేయమును విడిచినవాడై, యః=ఎవడు, తిష్ఠతి=ఉంచున్నాడో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. నిరాయాసముగా నహంకారమును విడిచి, ధ్యేయము

(లేక ధ్యేయరూపమైన బ్రహ్మస్వరూపము) నొందుచున్నాడో వాడు జీవన్ముక్తుడు. ధ్యేయమనగా ధ్యానింపబడునది. "ధ్యాతాసౌనతుతత్త్వవిత్" అనుటచే ఈ జీవన్ముక్తుడు ధ్యేయస్వరూపమైన బ్రహ్మము నొందినవాడుగాని ధ్యాతగాడు. కావున ధ్యేయసంత్యాగి యనబడును.

"యావతీదృశ్య కలనాసకలేయం విలోక్యతే" ౬౮

"సాయేనసుష్ఠుసంత్యక్తా సజీవన్ముక్తఉచ్యతే" ౬౯

(సామ-౬౧ మహా-అ ౨)

టీ. యావతీ=ఎంతపరిమితమైన, ఇయం=ఈ. దృశ్యకలనా=దృశ్యవ్యవహారము, సకలా=సమస్తము, విలోక్యతే=చూడబడుచున్నదో సా=ఆదృశ్యభేదవ్యవహారము, యేన=ఎవనిచేత, సుష్ఠు=లెస్సగ, సంత్యక్తా=విడువబడినదగునో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. భేదబుద్ధి యెవనిచే సంపూర్ణముగ విడువబడుచున్నదో వాడే జీవన్ముక్తుడు.

"ఉద్వేగానందరహితఃసమయాస్వచ్ఛయాధియా." ౭౦

"నశోచతేనచోదేతి సజీవన్ముక్తఉచ్యతే." ౭౧

(సామ-౬౧ మహా-అ౨,)

టీ. ఉద్వేగానందరహితః=సంభ్రమము సంతోషములు లేనివాడై, సమయా= సమమైనట్టియు, స్వచ్ఛయా = నిర్మలమైనట్టియు, ధియా=బుద్ధిచేత, నశోచతే=శోకింపడో, నచోదేతి=హర్షమును బొందడో, సః=వాడు, జీవన్ముక్తః= జీవన్ముక్తుడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా. జననమరణములందును నిర్మలమైన సమబుద్ధిగలవాడై తొందరలేక మోదఖేదంబుల నొందనివాడు జీవన్ముక్తుడు.

" సర్వాశాస్సకలాశ్శంకాస్సర్వేహాస్సర్వనిశ్చయాః " ౭౨
" ధియాయేనపరిత్యక్తాస్సజీవన్ముక్తఉచ్యతే. " ౭౩

(సామ-౯౧ మహా.)

టీ. సర్వాశాః=సమస్తాశలును, సకలాశ్శంకాః=సమస్తసందేహములును, సర్వేహాః= ఇచ్ఛలన్నియును, సర్వనిశ్చయాః = సమస్తనిశ్చయములును, ధియా=నిశ్చయమైన సమబుద్ధిచే, యేన=ఎవనిచేత, పరిత్యక్తాః=విడువబడినవగునో, సః=వాడు,జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే= చెప్పబడుచున్నాడు.

తా. బ్రహ్మమునందు గలిగినబుద్ధిచే నెవడు సకలాశలు సందేహములు కోరికలు అది వరకుగల జగజ్జీవేశ్వరాది భేదనిశ్చయములు విడుచునో వాడే, జీవన్ముక్తుడగునని చెప్పబడుచున్నాడు.

" జన్మస్థితివినాశేషుసోదయాస్తమయేషుచ. " ౭౪
" సమమేవమనోయస్యసజీవన్ముక్తఉచ్యతే, " ౭౫

(సామ-౯౧ మహా-అ ౨.)

టీ. జన్మస్థితివినాశేషు=జననవృద్ధి మరణములందును, సోదయాస్తమయేషుచ = లాభనష్టములందును, యస్య = ఎవనియొక్క, మనః=మనస్సు, సమమేవ=సమత్వమునే గలిగియుండునో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. స్పష్టము.

" సర్వాధిష్ఠానచిన్మాత్రే నిర్వికల్పేచిదాత్మని " ౭౬

(అధర్వ; ౭౦ అన్నపూర్ణ; అ ౨)

" యోజీవతిగతస్నేహః సజీవన్ముక్తఉచ్యతే " ౭౭

(సామ; ౯౧ మహా-అ ౨)

టీ. సర్వాధిష్ఠానచిన్మాత్రే=సకలమునకు నధిష్ఠానజ్ఞానస్వరూపమును, నిర్వికల్పే=వికల్పములేనిస్వరూపమునైన, చిదాత్మని=చిద్రూపమైనబ్రహ్మమునందు, గతస్నేహః=జగత్తునం దనురాగములేనివాడై, యః=ఎవఁడు, జీవతి=జీవించుచున్నాఁడో సః=వాఁడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాఁడు.

తా. జగత్తున మోహములేక ఎవఁడు బ్రహ్మానుసంధానము చేయుచుండునో వాఁడు జీవన్ముక్తుఁడు.

"క్రియానాశాద్భవేచ్చింతా నాశోఽస్మాద్వాసనాక్షయః" ౭౮
వాసనాప్రక్షయో మోక్షః సజీవన్ముక్తఉచ్యతే" ౭౯

(శు-య, 23 అధ్యాత్మ.)

టీ. క్రియానాశాత్=కర్మనాశమువలన, చింతానాశః=చింతానాశము, భవేత్=అగును. అస్మాత్=ఈ చింతానాశమువలన, వాసనాక్షయః=వాసనాక్షయమగును, వాసనాప్రక్షయః=వాసనాక్షయమే, మోక్షః=మోక్షము, సః=ఆ వాసనాక్షయముగలవాఁడే, జీవన్ముక్తః=జీవన్ముక్తుఁడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాఁడు.

తా. కర్మఫలాపేక్షలేకుండిన కర్మము నశించును. అందువలన కర్మలనుగూర్చి చేయు చింతయునుండదు. ఆచింత నశించిన వాసన నశించును. వాసననశించిన మోక్షము గలుగును. వాసనాక్షయము గలవాఁడే జీవన్ముక్తుఁడని చెప్పబడుచున్నాఁడు.

"నిర్వికల్పాచచిన్మాత్రా వృత్తిఃప్రజ్ఞేతికథ్యతే" ౮౦
"సాసర్వదాభవేద్యస్య సజీవన్ముక్తఉచ్యతే" ౮౧

(శు-య 23 అధ్యాత్మ.)

టీ. నిర్వికల్పా=వికల్పములు లేనిదియు, (ఎడతెగనిదియు) చిన్మాత్రా=కేవల చిద్రూపమైనదియునగు, వృత్తిః=చిత్తవృత్తి, ప్రజ్ఞేతి=ప్రజ్ఞయని, కథ్యతే=చెప్పబడుచున్నది, సా=ఆప్రజ్ఞ, సర్వదా=ఎల్లపుడును, యస్య=ఎవనికి, భవేత్=కలిగియుండునో, స,=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. స్పష్టము.

" దేహేంద్రియేష్వహంభావః ఇదంభావ స్తదన్యకే " ౮౨
" యస్యనోభవతః క్వాపి సజీవన్ముక్త ఉచ్యతే ,, ౮౩

(శు య. ౭౩ అధ్యాత్మ)

టీ. దేహేంద్రియేషు=దేహేంద్రియములందు, అహంభావః=అహంవృత్తియును, (నేననువృత్తియును) తదన్యకే=దేహేంద్రియములుకాని ఇతరవిషయములందు, ఇదంభావః=ఇదంవృత్తియును, (ఇదియనువృత్తియును) యస్య=ఎవనికి, క్వాపి=ఎచ్చటను, నోభవతః=ఆరెండువృత్తులుండవో, సః=వాడు, జీవన్ముక్తఉచ్యతే=జీవన్ముక్తుడని చెప్పబడును.

తా. అంతఃకరణవృత్తుల హంవృత్తియనియు, ఇదంవృత్తియనియు, రెండువిధములు. అహంవృత్తియే బుద్ధియనియు, నహంకారమనియు, చెప్పబడును. ఇదంవృత్తియేమనస్సనియు, మమకారమనియు, చెప్పబడును. బుద్ధివృత్తి దేహేంద్రియాదులను తానని వ్యాపించును. మనోవృత్తి నాదియని ఇతరవృత్తులను వ్యాపించును. "అహంవృత్తిరిదంవృత్తిరిత్యంతఃకరణం ద్విధావిజ్ఞానం స్యాదహం వృత్తిరిదంవృత్తిర్మనోభవేత్ ,, అని చెప్పబడి యున్నది. ఈయహంకార మమకారములు లేనివాడే జీవన్ముక్తుడగుచున్నాడు.

" నప్రత్యగ్బ్రహ్మణోర్భేదం కదాపిబ్రహ్మసర్గయోః " ౮౪
" ప్రజ్ఞయాయోవిజానాతి సజీవన్ముక్తఉచ్యతే " ౮౫

(శు-య, 23 అధ్యాత్మ)

టీ. కదాపి = ఒకప్పుడైనను, ప్రత్యగ్బ్రహ్మణోః=ప్రత్యగాత్మ బ్రహ్మలకును, బ్రహ్మసర్గయోః=బ్రహ్మకును సృష్టికిని, యః=ఎవడు, ప్రజ్ఞయా=పూర్వోక్తప్రజ్ఞచే, నభేదం=అభేదమును, విజానాతి= తెలిసి కొనుచున్నాడో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. ఎవడు నిర్వికల్ప చిన్మాత్రవృత్తిచే బ్రహ్మకును సృష్టికిని, ప్రత్యగాత్మకును బ్రహ్మమునకును భేదములేదని యెఱుగుచున్నాడో వాడు జీవన్ముక్తుడగుచున్నాడు.

"సాదుభిఃపూజ్యమానోఽపి పీడ్యమానోపిదుర్జనైః" ౮౬
" సమమేవభవేద్యస్య సజీవన్ముక్తఉచ్యతే " ౮౭

(శు-య 23 అధ్యాత్మ)

టీ. సాధుభిః=సాధువులచేత, పూజ్యమానోపి=పూజింపబడుచున్నవాడైనను, దుర్జనైః=దుర్మార్గులచేత, పీడమానోపి=పీడింపబడుచున్నవాడైనను, యస్య=ఎవనికి, సమమేవ=సమత్వమే, భవేత్=అగుచున్నదో, సః=వాడు, జీవన్ముక్తఉచ్యతే=జీవన్ముక్తుడని చెప్పబడుచున్నాడు.

తా. స్పష్టము.

" యథాస్థితమిదం యస్య వ్యవహారవతోపిచ " ౮౮
" అస్తంగతం స్థితంచిత్తం సజీవన్ముక్తఉచ్యతే " ౮౯

(కృ=య ౯౮ వరాహ; అ౪)

టీ. వ్యవహారవతోఽపిచ=వ్యవహారవంతుడైనను, యస్య=ఎవనికి, ఇదం = ఈజగత్తు, యథాస్థితం = ఎప్పటివలెనున్నదియగునో, చిత్తం=చిత్తము, అస్తంగతం=నాశనమునుపొందిస్థితం = ఉన్నదగునో సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని. ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. ఈజగత్తు ఎప్పటివలెనున్నట్లు గనబడునో (ఆరోపించుటకు పూర్వము ఎట్లుండెయున్నదో యట్లే యుండునో) మిథ్యగానుండునో, ఎవని చిత్తము వృత్తులు లేక నశించి యుండునో వాడు జీవన్ముక్తుడు.

“ నోదేతినాస్తమాయాతి సుఖేదుఃఖేమనఃప్రభా. ” ౯౧

“ యథాప్రాప్తస్థితిర్యస్య సజీవన్ముక్తఉచ్యతే, ” ౯౧

(కృ-య-౯౮ వరాహ అర.)

టీ. యస్య=ఎవనియొక్క, మనఃప్రభా = మనోవృత్తి, సుఖే=సుఖమందును, దుఃఖే=దుఃఖమందును, నోదేతి=సంతోషమున విజృంభింపదో, నాస్తమాయాతి=ఖేదమున క్షీణింపదో, యథాప్రాప్తస్థితిః=పొందబడిన జీవబ్రహ్మైక్యస్థితిని అతిక్రమించని ఉనికిగలవాడై యుండునో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడుఅని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. సుఖమునందు సంతోషము దుఃఖమునందు కృశత్వము నొందక మనస్సు ఎవనికుండునో తానే బ్రహ్మమను జ్ఞానముమారక యెప్పటి యట్లయుండునో, వాడే జీవన్ముక్తుడు.

“ యోజాగర్తిసుషుప్తస్థోయస్యజాగ్రన్నవిద్యతే. ” ౯౨

“ యస్యనిర్వాసనోబోధః సజీవన్ముక్తఉచ్యతే. ” ౯౩

(కృ-య-౮౮ వరాహ-అర.)

టీ. యః = ఎవడు, సుషుప్తిస్థః = నిద్రయందున్నవాడైనను, జాగర్తి=మేలుకొనువాడగునో, యస్య=ఎవనికి, జాగ్రత్=బాహ్యేంద్రియ వ్యాపారము, నవిద్యతే=లేదో, యస్యబోధః = ఎవనిబోధము, నిర్వాసనః=వాసనలేనిదియగునో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. ఎవడు నిద్రావస్థను నజ్ఞానముననుండక బ్రహ్మస్వరూపముగ నుండునో, ఎవనికి బాహ్యేంద్రియవ్యాపారము నశించునో, ఎవని బోధవాసన లేనిదగునో వాడు జీవన్ముక్తుడు.

" రాగద్వేషభయాదీనాం అనురూపంచరన్నపి. " ౯౪
" యోఽంతర్వ్యోమవత్స్వచ్ఛః సజీవన్ముక్తఉచ్యతే. " ౯౫

(కృ-య-౯౮ వరాహ-అ ౪)

టీ. రాగద్వేషభయాదీనాం = రాగద్వేషభయాదులకు, అనురూపం=తగినట్లు (అనుసరించి), చరన్నపి=సంచరించుచున్నను, యః = ఎవడు, అంతః=లోపలను, వ్యోమవత్=ఆకాశమువలె, స్వచ్ఛః=నిర్మలుడగునో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. పైకి రాగద్వేషాదులున్నట్లు చరించుచున్నను, లోపల నిర్మలాకాశమువలె స్వచ్ఛముగ శాంతముగ నుండునో వాడు జీవన్ముక్తుడగుచున్నాడు.

" యస్యనాహంకృతోభావో బుద్ధిర్యస్యనలిప్యతే " ౯౬
" కుర్వతోఽకుర్వతోవాపి సజీవన్ముక్తఉచ్యతే " ౯౭

(కృ-య-౯౮ వరాహ-అ ౪)

టీ. కుర్వతః=కర్మమునుచేయుచున్నట్టియు, అకుర్వతోవాపి=కర్మమునుచేయనట్టియు, యస్య=ఎవనియొక్క, భావః= భావము, నాహంకృతః=అహంకారము లేనిదగునో, యస్య=ఎవనియొక్క, బుద్ధిః=బుద్ధి, నలిప్యతే=కర్మలచే నంటబడదో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. కర్మము చేయుచున్నను చేయకున్నను ఎవనిభావ మహంకారముతో గూడకుండునో ఎవనిబుద్ధి యాకర్మములచే నంటబడదో (ఫలాపేక్ష గలిగియుండదో) వాడు జీవన్ముక్తుడు.

"యస్మాన్నోద్విజతేలోకో లోకాన్నోద్విజతేచయః" ౯౮
"హర్షామర్షభయాన్ముక్తస్సజీవన్ముక్తఉచ్యతే" ౯౯
(కృ-య-౯౮ వరాహ-అ ౪)

టీ. యస్మాత్=ఎవనివలన, లోకః=ప్రపంచము, నోద్విజతే=భయపడదో, లోకాత్=ప్రపంచమువలన, యః=ఎవడు, నోద్విజతేచ=భయపడదో, హర్షామర్షభయాత్, హర్ష=సంతోషమువలన, అమర్ష=కోపమువలన, భయాత్=భయమువలన, ముక్తః=విడువబడినవాడెవడో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. ఎవనివలన భూతములు భయపడవో భూతములవలన ఎవడు భయపడడో (సమబుద్ధిగలవాడగుటచేత) ఎవడు హర్షామర్షభయములులేనివాడో వాడు జీవన్ముక్తుడు.

" యస్సమస్తార్థజాలేషు వ్యవహార్యపినిస్పృహః " ౧౦౦
" పరార్థేష్వివపూర్ణాత్మా సజీవన్ముక్తఉచ్యతే " ౧౦౧
(కృ-య-౯౮ వరాహ-అ ౪; సామ ౬౧ మహా)

టీ. యః=ఎవడు, సమస్తార్థజాలేషు=జనసంబంధమగు సమస్త కార్యములందును, వ్యవహార్యపి=వ్యవహరించుచున్నవాఁడైనను, పరార్థేష్వివ=ఇతరులకార్యములందువలె, నిస్పృహః=ఇచ్ఛలేనివాఁడై, పూర్ణాత్మా=పూర్ణమైన యాత్మరూపముగలవాడగునో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుఁడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాఁడు.

తా. స్పష్టము.

" ప్రజహాతియదా కామాన్ సర్వాన్ చిత్తగతాన్ మునే" ౧౦౨
" మయిసర్వాత్మకేతుష్టః సజీవన్ముక్తఉచ్యతే "　　　౧౦౩

(కృ-య-౯౮ వరాహ-అ ౪)

టీ. మునే=ఓమునీంద్రుఁడా, యదా=ఎప్పుడు, చిత్తగతాన్=చిత్తమునందున్న, సర్వాన్=సమస్తమైన, కామాన్=కోరికలను, ప్రజహాతి=విడుచుచున్నాఁడో, సర్వాత్మకే=సర్వాత్మస్వరూపుఁడనైన, మయి=నాయందు, తుష్టః=తృప్తినొందుచున్నాఁడో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుఁడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాఁడు.

తా. ఎవడు చిత్తమునందున్న సమస్తకామములను విడిచి యాత్మయందు తృప్తినొందుచున్నాఁడో వాడు జీవన్ముక్తుఁడని చెప్పబడుచున్నాఁడు.

" చైత్యవర్జితచిన్మాత్రే పదే పరమపావనే "　　　౧౦౪
" అక్షుబ్ధచిత్తో విశ్రాన్తస్సజీవన్ముక్తఉచ్యతే "　　　౧౦౫

(కృ-య-౯౮ వరాహ-అ ౪)

టీ. చైత్యవర్జితచిన్మాత్రే=చిత్తవృత్తిశూన్యమైన జ్ఞానమాత్రమును, పరమపావనే=అతిపవిత్రమునగు, పదే=పదమునందు, అక్షు

ద్ధచిత్తః=క్షోభించని చిత్తముగలవాఁడై, విశ్రాంతః=విశ్రమించువాఁడగునో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుఁడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాఁడు.

తా. క్షోభములేని చిత్తముగలవాఁడై చిదాకాశమున ఎవఁడు విశ్రమించునో వాఁడు జీవన్ముక్తుఁడని భావము.

" ఇదంజగదయంసోయందృశ్యజాతమవాస్తవం. " ౧౦౭
" యస్యచిత్తేనస్ఫురతిసజీవన్ముక్తఉచ్యతే. " ౧౦౭

(కృ-య-౯౮ వరాహ-అ౪.)

టీ. ఇదం=ఇది, జగత్ = జగత్తు, అయం = వీఁడు, సోయం = ఆవీఁడుఅను, అవాస్తవం=మిథ్యారూపమయిన, దృశ్యజాతం = దృశ్యసమూహము, యస్య=ఎవనియొక్క, చిత్తే = చిత్తమందు, నస్ఫురతి=ప్రకాశింపకుండునో, సః=వాఁడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుఁడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాఁడు.

తా. ఇది జగత్తు వీఁడు వాఁడు అను మిథ్యారూపమైన దృశ్యసముదాయము ఎవనిచిత్తమున తోఁచకుండునో ఎవనిచిత్తము సమస్థితిగనుండునో వాఁడు జీవన్ముక్తుఁడు.

" శాంతసంసారకలనఃకలావానపినిష్కళః " ౧౦౮
" యస్సచిత్తోపినిశ్చిత్తః సజీవన్ముక్తఉచ్యతే. " ౧౦౮

(సామ-౭౧ మహా-అ౨.)

టీ. శాంతసంసారకలనః = శాంతింపఁబడిన సంసారవ్యాపారము కలవాఁడును, కళావానపి=షోడశకళలు గలవాఁడయ్యును, నిష్కళః =

కళలు లేనివాడును,యః=ఎవడు,సచిత్తోపి=చిత్తముతోనున్నవాఁడైనను, నిశ్చిత్తః=చిత్తము లేనివాఁడో, సః=వాఁడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. ఇంద్రియములు చిత్తమును గలవాడయ్యును వృత్తి విముఖుడగువాడు జీవన్ముక్తుడు.

" చిదాత్మాహంపరాత్మాహం నిర్గుణోహంపరాత్పరః " ౧౧౦
" ఆత్మమాత్రేణయస్తిష్ఠేత్ సజీవన్ముక్తఉచ్యతే. " ౧౧౧
(కృ-య-౩౭ తేజోబిందు-అ౪.)

టీ. చిదాత్మాహం= నేను చిద్రూపుడనైన ప్రత్యగాత్మను, పరాత్మాహం=నేను నిర్వికారుడగు పరమాత్మను, నిర్గుణోహం=నేను నిర్గుణుడను, పరాత్పరః = ప్రకృతికిపరమైన శుద్ధబ్రహ్మమును, అని, ఆత్మమాత్రేణ=ఆత్మమాత్రరూపమున, యః=ఎవడు, తిష్ఠేత్=ఉంచున్నాడో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా. స్పష్టము.

" దేహత్రయాతిరిక్తోహం శుద్ధచైతన్యమస్మ్యహం " ౧౧౨
" బ్రహ్మాహమితియస్యాస్తి సజీవన్ముక్తఉచ్యతే " ౧౧౩
(కృ-య-౩౭ తేజోబిందు-అ౪)

టీ. అహం= నేను, దేహత్రయాతిరిక్తః = దేహత్రయమునకు విలక్షణమైనవాడను, అహం= నేను, శుద్ధచైతన్యం=నిర్వికారబ్రహ్మము, అస్మి=అగుచున్నాను, అహం= నేను, బ్రహ్మేతి=బ్రహ్మమేయనునిశ్చయము, యస్య=ఎవనికి, అస్తి=కలదో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. స్థూలసూక్ష్మకారణ దేహములకు సాక్షియైన ప్రత్యగాత్మనే, నేనను మాయాజృంభణమునకు పూర్వముండు శుద్ధబ్రహ్మమునే, నేనను నిశ్చయముగలవాడు జీవన్ముక్తుడని చెప్పబడుచున్నాడు.

" యస్య దేహాదికం నాస్తి యస్య బ్రహ్మేతినిశ్చయః " ౧౧౪
" పరమానందపూర్ణోయః సజీవన్ముక్తఉచ్యతే " ౧౧౫
(కృ-య-౩౭ తేజోబిందు-అ ౪)

టీ. యస్య = ఎవనికి, దేహాదికం = దేహము మొదలైనది, నాస్తి=లేదో, యస్య=ఎవనికి, బ్రహ్మేతి=బ్రహ్మమను, నిశ్చయః=నిశ్చయముండునో, యః=ఎవడు, పరమానందపూర్ణః=పరమానంద పరిపూర్ణుడో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. ఎవనికి దేహమునం దహంకారమును గేహాదులందు మమకారము నుండదో ఎవనికి తానే బ్రహ్మమని నిశ్చయముండునో వాడే నిత్యానందపరిపూర్ణుడు. జీవన్ముక్తుడు.

" నిత్యానందప్రసన్నాత్మా హ్యన్యచింతావివర్జితః " ౧౧౬
" కించిదస్తిత్వహీనోయః సజీవన్ముక్తఉచ్యతే " ౧౧౭
(కృ-య ౩౭ తేజోబిందు-అ ౪)

టీ. నిత్యానందప్రసన్నాత్మా, నిత్యానంద=నిత్యానందముచే, ప్రసన్న=ప్రసన్నమైన, ఆత్మా=ఆత్మగలవాడును, అన్యచింతావివర్జితః=ఇతరచింతలేనివాడును, కించిదస్తిత్వహీనః = కొంచము నున్నదనునూహలేనివాడును, యః=ఎవడో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. నిత్యానందముచే ప్రసన్నమైన చిత్తము గలవాడును

ఇతరచింతయేమియు లేనివాడును జగదాదిభేదబుద్ధి కొంచెమును లేని వాడును, జీవన్ముక్తుడగుచున్నాడు.

"అహంబ్రహ్మాస్మ్యహంబ్రహ్మాస్మ్యహంబ్రహ్మేతినిశ్చయః" ౧౧౮
"చిదహంచిదహంచేతి సజీవన్ముక్తఉచ్యతే" ౧౧౯
(కృ-య-౩౭ తేజోబిందు-అ ౪)

టీ. అహం=నేను, బ్రహ్మ=బ్రహ్మము, అస్మి = అగుచున్నాను, అహంబ్రహ్మాస్మి=నేను బ్రహ్మమునగుచున్నాను, అహంబ్రహ్మేతి=నేను బ్రహ్మనని, నిశ్చయః=నిశ్చయముగలవాడును, చిదహం, అహం=నేను, చిత్=జ్ఞానస్వరూపుడను, చిదహం=చిద్రూపుడైన ప్రత్యగాత్మను నేనని నిశ్చయముగలవాడెవడో, సః=వాడు, జీవన్ముక్తః=జీవన్ముక్తుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా. తానే బ్రహ్మమనియు, ప్రత్యగాత్మయనియు తలచువాడు జీవన్ముక్తుడు. కొందరు జగత్తుతోచకుండుట జీవన్ముక్తియందురు. అది సరికాదు. అది విదేహముక్తి. తానే బ్రహ్మమను ధృఢమైన నిశ్చయముగలవాడై జగత్తు నింద్రజాలమువలె మిథ్యగ జూచుచుండుట జీవన్ముక్తి యనబడును.

ఇతిసార్థాంతిక జీవన్ముక్తి వాక్యాన్యేకోనవింశదధికంశతం.

ఇట్లు సార్థాంతిక జీవన్ముక్తివాక్యములు నూటపందొమ్మిది.

ఇత్యష్టమం ప్రకరణం సమాప్తమ్.

ఇట్లు యెనిమిదవ ప్రకరణము సమాప్తము.

శ్రీ

సద్గురవేనమః.

# ౬ స్వానుభూతి వాక్య ప్రకరణము

" యోసావసౌపురుషస్సోఽహమస్మి " ౧

(శు-య-౧ ఈశావాస్య-౧౬; ౧౦ బృహదారణ్యక-అ ౭-బ్రా ౧౫)

టీ. అసౌపురుషః=ఈపురుషుడు, యః=ఎవడో, అసౌ=వీడును, సః=వాడును, అహమస్మి=నేనగుచున్నాను.

తా. ఈపురుషుడనువాడును నేనగుచున్నాను. అంతఃకరణప్రతిబింబితచైతన్యము చిదాభాసుడైనజీవుడు వీడు క్షరపురుషుడు. అంతఃకరణాధిష్ఠానచైతన్యము కూటస్థుడు. వీడక్షరపురుషుడు. మాయాధిష్ఠానచైతన్యము, పరమాత్మ. అతడుత్తమపురుషుడు. ఈవాక్యమున నేననగా జీవుడు. ఈపురుషుడనగా కూటస్థుడు. వాడనగాపరమాత్మ. జీవుడుగా కనబడుచున్న నేను ప్రత్యగాత్ముడను పరమాత్ముడను అగుచున్నాను.

" తదోయ్యహం సోఽసౌయోఽసౌసోఽహం " ౨

టీ. తత్ = ఆయాదిత్యునియందున్న, అసౌ = ఈపురుషుడు, యః=ఎవడో, సః=వాడు, అహం=నేను, అసౌ=ఈభూతసముదాయమందున్నవీడు, యః=ఎవడో, సః=వాడే, అహం=నేను.

తా. సూర్యమండలమందున్నవాడును, భూతసముదాయమునసున్నవాడును ఒక్కపరమాత్మయే. నేనే ఆపరమాత్మను.

" తచ్ఛాంతమచల మద్వయానంద చిద్ఘనఏవాస్మి " ౩
(సామ-౧౯ పరమహంస)

టీ. తత్=తత్పదలక్ష్యమైన బ్రహ్మమును, శాంతం=శాంతస్వరూపమును, అచలం=అచలస్వరూపమును, అద్వయానందచిద్ఘనఏవ= అద్వితీయానంద ప్రజ్ఞానఘనుడనే, అస్మి=అగుచున్నాను.

తా. వడగండ్లు ఘనీభవించిన జలమునుదక్క నితరముకాదు. కావున జలఘనమనబడును. అట్లే ఘనీభవించినయనగా సాంద్రజ్ఞాన స్వరూపము చిద్ఘనమనబడును. ఉపాధులందు ప్రవేశింపకుండు చిద్రూపమే చిద్ఘనమనబడును. ఉపాధులందు ప్రవేశించిన ద్రవాత్మయనబడును. వడగండ్లు నీరైనట్లు అట్టిబ్రహ్మమే నేనగుచున్నాను. అట్లే యానందఘనమనినను, సద్ఘనమనినను, ప్రజ్ఞానఘనమనినను, తెలియవలెను.

" త్వం వాహమస్మిభగవఃదేవ తేహంవై త్వమసి " ౪
(కృ-యజు-౯౦ వరాహ.)

టీ. భగవః=ఓభగవంతుడా, త్వంవా = నీవే, అహం=నేను, అస్మి=అగుచున్నాను, దేవ=ఓదేవా, అహం=నేను, తేవై=నీవాడనే, అహం=నేనే, త్వం=నీవు, అసి=అగుచున్నావు.

తా. అగ్నికిని విస్ఫులింగమునకు నున్న సంబంధమువలె నీకును నాకును సంబంధమున్నది. అగ్ని విస్ఫులింగమెట్లయ్యెనో యట్లే నీవు నేనైతివి.

" సచ్చిదానందాత్మకోహం అజరోహంపరిపూర్ణోస్మి." ౫
(అధర్వ-౫౨ మహానారాయణ-అ౮.)

టీ. అహం=నేను, సచ్చిదానందాత్మకః = సత్యజ్ఞానానంద స్వరూపుడను, అహం=నేను, అజరః=ముదిమిలేనివాడను, పరిపూర్ణః= పరిపూర్ణుడను, అస్మి=అగుచున్నాను.

తా. స్పష్టము.

"శుద్ధాద్వైతబ్రహ్మాహం" ౬

(శు-య-౮౮ మండలబ్రాహ్మణ.)

టీ. శుద్ధ=మాయాసంబంధములేని. అద్వైత=అద్వితీయమైన, బ్రహ్మ=బ్రహ్మము, అహం=నేను.

తా. స్పష్టము.

"తత్పూర్ణానందైకబోధస్తద్బ్రహ్మైవాహమస్మి" ౭

(శు-య-౨౦ అమృతబిందు.)

టీ. తత్పూర్ణానందైకబోధః = తత్, ఆ బ్రహ్మముయొక్క, పూర్ణానంద వెలితిలేనియానందమే, ఏక=ముఖ్యమగు, బోధః=బోధగల, తద్బ్రహ్మైవ=ఆబ్రహ్మమే, అహం=నేను, అస్మి = అగుచున్నాను.

తా. స్పష్టము.

"వాచామగోచరనిరాకార పరబ్రహ్మస్వరూపోఽహమేవ" ౮

(అథర్వ-౫౭ మహానారాయణ-అ ౮)

టీ. అహమేవ=నేనే, వాచాం=వాగాదీంద్రియములకు (వేదములకు) అగోచర=తెలియబడని, నిరాకార=రూపములేని, పరబ్రహ్మస్వరూపః=పరబ్రహ్మస్వరూపమును.

తా. స్పష్టము.

"సదోజ్జ్వలోఽవిద్యాతత్కార్యహీనః స్వాత్మబంధహర స్సర్వదా ద్వైతరహిత ఆనందరూపస్సర్వాధిష్ఠానచిన్మాత్రోనిరస్తావిద్యాతమోమోహఏవాహం ఓంతద్యత్పరంబ్రహ్మరామచంద్రచిదాత్మకస్సోహమోంతద్రామభద్ర పరంజ్యోతిస్సోహమోం" ౯

(అధర్వ-౫౫ రామోత్తరతాపినీ.)

"తత్పరః పరమపురుషః పురాణపురుషోత్తమోనిత్య శుద్ధబుద్ధముక్తసత్యపరమానందానంతాద్వయపరిపూర్ణః పరమాత్మా బ్రహ్మైవాహంరామోఽస్మి." ౧౦

(అధర్వ-౫౫ రామోత్తరతాపినీ; శు-య-౯౧ తారసార.)

టీ. అహం=నేను, సదా=ఎల్లప్పుడును, ఉజ్జ్వలః=ప్రకాశించువాడను; అవిద్యాతత్కార్యహీనః=అవిద్యయును తత్కార్యమైన సంసారమును లేనివాడను, స్వాత్మబంధహరః= ఆత్మకు బంధరూపముగనుండు నవిద్యను హరించువాడను, సర్వదా=ఎల్లప్పుడును, ద్వైతరహితః=ద్వైతము లేనివాడను, ఆనందరూపః=నిరతిశయప్రేమస్వరూపుడను, సర్వ=సర్వజగత్తునకు, అధిష్ఠాన=అధిష్ఠానరూపమైన, చిన్మాత్రః=చిద్రూపుడను, నిరస్త=కొట్టబడిన, అవిద్యాతమోమోహఏవ=అవిద్యామయమైన మోహమను చీకటిగలవాడను. కావున శుద్ధబ్రహ్మమును, ఓం= అగీకారార్థమును తెలియచేయును, పరం =ప్రకృతికి పరమైన, బ్రహ్మ=బ్రహ్మము, యత్ =ఏదియో. తత్ = అది, రామచంద్రచిదాత్మకః=చిద్రూపుడైన రామచంద్రుడు; సః = రామచంద్రుడే, అహం=నేను, తత్ = ఆబ్రహ్మము, పరంజ్యోతిః = పరంజ్యోతి స్వరూపుడైన, రామభద్రః=చతురక్షరమంత్రస్వరూపుడైన రామభద్రుడు, సః = ఆరామభద్రుడు, అహం = నేను, తత్ = తత్పదవాచ్యుడైన ఈశ్వరుడును, పరః=శ్రేష్ఠుడును, పరమపురుషః=పరమపురుషుడును, పురాణపురుషోత్తమః = పురాణ పురుషులగు బ్రహ్మవిష్ణ్వాదులకన్న నుత్తముడును

నిత్యశుద్ధబుద్ధముక్తసత్యపరమానందాద్వయపరిపూర్ణః, నిత్య=నాశము లేని, శుద్ధ = మాయాసంబంధములేని, బుద్ధ = బోధస్వరూపమైన, ముక్త=అవిద్యారహితమైన, సత్య=కాలత్రయాబాధితమైన, పరమానంద=అతిశయ ప్రేమస్వరూపమైన, అనంత=అంతములేని (దేశ కాల వస్తుపరిచ్ఛేదములేని) అద్వయ=అద్వితీయమైన, పరిపూర్ణః=అంతట నిండియుండు స్వరూపముగలవాడును, పరమాత్మా = పరమాత్ముడును, బ్రహ్మ=పరబ్రహ్మమునగు, రామఏవ=రాముడే, అహమస్మి = నేనగుచున్నాను.

తా. శ్రీరామ పరబ్రహ్మలకు అభేదమును బోధించుచు నుపాసించువాడే రాముడని ఈవాక్యము చెప్పుచున్నది.

"త్రిషుధామసుయద్భోజ్యం భోక్తాభోగ్యశ్చయద్భవేత్" ౧౧
"తేభ్యోవిలక్షణస్సాక్షీ చిన్మాత్రోహంసదాశివః" ౧౨

(కృ-య-౧౨ కైవల్య.)

టీ. త్రిషు=మూడైన, ధామసు=స్థానములందు, యత్=ఏది భోజ్యం=భోజ్యమో, భోక్తా = భోక్తయును, భోగ్యశ్చ=భోగ్యమును, భవేత్=అగునో, తేభ్యః = వానికంటె, విలక్షణః = వేరైనవాడును, సాక్షీ=వానికి సాక్షియు, అహం=నేను, చిన్మాత్రః = చిన్మాత్రుడను, సదాశివః=నిత్యమంగళస్వరూపుడను.

తా. జాగ్రత్స్వప్న సుషుప్తులందు భోజ్య భోక్తృ భోగస్వరూపముగ నేదియుండునో దానికి నేను వేరైనవాడను. వానివృత్తుల నెరిగెడి సాక్షిని. చిన్మాత్రుడను. నిత్యమంగళస్వరూపుడను. శరీరత్రయమునకు విలక్షణమైన ఆత్మను.

" మయ్యేవసకలంజాతంమయిసర్వంప్రతిష్ఠితం." ౧౩
" మయిసర్వంలయంయాతితద్బ్రహ్మాద్వయమస్మ్యహం." ౧౪

(కృ-య-౧౨ కైవల్య.)

టీ. మయ్యేవ=నాయందే, సకలం=సమస్తమును, జాతం=పుట్టి నది. మయి=నాయందే, సర్వం=సమస్తమును, ప్రతిష్ఠితం = సురక్షిత ముగనున్నది. మయి=నాయందే, సర్వం=సమస్తమును, లయం=నాశ మును, యాతి=పొందుచున్నది. అద్వయం=అద్వితీయమైన, తద్బ్రహ్మ= ఆబ్రహ్మము, అహం=నేను, అస్మి=అగుచున్నాను.

తా. అద్వితీయబ్రహ్మమే నేను. సముద్రమందుపుట్టుచు నందే లయించుచు నందేయుండు బుద్బుదముల విధమున నాయందే జగము లుత్పత్తిస్థితిలయముల నొందుచున్నవి.

" నిర్వాణోస్మినిరీహోస్మినిరంశోస్మినిరీప్సితః " ౧౫

(సామ-౬౫ సన్యాస-అ ౨.)

" చిదాత్మాస్మినిరీశోస్మిపరాపరవివర్జితః " ౧౬

(అథర్వ-౭౦ అన్నపూర్ణ-౪ ౫.)

టీ. నిర్వాణోస్మి=కైవల్యస్వరూపుడ నగుచున్నాను, నిరీహః= ఇచ్ఛలేనివాడను, అస్మి=అగుచున్నాను. నిరంశోస్మి=స్వగతభేదములేని వాడనగుచున్నాను, నిరీప్సితః = కోరికలేనివాడును, చిదాత్మాస్మి = చిద్రూపుడైన ప్రత్యగాత్మనగుచున్నాను. నిరీశోస్మి = ఈశ్వరుడులేని వాడనగుచున్నాను. పరాపరవివర్జితః=జీవాత్మ పరమాత్మ భేదములేని వాడను.

తా. నేను కైవల్య స్వరూపుడను నిరీహుడను భేదత్రయము లేనివాడను.నాకును నియామకుడగు నీశ్వరుడులేడు. జీవాత్మ పర మాత్మభేదములేని శుద్ధ బ్రహ్మమును అగుచున్నానని తాత్పర్యము.

" బ్రహ్మైవాహంసర్వవేదాంతవేద్యం నాహంవేద్యంవ్యోమవా తాదిరూపం. "

" రూపంనాహంనామనాహంనకర్మ బ్రహ్మైవాహంసచ్చిదానంద
రూపం." ౧౭
(శు-య-33 సర్వసార)

టీ. అహం = నేను, సర్వవేదాంత = సమస్తోపనిషత్తులచేత, వేద్యం= తెలియదగిన, బ్రహ్మైవ=బ్రహ్మమునే, వేద్యం = ఇంద్రియములచే తెలియతగిన, వ్యోమవాతాదిరూపం=ఆకాశము వాయువు మొదలైనవానిరూపము, నాహం=నేనుగాను. రూపం=రూపము, నాహం=నేనుగాను, నామ=పేరు, నాహం=నేనుగాను. నకర్మ=కర్మముగాను. అహం=నేను, సచ్చిదానందరూపం=సత్యజ్ఞానానంద స్వరూపమయిన, బ్రహ్మైవ=బ్రహ్మమునే.

తా. ఉపనిషత్తులే బ్రహ్మమును ప్రతిపాదించుచున్నవో ఆ బ్రహ్మమునే నేను. నేనుభూతాది రూపమునుగాను. నాకు నామరూపములులేవు. నేను కర్మముగాను. సచ్చిదానందరూపుడను.

" నిత్యశ్శుద్ధోబుద్ధముక్తస్వభావ స్సత్యస్సూక్ష్మస్సద్విభుశ్చాద్వితీయః " ౧౮

" ఆనందాబ్ధిర్యఃపరఃసోహమస్మి ప్రత్యగ్ధాతుర్నాత్రసంశీతిరస్తి"
(సామ-౨౮ మైత్రేయ-అ ౧)

టీ. నిత్యః=నాశములేనివాడును, శుద్ధః=మాయాసంబంధములేనివాడును, బుద్ధముక్తస్వభావః=బుద్ధ=బోధరూపముగల, ముక్త=బంధములేని, స్వభావః=స్వభావముగలవాడును, సత్యః=కాలత్రయాభాధ్యుడును, సూక్ష్మః=సూక్ష్మరూపుడును, సత్ =సత్తారూపుడును, విభుశ్చ=సర్వవ్యాపకుడును, అద్వితీయః=రెండవది లేనివాడును, ఆనందాబ్ధిః=ఆనందసముద్రుడునై, యః = ఎవడు, పరః = పరమాత్మయై యున్నాడో, సః=వాడే, అహం=నేను, అస్మి=అగుచున్నాను. ప్రత్య

గ్ధాతుః=ప్రత్యగాత్మ స్వరూపుడను, అత్ర=ఇక్కడ, సంశీతిః = సందేహము, నాస్తి=లేదు.

తా. స్పష్టము.

" ద్వైతభావవిముక్తోస్మి సచ్చిదానందలక్షణః" ౨౧

" శుద్ధబోధస్వరూపోహం కేవలోహంసదాశివః" ౨౨

టీ. ద్వైతభావవిముక్తః= ద్వైతభావ = ద్వైతధర్మమునుండి, విముక్తః=విడువబడినవాడను, అస్మి = అగుచున్నాను. సచ్చిదానందలక్షణః=సత్యజ్ఞానానంద స్వరూపుడను, అహం = నేను, శుద్ధబోధస్వరూపః=స్వచ్ఛమైనబోధగు స్వరూపముగాగలవాడను, అహం= నేను, కేవలః= అద్వితీయుడను, సదాశివః=నిత్యమంగళస్వరూపుడను.

తా. జగజ్జీవేశ్వరాది ద్వైతజ్ఞానము నశించినవాడనైతిని. సచ్చిదానందస్వరూపమైన యాత్మనైతిని. కేవల బోధస్వరూపమగు పరబ్రహ్మము నేనే అయ్యున్నానని భావము.

" సోహమర్కఃపరంజ్యోతిరర్కజ్యోతిరహంశివః" ౨౩

" ఆత్మజ్యోతిరహంశుక్రస్సర్వజ్యోతీరసావహః" ౨౪

(అధర్వ-౯-౨ మహావాక్య.)

టీ. పరంజ్యోతిః = స్థూల ప్రపంచమునకు జ్యోతిరూపముగ, అర్కః=సూర్యుడైనట్టియు, అర్కజ్యోతిః=సూర్యునకు జ్యోతిస్వరూపమైనట్టియు, సః=ఆపరమాత్మయే, అహం=నేను, శివః=మంగళస్వరూపుడను, అహం= నేను, శుక్రః=స్వచ్ఛమైనవాడను, ఆత్మజ్యోతిః=బుద్ధికి జ్యోతియైనవాడను, సర్వజ్యోతిః= సమస్తమునకు జ్యోతియైనవాడను, రసావహః=ఆనందానుభవము నిచ్చువాడను.

తా. స్థూలప్రపంచమునకు సూర్యరూపమునను సూర్యునకు జ్యోతిరూపముగనున్న పరమాత్మయే నేను. నేను బుద్ధిని సర్వమును ప్రకాశింపజేయువాడను. మంగళస్వరూపుడను. ఆనందానుభవము గలుగజేయువాడను.

" నిష్క్రియోఽస్మ్యవికారోఽస్మినిర్గుణోఽస్మినిరాకృతిః " ౨౫
" నిర్వికల్పోఽస్మినిత్యోఽస్మినిరాలంబోఽస్మినిర్ద్వయః " ౨౬

(సామ-౭౪ ఖండిక.)

టీ. నిష్క్రియోస్మి=క్రియలేనివాడ నగుచున్నాను, అవికారోస్మి=నిర్వికారుడ నగుచున్నాను, నిర్గుణోస్మి= నిర్గుణుడనగుచున్నాను, నిరాకృతిః=ఆకారములేనివాడను, నిర్వికల్పోస్మి= నిర్వికల్పుడనగుచున్నాను, (ఎడతెగకుండువాడ నగుచున్నాను) నిత్యోస్మి = నాశములేనివాడ నగుచున్నాను, నిరాలంబోస్మి=ఆధారములేనివాడనగుచున్నాను, నిర్ద్వయః=అద్వితీయుడను.

తా. కర్మేంద్రియములు లేమి క్రియలేనివాడను. మనస్సు లేమి నిర్వికారుడను. ప్రకృతిలేమి త్రిగుణములు లేనివాడను. దేహములేనందున నాకారము లేనివాడను. అద్వైతజ్ఞానమున నిర్వికల్పుడను. నాశములేనివాడను. సకలాధారుడను గాన నాధారము లేనివాడను. అద్వితీయుడను.

కేవలాఖండబోధోఽహం స్వానందోఽహంనిరంతరః " ౨౭

(సామ-౭౪ ఖండిక)

"సత్యంజ్ఞానమనంతం యత్పరబ్రహ్మాహమేవతత్ " ౨౮

(కృ-య-౫౮ వరాహ)

టీ. అహం=నేను, కేవలాఖండబోధః=కేవలము నఖండమైన జ్ఞానమునే, అహం=నేను, స్వానందః=పరమాత్మానందస్వరూపుడను, నిరంతరః=అంతరములేనివాడను, యత్=ఏది, సత్యంజ్ఞానంఅనంతం=సత్యజ్ఞానానంతమైన, పరబ్రహ్మ=పరబ్రహ్మమో, తదేవ=ఆపరబ్రహ్మమే, అహం=నేను.

తా. స్పష్టము.

" కేవలంసచ్చిదానందం బ్రహ్మైవాహంజనార్దనః " ౨౯

(కృ-య-౯౮ వరాహ)

" అశుభశ్శుభసంకల్ప స్సశాంతోస్మినిరామయః " ౩౦

(శు-య-౬౫ సన్న్యాస-అ ౨)

టీ. కేవలం=అద్వితీయమైన, సచ్చిదానందబ్రహ్మైవ=సత్యజ్ఞానానందస్వరూపమైనబ్రహ్మమే, అహం=నేను, జనార్దనః=జనార్దనుడను, అశుభః=శుభములేనివాడను, శుభసంకల్పః=శుభసంకల్పముగలవాడను, సశాంతః=శాంతముతో గూడినవాడను, అస్మి=అగుచున్నాను, నిరామయః=రోగములేనివాడను.

తా. శుభాశుభవిహీన పరమశాంత నిరోగజనార్దన కేవల సచ్చిదానంద పరబ్రహ్మము నేనే అగుచున్నాను.

" నష్టేష్టానిష్టకలన స్సచ్చిన్మాత్రపరోస్మ్యహం " ౩౧

(శు-య-౬౫ సన్న్యాస-అ ౨)

" అంతర్యామ్యహమగ్రాహ్యోనిర్దేశ్యోహమలక్షణః " ౩౨

(కృ-య-౪౦ బ్రహ్మవిద్యా.)

టీ. అహం=నేను, నష్టేష్టానిష్టకలనః:- నష్ట=నశించిన, ఇష్టానిష్టకలనః = ఇష్టానిష్ట వ్యవహారము కలవాఁడను, సచ్చిన్మాత్రపరోస్మి=సత్యజ్ఞానస్వరూపమగు పరమాత్మ నగుచున్నాను, అహం=నేను, అంతర్యామీ=అంతర్యామియైన ఈశ్వరుఁడను, అగ్రాహ్యః=గ్రహింపబడనివాఁడను, అనిర్దేశ్యః=నిర్దేశించుటకు శక్యముగానివాఁడను, అలక్షణః=లక్షణములేనివాఁడను.

తా. 'ఇష్టమైనది యనిష్టమైనది' యను వ్యవహారములేనివాడను సత్యజ్ఞాన స్వరూపుఁడనగు పరమాత్మను, సమస్త భూతములందుండు నంతర్యామిని, విషయములవలె గ్రహింపబడువాఁడనుగాను, అవాఙ్మానసగోచరుడ నగుటచే ననిర్దేశ్యుఁడను, అలక్షణుఁడను, నిరుపాధికబ్రహ్మను.

"అద్వైతోఽహం ప్రపూర్ణోఽహం అబాహ్యోఽహమనంతరః"
"అద్వయానందవిజ్ఞాన ఘనోఽస్మ్యహమవిక్రియః" ౩౮

(కృ-య-౮౦ బ్రహ్మవిద్యా)

టీ. అహం=నేను, అద్వైతః=ద్వైతమైన జగజ్జీవాదిభేదములేనివాఁడను, అహం=నేను, ప్రపూర్ణః=సర్వపరిపూర్ణుడను, అహం=నేను, అబాహ్యః=బాహ్యప్రదేశములేనివాఁడను, అనంతరః= అంతరములేనివాఁడను, అద్వయానంద విజ్ఞానఘనః=అద్వితీయానంద ఘనుఁడను, అస్మి = అగుచున్నాను, అహం=నేను, అవిక్రయః = వికారము లేనివాఁడను.

తా. నేను ద్వైతజ్ఞానములేనివాఁడను, చిదానందఘనుఁడను, భావవికారములు లేనివాఁడను.

"అవిద్యాకార్యహీనోఽహమవాఙ్మానసగోచరః" ౩౯
"ఆత్మచైతన్యరూపోఽహమహమానందచిద్ఘనః" ౩౬

టీ. అహం=నేను, అవిద్యాకార్యహీనః = అవిద్యాకార్యమైన సంసారములేనివాడను, అవాఙ్మానసగోచరః=వాక్కులకు మనస్సునకు దెలియబడనివాడను, అహం=నేను, ఆత్మా=ఆత్మను, చైతన్యరూపః= చైతన్యస్వరూపుడను, ఆనందచిద్ఘనః=ఆనందచిద్ఘనుఁడను.

తా. స్పష్టము.

"ఆప్తకామోహమాకాశా త్పరమాత్మేశ్వరోస్మ్యహం" ౩౭
"చిదానందోస్మ్యహంచేత్తా చిద్ఘనశ్చిన్మయోస్మ్యహం" ౩౮
(కృ-య; ౪౦ బ్రహ్మవిద్యా)

టీ. అహం=నేను, ఆప్తకామః=పొందబడినకోరికగలవాఁడను, ఆకాశాత్=ఆకాశముకన్నను, పరమ=ఉత్కృష్టమైన, ఆత్మా=ఆత్మను, ఈశ్వరోస్మి = సర్వభూతములకు నియామకుఁడ నగుచున్నాను, అహం=నేను, చిదానందోస్మి=చిదానందుఁడనగుచున్నాను, చేత్తా= చైతన్యస్వరూపుఁడనగుచున్నాను, చిద్ఘనః=జ్ఞానస్వరూపుఁడను, చిన్మయః=జ్ఞానమయుడను, అహం=నేను అస్మి=అగుచున్నాను.

తా. ఆత్మస్వరూపము తెలియుటచే నితరమైన కోరికలులేక పొందబడిన కోరికలుగలవాఁడనైతిని. ఘనీభవించిన జ్ఞానమే స్వరూపము గలవాఁడను.

"జ్యోతిర్మయోస్మ్యహంజ్యాయాన్ జ్యోతిషాంజ్యోతిరస్మ్యహం" ౩౯
"నిత్యోహంనిరవద్యోహంనిష్క్రియోస్మి నిరంజనః" ౪౪
(కృ-య-౪౦ బ్రహ్మవిద్యా.)

టీ. అహం=నేను, జ్యోతిర్మయః=ప్రకాశరూపుఁడను, అస్మి = అగుచున్నాను, జ్యాయాన్=జ్యేష్ఠుఁడను, జ్యోతిషాం=సూర్యాదిజ్యోతి

స్వరూపములకు, అహం=నేను, జ్యోతిరస్మి = జ్యోతియగుచున్నాను, అహం=నేను, నిత్యః=నాశములేనివాఁడను, నిరవద్యః=నిందలేనివాఁడను నిష్క్రియోస్మి=క్రియలేనివాఁడనగుచున్నాను, నిరంజనః=దేని నంటని వాఁడను.

తా. నేను సూర్యాదులను వెలిగించు వెలుఁగును ; సర్వమునకు నాదియగుటచే బెద్దవాఁడను. మాయాసంబంధములేమిచే నిరవద్యుఁడను. నిరంజనుఁడనని భావము.

" నిర్మలోనిర్వికల్పోస్మి నిరాఖ్యాతోస్మినిశ్చలః " ౪౧
" నిర్వికారోనిత్యపూతోనిర్గుణోనిస్పృహోస్మ్యహం " ౪౨
(కృ-య-౪౦ బ్రహ్మవిద్యా)

టీ. అహం=నేను, నిర్మలః = స్వచ్ఛమైనవాఁడను, నిర్వికల్పః=నిర్వికల్పుఁడను, అస్మి=అగుచున్నాను, నిరాఖ్యాతః = ప్రకథితుఁడనుగాను, (ప్రసిద్ధుఁడనుగాను) నిశ్చలః=సంకల్పములేనివాఁడను, నిర్వికారః=భావవికారములు లేనివాఁడను, నిత్యపూతః = నిత్యపవిత్రుఁడను, నిర్గుణః= నిర్గుణుడను, నిస్పృహః = దేనియందును స్పృహలేనివాఁడను అస్మి=అగుచున్నాను.

తా. అవిద్యామాలిన్యము తొలఁగినందున స్వచ్ఛమైనవాఁడను, నిర్వికల్పుఁడను, శరీరవిలక్షణుఁడను అగుటచే భావవికారములేని వాఁడను నిత్యపవిత్రుఁడను.

" నిరింద్రియోని యంతాహం నిరపేక్షోస్మినిష్కలః " ౪౩
" పురుషఃపరమాత్మాహం పురాణఃపరమోస్మ్యహం " ౪౪
(కృ-య ; ౪౦ బ్రహ్మవిద్యా)

టీ. అహం=నేను, నిరింద్రియః=ఇంద్రియములు లేనివాఁడను, నియంతా= బుద్ధీంద్రియముల నడుపువాఁడను ; నిరపేక్షః=విషయా

పేఱు లేనివాఁడను ; అస్మి=అగుచున్నాను ; అహం=నేను, నిష్కలః= అంతరింద్రియ బాహ్యేంద్రియ పంచప్రాణములను షోడశకలలు లేనివాఁడను ; పురుషః=నూతాత్మ స్వరూపుఁడను ; అహం=నేను ; పరమాత్మా=పరమాత్మను ; పురాణః = అనాదిసిద్ధమైనవాఁడను ; పరమః=ఉత్కృష్టుఁడను ; అస్మి=అగుచున్నాను.

"పూర్ణానందైకబోధోఽహం ప్రత్యగేకరసోఽస్మ్యహం" ౪౫
"ప్రజ్ఞాతోఽహం ప్రశాన్తోఽహం ప్రకాశః పరమేశ్వరః" ౪౬

(కృ-య ; ౪౦ బ్రహ్మవిద్యా)

టీ. అహం=నేను ; పూర్ణానందైకబోధః=పూర్ణానందముతోఁ గూడిన ముఖ్యమైనబోధగా స్వరూపముగా గలవాఁడను ; అహం=నేను ; ప్రత్యగేకరసః=ప్రత్యగాత్మ స్వరూపము ; అస్మి=అగుచున్నాను ; అహం=నేను : ప్రజ్ఞాతః = అన్నిఁటిని దెలిసికొనువాఁడను ; అహం=నేను ; ప్రశాంతః=శాంతుఁడను ; అహం=నేను ; ప్రకాశః= స్వప్రకాశుఁడను ; పరమేశ్వరః=పరమేశ్వరుఁడను.

తా. స్పష్టము.

"ఏకధాచింత్యమానోఽహం ద్వైతాద్వైతవిలక్షణః" ౪౭
"శుద్ధోఽస్మి శుభ్రశ్శాంతోఽస్మి శాశ్వతోఽస్మి శివోఽస్మ్యహం" ౪౮

(కృ-య ; ౪౦ బ్రహ్మవిద్యా)

టీ. అహం=నేను ; ఏకధా=ఒక్కరీతిగనే ; చింత్యమానః=చింతించబడువాడను, ద్వైతవిలక్షణం = ద్వైతాద్వైత వ్యవహారములేనివాఁడను ; శుద్ధోఽస్మి=పరిశుద్ధుఁడనగుచున్నాను ; శుభ్రః=స్వచ్ఛుఁడను ; శాంతోఽస్మి=శాంతుఁడనగుచున్నాను ; శాశ్వతోఽస్మి=శాశ్వతుఁడనగుచున్నాను ; శివోఽస్మి-మంగళస్వరూపుఁడనగు చున్నాను.

తా. నేనే బ్రహ్మమను జ్ఞానముచేతనే చింత్యమానుఁడను గాని మఱియొకవిధమున చింతింపబడువాఁడనుగాను. అద్వైతమని ద్వైతకాలమున బోధకొఱకు చెప్పబడునుగాని పరమార్థమున నద్వైతమను వ్యవహారములేదు కావున బ్రహ్మము ద్వైతాద్వైత విలక్షణమైనది. ఆబ్రహ్మమే నేను.

"అహంసకృద్విభాతోఽస్మి స్వమహిమ్నిసదాస్థితః" ౪౯
"సచ్చిదానందమాత్రోఽహంస్వప్రకాశోఽస్మిచిద్ఘనః" ౫౦
(కృ-య-౪౦ బ్రహ్మవిద్యా)

టీ. అహం=నేను, సకృద్విభాతః=సదసద్వృత్తులులేక యొక్కమాఱుగఁ బ్రకాశించువాఁడను, అస్మి = అగుచున్నాను, సదా=ఎల్లపుడు, స్వమహిమ్ని = స్వకీయమైన మహిమయందే, స్థితః=ఉన్నవాడను, స్వప్రకాశోఽస్మి=స్వప్రకాశుఁడ నగుచున్నాను, చిద్ఘనః=జ్ఞానఘనుఁడను.

తా. ఇతరప్రకాశము నపేక్షింపక స్వప్రకాశుఁడ నగుచున్నాను. ఎల్లపుడు పరమాత్మ మహిమయందే యున్నవాఁడ నగుచున్నాను. సదాదిత్రివృత్తులులేక·ఏకరూపముగ నెల్లపుడు బ్రకాశించువాఁడను.

"మానావమానహీనోఽస్మి నిర్గుణోఽస్మిశివోఽస్మ్యహం" ౫౧
"ద్వైతాద్వైతవిహీనోఽస్మిద్వంద్వహీనోఽస్మిసోఽస్మ్యహం" ౫౨
(సామ-౨౯ మైత్రేయ.)

టీ. అహం=నేను, మానావమానహీనః=మానము నవమానము లేనివాఁడను, అస్మి=అగుచున్నాను, నిర్గుణః=గుణరహితుఁడను, అస్మి= అగుచున్నాను, శివః=శివుఁడను, అస్మి=అగుచున్నాను, ద్వైతాద్వైతహీనః=ద్వైతాద్వైత వ్యవహారములు లేనివాఁడను, అస్మి=అగు

చున్నాను, ద్వంద్వహీనః=సుఖదుఃఖాది ద్వంద్వములు లేనివాఁడను, సః=ఆపరమాత్మను, అహం=నేను, అస్మి - అగుచున్నాను.

తా. శరీరత్రయములేమిచే మానావమానములులేనివాఁడను. నిర్గుణుడను. ద్వంద్వములు లేనివాఁడను. సత్వరజస్తమో గుణములు లేనివాఁడను అగుచున్నాను. కేవల పరమాత్మ నగుచున్నాను.

"భావాభావవిహీనోస్మి భాషాహీనోస్మిభాస్య్వహం ,, ౫౩
"శూన్యాశూన్యవిహీనోస్మి శోభనాశోభనోస్మ్యహం ,, ౫౪
(సామ-౯ మైత్రేయ-అ ౩.)

టీ. అహం=నేను ; భావాభావవిహీనః=విషయనిర్విషయములులేనివాఁడను ; అస్మి=అగుచున్నాను ; భాషాహీనోస్మి=వాగాదీంద్రియములులేని వాఁడనగుచున్నాను, ః స్మి=ప్రకాశ రూపమగుచున్నాను ; అహం=నేను, శూన్యాశూన్యవిహీనః=శూన్యమైన సుషుప్తియు నశూన్యములైన జాగ్రత్స్వప్నములును లేనివాఁడను ; అస్మి=అగుచున్నాను ; అహం=నేను ; శోభనాశోభనోస్మి = శోభనాశోభనములు లేనివాఁడనగుచున్నాను.

తా. విషయనిర్విషయములు లేనివాఁడను. అవస్థాత్రయవిలక్షణుఁడును, అసంగుఁడనగుటచే శుభాశుభములు లేనివాఁడను వాగాదీంద్రియములు లేనివాఁడను నిర్గుణపరబ్రహ్మమునని తాత్పర్యము.

"సదసద్భేదహీనోస్మి సంకల్పరహితోస్మ్యహం ,, ౫౫
"నానాత్మభేదహీనోస్మి హ్యఖండానందవిగ్రహః " ౫౬
(సామ ; ౯ మైత్రేయ ; అ ౩)

టీ. అహం=నేను ; సదసద్భేదహీనః=సదసద్భేదములేనివాఁడను; అస్మి=అగుచున్నాను ; సంకల్పరహితోస్మి= మనస్సులేనందున

నిస్సంకల్పుఁడనగుచున్నాను ; నానాత్మభేదహీనోస్మి=మాయాద్యుపాధులు లేనందున నానాత్వభేదములేని వాఁడనగుచున్నాను ; అఖండానందవిగ్రహః=పరిపూర్ణానంద స్వరూపుఁడను. హి=నిశ్చయము.

తా. స్పష్టము.

"బంధమోక్షవిహీనోస్మి శుద్ధంబ్రహ్మాస్మిసోస్మ్యహం" ౫౮

"చిత్తాదిసర్వహీనోస్మి పరమోస్మిపరాత్పరః" ౫౯

(సామ-౭౯ మైత్రేయ-అ-3)

టీ. అహం=నేను; బంధమోక్షవిహీనః= బంధమోక్షములులేని వాఁడను; అస్మి=అగుచున్నాను ; శుద్ధం=శుద్ధమైన ; బ్రహ్మ=బ్రహ్మము; అస్మి=అగుచున్నాను ; సోస్మి=ఆపరమాత్మనగు చున్నాను ; చిత్తాది= చిత్తము మొదలైన ; సర్వహీనః=సమస్తములేనివాఁడను ; అస్మి=అగుచున్నాను ; పరమోస్మి=సర్వోత్కృష్టుడనగుచున్నాను ; పరాత్పరః= పరమాత్మ నగుచున్నాను.

తా. కర్తృత్వములేకయుండుటచే బంధమోక్షములేనివాఁడను ; నిస్సంగుఁడనగుటచే శుద్ధుఁడను భేదత్రయములేమిచే చిత్తాదులులేనివాఁడను.

"సదావిచార రూపోస్మినిర్విచారోస్మి సోస్మ్యహం" ౫౯

"ధ్యాతృధ్యాన విహీనోస్మిధ్యేయహీనోస్మిసోస్మ్యహం" ౬౦

(సామ; ౭౯ మైత్రేయ-అ 3)

టీ. అహం= నేను, సదా =ఎల్లప్పుడు, విచారరూపోస్మి= బ్రహ్మవిచారస్వరూపుఁడ నగుచున్నాను, నిర్విచారోస్మి=బ్రహ్మమగుటవలన విచారములేనివాఁడనగుచున్నాను, సోస్మి=ఆపరమాత్మనగుచున్నాను, ధ్యాతృధ్యానహీనః = ధ్యాతయును ధ్యానమునులేనివాఁడను, అస్మి=

అగుచున్నాను, ధ్యేయహీనోస్మి=ధ్యేయము లేనివాఁడనగుచున్నాను, సః=ఆపరమాత్మను, అస్మి=అగుచున్నాను.

తా. స్పష్టము.

" లక్ష్యాలక్ష్యవిహీనోస్మి లయహీనరసోస్మ్యహం "		౬౧
" మాతృమానవిహీనోస్మి మేయహీనశ్శివోస్మ్యహం "		౬౨

(సామ ; ౨౯ మైత్రేయ-అ 3)

టీ. లక్ష్యాలక్ష్య విహీనః = లక్ష్యాలక్ష్యములు లేనివాఁడను, అస్మి=అగుచున్నాను, అహం=నేను, లయహీనరసోస్మి=నాశములేని యనుభవస్వరూపుఁడనగుచున్నాను. అహం=నేను, మాతృమానవిహీనః=ప్రమాతృప్రమాణములు లేనివాడను, అస్మి=అగుచున్నాను, మేయహీనః= మేయములేనివాఁడను, శివః= పరమాత్మను, అస్మి=అగుచున్నాను.

తా. కూటస్థునితోఁగూడిన బుద్ధియందలి చిదాభాసుఁడు 'ప్రమాత' యనఁబడును, చిదాభాసునితోఁగూడిన మనోవృత్తి 'ప్రమాణ' మనఁబడును. ఘటాది విషయము ప్రమేయమనబడును. ప్రమేయముతోఁగూడిన ప్రమాణమందు విషయాకృతి గలుగుచున్నది. ఆ విషయమును ప్రమాతగ్రహించును. ప్రమేయమును ప్రమాణమును నిశ్చయించును.

" సర్వేంద్రియవిహీనోస్మి సర్వకర్మకృదప్యహం "		౬3
" ముదితాముదితాఖ్యోస్మి సర్వమానఫలోస్మ్యహం "		౬౪

(సామ ; ౨౯ మైత్రేయ-అ 3)

టీ. అహం=నేను, సర్వకర్మకృదపి=సమస్తకర్మములు చేయుచున్నవాఁడనైనను, సర్వేంద్రియవిహీనోస్మి=సమస్తేంద్రియములు లేనివాఁడనగుచున్నాను, ముదితాముదితాఖ్యః='ముదిత' 'అముదిత'

యను నామములు గలవాఁడను, సర్వమౌనఫలః=సమస్తమౌనముల యొక్క-ఫలము, అస్మి=అగుచున్నాను.

తా. ఆత్మజ్ఞానులకు ముదితాస్వరూపముగను అజ్ఞానులకముదితా స్వరూపముగనుండును. సర్వేంద్రియవృత్తి విముఖములై యుండుటయే సర్వమౌనము. ఆ సర్వమౌనఫలమే నేనగుచున్నాను.

షడ్వికారవిహీనోఽస్మి షట్కోశరహితోఽస్మ్యహం ,, ౬౫
దేశకాలవిహీనోఽస్మి దిగంబరసుఖోఽస్మ్యహం ,, ౬౬
(సామ-౭౯ మైత్రేయ-అ 3)

టీ. అహం=నేను, షడ్వికారహీనోఽస్మి = షడ్భావవికారములు లేనివాఁడనగుచున్నాను, షట్కోశరహితోఽస్మి = షట్కోశములులేనివాఁడ నగుచున్నాను, దేశకాలవిహీనోఽస్మి=దేశకాలవిశేషములు లేనివాఁడనగుచున్నాను, అహం=నేను, దిగంబరసుఖః=దిగంబరసుఖముగలవాఁడను, అస్మి=అగుచున్నాను.

తా. అస్తి, జాయతే, వర్ధతే, పరిణమతే, అపక్షీయతే, వినశ్యతి, ఇవి షడ్భావవికారములు. ఇవిలేనివాఁడను. త్వక్కు, మాంసము, రుధిరము, స్నాయువు, మజ్జ, అస్థి, ఇవి షట్కోశములు. ఇవి లేనివాఁడను. దేశకాలవస్తుపరిచ్ఛేదములేమిచే ననంతుడను. దిగంబరునకు దేహాభిమానముండమి సుఖమెక్కు-వగ నుండును. ఆసుఖమే నేనగుచున్నాను.

"అఖండాకాశరూపోఽస్మి హ్యఖండాకారమస్మ్యహం." ౬౭
"ప్రపంచముక్తచిత్తోఽస్మి ప్రపంచరహితోఽస్మ్యహం." ౬౮
(సామ-౭౯ మైత్రేయ-అ 3.)

టీ. అహం=నేను, అఖండాకాశరూపః = చిదాకాశస్వరూపుడను, అస్మి=అగుచున్నాను; హి=నిశ్చయము, అఖండాకారం= అనంతస్వరూము, అస్మి=అగుచున్నాను. ప్రపంచ=ప్రపంచవాసనచే, ముక్త= విడువబడిన, చిత్తఃఅస్మి = చిత్తముగలవాడ నగుచున్నాను. అహం= నేను, ప్రపంచరహితః=ప్రపంచములేనివాడను, అస్మి= అగుచున్నాను.

తా. స్పష్టము.

" సర్వప్రకాశరూపోస్మిచిన్మాత్రజ్యోతిరస్మ్యహం." ౬౯
" కాలత్రయవిహీనోస్మికామాదిరహితోస్మ్యహం" ౭౦
(సామ-౭౯ మైత్రేయ-అ 3.)

టీ. అహం= నేను, సర్వప్రకాశరూపః=అన్నిటియొక్క ప్రకాశమేస్వరూపముగా గలవాడను, (సూర్యాదిఘటాంత ప్రకాశస్వరూపుడను) అస్మి=అగుచున్నాను, చిన్మాత్రజ్యోతిః=చిన్మాత్రమైన ప్రకాశస్వరూపుడను, అస్మి =అగుచున్నాను, కాలత్రయవిహీనః = మూడుకాలములు లేనివాడను, అస్మి=అగుచున్నాను. అహం=నేను, కామాదిరహితః=కామాదులు లేనివాడను, అస్మి= అగుచున్నాను.

తా. సూర్యుడుమొదలు ఘటముదాకగల వస్తువులయొక్క ప్రకాశమే నేను. నేను కేవల చిన్మాత్రుడను. కాలత్రయమున నేకరీతిగ నుండువాడను. కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, ఈఆరుగుణములు లేనివాడను.

"ముక్తిహీనోస్మిముక్తోస్మి మోక్షహీనోస్మ్యహంసదా" ౭౧
"గంతవ్యదేశహీనోస్మిగమనాదివివర్జితః" ౭౨
(సామ-౭౯ మైత్రేయ-అ 3.)

టీ. అహం= నేను, సదా=ఎల్లప్పుడు, ముక్తిహీనః = ముక్తిలేనివాడను, అస్మి=అగుచున్నాను, ముక్తః=ముక్తుడను, అస్మి = అగుచు

న్నాను. మోక్షహీనో స్మి=మోక్షములేనివాడ నగుచున్నాను, గంత వ్య దేశహీనో స్మి=పోవుటకు తగిన దేశము లేనివాడనగుచున్నాను, గమ నాదివివర్జితః=గమనాదులు లేనివాడను.

తా. స్వతస్సిద్ధముగ బద్ధుడనుగాను కావున ముక్తిలేనివాడను. అవిద్యాక్రాంతమై పిదప నాత్మజ్ఞానమున నవిద్య తొలగెనుగావున ముక్తుడను. ఏయవస్థయు లేనివాడను గావున మోక్షమును లేని వాడను. పరిపూర్ణుడనుగావున పోవుటకు చోటులేదు. నిరవయవుడను గావున గమనాదిక్రియలు లేనివాడను.

"సర్వదా సమరూపో స్మిశాంతో స్మి పురుషో త్తమః" ౭౩

(సామ-౭౯ మైత్రేయ-అ3.)

"చిదక్షరోహంసత్యోహంవాసుదేవో౽జరో౽మరః" ౭౪

(కృ-య-3౭ తేజోబిందు.)

టీ. అహం=నేను, సర్వదా=ఎల్లపుడు, సమరూపః=సమరూ పుడను, అస్మి=అగుచున్నాను శాంతః=శాంతుడను, పురుషో త్తమః= పురుషోత్తముడను, అస్మి= అగుచున్నాను, చిత్ = జ్ఞానస్వరూపుడను, అక్షరః=కూటస్థుడను, అహం=నేను, సత్యః=కాలత్రయాబాధ్యుడను, వాసుదేవః= వాసుదేవుడను, అజరః= జరలేనివాడను, అమరః= నాశ ములేనివాడను, అస్మి= అగుచున్నాను. తనయందు సమస్తభూతము లును సమస్తభూతములందు తాను వసించువాడని వాసుదేవశబ్దమున కర్థము.

తా. స్పష్టము.

అహమేకాక్షరంబ్రహ్మ వాసుదేవాఖ్యమద్వయం" ౭౫

(అధర్వ-౪3 నారదపరివ్రాజక-అ-3.)

పరబ్రహ్మస్వరూపోహం పరమానందమస్మ్యహం" ౭౬

(కృ-య-3౭ తేజోబిందు.)

టీ. అహం=నేను. ఏకాక్షరం=ఓంకారస్వరూపమైన, బ్రహ్మ= బ్రహ్మమును, అద్వయం=అద్వితీయమైన, వాసుదేవాఖ్యం=వాసుదేవ నామమైన, పరబ్రహ్మస్వరూపః=పరబ్రహ్మ స్వరూపుడను, అహం= నేను, పరమానందం=పరమానందస్వరూపుడను, అస్మి=అగుచున్నాను.

తా. స్పష్టము.

" కేవలంజ్ఞానరూపోహం కేవలం పరమోస్మ్యహం " ౭౭
" కేవలంశాంతరూపోహం కేవలం చిన్మయోస్మ్యహం " ౭౮
(కృ-య ; ౩౭ తేజోబిందు ; అ 3.)

టీ. అహం=నేను, కేవలం=ముఖ్యముగ, జ్ఞానరూపః=చిద్రూపుఁడను. అహం=నేను, కేవలం=ముఖ్యముగ, పరమోస్మి = ఉత్కృష్టుఁడ నగుచున్నాను, అహం=నేను, కేవలం = ముఖ్యముగ, శాంతరూపః = శాంతాకారుఁడను, అహం=నేను, కేవలం = ముఖ్యముగ, చిన్మయోస్మి=చిన్మయుఁడ నగుచున్నాను.

తా. నేను కేవల ప్రత్యగాత్మను గావున, చిద్రూపుఁడను, శాంతుఁడను, పరముఁడను, చిన్మయుఁడను.

" కేవలం నిత్యరూపోహం కేవలం శాశ్వతోస్మ్యహం " ౭౯
" కేవలంసత్యరూపోహమహం త్యక్త్వా హామస్మ్యహం " ౮౦
(కృ-య ; ౩౭ తేజోబిందు ; అ 3.)

టీ. అహం=నేను, కేవలం=ముఖ్యముగ, నిత్యరూపః=నాశము లేని రూపముగలవాఁడను, అహం = నేను, కేవలం = ముఖ్యముగ, శాశ్వతోస్మి=ఎప్పుడు నుండువాఁడ నగుచున్నాను, కేవలం=ముఖ్యముగ, అహం= నేను, సత్యరూపః= కాలత్రయాబాధ్యమైన రూపము గలవాఁడను, అహం=నేను, త్యక్త=విడువబడిన, అహమస్మి = అహమస్మిగలవాడను.

తా. ప్రత్యగాత్మస్వరూపుఁడనగు నేను నిత్యుఁడను. శాశ్వతుఁడను. సత్యుడను, అహంభావములేనివాఁడను. (ఇచ్చట నింకొక "అహం" ఎక్కువపడ్డది)

" కేవలంతుర్యరూపోస్మి తుర్యాతీతోస్మి కేవలం" ౮౧
" కేవలాకారరూపోస్మిశుద్ధరూపోస్మ్యహంసదా" ౮౨
(కృ-య ; 32 తేజోబిందు-అ 3.)

టీ. అహం=నేను, సదా=ఎల్లప్పుడు, కేవలం = ముఖ్యముగ, తుర్యరూపోస్మి=తురీయస్వరూపుఁడనగుచున్నాను, కేవలం = ముఖ్యముగ, తుర్యాతీతః=తుర్యాతీతుఁడను, అస్మి=అగుచున్నాను, కేవలాకారరూపోస్మి అద్వితీయాకారమే రూపముగాఁగలవాడ నగుచున్నాను. శుద్ధరూపోస్మి= శుద్ధరూపుఁడనగుచున్నాను.

తా. జాగ్రత్స్వప్నసుషుప్తులకు సాక్షినగుటచే దురీయుఁడను. కేవల పరబ్రహ్మనగుటచే దురీయాతీతుఁడను. అద్వితీయుఁడనగుటచే తను నిస్సంగుడను. అందుచే బరిశుద్ధుఁడను.

" నిర్వికల్పస్వరూపోస్మి నిరీహోస్మినిరామయః" ౮౩
" అపరిచ్ఛిన్నరూపోస్మి హ్యనంతానందరూపవాన్" ౮౪
(కృ-య-32 తేజోబిందు-అ 3.)

టీ. నిర్వికల్పస్వరూపః=నిర్వికల్పస్వరూపుఁడను, అస్మి = అగుచున్నాను, నిరీహోస్మి = ఇచ్ఛలేనివాఁడ నగుచున్నాను, అపరిచ్ఛిన్నరూపః=ఆక్రమింపబడని రూపముగలవాఁడను, అస్మి=అగుచున్నాను. అనంతానందరూపవాన్=అనంతానంద రూపవంతుఁడను.

తా. స్పష్టము.

" ఆత్మారామస్వరూపోస్మిహ్యహమాత్మాసదాశివః " ౪౫
" ఆదిమధ్యాంతశూన్యోస్మిహ్యాకాశసదృశోస్మ్యహం " ౪౬
(కృ-య-32 తేజోబిందు-అ 3.)

టీ. అహం=నేను, ఆత్మారామస్వరూపః=ఆత్మయందే రమించు రూపముగలవాఁడను, అస్మి=అగుచున్నాను. ఆత్మా = ప్రత్యగాత్మను, సదాశివః=సదాశివుఁడను. ఆదిమధ్యాంతశూన్యః=ఆదిమధ్యాంతములు లేనివాఁడను, అస్మి=అగుచున్నాను, అహం = నేను, ఆకాశసదృశః= ఆకాశతుల్యుఁడను, అస్మి=అగుచున్నాను.

తా. స్పష్టము.

" నిత్యశుద్ధచిదానంద స్సత్తామాత్రోహ మవ్యయః " ౪౭
" నిత్యశుద్ధవిశుద్ధైక సచ్చిదానంద మస్మ్యహం " ౪౮
(కృ-య ; 32 తేజోబిందు ; అ 3 )

టీ. అహం=నేను ; నిత్యశుద్ధచిదానందః, నిత్య=నాశములేని శుద్ధ=స్వచ్ఛమైన ; చిదానందః=జ్ఞానానంద స్వరూపుడను ; సత్తామాత్రః=సద్రూపుడను ; అవ్యయః=నాశములేనివాఁడను ; అహం=నేను నిత్యశుద్ధ=మాయాయోగములేనందున నెప్పుడు బరిశుద్ధమైన ; విశుద్ధ=అవిద్యనశించినందున స్వచ్ఛమైన ; ఏక=ముఖ్యమైన; సచ్చిదానందం=సత్యజ్ఞానానంద స్వరూపుఁడను ; అస్మి=అగుచున్నాను.

తా. అవిద్యనశించినందున సచ్చిదానంద స్వరూపమైన ప్రత్యగాత్మనగుచున్నాను. అని తాత్పర్యము.

" భూమానంద స్వరూపోహం భాషాహీనోస్మ్య హంసదా" ౪౯
" సర్వాధిష్ఠాన రూపోస్మిసర్వదా చిద్ఘనోస్మ్యహం " ౫౦
(కృ-య; 32 తేజోబిందు ; అ 3 )

టీ. అహం=నేను ; భూమానంద స్వరూపః= సాంద్రానంద స్వరూపుఁడను ; అహం=నేను ; సదా=ఎల్లప్పుడును ; భాషాహీనోస్మి=వాగాదీంద్రియములు లేనివాఁడనగు చున్నాను ; సర్వాధిష్ఠాన రూపః=సకలజగత్తున కధిష్ఠానమైనవాఁడను ; అస్మి=అగుచున్నాను. అహం=నేను ; సర్వదా=ఎల్లప్పుడును ; చిద్ఘనః=జ్ఞానఘనుఁడను ; అస్మి=అగుచున్నాను.

" చిత్తవృత్తివిహీనోఽహం చిదాత్మైకరసోస్మ్యహం." ౯౧
" అహంబ్రహ్మైవ సర్వం స్యాదహంచైతన్యమేవహి " ౯౨
(కృ-య; 32 తేజోబిందు ; అ ౩ ;)

టీ. అహం=నేను ; చిత్తవృత్తివిహీనః = చిత్తవృత్తులులేనివాఁడను; అహం=నేను ; చిదాత్మ=జ్ఞానస్వరూపమగు నాత్మయొక్క; ఏక= ముఖ్యమైన; రసః=అనుభవముగలవాఁడను; అస్మి=అగుచున్నాను అహం=నేను ; సర్వం=సమస్తమును ; బ్రహ్మైవ=బ్రహ్మమే ; స్యాత్ = అగుదును ; అహం=నేను ; చైతన్యమేవ=చైతన్యమే.

తా. ప్రమాణము, విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతి యని చిత్తవృత్తు లయిదువిధములు. ప్రత్యక్షము, అనుమానము, శబ్దము, అని ప్రమాణము మూఁడువిధములు. ఒకరుచెప్పినను చెప్పకయున్నను, దనంతటదనకు వస్తుస్వరూపముతోఁచుట ప్రత్యక్షము. (ఇంద్రియార్థసన్నికర్షజన్యజ్ఞానము ప్రత్యక్షము. ఇంద్రియార్థసంయోగమువలన పుట్టిన జ్ఞానము ప్రత్యక్షము) పొగనుచూచి యగ్నిఁజూడకయున్నను నగ్నిగలదని నిశ్చయించినట్లు కార్యమునుబట్టి కారణమున్నది అని యెఱుఁగుట యనుమానము (వ్యాప్తివిశిష్టపక్షధర్మతాజ్ఞానము పరామర్శము). " పరామర్శజన్యజ్ఞానమనుమితిః " పరామర్శవలన గలిగినజ్ఞాన మనుమితి. " అనుమితికరణమనుమానం " తత్కరణ మనుమానము. పర్వతమందలి పొగనుచూచి పర్వతమగ్ని

గలదనుట యనుమానము.) వేదవాక్యము, గురువాక్యము మొదలైనవానిని నమ్ముట శబ్దము. ("ఆప్తవాక్యంశబ్దం", "ఆప్తస్తుయథార్థవక్తా" ఆప్తవాక్యముశబ్దము. ఆప్తుఁడుయథార్థవాది) ఇది యంతయు ప్రమాణవృత్తి 'విపర్యయోమిథ్యాజ్ఞాన మతద్రూపప్రతిష్ఠితం' అను పతంజలిసూత్రమున త్రాడు జూచి పామనుకొనునట్లొక దాని జూచి మఱియొకటియని తలఁచుట విపర్యయము 'శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యోవికల్పః' అను సూత్రమున శబ్దజ్ఞానానుపాతమైనను వస్తుశూన్యమగుట వికల్పము. రాఘు నవ్వెననునపుడు శబ్దార్థమువలన బోధపడినను నిజముగ నట్లులేదు, ఇట్టిబోధయే (వృత్తియే) వికల్పము 'అభావప్రత్యయాలంబనావృత్తిర్నిద్రా' అనునట్లు విషయజ్ఞానములు లేక సర్వేంద్రియములు ముకుళించుట నిద్ర 'అనుభూతవిషయాసంప్రమోషస్స్మృతిః' అనుభవించిన విషయములను స్మరణమునకుదెచ్చికొనుట స్మృతి. ఈవృత్తులు వైరాగ్యమునను బ్రహ్మజ్ఞానమునను నశించును. నే నీవృత్తులు లేనివాఁడనని యభిప్రాయము.

"అహమేవాహమేవాస్మిభూమాకారస్వరూపవాన్" ౯౩
"అహమేవమహానాత్మాహ్యహమేవపరాత్పరః" ౯౪

(కృ-య-౩౭ తేజోబిందు-అ ౩.)

టీ. అహం='అహం' శబ్దవాచ్యమైన జీవునిగాఁదోఁచు నేను, అహమేవ='అహం' శబ్దలక్ష్యమైన పరమాత్మనే (ప్రత్యగాత్మనే) అస్మి=అగుచున్నాను, భూమాకారస్వరూపవాన్=పరమాకార స్వరూపవంతుఁడను, అహమేవ=నేనే, మహాన్=ఘనమైన, ఆత్మా=ఆత్మను, అహమేవ=నేనే, పరాత్పరః=పరమాత్మను.

తా. స్పష్టము.

"అహంమన్యవదాభామిహ్యహమేవశరీరవాన్" ౯౫
"అహంశిష్యవదాభామిహ్యహంలోకత్రయాశ్రయః" ౯౬
(కృ-య ; 32 తేజోబిందు ; అ 3.)

టీ. అహం = ప్రత్యగాత్మస్వరూపుఁడనగు నేను, అన్యవత్ = చిదాభాసుఁడైన జీవునివలె, ఆభామిహి=తోఁచుచున్నాను, అహమేవ=ప్రత్యగాత్మనగు నేనే, శరీరవాన్=ఘటమువంటి శరీరముగల వాఁడను, అహం=గురుస్వరూపుఁడనగు నేనే, శిష్యవత్ = ముముక్షువగు శిష్యునివలె, ఆభామి=తోఁచుచున్నాను, అహం= నేను,లోకత్రయాశ్రయః, లోకత్రయ=మూఁడు లోకములకు, ఆశ్రయః=ఆధారమైన స్థానమును.

తా. ఒక్క యాకాశమే మహాకాశమనియు, మేఘాకాశమనియు, ఘటాకాశమనియు, జలాకాశమనియు, నాలుగు విధములుగ నుపాధులబట్టి చెప్పఁబడునట్లు, బ్రహ్మమే బ్రహ్మమనియు, ఈశ్వరుఁడనియు, కూటస్థుఁడనియును, జీవుఁడనియు, నుపాధులఁబట్టి నాలుగు విధములుగఁ జెప్పఁబడును. అంతటను వ్యాపించి యనంతమై యున్నది యాకాశము. అట్టిదే బ్రహ్మమును. మేఘమండలమందు ఘనీభవించిన నీట బ్రతిఫలించిన యాకాశము మేఘాకాశము. అట్టివాఁ డీశ్వరుఁడు. మాయయందు ప్రతిబింబించిన బ్రహ్మము. ఘటమందున్న మహాకాశము ఘటాకాశ మనబడును. అట్టివాఁడు కూటస్థుఁడు (ఘటమువంటి స్థూలసూక్ష్మాత్మకమైన శరీరమున కాధారుఁడు) అతఁడే ప్రత్యగాత్మయని యుఁ జెప్పబడును. ఘటమందలి నీట బ్రతిబింబించు నాకాశము జలాకాశ మనబడును. అట్టివాఁడే జీవుఁడు (కూటస్థునియందు నవిద్యచే గల్పింపబడిన యంతఃకరణమున బ్రతిబింబించిన కూటస్థచైతన్యము) నీటివలన ఘటాకాశమును మఱుఁగుపఱచి జలాకాశము తానే పైకి కనుపడునట్లు తన కాధారుఁడైన కూటస్థుని విడిచి యంతఃకరణ వృత్తులతో జీవుఁడే నేను నేనని పైకి గనపడుచున్నాఁడు.

కూటస్థుఁడు మఱుగుపడుటయు జీవుఁడు పైకి గనుపడుటయు నన్యోన్యాధ్యాసమనఁబడును. వాస్తవమున జలాకాశ మసత్యమై ఘటాకాశము సత్యమైనను జలాకాశమే కనుపడునట్లు సత్యమైన 'యహం' శబ్దలక్ష్యమైన కూటస్థుఁడు మఱుగుపడి యసత్యమైన 'యహం' శబ్దవాచ్యుఁడైన జీవుఁడు పైకి గనబడుటచే 'అహమన్యవదాభాతి' యని చెప్పఁబడెను. అజ్ఞానికికూటస్థుఁడు తోఁచకయుండుట యవిద్య. కూటస్థుఁడుకలఁడని విద్వాంసులు చెప్పినను, దోఁచకయుండుట 'యావృత్తి' తాను జీవుడని తోఁచుట 'విక్షేపశక్తి' ఈ యవిద్య తత్వజ్ఞానికుండదు కావున, నతనికి జీవత్వము మిథ్యగను దాను కూటస్థుఁడనియుఁదోఁచును. అట్లుతోఁచుటయే, విద్యయనియు జ్ఞానమనియు జెప్పఁబడును. అట్టిజ్ఞానమున నవిద్య నశించునుగాని, ఇతరములైన కర్మాదులు నశింపవు. ఈజ్ఞానము పరోక్షమనియు నపరోక్షమనియు రెండువిధములు. గురుబోధమునను యుక్తిని గూటస్థుఁడుగలఁడని యెఱుంగుట పరోక్షజ్ఞానము. తానే కూటస్థుఁడని యెఱుగుట యపరోక్షజ్ఞానము. అపరోక్షజ్ఞానికి తెలియదగినది యింక యుండదు. పొందఁదగిన లాభము మఱియుండదు. అపరోక్షజ్ఞానమున నవిద్య నశింపగ మోక్షము గలుగుచున్నది.

"అహంకాలత్రయాతీతోహ్యహం వేదైరుపాసితః" ౯౭
"అహంశాస్త్రేణ నిర్ణీతోహ్యహంచిత్తే వ్యవస్థితః" ౯౮
(కృ-య-32 తేజోబిందు-అ 3)

టీ. అహం = కూటస్థబ్రహ్మమగు నేను ; కాలత్రయాతీతోహి=మూడుకాలముల కతీతుఁడను ; అహం=నేను, వేదైః=వేదములచేత ; ఉపాసితః=ఉపాసింపబడువాఁడను ; అహం=నేను, శాస్త్రేణ=శాస్త్రముచేత, నిర్ణీతోహి=నిర్ణయింప బడువాఁడను ; అహం=నేను, చిత్తే=చిత్తమందు ; వ్యవస్థితః=ఉండువాఁడను.

తా. కూటస్థచైతన్యమగు నేను, మూడుకాలముల కతీతుఁ

డను. వేదములచే నుపాసింప బడువాఁడను, చిత్తవృత్తిసాక్షిగనున్న వాఁడను.

"ఆనందఘనఏవాహం అహంబ్రహ్మాస్మి కేవలం" ౯౯
"ఆత్మనాత్మని తృప్తోస్మ్యహ్యరూపోహ్యహమవ్యయః" ౧౦౦
(కృ-య; 32 తేజోబిందు ; అ 3.)

టీ. అహం=నేను ; ఆనందఘనఏవ = ఆనంద ఘనుఁడనే ; అహం=నేను ; బ్రహ్మాస్మి=బ్రహ్మనగుచున్నాను ; కేవలం=ముఖ్యముగ ; ఆత్మనా=ఆత్మచేత ; ఆత్మని=ఆత్మయందు ; తృప్తోస్మివా=తృప్తి బొందిన వాడఁనగుచున్నాను ; అరూపఃహి=రూపములేనివాఁడను ; అహం= నేను ; అవ్యయః=నాశములేనివాఁడను.

తా. సుషుప్తియందలి యానందమితర విషయములతోఁమిశ్రమముగాక యున్నందున నానందఘనమనఁబడును. (ఘనీభవించిన యానందము) ఆ యానంద ఘనమే నేను. నిత్యతృప్తుఁడను. కేవల బ్రహ్మమును.

"ఆకాశాదపిసూక్ష్మో హమాద్యంతాభావవానహం" ౧౦౧
"సత్తామాత్ర స్వరూపోహంశుద్ధమోక్ష స్వరూపవాన్" ౧౦౨
(కృ-య ; 32 తేజోబిందు ; అ 3.)

టీ. అహం=నేను ; ఆకాశాత్=ఆకాశముకన్నను ; సూక్ష్మః=సూక్ష్మమైనవాఁడను ; అహం=నేను ; ఆద్యంతాభావవాన్ = ఆద్యంతములులేనివాఁడను ; అహం= నేను ; సత్తామాత్ర స్వరూపః=సమస్త వస్తువులకు సత్తను ; శుద్ధమోక్షస్వరూపవాన్ = కేవలమోక్ష స్వరూపుఁడను.

తా. స్పష్టము.

"సత్యానందస్వరూపోఽహం జ్ఞానానందఘనోఽస్మ్యహం" ౧౦౩
"నామరూపవిముక్తోఽహ మహామానంద విగ్రహా" ౧౦౪

(కృ-య ; ౩౭ తేజోబిందు ; అ ౩)

టీ. అహం=నేను; సత్యానందస్వరూపః=సత్యానంద స్వరూపుఁడను ; అహం=నేను ; జ్ఞానానందఘనః = చిదానందఘనుఁడను ; అస్మి=అగుచున్నాను ; అహం=నేను ; నామరూపవిముక్తః=నామరూపములనుండి విడువబడినవాఁడను ; అహం=నేను ; ఆనందవిగ్రహః= ఆనందస్వరూపుఁడను.

తా. స్పష్టము.

"ఆదిచైతన్యమాత్రోఽహ మఖండైకరసోఽస్మ్యహం" ౧౦౫
"సర్వత్రపూర్ణరూపోఽహం పరామృతరసోఽస్మ్యహం" ౧౦౬

(కృ-య ; ౩౭ తేజోబిందు ; అ ౩.)

టీ. అహం=నేను ; ఆదిచైతన్యమాత్రః = మాయాజృంభణమునకు ముందున్న బ్రహ్మమును; అహం=నేను; అఖండైకరసః=అఖండ బ్రహ్మానుభవము గలవాఁడను ; అస్మి=అగుచున్నాను ; అహం=నేను సర్వత్రపూర్ణరూపః=అంతటను నిండియున్న స్వరూపముగలవాఁడను ; అహం=నేను ; పరామృతరసః=ఉత్కృష్టమైన కైవల్యస్వరూపుఁడను ; అస్మి=అగుచున్నాను.

తా. నేను శుద్ధబ్రహ్మమును , సర్వవ్యాపకుఁడను, అమృతస్వరూపుఁడను, అఖండ బ్రహ్మానుభవము గలవాఁడను.

"ఏకమేవాద్వితీయం సద్బ్రహ్మైవాహంనసంశయః" ౧౦౭
"అహమేవపరంబ్రహ్మ హ్యహమేవగురోర్గురుః" ౧౦౮

(కృ-య ; ౩౭ తేజోబిందు ; అ ౩.)

టీ. అహం=నేను ; ఏకమేవ=ఒక్కటియేయైనదియును ; అద్వితీయం=రెండవదిలేనిదియునగు, సత్=సద్వస్తువైన ; బ్రహ్మైవ=బ్రహ్మమునే ; నసంశయః=సంశయములేదు; అహమేవ=నేనే, పరం=ఉత్కృష్టమైన, బ్రహ్మహి=బ్రహ్మమును, అహమేవ=నేనే, గురోః=గురువునకు, గురుః=గురువును.

తా. సృష్టికిముందు సజాతీయ విజాతీయ స్వగతభేదములేని సద్వస్తువైన యేబ్రహ్మముగలదో, యాబ్రహ్మమే నేను; ఎల్లవారికిని గురువు బ్రహ్మముగావున "సర్వేషామపిగురుఃకాలేనానవచ్ఛేదాత్" అను సూత్రమువలన నేనే గురువులకు గురువును.

" సర్వజ్ఞానప్రకాశోస్మిముఖ్యవిజ్ఞానవిగ్రహః " ౧౦౯
" తుర్యాతుర్యప్రకాశోస్మితుర్యాతుర్యవివర్జితః " ౧౧౦
(కృ-య ; 32 తేజోబిందు ; అ ౫.)

టీ. సర్వజ్ఞానప్రకాశః, సర్వజ్ఞాన=సర్వజ్ఞత్వముచేత, ప్రకాశః=ప్రకాశించువాఁడను, అస్మి=అగుచున్నాను, ముఖ్యవిజ్ఞానవిగ్రహః, ముఖ్య=ముఖ్యమయిన, విజ్ఞాన = ఆత్మానుభవజ్ఞానమే, విగ్రహః = రూపముగలవాఁడను, తుర్య=జాగ్రత్స్వప్నసుషుప్తులకు విలక్షణమైన స్థితియందు ; అతుర్య = జాగ్రత్స్వప్న సుషుప్తులందును, ప్రకాశః= ప్రకాశించువాఁడను, అస్మి = అగుచున్నాను, తుర్యాతుర్యవివర్జితః= తుర్యాతుర్యములు లేనివాఁడను.

తా. తుర్యమందునతుర్యమందు ప్రకాశించువాఁడను. తుర్యాతుర్యములు లేనివాఁడను ; దేహేంద్రియములులేమిచే తుర్యములేనివాఁడను; తుర్యములేమిచే నతుర్యములేనివాఁడను.

" దృశిస్వరూపం గగనోపమం పరం సకృద్విభాతం త్వజమేకమక్షరం ", ౧౧౧

" అలేపకంసర్వగతం యదద్వయం తదేవచాహం సకలం విముక్తం " ౧౧౨

(శు-య; ౧౦౮ ముక్తిక; అ ౨.)

టీ. దృశిస్వరూపం=దృగ్రూపమైనదియు, గగనోపమం-ఆకాశమువంటిదియు, పరం = ప్రకృతికిపరమైనదియు, సకృద్విభాతంతు = సదాదిత్రివృత్తులులేక ప్రకాశించునదియు, అజం = పుట్టుకలేనిదియు, ఏకం=ఒక్కటియైనదియు, అక్షరం = నాశములేనిదియు, అలేపకం= నిరంజనమైనదియు, సర్వగతం=సమస్తముననున్నదియును, అద్వయం= అద్వితీయమైనదియు, యత్=ఏబ్రహ్మమో, సకలం=సమస్తరూపమైనదియు, విముక్తం = మాయాముక్తమునగు, తదేవచ = ఆబ్రహ్మమే అహం=నేను.

తా. సర్వసాక్షియునక్షరము నిరంజనమునగు బ్రహ్మమే నేను.

" అహంబ్రహ్మాస్మిమంత్రోయం జన్మపాపంవినాశయేత్ "౧౧౩

" అహంబ్రహ్మాస్మిమంత్రోయం భేదబుద్ధింవినాశయేత్ "౧౧౪

(కృ-య ; ౩౭ తేజోబిందు; అ ౩.)

టీ. అహంబ్రహ్మాస్మి=' అహంబ్రహ్మాస్మి ' యను, అయంమంత్రః=ఈమంత్రము, జన్మపాపం=జన్మమునకు హేతువైన కర్మస్వరూపమగు పాపమును, వినాశయేత్ = నశింపజేయును, అహంబ్రహ్మాస్మి= ' అహంబ్రహ్మాస్మి ' యను, అయంమంత్రః=ఈమంత్రము, భేదబుద్ధిం= జగజ్జీవేశ్వరాది భేదబుద్ధిని, వినాశయేత్=నశింపజేయును.

తా. ' అహంబ్రహ్మాస్మి ' యను మంత్రము సమస్తకర్మములను నశింపజేయును గాన నా మంత్రోపాసనమున జన్మరాహిత్యమగును. జగజ్జీవేశ్వరాది భేదము నశించునుగాన నా మంత్రోపాసనమున సమస్తమును బ్రహ్మమని తోఁచును. సమత్వము గలుగును.

" అహంబ్రహ్మాస్మి మంత్రోయం కోటిదోషం వినాశయేత్ "
" అహంబ్రహ్మాస్మి మంత్రోయం జ్ఞానానందం ప్రయచ్ఛతి "

(కృ-య ; 32 తేజోబిందు ; అ 3.)

టీ. అహంబ్రహ్మాస్మి మంత్రోయం='అహంబ్రహ్మాస్మి' యను నీమంత్రము, కోటిదోషం=కోటిదోషములను, వినాశయేత్=నశింప జేయును, జ్ఞానానందం = జ్ఞానానందస్వరూప కైవల్యమును, ప్రయచ్ఛతి=కూర్చును.

తా. స్పష్టము.

" సర్వమంత్రాన్ సముత్సృజ్యైతన్మంత్రంసమభ్యసేత్ " ౧౧౭
" సద్యోమోక్షమవాప్నోతి నాస్తిసందేహమణ్వపి " ౧౧౮

(కృ-య; 32 తేజోబిందు; అ 3.)

టీ. సర్వమంత్రాన్ = సమస్తమంత్రములను , సముత్సృజ్య= విడిచి, ఏతన్మంత్రం=ఈమంత్రమును, సమభ్యసేత్ =అభ్యసింపవలెను, సద్యః=వెంటనే, మోక్షం=మోక్షమును, అవాప్నోతి=పొందుచున్నా, డు, సందేహం=సంశయము, అణ్వపి=అణుమాత్రమైనను, నాస్తి=లేదు.

తా. చిత్తభ్రమకారకములైన యితరమంత్రము లన్నిటిని విడిచి, ఈ యహం బ్రహ్మాస్మియను మంత్రము నుపాసించినవెంటనే మోక్షము గలుగును సందేహము కొంచెమునులేదు. తానే బ్రహ్మ మనునపరోక్షజ్ఞానము గలుగుటయే యీమంత్రజపము. తాను బ్రహ్మ ముగావున బ్రహ్మలక్షణము లన్నియు దనకే గలిగెనని స్వానుభూతి వాక్యముల జెప్పఁబడెను. చెప్పినదానినే మఱల జెప్పుటచే బున రుక్తిదోష మనరాదు. ఈవాక్యము లొక్కొక్క యుపనిషత్తునుండి

గూర్పఁబడి వ్రాయఁబడినవి. కావున, సర్వోపనిషత్తు లిట్లేకీభవించినవని తెలియవలెను.

ఇతిసార్ధాంతికస్వానుభూతి వాక్యాన్యష్టాదశో త్తరశతం.

ఇట్లు సార్ధాంతికస్వానుభూతి వాక్యములు నూటపదునెనిమిది.

ఇతి నవమంప్రకరణం సమాప్తం.

ఇట్లు తొమ్మిదవ ప్రకరణము సమాప్తము.

---

శ్రీ
సద్గురవేనమః

# ౧౦ సమాధివాక్య ప్రకరణము.

" జీవాత్మపరమాత్మైక్యావస్థా త్రిపుటిరహితా
పరమానందస్వరూపా శుద్ధచైతన్యాత్మికా సమాధిః " ౧

(అధర్వ ; గ్రం శాండిల్య ; అ ౧.)

టీ. జీవాత్మపరమాత్మైక్యావస్థా=జీవాత్మపరమాత్మ లిర్వురకు నైక్యమగునవస్థయు, త్రిపుటిరహితా=ధ్యానము, ధ్యేయము, ధ్యాత, యను త్రిపుటలేనిదియు, పరమానందస్వరూపా = ఉత్కృష్టానందమే స్వరూపముగాగలదియు, శుద్ధచైతన్యాత్మికా = మాయావిద్యలసంబంధములేని శుద్ధచైతన్య స్వరూపమైనదియు, సమాధిః = సమాధియనబడును.

తా. ధ్యానసమయమున నిది ధ్యానము. నేను ధ్యానించుచున్నాను. ఇది ధ్యానింపబడునది, యను భేదజ్ఞానములేని స్థితిసమాధి. అట్టి సమాధియందు జగజ్జీవేశ్వరాది భేదబుద్ధియుండదు. ఇంద్రియసంబంధముగాని యుత్కృష్టానందము గలుగును. సుషుప్తియందే జీవేశ్వరభేదబుద్ధిలేకయుండుట, దుఃఖములేని కేవలసుఖమే స్ఫురించుట, యెల్లవారికి దెలిసియున్నది. ఇక తురీయమైనసమాధిదశయందు జెప్పనేల? అనుభవజ్ఞులకే దెలియవలయునని తాత్పర్యము.

" ధ్యాతృధ్యానేవిహాయనివాతస్థితిదీప వద్ధ్యేయైకగోచరంచిత్తం సమాధిః " ౨

(శు-యు; గ్రం పైంగల; అ 3.)

టీ. ధ్యాతృధ్యానే=ధ్యానించువానిని ధ్యానమును, విహాయ = విడిచి, నివాతస్థితదీపవత్, నివాతస్థిత=వాయుప్రచారములేనిస్థలమున నున్న, దీపవత్=దీపమువలె, ధ్యేయైకగోచరం = ధ్యానింపబడుచున్న బ్రహ్మమేముఖ్యముగ గోచరముగనున్న, చిత్తం=చిత్తము, సమాధిః= సమాధియనఁబడును.

తా. ధ్యానము, ధ్యాత, యను వృత్తిలేక ధ్యేయమైన బ్రహ్మ స్వరూపమొందినచిత్తమే సమాధి. భ్రమరకీటన్యాయమున ధ్యానింపఁగ జిత్తమే బ్రహ్మాకారమొందును. అదియే సమాధియనబడును.

"మనఃప్రచారశూన్యం పరమాత్మనిలీనంభవతి" 3

(శు-య; ౭౮ మండలబ్రాహ్మణ; బ్రా 3.)

టీ. ప్రచారశూన్యం=కామాదివికారములేని, మనః=మనస్సు, పరమాత్మని=పరమాత్మయందు, లీనం=ఐక్యము, భవతి=అగుచున్నది.

తా. మాలిన్యములేని యుప్పుగడ్డ నీట నైక్యమౌనట్లు కామాదివికారములేని స్వచ్ఛమైన మనస్సు, పరమాత్మయందైక్యమగుచున్నది. ఆ యైక్యమే సమాధియనబడును.

"ప్రాప్తేజ్ఞానేనవిజ్ఞానే జ్ఞేయేచపరమాత్మని
హృదిసమ్యక్ స్థితే దేహేలబ్ధశాంతిపదంగతే
తదాప్రభామనోబుద్ధి శూన్యంభవతి" ౪

(శు-య; ౫౮ పైంగల; అ ౪)

టీ. జ్ఞానేన=శాస్త్రజ్ఞానముచేత, విజ్ఞానే = అనుభవజ్ఞానము, ప్రాప్తే=ప్రాప్తించుచుండఁగా, జ్ఞేయేచ = తెలియదగిన పరమాత్మ, హృది=హృదయమందు, సమ్యక్స్థితే= స్ఫుటముగనుండఁగ, దేహే= దేహము, లబ్ధశాంతిపదంగతే=అభిమానము విడువఁగా గలిగినశాంతి

"యదాపంచావతిష్ఠన్తే జ్ఞానానిమనసాసహా" ౭

"బుద్ధిశ్చనవిచేష్టంతి తామాహుఃపరమాంగతిం" ౮

(కృ-య; 3 కఠ; అ ౨; వల్లి ౬.)

టీ. యదా=ఎప్పుడు, మనసాసహా=మనస్సుతోగూడ, పంచ జ్ఞానాని=జ్ఞానేంద్రియములైదును, బుద్ధిశ్చ=బుద్ధియును, నవిచేష్టంతి= తమపనులుచేయనివై, అవతిష్ఠంతి=స్వస్వరూపముగ నున్నవియగునో, తాం=అట్టిస్థితిని, పరమాం=ఉత్కృష్టమైన, గతిం=గతినిగా (సమాధి యని) ఆహుః=చెప్పుదురు.

తా. బుద్ధి యహంకారమును విడచి మనస్సు సంకల్పములను విడచి, ఇంద్రియములు విషయములకు బోవుట విడిచి ఎప్పుడు పర మాత్మయందు లీనమగునో యాస్థితియే సమాధి యనబడును. అభేద జ్ఞానమున దేహేంద్రియాదులు తానను నభిమానమును విడచుట సమాధి.

"సశాంతసర్వసంకల్పా యాశిలావదవస్థితిః" ౯

"జాగ్రన్నిద్రావినిర్ముక్తా సాస్వరూపస్థితిఃపరా" ౧౦

(సామ-౬౧ మహా-అ ౫-౫౯ మైత్రేయ-అ ౨.)

టీ. జాగ్రన్నిద్రావినిర్ముక్తా = జాగ్రత్స్వప్న సుషుప్తులు లేనిది యును, సశాంత=శాంతముతోగూడిన, సర్వసంకల్పా=సమస్త సంక ల్పములుగలది (సంకల్ప శూన్యమైనది) శిలావత్ = రాయివలె, అవ స్థితిః=ఉండుట, యా=ఏదియో, సా=అదియే, పరా = ఉత్కృష్టమైన, స్వరూపస్థితిః=పరమాత్మ స్వరూపము.

తా. జాగ్రత్స్వప్న సుషుప్తులులేని స్థితియే, పరమాత్మస్వరూ పము, అదియే సమాధి. జాగ్రత్స్వప్న సుషుప్తులు కానిదనఁగా మర

ణ మూర్ఛాదులని యర్థము జేయరాదు. కేవల తురీయస్థితి యని తెలియ వలయును.

"మారుతే మధ్యసంచారే మనస్థైర్యంప్రజాయతే" ౧౧

"యోమనస్సుస్థిరీభావః సైవావస్థామతోన్మనీ" ౧౨

టీ. మారుతే=వాయువు, మధ్యసంచారే=పార్శ్వసంచారమును విడచి మధ్యసంచారము గలదియగుచుండఁగా, మనస్థైర్యం= మనస్సునకు స్థిరత్వము, ప్రజాయతే=కలుగుచున్నది, మనస్సుస్థిరీభావః- మనస్సుయొక్క సుస్థిరీభావము, యః = ఏదియో, సైవావస్థా = ఆస్థితియే, ఉన్మనీ=ఉన్మనీసమాధి, మతా=అగును.

తా. పార్శ్వములనఁగ నిడాపింగళులు, మధ్యయనఁగా సుషుమ్న, ముక్కుయొక్క కుడిరంధ్రము 'పింగల' యనియు, సూర్యనాడి యనియుఁ జెప్పబడును. ఎడమరంధ్రము 'ఇడ' యనియు, చంద్రనాడి యనియు చెప్పఁబడును. ఈ రెండు మార్గములను విడిచి (రేచకపూరకములను విడిచి) బ్రహ్మనాడియైన సుషుమ్న మార్గమున వాయువు చరించుచుండగా, (కుంభకస్థితి) మనస్సు చాంచల్యమును విడిచి స్థిరత్వము నొందును. ఆ స్థిరత్వమే–ఉన్మని.

"సరూపోసౌమనోనాశో జీవన్ముక్తస్యవిద్యతే" ౧౩

"నిదాఘారూపనాశస్తు వర్తతేఽదేహముక్తికే" ౧౪

(అధర్వ-౭౦ అన్నపూర్ణ; అ ౪.)

టీ. నిదాఘ=ఓ నిదాఘుఁడా, అసౌ=ఈ, మనోనాశః=మనోనాశము, సరూపః=రూపముతోఁగూడినదై, జీవన్ముక్తస్య=జీవన్ముక్తునకు, విద్యతే=ఉండును, అరూపనాశః=రూపములేని నాశముతోఁగూ

డినదై, అదేహముక్తికే= విదేహముక్తియందు, వర్తతే=వర్తించు చున్నది.

తా. సరూపనాశమనియు, నరూపనాశమనియు, మనోనాశము రెండు విధములు. మొదటిది జీవన్ముక్తున కుండును. రెండవది విదేహముక్తియందుండును. వేచబడిన విత్తనము రూపముతో నున్నను, వృక్షమునకు కారణముగాని యట్లు మనస్సున్నను వృత్తిలేనందున సంసారమునకు హేతువుగాక యుండుటచే, సరూపనాశ మనబడును. కర్పూరదీపనాశమువలె వృత్తియును రూపమును నశించుట యరూపనాశము. ఈ రెండునాశములును సమాధియే. సరూపనాశమున ప్రారబ్ధక్షయ పర్యంతమును స్థూలశరీరముండును. అరూపనాశమున మూడు దేహములును నశించును. ఇదిగో విదేహముక్తి యనఁబడును.

"చిత్తేచైత్యదశాహీనే యాస్థితిఃక్షీణచేతసాం" ౧౫
"సోచ్యతే శాంతకలనా జాగ్రత్యేవసుషుప్తతా" ౧౬
(అధర్వ-౨౦ అన్నపూర్ణ; అ ౨;)

టీ. క్షీణచేతసాం= క్షీణించినచిత్తముగల యోగులయొక్క, చిత్తే=చిత్తము; చైత్యదశాహీనే=చిత్తవృత్తులులేని దాచుండఁగా, యాస్థితిః=ఏస్థితికలదో, సా=ఆస్థితి, జాగ్రత్యేవ= జాగ్రదవస్థయందే, సుషుప్తతా=సుషుప్తత్వమనియు, శాంతకలనా= శాంతస్వరూపసమాధియనియు, ఉచ్యతే= చెప్పఁబడుచున్నది.

తా. యోగుల చిత్తము వృత్తులులేకయుండును. జాగ్రదవస్థయైనను, చిత్తవృత్తిలేనిస్థితి సుషుప్తత్వమనియు సమాధియనియు జెప్పఁబడును.

"నైశజ్జాగ్రన్నైవస్వప్నఃసంకల్పానామభావనాత్" ౧౭
"సుషుప్తిభావోనాప్యేతత భావాజ్జడతాస్థితేః" ౧౮
(అధర్వ; ౨౦ అన్నపూర్ణ; అ ౪,)

టీ. సంకల్పానాం=సంకల్పములయొక్క, అభావనాత్=అభావనమువలన, ఏతత్=ఈ సమాధిస్థితి, నజాగ్రత్=జాగ్రదవస్థగాదు, నైవస్వప్నం=స్వప్నావస్థకాదు, ఏతత్=ఈసమాధి, జడతాస్థితేః=జడత్వస్థితియొక్క, అభావాత్=లేమివలన, సుషుప్తిభావోపి=నిద్రావస్థయును, న=కాదు.

తా. బ్రహ్మాకారముగ మనస్సుపరిణమించుటచే, నితరసంకల్పములు లేకయుండుటచే, నీ సమాధిస్స్వప్నావస్థకాదు. జాగ్రదవస్థకాదు. జడత్వము లేకయుండుటచే నిద్రావస్థకాదు. కేవలతురీయమై జాగ్రత్స్వప్నసుషుప్తి మూర్ఛావ్యవస్థలకు విలక్షణమైయున్నది.

"సత్యావబోధఏవాసౌ వాసనాతృణపావకః" ౧౯
"ప్రోక్తస్సమాధిశబ్దేన నతుతూష్ణీమవస్థితిః ,, ౨౦

(సామ ; ౬౧ మహా ; అ ర.)

టీ. వాసనాతృణపావకః=వాసనలను గరికపోచ కగ్నిహోత్రమైన, అసౌ=ఈ, సత్యావబోధః=బ్రహ్మజ్ఞానము, సమాధిశబ్దేన=సమాధిశబ్దముచే; ప్రోక్తః=చెప్పఁబడుచున్నది, తూష్ణీమవస్థితిః=ఊరకయుండుట, న=కాదు.

తా. అసత్యములైన జగజ్జీవేశ్వరాది భేదమును నిరసించి, సత్యమైన బ్రహ్మజ్ఞానము నెఱుంగుట సత్యావబోధము. సత్యమనఁగా సద్ధర్మము తానే బ్రహ్మమని యితరమెద్దియును లేదని యెఱుఁగుటయనెడు నీసత్యావబోధము 'సమాధి' యగును. ఇది సమస్తవాసలనలను నశింపజేయును. జాగ్రత్స్వప్న సుషుప్తులను, ఆలస్యము మొదలయిన వానివలన నూఱకయుండుటయును సమాధికాదు. శరీరమును మఱచుట సమాధికాదు. కర్తృత్వాద్యభిమానములేక తానే బ్రహ్మమని నిశ్చయించుట సమాధి.

" నిర్వికారతయావృత్త్యా బ్రహ్మాకార తయాపునః ''  ౨౧
" వృత్తివిస్మరణంసమ్యక్సమాధిరభిధీయతే ''  ౨౨

(కృ-య ; ౩౭ తేజోబిందు.)

టీ. నిర్వికారతయా=వికారత్వములేని, వృత్త్యా-వృత్తిచేను, పునః=ఇంకను, బ్రహ్మాకారతయా=బ్రహ్మాకారత్వముచేతను, వృత్తి విస్మరణం=చిత్తవృత్తులను మఱచుట, సమ్యక్=లెస్సగ, సమాధిః=సమాధియని, అభిధీయతే=చెప్పఁబడుచున్నది.

తా. చిత్తముబ్రహ్మధ్యానమున, బ్రహ్మాకారముగ, నిర్వికారముగ జేయుచు చిత్తవృత్తులను గుఱుగనియకయుండుట 'సమాధి' యని చెప్పఁబడును.

" దృశ్యాసంభవబోధేన రాగద్వేషాదితానవే ''  ౨౩
" రతిర్బలోదితాయా సాసమాధిరభిధీయతే ''  ౨౪

(సామ ; ౬౧ మహా ; అ ౪.)

టీ. దృశ్యాసంభవబోధేన=దృశ్యమువలనసంభవించని బోధచే (దృగ్రూపమైన బ్రహ్మబోధముచే) రాగద్వేషాది = రాగద్వేషాదుల యొక్క, తానవే = క్షీణించుటయందు, యారతిః = ఏబ్రహ్మాసక్తి, బలోదితా=లెస్సగనుదయించునదియగునో, సా=ఆబ్రహ్మాసక్తి, సమాధిః=సమాధియని, అభిధీయతే=చెప్పఁబడుచున్నది.

తా. నాశరహితమైన బ్రహ్మబోధమున రాగద్వేషాదులు నశింపఁగా బ్రహ్మమందే యాసక్తి కలుగునో యదియే సమాధి యనఁబడును. రాగద్వేషాదు లున్నపుడు బ్రహ్మమం దాసక్తి యుండదు. అప్పుడు దృశ్యములయిన విషయములందే బోధముండును. విషయానురాగమున సమాధి సిద్ధింపదు.

" అహమేవపరంబ్రహ్మ బ్రహ్మాహమితిసంస్థితిః " ౨౫
" సమాధిస్సతువిజ్ఞేయ స్సర్వవృత్తినిరోధకః " ౨౬
(శు-య; ౭౭ త్రిశిఖిబ్రాహ్మణ.)

టీ. అహమేవ=నేనే, పరంబ్రహ్మ= పరబ్రహ్మమును, బ్రహ్మ= బ్రహ్మమే, అహమితి=నేనను, సంస్థితిః=జ్ఞానము, సర్వవృత్తి నిరోధకః= చిత్తముయొక్క సమస్తవృత్తులను నిరోధించునది యగును, సతు= ఆజ్ఞానమే, సమాధిః=సమాధియని, విజ్ఞేయః=తెలియదగినది.

తా. నేనే బ్రహ్మము. బ్రహ్మమే నేనని, అన్యమింకలేదను నీ దృఢాపరోక్ష జ్ఞానము, చిత్తవృత్తుల నన్నింటిని నశింపజేయును. చిత్తవృత్తులను నశింపజేయు దృఢాపరోక్ష జ్ఞానమే సమాధియగును.

" సమాధిస్సంవిదుత్పత్తిః పరజీవైకతాంప్రతి " ౨౭
(సామ; ౯౦ దర్శన; ఖం ౧౦) (అధర్వ-౭౦ అన్నపూర్ణ; అ ౫.)
" ధ్యానస్యవిస్మృతిస్సమ్య క్సమాధిరభిధీయతే " ౨౮
(శు-య; ౭౭ త్రిశిఖిబ్రాహ్మణ.)

టీ. పరజీవైకతాంప్రతి = జీవబ్రహ్మముల నైక్యమునుగూర్చి, సంవిదుత్పత్తిః=జ్ఞానోదయమే, సమాధిః=సమాధియగును, ధ్యానస్య= ధ్యానముయొక్క, విస్మృతిః=మఱపు, సమ్యక్=శ్రేష్ఠమైన, సమాధిః= సమాధియని, అభిధీయతే=చెప్పబడుచున్నది.

తా. బ్రహ్మధ్యానము జేయునపుడు ఇతరసంకల్పము లేక నేను ధ్యానము జేయుచున్నానను వృత్తి లేకయుండుట సమాధి. మఱియు ను జీవబ్రహ్మముల నైక్యముగూర్చు జ్ఞానమే (జీవుఁడు బ్రహ్మము నొకటియని తెలియుట) సమాధి యనఁబడును.

" సమాహితానిత్యతృప్తా యథాభూతార్థదర్శినీ " ౨౯
" బ్రహ్మన్సమాధిశబ్దేన పరాప్రజ్ఞోచ్యతేబుధైః " ౩౦
(అథర్వ–౭౦ అన్నపూర్ణ ; అ ౧.)

టీ. సమాహితా=బ్రహ్మముకన్న నన్యమెద్దియును లేదని స్వస్థచిత్తమున నుండుట, నిత్యతృప్తా = నిత్యతృప్తి స్వరూపమైనదియును, యథాభూతార్థదర్శినీ=యథార్థజ్ఞాన స్వరూపమైనదియును, పరా=ఉత్కృష్టమైనదియునగు, ప్రజ్ఞా=ప్రజ్ఞయే, బ్రహ్మన్=ఓనిదాఘుఁడా, బుధైః= పండితులచేత, సమాధిశబ్దేన = సమాధియను పదముచేత, ఉచ్యతే= చెప్పబడుచున్నది.

తా. సమాహితత్వము, నిత్యతృప్తి, యథార్థజ్ఞానము, నివిప్రజ్ఞా లక్షణములు. ఇట్టిప్రజ్ఞఁగలవాఁడు స్థితప్రజ్ఞుఁడు. ఆప్రజ్ఞయే సమాధియని చెప్పఁబడుచున్నది.

" అక్షుబ్ధానిరహంకారా ద్వంద్వేష్వననుపాతినీ " ౩౧
" బ్రహ్మన్ సమాధిశబ్దేన మేరోస్స్థిరతరాస్థితిః " ౩౨
(అథర్వ; ౭౦ అన్నపూర్ణ ; అ ౧)

టీ. బ్రహ్మన్= ఓనిదాఘుడా, అక్షుబ్ధా= క్షోభింపబడనిదియు, నిరహంకారా=అహంకారములేనిదియు, ద్వంద్వేషు = సుఖదుఃఖాది ద్వంద్వములందు. అననుపాతినీ=పడనిదియును, మేరోః=మేరుపర్వతముకన్నను, స్థిరతరా=మిక్కిలిస్థిరమైన, స్థితిః=స్థితియే, సమాధిశబ్దేన= సమాధిశబ్దముచే జెప్పబడెను.

తా. అహంకారశూన్యమై సుఖాదిద్వంద్వములచే బాధింపఁబడనిదై విషయముల వలన క్షోభింపబడనిదై యుండు మనస్థితి మేరువు పర్వతముకన్నను మిక్కిలి స్థిరముగానుండును. అట్టిస్థిరమైన స్థితియే సమాధియనబడును.

"నిశ్చితావిగతాభీష్టా హేయోపాదేయవర్జితా" 33
"బ్రహ్మన్సమాధిశబ్దేన పరిపూర్ణామనోగతిః" 3౪

(అథర్వ; ౭౦ అన్నపూర్ణ; అ ౧.)

టీ. నిశ్చితా=సర్వవేదాంతశ్రవణ మననములచే నిశ్చయింపఁబడినదియును, విగతాభీష్టా=కోరికలులేనిదియును, హేయ=విడువఁదగినదియును, ఉపాదేయ=గ్రహింపఁదగినదియును, (ఈరెంటితో) వర్జితా లేనిదియునైన, పరిపూర్ణా=పరిపూర్ణమైన, (సమమైన); మనోగతిః=మనోవృత్తి, బ్రహ్మన్=ఓనిదాఘుఁడా, సమాధిశబ్దేన=సమాధిశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది.

తా. 'అహం బ్రహ్మాస్మి' యను జ్ఞానమున నిశ్చయమైనదియుఁ, గోరికలేనిదియు, నిదివిడువఁదగినది యిదిగ్రహింపఁదగినది, యను వృత్తిలేనిదియునగు మనోవృత్తిగా సమాధియనఁబడును.

"సలిలే సైంధవంయద్వత్సామ్యంభజతియోగతః" 3౫
"తథాత్మమనసోరైక్యం సమాధిరభిధీయతే" 3౬

(ఋ; ౧౧౫ సౌభాగ్యలక్ష్మీ;) (కృ-య; ౬౮ వరాహ; అ-౨)

టీ. సలిలే=నీటియందు, సైంధవం=ఉప్పుగడ్డ, యద్వత్=ఏప్రకారము, సామ్యం=నీటిసామ్యమును, భజతి=పొందుచున్నదో, తథా=అట్లే=యోగతః=ధ్యానయోగమువలన, ఆత్మమనసోః=ఆత్మమనస్సులయొక్క, ఐక్యం=ఏకత్వము (కలుగుట), 'సమాధి' యని, అభిధీయతే=చెప్పఁబడుచున్నది.

తా. ఉప్పుగడ్డ నీటఁబడి యెట్లు నీరగునో యట్లే ధ్యానయోగమున మనస్సు పరమాత్మయందు గలిసి యేకత్వమొందుట 'సమాధి' యనఁబడుచున్నది.

" యత్సమత్వంతయోర్యత్ర జీవాత్మపరమాత్మనోః " 37
" సమస్తనష్టసంకల్పః సమాధిరభిధీయతే " 38

(ఋ; ౧౦౫ సౌభాగ్యలక్ష్మీ.)

టీ. యత్ర = ఎక్కడ, తయోః=ఆ, జీవాత్మ పరమాత్మనోః= జీవాత్మ పరమాత్మలకు, యత్సమత్వం=ఏసమత్వము కలుగుచున్నదో, సమస్తనష్టసంకల్పః = సమస్తసంకల్పములు నశించిన యాసమత్వము, సమాధిః='సమాధి' యని, అభిధీయతే= చెప్పఁబడుచున్నది.

తా. సమస్త సంకల్పములు నశింపఁగా జీవాత్మ పరమాత్మలకు గలుగు సమత్వమే 'సమాధి' లక్షణావృత్తిచే నుపాధులను విడువఁగా శేషించు సామ్యమే బ్రహ్మము. దాని నెఱుఁగుట సమాధి యనఁబడును.

" ప్రభాశూన్యంమనశ్శూన్యం బుద్ధిశూన్యంనిరామయం" 38
" సర్వశూన్యంనిరాభాసం సమాధిరభిధీయతే " 40

(ఋ; ౧౦౫ సౌభాగ్యలక్ష్మీ.)

టీ. ప్రభాశూన్యం = జాగ్రదవస్థ లేనిదియును, మనశ్శూన్యం= స్వప్నావస్థ లేనిదియును, బుద్ధిశూన్యం = సుషుప్త్యవస్థ లేనిదియును, నిరామయం= రోగహీనమైనదియును, సర్వశూన్యం=సమస్తవృత్తులును లేనిదియును, నిరాభాసం = మిథ్యాత్మము కానిదియునగు స్థితి, సమాధిః='సమాధి' యని, అభిధీయతే= చెప్పఁబడుచున్నది.

తా. సమస్త సంకల్పములు నశింపఁగా జీవాత్మ పరమాత్మలకు గలుగు సమత్వమే, 'సమాధి' యనఁబడును. మిథ్యాత్వముఁగాక యథార్థ (సత్య) మైనదియును, జాగ్రత్స్వప్న సుషుప్తులు కానిదియును, రోగహీనమైనదియు నగు స్థితిసమాధి యనఁబడును.

" బ్రహ్మాకారమనోవృత్తి ప్రవాహోఽయంకృతింవినా ", ౪౧
" సంప్రజ్ఞాతసమాధిస్స్యాద్ధ్యానాభ్యాసప్రకర్షతః ౪౨
(శు-య ; ౧౦౮ ముక్తిక ; అ ౨.)

టీ. ధ్యానాభ్యాసప్రకర్షతః=ధ్యానాభ్యాసాతిశయమున, అహం కృతింవినా = అహంకారములేని; బ్రహ్మాకార మనోవృత్తిప్రవాహః= బ్రహ్మాకారముగ బరిణమించిన మనోవృత్తిప్రవాహమే, సంప్రజ్ఞాతసమాధిస్స్యాత్ =సంప్రజ్ఞాత సమాధియగును.

తా. అహంకారమునువిడిచి ధ్యానాభ్యాసమునబ్రహ్మాకారము నొందిన మనోవృత్తి 'సంప్రజ్ఞాతసమాధి' యనఁబడును. అగ్నిసంతప్తమైన యినుపగుండగ్ని రూపమున నున్నట్టులహంకారమును విడిచి, ధ్యానయోగమున మనస్సు బ్రహ్మాకారమును బూనియుండుట 'సంప్రజ్ఞాతసమాధి' యనఁబడును ఇందు ధ్యానస్వరూపమగు వృత్తి యుండును. అది తనకు దెలియును. ఇతర వృత్తులుండవు. ఆహేతువుచే 'సంప్రజ్ఞాత' మనఁబడును.

"ప్రశాంతవృత్తికం చిత్తం పరమానందదీపకం" ౪౩
"అసంప్రజ్ఞాతనామాయం సమాధిర్యోగినాం ప్రియః" ౪౪
(శు-య-౧౦౮ ముక్తిక-అ ౨)

టీ. ప్రశాంతవృత్తికం=వృత్తి శూన్యమైనదియు, పరమానంద దీపకం=బ్రహ్మానందము నుద్దీపింపజేయునదియునగు, చిత్తం=చిత్తము, అసంప్రజ్ఞాతనామ=అసంప్రజ్ఞాతమను పేరుగలది, అయంసమాధిః = ఈయసంప్రజ్ఞాతసమాధి, యోగినాం = యోగులకు, ప్రియః= ప్రియమైనది.

తా. బ్రహ్మానంద దీపకమై వృత్తిశూన్యమైన యీ యసంప్రజ్ఞాతసమాధియోగుల కత్యంతప్రియమైనది. ఈ సమాధియందు వృత్తి

యుండదు. ధ్యానము, ధ్యాత, ధ్యేయమునను త్రిపుటియుండదుగావున నసంప్రజ్ఞాత మనబడును.

"స్వానుభూతి రసావేశాద్దృశ్యశబ్దావుపేక్ష్యతు" ౮౫
"నిర్వికల్పసమాధిస్స్యా న్నివాతస్థితదీపవత్" ౮౬
(కృ-య-౧౦౬ సరస్వతీరహస్య.)

టీ. స్వానుభూతిరసావేశాత్ = బ్రహ్మానుభవాతిశయమువలన, దృశ్యశబ్దాఉపేక్ష్య=దృశ్యానువిద్ధ శబ్దానువిద్ధ స్వరూపమైన సవికల్ప సమాధినపేక్షించక, నివాతస్థితదీపవత్ = వాయుప్రసారములేని స్థలమందున్న (చాంచల్యములేక తిన్నఁగ వెలుగు) దీపమువలె, నిర్వికల్ప సమాధిః=నిర్వికల్పసమాధి, స్యాత్ =అగును.

తా. సమాధి రెండువిధములు. సంప్రజ్ఞాత సమాధియనియు, నసంప్రజ్ఞాత సమాధియనియును యోగులు వ్యవహరించెదరు. నిర్వికల్ప సమాధియనియు, సవికల్పసమాధియనియును వేదాంతులు వ్యవహరించెదరు. 'వితర్కవిచారానందాస్మితా రూపానుగమాత్సం ప్రజ్ఞాతః' అని, సంప్రజ్ఞాత సమాధిలక్షణము పతంజలిచేనిర్ణయింపఁబడెను. వితర్కము. విచారము, ఆనందము, అస్మిత, యీ నాలిగింటితో గూడినది సంప్రజ్ఞాతసమాధి. యోగమతమున, ప్రకృతి, జీవుఁడు, ఈశ్వరుఁడును, శాశ్వతములు, పంచభూతములు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, పంచతన్మాత్రలు, అంతఃకరణ చతుష్టయమునను నిఱువదినాలుగు తత్వములు జడతత్వములు ప్రకృతి యనఁబడును. ఇఱువదియైదవవాఁడైన చిన్మాత్రుఁడగు పురుషుఁడు జీవుఁడనియు, నజడతత్వమనియు, జెప్పఁబడును. ఈ యిఱువది నాలుగు తత్వములందును, బంచమహాభూతములు, జ్ఞానేంద్రియములును, స్థూలవిషయములు పంచతన్మాత్రలు (శబ్దస్పర్శరూపరసగంధములు) అంతఃకరణ చతుష్టయమును, సూక్ష్మవిషయములు. తత్వోపాసనయ

నియు, నీశ్వరోపాసనయనియును భావన రెండువిధములు. జడతత్వ ములను భావించుచుండుటయే 'సంప్రజ్ఞాతసమాధి' స్థూలభూతము లను భావించుచుండుట 'వితర్కము' సూక్ష్మవిషయములను భావిం చుచుండుట 'విచారము' స్థూలసూక్ష్మవిషయజ్ఞానము గలిగిన వానినివిడిచి చిత్తమందలి సత్వగుణమును విచారించుట యానందము. ఈసత్వగుణమున కొంచెము రజస్తమోగుణములుండు గావున నిది మలిన సత్వమనఁబడును. చిత్తముయొక్క కేవలశుద్ధ సత్వమును భావింపుచునంతర్ముఖమైన సుఖమొందుట 'యస్మిత' ''విరామప్రత్య యాభ్యాస పూర్వసంస్కార శేషోన్యః'' అని యసంప్రజ్ఞాత సమాధి లక్షణము పతంజలిచేఁజెప్పఁబడెను. వితర్కవిచారాస్మితా నందము లులేక నిర్వితర్కనిర్విచార నిరానందనిరస్మితా స్వరూపముగా నుండు నది యసంప్రజ్ఞాతము సంప్రజ్ఞాతసమాధిగల వానికి తానుచిన్మాత్రు డైన పురుషుఁడనియుఁ, బ్రధానమిదియనియు, నీశ్వరుఁడు పరమా త్మ యనియు దెలియదు. అసంప్రజ్ఞాత సమాధిగలవానికి తత్వభావన యుండదు. ఈశ్వరతత్వము లెన్నగ దెలియఁబడును. తెలయఁదగిన తత్వమిఁకనుండమిచే నసంప్రజ్ఞాత సమాధియనఁబడును. చిత్తమంది తరవృత్తులను రాసీయక తానుచిన్మాత్రుడైన పురుషుఁడుగానుండుట యసంప్రజ్ఞాతము. సంప్రజ్ఞాత మునఁ దెలియదగిన తత్వ ములుండుట వలన జిత్తవృత్తులుండును. అసంప్రజ్ఞాతమున నుండవు. శమదమాదిషట్కసంపన్నుఁడైన యధికారి గురుముఖంబున వేదాం తవాక్య శ్రవణమననంబుల జేయుచు దాను బ్రహ్మమని బోధింపఁ బడుట సవికల్పసమాధిబోధస్వరూపముగాన నీసవికల్పసమాధి దృశ్యా నువిద్ధశబ్దాను విద్ధమైయుండును. తానే బ్రహ్మమని యనుభవము నను స్వవిచారమున గలిగిన యుక్తులవలనను నెఱింగి యఖండాకార వృత్తిగనుండుట 'నిర్వికల్పసమాధి' బ్రాహ్మణుఁడు తానేమిచేయు చున్నను, తాను బ్రాహ్మణుఁడని యెడ తెగక యెట్లుతలఁచునో శూద్రు డనియెట్లుతలఁచదో యట్లేతాను దేహేంద్రియాదికము గాడనియు

గేవల బ్రహ్మమేయనియు జగన్నిరసన పూర్వకముగ గలుగు నపరో క్షజ్ఞానమే నిర్వికల్ప సమాధి ఈజ్ఞానమెడతెగక యుండుగావున నిర్వికల్పమనఁబడెను.

" ప్రభాశూన్యం మనఃశూన్యం బుద్ధిశూన్యం చిదాత్మకం " ౪౭
" అతద్వ్యావృత్తిరూపోసౌ సమాధిర్మునిభావితః " ౪౮
(శు-య ; ౧౦౮ ముక్తిక ; అ ౨)

టీ. మునిభావితః=మునిభావితమైన, అసౌసమాధిః=ఈనిర్వికల్పసమాధి, ప్రభాశూన్యం=చక్షురాది బాహ్యేంద్రియములచే బూర్ణ ప్రభతో వ్యవహరించుచున్న యహంకారములేనిది ; మనశ్శూన్యం= సంకల్పములుచేయు మనస్సులేనిది, బుద్ధిశూన్యం=వృత్తికిబీజమై బుద్ధి రూపమున ముకుళించియున్న యహంకారములేనిది, చిదాత్మకం= కేవలజ్ఞాన స్వరూపమైనది, అతద్వ్యావృత్తిరూపః = బ్రహ్మముకన్న నన్యమగు జగజ్జీవేశ్వరాదికమును నిరసించుటయే రూపముగాగలది.

తా. ఈనిర్వికల్ప సమాధిమూడు విధములైన యహంకారము లేనిది. జ్ఞానస్వరూపమైనది. బ్రహ్మవ్యతిరిక్త జగజ్జీవేశ్వరాదులను మిథ్యయని నిరసించులే రూపముగాగలది. పూర్ణప్రభతో జాగ్రదవస్థ యందును అర్ధప్రభతో స్వప్నమనో రాజ్యాదులందును ముకుళీభూతమై సుషుప్తిమూర్ఛాదులందును అహంకారముండును. కావున ప్రభ యనియును 'మనస్స' నియును 'బుద్ధి' యనియు నహంకారము మూడువిధములుగా నున్నది. తత్ బ్రహ్మము అతత్ బ్రహ్మముకాని జగజ్జీవేశ్వరాదికమైన మాయాకార్యము, వ్యావృత్తి నిరసనము అతద్వ్యావృత్తియనగా బ్రహ్మాతిరిక్త మాయాతత్కార్యనిరసనము.

" ఊర్ధ్వపూర్ణమధః పూర్ణంమధ్యపూర్ణంశివాత్మకం " ౪౯
" సాక్షాద్విధిముఖోహ్యేషసమాధిఃపారమార్థికః " ౫౦
(శు-య; ౧౦౮ ముక్తిక ; అ_౨)

టీ. పారమార్థికః=పరమార్థస్వరూపమైన (సత్యమైన) ఏషసమాధిః=బ్రహ్మస్వరూపమైన యీనిర్వికల్ప సమాధి, ఊర్ధ్వపూర్ణం=అవిద్యాపాదమైన ప్రపంచముయొక్క మీదిభాగమున నిండియున్నది, అధఃపూర్ణం=క్రిందిభాగమున నిండియున్నది, మధ్యపూర్ణం=మధ్యభాగమున నిండియున్నది, శివాత్మకం=మంగళస్వరూపమైనది, సాక్షాత్=ప్రత్యక్షముగ, విధిముఖః=బ్రహ్మముఖమున బ్రకటింపబడినది. (వేదమువలనఁజెప్పబడినది)

తా. సమాధియనఁగా బ్రహ్మస్వరూపము గావున ననంతమైన బ్రహ్మమందొక పాదమున మాయాకార్యమైన జగత్తుతోఁచఁగా నాజగత్తున కూర్ధ్వమధ్యాధో భాగమునందు నీసమాధియున్నదని భావము. 'పాదోస్యవిశ్వాభూతాని త్రిపాదస్త్రిస్వయంప్రభః ఇత్యేకదేశవృత్తిత్వం మాయాయావకతిశ్రుతిః' అనంతమైన బ్రహ్మమునందొక దేశమున మాత్రముననే మాయాకార్యమైన జగత్తుతోఁచుచున్నదనియును దక్కినది 'శుద్ధబ్రహ్మ' మనియు, మాయకేకదేశవృత్తిత్వమే శ్రుతిచెప్పుచున్నదని విద్యారణ్యులు చెప్పుచున్నారు.

ఇది సార్థాంతిక సమాధివాక్యాని పంచాశత్
ఇట్లుసార్థాంతికసమాధి వాక్యములు నేఁబది

ఇతి దశమంప్రకరణసమాప్తం.

ఇట్లు పదియవప్రకరణము సమాప్తము.

---

శ్రీ

సద్గురవేనమః

అష్టవిధ స్వరూపవాక్యములు.

# ౧౧ నానాలింగస్వరూపవాక్య ప్రకరణము.

"శ్రోత్రస్యశ్రోత్రం మనసో మనోయ ద్వాచోహవాచంస ఉప్రాణస్యప్రాణః" ౧

(సామ; కేన ; ఖం౧-౨)

టీ. యత్=ఏది, శ్రోత్రస్య=శ్రోత్రేంద్రియమునకు (చెవికి), శ్రోత్రం=చెవియో, మనసః=మనస్సునకు, మనః=మనస్సో, వాచః=వాగింద్రియమునకు, వాచం=వాక్కో, ప్రాణస్య=ప్రాణమునకు, ప్రాణః=ప్రాణమో, సః=అది, (యాత్మ), ఉ=అవునుగదా.

తా. జడమైన శ్రోత్రేంద్రియమునకు చైతన్యము గలుగజేసి గ్రహించుటకు సామర్థ్యమేది యిచ్చుచున్నదో యది యాత్మ కావున, యది చెవికి చెవియై, మనసునకు మనస్సై, ప్రాణమునకు ప్రాణమై యున్నది. ఆత్మచైతన్య తేజమున నింద్రియములు పనులుచేయుచున్నవి. ఆచైతన్యము లేక యుండిన నవి జడములైయుండును. కావున నాత్మ చెవికి జెవియని యీ క్రమమున జెప్పఁబడెను.

'యోవైభూమాతత్సుఖం' ౨

(సామ ; ౯ ఛాందోగ్య ; ప్ర-౭ ; ఖం ౨౩)

టీ. యోవై=ఏయాత్మ, భూమా=విస్తారమైన, తత్సుఖం=బ్రహ్మానంద స్వరూపమైనదో.

తా. ఆత్మ బ్రహ్మానంద స్వరూపమైనది.

'యోవైభూమాతదమృతం' 3

(సామ ; ఛాందోగ్య ; ప్ర 2 ; ఖం ౨౪)

టీ. యోవై=ఏయాత్మ, భూమా=అనంతమైన, తదమృతం=విదేహకైవల్య స్వరూపమైనది.

తా. ఆత్మ యమృత స్వరూపమైనది.

'నేతినేతినహ్యే తస్మాదితినేత్యన్యత్పర మ_స్త్యథనామధేయం సత్యస్యసత్యమితి ప్రాణావైసత్యంతేషామేవసత్యం' ४

(శు-య; ౧౦ బృహదారణ్యక; అ ४; బ్రా 3.)

'రాతేర్దాతుః పరాయణం'

(శు-య; ౧౦ బృహదారణ్యక; అ ౫; బ్రా ౯;)

టీ. (ఆయాత్మ) నేతి=విశ్వవిరాట్స్వరూపమగు స్థూలప్రపంచముగాదు, నేతి=తైజస హిరణ్యగర్భస్వరూపమగు సూక్ష్మప్రపంచము గాదు, నేతిహి = ప్రాజ్ఞాంతర్యామి స్వరూపమగు కారణప్రపంచము గాదు, అన్యత్పరం=కారణముకన్న నన్యమైన తురీయాంశమును, నేతి=కాదు, అథ=ఇకనేమనగ, ఏతస్మాత్=ఇందువలన, (నిషేధాధికరణత్వమువలన); నామధేయమ_స్తి=పేరుమాత్రము గలదు, సత్యమేవ = సద్వస్తువైన బ్రహ్మమే, సత్యస్య=జాగ్రత్ప్రపంచమునకు, సత్యం=సత్యమైనది (ఆధారమైనది), ప్రాణాహి=ప్రాణములైయున్నది, తేషాం=ఆప్రాణములకు, సత్యం=సత్యమైయున్నది, (ఆధారమైనది), ఇతి=ఈ ప్రకారమున్నది, రాతేః=(బ్రహ్మవ్యతిరిక్తమైన ప్రపంచమను) ధనముయొక్క, దాతుః=దానముజేయువానికి (ప్రపంచమును విడుచువానికి), పరాయణం=ఉత్తమగతియై యున్నది.

తా. ఆత్మస్వరూపమును నిశ్చయించుటకు శక్యముగాదు. ఇది కాదిది కాదని సమస్తదృశ్య సముదాయమును నిషేధింపఁగా, నెక్కడ మనోవాక్కులు దెలియఁజాలక 'యతోవాచో నివర్తంతే అప్రా

పృయమనసాసహ) అను తైత్తిరీయ వాక్యములచే మఱలుచున్నవో యా పైది యాత్మయని నిశ్చయింప వలయును. అట్టి పరతత్వమునకు నాత్మ మొదలైన నామములు వ్యవహారార్థము కల్పింపఁ బడినవి. కాని పారమార్థికమున నామరూపము లాత్మకులేవని యెఱుంగవలయును. బ్రహ్మము జాగ్రత్ప్రపంచమున కాధారమై యున్నది. అధిష్ఠానమైన దని యెఱుఁగవలెను. ప్రాణములై యున్నది. ఆ ప్రాణముల కాధారమైనది. ప్రాణములనఁగా, స్వప్న సుషుప్తి ప్రపంచము సూచింపఁ బడినది అని తెలియవలయును. ద్వైతస్వరూపమైన 'జగద్బుద్ధి' యను ధనమును త్యాగము గావించిన దాత కుత్తమగతియై యున్నది. జగజ్జీవేశ్వరాది భేదబుద్ధిలేని జీవన్ముక్తునకు వాని స్వరూపము సాక్షాత్కారమగుచున్నదని తాత్పర్యము.

"సపర్యగాచ్ఛుక్రమకాయమవ్రణ మస్నావిరంశుద్ధమపాపవిద్ధం"
(శు-య ; ౧ ఈశావాస్య.)

టీ. సః = ఆ పరమాత్మ, పర్యగాత్ = సర్వవ్యాపకమైనది, శుక్రం=స్వచ్ఛమైనది, అకాయం=దేహము లేనిది, అవ్రణం = వ్రణములులేనిది, అస్నావిరం=పేగులు నరములు లేనిది, శుద్ధం=పరిశుద్ధమైనది (మాయాసంబంధము లేనిది), అపాపవిద్ధం=పుణ్యస్వరూపమైనది.

తా. ఆపరమాత్మ సర్వవ్యాపకమైనది. స్వతస్సిద్ధముగ స్వచ్ఛమైనది. షడ్భావవికారములు లేనిది. మాయాయోగము లేక శుద్ధమైనది. పుణ్యపుంజ స్వరూపమయినది.

"ప్రణవోహిపరంబ్రహ్మ ప్రణవశ్చపరస్స్మృతః" ౭
(అధర్వ; ౬ మాండూక్య, శ్రీగౌడపాదీయకారికా.)

టీ. ప్రణవః=ఓంకారము, పరంబ్రహ్మహి=నిశ్చయముగ పరబ్రహ్మము, ప్రణవశ్చ=ప్రణవమే, పరః=పరమాత్మయని, స్మృతః= చెప్పఁబడుచున్నది.

తా. ప్రణవమే బ్రహ్మము. ప్రణవమే పరమేశ్వరుఁడు. ఈశ్వరునకు ప్రణవమే వాచకమని, 'తస్యవాచకః ప్రణవః' అనిపతంజలిచే జెప్పఁబడెను. ప్రణవోపాసనము నిర్గుణోపాసన గావున నయ్యుపాసనము సేయవలయును.

'ననిరోధోనచోత్పత్తిర్నబద్ధోనచసాధకః" ౮

"నముముక్షుర్నవైముక్త ఇత్యేషాపరమార్థతా" ౯

(అధర్వ; ౮౦ త్రిపురాతాపనీ;-అధర్వ; ౭౬ ఆత్మ)

(కృ-యు; ౭౯ అవధూత;-కృ-యు; ౨౦ అమృతబిందు)

టీ. నిరోధః=నాశము, న=లేదు, ఉత్పత్తిః=పుట్టువు, న=లేదు, బద్ధః=సుఖదుఃఖాది ధర్మవంతుఁడు, న=కాడు, సాధకః=శ్రవణ,మనన, నిదిధ్యాసలుసేయువాఁడును, న=కాడు, ముముక్షుః = శమదమాది షట్కసంపన్నుఁడైన మోక్షేచ్ఛగలవాఁడును, న=కాడు, ముక్తః వై=అవిద్యానాశమున ముక్తినొందిన వాఁడును, న=కాడు, ఇతి= ఇట్లు, ఏషా=ఈ, పరమార్థతా=పారమార్థికముండును.

తా. జననము, మరణము, బద్ధుఁడు, సాధకుఁడు, ముముక్షువు, ముక్తుఁడు, ననుభేదము వ్యావహారికము గాని పారమార్థికముగాదు. సత్యముగాదు. బ్రహ్మముకన్న నన్యముమిథ్య.

'అఖండైకరసంశాస్త్ర మఖండైకరసాత్రయీ' ౧౦

(కృ-యు; ౩౭ తేజోబిందు; అ ౨;)

టీ. శాస్త్రం=శాస్త్రము, అఖండైకరసం=అఖండబ్రహ్మస్వరూపము, త్రయీ=వేదములు, అఖండైకరసా=అఖండబ్రహ్మము.

తా. బ్రహ్మమును బోధించుశాస్త్రములు వేదములు బ్రహ్మస్వరూపమని తెలియవలెను.

" అఖండైకరసోదేహ అఖండైకరసంమనః " ౧౧
" అఖండైకరసంసూత్ర మఖండైకరసంవిరాట్ " ౧౨

(కృ-య ; ౩౭ తేజోబిందు ; అ౨)

టీ. దేహః= దేహము, అఖండైకరసః = అఖండబ్రహ్మము, మనః=మనస్సు, అఖండైకరసః=అఖండబ్రహ్మము, సూత్రం=సూత్రాత్మ (హిరణ్యగర్భుఁడు), అఖండైకరసం=అఖండబ్రహ్మము, విరాట్ = విరాడాత్మ, అఖండైకరసం=అఖండ బ్రహ్మము.

తా. వస్తువిచారమున రజ్జువునందారోపింపఁబడిన పాము రజ్జువగునో యట్లే మాయాకల్పితమైన దేహమనస్సూత్రాత్మ విడాత్మలు తత్వజ్ఞానమున నధిష్ఠానమైన బ్రహ్మమేయగును గాని యాధారములుగావు ఇట్లేవక్ష్యమాణవాక్యములకు నెఱుఁగవలయును.

" అఖండైకరసావిద్యా అఖండైకరసోవ్యయః " ౧౩
" అఖండైకరసంగోప్యం అఖండైకరసశ్శశీ " ౧౪.

(కృ-య ; ౩౭ తేజోబిందు ; అ ౨.)

టీ. విద్యా=అవిద్యనుదొలఁగించువిద్య, అఖండైకరసా=అఖండబ్రహ్మము, అవ్యయః=అక్షరుఁడైనకూటస్థుఁడు, అఖండైకరసః=అఖండబ్రహ్మము, గోప్యం=రహస్యమైన బ్రహ్మోపదేశము, అఖండైకరసం=అఖండబ్రహ్మము, శశీ=చంద్రుఁడు, అఖండైకరసః=అఖండబ్రహ్మము.

తా. స్పష్టము.

' అఖండైకరసాస్తారా అఖండైకరసోరవిః ' ౧౫
' అఖండైకరసోజ్ఞాతా అఖండైకరసాస్థితిః ' ౧౬

(కృ-య ; ౩౭ తేజోబిందు ; అ ౨)

టీ. తారాః=నక్షత్రములు, అఖండైకరసాః=అఖండబ్రహ్మస్వరూపములు, రవిః=సూర్యుఁడు, అఖండైకరసః=అఖండబ్రహ్మము

జ్ఞాతా=జీవుఁడు, అఖండైకరసః=అఖండబ్రహ్మము, స్థితిః=స్వస్థమైన చిత్తవృత్తి, అఖండైకరసా=అఖండబ్రహ్మము.

తా. స్పష్టము.

" అఖండైకరసామాతా అఖండైకరసఃపితా " ౧౮
" అఖండైకరసోరాజా అఖండైకరసంపురం " ౧౯

(కృ-య ; 38 తేజోబిందు ; అ ౨.)

టీ. మాతా=తల్లి, అఖండైకరసా=అఖండబ్రహ్మము, పితా=తండ్రి, అఖండైకరసః=అఖండబ్రహ్మము, రాజా=రాజు, అఖండైకరసః=అఖండ బ్రహ్మము, పురం=నగరము, అఖండైకరసః = అఖండ బ్రహ్మము.

తా. స్పష్టము.

" అఖండైకరసంక్షేత్రం అఖండైకరసాక్షమా " ౧౯
" అఖండైకరసంతారం అఖండైకరసోజపః " ౨౦

(కృ-య ; 38 తేజోబిందు ; అ ౨.)

టీ. క్షేత్రం=భూభాగమైన క్షేత్రము (శరీరము), అఖండైకరసం అఖండబ్రహ్మము, క్షమా=భూమి (ఓర్పు), అఖండైకరసా=అఖండబ్రహ్మము, తారం = ఓంకారము, అఖండైకరసం = అఖండ బ్రహ్మము, జపః=జపము, అఖండైకరసః=అఖండబ్రహ్మము.

తా. స్పష్టము.

" సర్వవర్జితచిన్మాత్రం త్వత్తామత్తాచచిన్మయం " ౨౧
" ఆదిరంతంచచిన్మాత్రం గురుశిష్యాదిచిన్మయం " ౨౨

(కృ-య ; 38 తేజోబిందు-అ ౨.)

టీ. సర్వవర్జిత చిన్మాత్రం=సమస్తదృశ్యములుకాని చిన్మాత్రమైనది, త్వత్తా=నీవనుధర్మము, మత్తాచ = నేననుధర్మమును, చిన్మయం=బ్రహ్మము, ఆదిః=మొదలును, అంతంచ=తుదయును, చిన్మాత్రం=జ్ఞానమాత్రము, గురుశిష్యాది=గురుశిష్యాది వ్యవహారము, చిన్మయం బ్రహ్మమయము.

తా. సమస్తమును బ్రహ్మమని యెఱుఁగ వలయును.

"దృగ్దృశ్యంయది చిన్మాత్రంఅస్తిచే చ్చిన్మయంసదా" ౨౩
"సర్వాశ్చర్యంచచిన్మాత్రం దేహశ్చిన్మాత్రఏవహి", ౨౪
(కృ-య ; 32 తేజోబిందు, అ ౨)

టీ. దృక్=దృగ్రూపము, చిన్మాత్రం చిద్రూపమే, దృశ్యం=దృశ్యము, యద్యస్తిచేత్=ఉండెనేని, సదా=ఎప్పుడును, చిన్మయం=బ్రహ్మమయమే, సర్వాశ్చర్యంచ=సమస్తాశ్చర్యమును, (భోగ్యస్వరూపమగుమాయ), చిన్మాత్రం=బ్రహ్మమే, దేహః=దేహమును, చిన్మాత్రఏవహి=బ్రహ్మరూపమే,

తా. బ్రహ్మము దృగ్రూపమైనది. దృశ్యములేదు. ఉన్నట్లు గనబడునేనినదియును బ్రహ్మమే. దానిని బ్రహ్మమని తలఁపవలయును.

"అహంత్వంచైవచిన్మాత్రం మూర్తామూర్తాదిచిన్మయం" ౨౫
"పుణ్యంపాపంచచిన్మాత్రం జీవశ్చిన్మాత్రవిగ్రహః", ౨౬
(కృ-య ; 32 తేజోబిందు, అ ౨)

టీ. అహం=నేను. త్వంచ=నీవును, చిన్మాత్రమేవ=చిద్రూపమైన బ్రహ్మమే, మూర్తామూర్తాది, మూర్తామూర్త=మూర్తామూర్తములు, ఆది=మొదలైనది, చిన్మయం=బ్రహ్మమయము, పుణ్యం=పుణ్యమును, పాపంచ=పాపమును, చిన్మాత్రం=చిద్రూపము, జీవః=జీవుఁడు, చిన్మాత్రవిగ్రహః=చిన్మాత్రస్వరూపుఁడు.

తా. కనఁబడుచున్న పృథివ్యప్తేజస్సులు, మూ ర్తములనఁబడును. కనఁబడని వాయ్వాకాశకాలమన ఆదులు, అమూ ర్తములు. సమ స్తమును బ్రహ్మమే.

" దేహత్రయవిహీనత్వా త్కాలత్రయవివర్జనాత్ " ౨౭
" జీవత్రయగుణాభావా త్తాపత్రయవివర్జనాత్ " ౨౮
" లోకత్రయవిహీనత్వా త్పరమాత్మేతిశాసనాత్ " ౨౯
" చిత్తాభావాచ్చింతనీయం దేహాభావాజ్జరానచ " ౩౦
(కృ-య ; ౩౭ తేజోబిందు)

టీ. దేహత్రయ విహీనత్వాత్ =స్థూలసూక్ష్మకారణశరీరముల లేమివలనను, కాలత్రయ వివర్జనాత్ = భూతభవిష్యద్వ ర్తమానములను కాలములు లేమివలనను, జీవత్రయగుణాభావాత్ = విశ్వతైజసప్రాజ్ఞ సత్వరజ స్తమో గుణములు లేమివలనను, తాపత్రయవివర్జనాత్ =ఆధ్యాత్మికాధి భౌతికాది దైవతములను తాపములు లేమివలనను, లోకత్రయవిహీనత్వాత్ =స్వర్గమ ర్త్యపాతాళములులేమివలనను, పరమాత్మేతి=పరమాత్మయని, శాసనాత్ =(పరమాత్మకన్న నన్యములేదని) శ్రుతిశాసనమువలనను, చిత్తాభావాత్ = చి త్తములేమివలనను, నచింతనీయం=పరమాత్మ యిట్టిదని చింతించుటకు శక్యముకాదు, దేహాభావాత్ =దేహము లేమివలన, జరా=ముదిమి న=లేదు.

తా. చి త్తము లేమివలనను, సర్వదృశ్యములు లేమివలనను, పరమాత్మ చింతించఁబడుటకు శక్యముకానిది. నేతినేతివాక్యములఁ దెలిసినంతదానిని నిషేధింపఁగా, నవాఙ్మానసగోచరమై యేది శేషించునో యది బ్రహ్మము.

" పాదాభావాద్గతిర్నాస్తి హస్తాభావాత్క్రియానచ " ౩౧
" మృత్యుర్నాస్తిజనన్యభావాత్ బుద్ధ్యభావాత్సుఖాదికం" ౩౨
(కృ-య ; ౩౭ తేజోబిందు)

టీ. పాదాభావాత్ = పాదములులేమి, గతిర్నాస్తి = గమనము లేదు; హస్తాభావాత్ = చేయిలేమి, క్రియా = కర్మ, నచ = లేదు, జన్మాభావాత్ = పుట్టువులేమి, మృత్యుః = మరణము, నాస్తి = లేదు, బుద్ధ్యభావాత్ = బుద్ధిలేమి, సుఖాదికం = సుఖము మొదలైనది, నాస్తి = లేదు.

తా. నిరవయవుఁడు నసంగుఁడు నగు ప్రత్యగాత్మకు, గమనము లేదు, కర్మములేదు, మరణములేదు, బంధమోక్షములకు హేతువులైన బుద్ధ్యాదులులేమిచే బంధమోక్షములులేక నిరతిశయసుఖస్వరూపుఁడై యున్నాఁడు.

ఇతి సాధ్రాంతిక నానాలింగస్వరూపవాక్యాని ద్వాత్రింశత్

ఇట్లు సాధ్రాంతిక నానాలింగస్వరూపవాక్యములు ముప్పదిరెండు

ఇత్యేకాదశప్రకరణం సమాప్తం.

ఇట్లు పదునొకండవప్రకరణము సమాప్తము.

———

శ్రీ

సద్గురవేనమః.

# ౧౨ పుంలింగస్వరూపవాక్య ప్రకరణము.

"సఏషోకళోమృతః" ౧

(అధర్వ; ౪ ప్రశ్న; ప్ర ౬)

టీ. సఏషః=ఆయీయాత్మ, అకళః=షోడశకళలు లేనివాఁడు, అమృతః=నాశము లేనివాఁడు.

తా. స్పష్టము.

"నాంతఃప్రజ్ఞం నబహిఃప్రజ్ఞంనోభయతఃప్రజ్ఞం నప్రజ్ఞానఘనం నప్రజ్ఞంనాప్రజ్ఞం అదృశ్యమవ్యవహార్య మగ్రాహ్యమలక్షణ మచింత్యమవ్యపదేశ్య మైకాత్మ్యప్రత్యయసారం ప్రపంచోపశమంశాంతంశివమద్వైతంచతుర్థంమన్యన్తేసఆత్మాసవిజ్ఞేయః" అధర్వ; ౬ మాండూక్య ౭-అధర్వ ౧౩ రామోత్తరతాపనీ;

(అధర్వ ౨౭ నృసింహతాపనీ; ఖం ౪)

టీ. నాంతఃప్రజ్ఞం=అంతఃప్రజ్ఞకానివానిని, నబహిఃప్రజ్ఞం=బహిఃప్రజ్ఞకానివానిని, నోభయతఃప్రజ్ఞం=అంతర్బాహ్యములందుండునుభయప్రజ్ఞకానివానిని, నప్రజ్ఞానఘనం=ప్రజ్ఞానఘనము కానివానిని, నప్రజ్ఞం=ప్రజ్ఞకానివానిని, నాప్రజ్ఞం=అప్రజ్ఞకానివానిని, అదృశ్యం=దృశ్యముగానివానిని, అవ్యవహార్యం=వ్యవహరించదగనివానిని, అగ్రాహ్యం=గ్రహించదగనివానిని, అలక్షణం=లక్షణము కానివానిని, అచింత్యం=చింత్యముగానివానిని, అవ్యపదేశ్యం=నిర్దేశించశక్యముగానివానిని, ఐకాత్మ్యప్రత్యయసారం=ఏకాత్మజ్ఞానసారుని, ప్రపంచోపశమం=ద్వైతప్రపంచమును శమింపజేయువానిని, శాంతం=శాంతస్వరూపుని,

శివం=మంగళస్వరూపుని, అద్వైతం=ద్వైతముగానివానిని, చతుర్థం=జాగ్రత్స్వప్నసుషుప్తులకు విలక్షణమైనవానిని, మన్యంతే=తలంచుచున్నారో, సః=ఆతురీయుఁడు (చతుర్థుడు) ఆత్మా=ఆత్మ, సః=ఆయాత్మ, విజ్ఞేయః=తెలిసికొనఁదగినవాఁడు.

తా. అంతఃప్రజ్ఞయనఁగ తైజసుడనుజీవుఁడు. బహిఃప్రజ్ఞయనఁగా విశ్వుడుఅనుజీవుడు, ఉభయతఃప్రజ్ఞయనఁగా జాగ్రత్స్వప్నములయొక్క సంధికాలమందుండు జీవుఁడు (జ్ఞాతయగుజీవుఁడు) ప్రజ్ఞానమనఁగా సుషుప్తియందుండు ప్రాజ్ఞుఁడనుజీవుఁడు, ప్రజ్ఞయనఁగా సమస్తము నొక్కమారుగ తెలిసికొనుజ్ఞాత (జీవుఁడు) అప్రజ్ఞయనఁగా కేవలజడమైనపదార్థము, గ్రాహ్యమనఁగ విషయము. ఇట్టిదేదియు నాత్మగాదు. పరమాత్మస్వరూపము శాంతము. శివము అద్వైతము. ద్వైతప్రపంచోపశమము తురీయమైనది ఇట్లెఱింగి పండితులాత్మధ్యానము జేయుదురు. ఆయాత్మస్వరూపమే తెలిసికొనఁదగినది. అన్యము విడువదగినది.

"అమాత్రశ్చతుర్థో వ్యవహార్యశ్శివోద్వైతః" 3

(అథర్వ; ౬ మాండూక్య ౧-౨)

టీ. అమాత్రః=అకారోకార మకారములను మాత్రత్రయములేనివాఁడు (కానివాఁడు), చతుర్థః=నాల్గవదియైన కేవలనాదబ్రహ్మమే స్వరూపముగా గలవాడు, అవ్యవహార్యః=వ్యవహరింప శక్యము కాని వాఁడు, శివః=శుభస్వరూపుఁడు, అద్వైతః=అద్వితీయుఁడు

తా. ఆత్మప్రణవముయొక్క మూఁడు మాత్రలుగాక నాదాత్మకమైనవాఁడు ఇంద్రియములచే వ్యవహరింపఁ దగినవాఁడు కాఁడు అద్వితీయ శుభస్వరూపుఁడు.

"యత్రనాన్యత్పశ్యతినాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతిసభూమా" ౪

(సామ ; ౫ ఛాందోగ్య, ప్ర ౭ ; ఖం, ౨౪ ;)

టీ. యత్ర=ఏ స్వరూపమందు, అన్యత్=దానికంటెనితరము ను, నపశ్యతి=చూడఁడో, అన్యత్=ఇతరము, నశృణోతి=వినఁడో, అన్యత్=ఇతరమును, నవిజానాతి = ఎఱుఁగఁడో, సః=ఆయాత్మయే, భూమా=గొప్పవాఁడు.

తా. పరమాత్మకన్న నన్యములేదు కావున పరమాత్మ స్వరూపమెఱిఁగినవానికి నదితరము కఁనబడదు. ఇతరము వినఁబడదు. తెలిసికొనుట కితరములేదు. అట్టి ఆత్మయే భూమాంకారుఁడు.

"సఏష నేతి నేత్యాత్మా గృహ్యోనగృహ్యతేశీర్యోనహిశీర్యతే
సంగోనహిసజ్జతే శితోనవ్యథతేన హృష్యతి" ౫

(శు-య; బృహదారణ్యక; అ ౫; బ్రా ౯)

టీ. సఏషనేతినేత్యాత్మా=నేతి, నేతి, వాక్యములచే సర్వము ను నిషేధించఁగ శేషించిన యీ యాత్మ, అగ్రాహ్యః=విషయముల వలె గ్రహింపఁదగినవాఁడు కాఁడు, నగృహ్యతే=గ్రహింపఁబడఁడు, అశీర్యః=శరీరమువలె నశింపఁదగినవాఁడు కాఁడు, నహిశీర్యతే=నశింపఁబడఁడు, అసంగః=సంగములేనివాఁడు (కూఁడుకొనువాఁడుకాఁడు.) అశితః=శీతాదులులేనివాఁడు, నవ్యథతే-వ్యథనొందఁడు, నహృష్యతి=సంతోషించఁడు.

తా. ఆత్మ గ్రహింపఁదగిన రూపముగలవాఁడుకాఁడు. గ్రహింపఁబడఁడు. నిస్సంగుఁడు, సంగమునకు గూర్పఁదగినవాఁడుకాడు. సుఖదుఃఖములు లేనివాఁడు శరీరరహితుఁడు.

"సఘనఏవైవం వా రేయమాత్మానం తరో బాహ్యఃకృత్స్నః
ప్రజ్ఞానఘనఏవ" ౬

(శు-య; ౧౦ బృహదారణ్యక, అ ౬-బ్రా ౫)

టీ. అరే=ఓమైత్రేయీ! అయమాత్మా=యీయాత్మ, ఏవం=యీప్రకారము, రసఘనఏవ=ఆనందరసఘనుఁడే, అనంతరః=అంతరము లేనివాఁడు. అబాహ్యః=బాహ్యము లేనివాఁడు, కృత్స్నః=పరిపూర్ణుఁడు, ప్రజ్ఞానఘనః=ప్రజ్ఞానఘనుఁడు.

తా. పరిపూర్ణుఁడగుటచే నాత్మ బాహ్యాంతరములు లేనివాఁడు, ప్రజ్ఞానఘనతయే స్వరూపముగా గలవాఁడు, ఆనందరసఘనుఁడు,

" తస్మాన్మనో విలీనే మనసి గతే సంకల్పే వికల్పే దగ్ధే పుణ్యాపాపే సదాశివః ౭

" ఓం శక్త్యాత్మకః సర్వత్రావస్థితస్స్వయం జ్యోతిశ్శుద్ధో నిత్యో నిరంజనశ్శాంతతమః ప్రకాశయతి " ౮

(శు-య ; ౧౫ పాన)

టీ. తస్మాత్=ఆయాత్మజ్ఞానమున, మనః=మనస్సు, విలీనే=లీనమగుచుండఁగా, మనసి=మనసునందు, గతే=పొందియున్న, సంకల్పే=సంకల్పమును, వికల్పే=వికల్పమును, పుణ్యాపాపే=పుణ్యాపాపములును, దగ్ధే=దగ్ధమగుచుండఁగా, సదాశివః=సదాశివస్వరూపుఁడును, శక్త్యాత్మకః=శక్తిస్వరూపుఁడును, సర్వత్ర=అంతటను, అవస్థితః=ఉన్నవాఁడును, స్వయంజ్యోతిః=తనంతప్రకాశించువాఁడును, శుద్ధః=నిర్మలుఁడును, నిత్యః=నాశము లేనివాఁడును, నిరంజనః=దేని నంటనివాఁడును (దోషరహితుఁడును) శాంతతమః=అత్యంత శాంతస్వరూపుఁడునై, ప్రకాశయతి=ప్రకాశించుచున్నాఁడు, (సమస్తమును ప్రకాశింపఁజేయుచున్నాఁడు.)

తా. ఆత్మజ్ఞానమున మనస్సు నశింపఁగ దాని భాగములైన సంకల్ప వికల్పములు నశించును. పిదప దత్కార్యమైన పుణ్యాపాపస్వరూపమగు కర్మము దగ్ధమగును. పిదప మేఘావరణ వినిర్ముక్తంబగు

బానుబింబము చందమున నిర్మలుఁడును, నిత్యుఁడును, సర్వపరిపూర్ణుఁడును, స్వయంప్రకాశమానుఁడు నగు నాత్మ ప్రకాశించుచుండును.

"ఏషశుద్ధఃపూతః శూన్యశ్శాంతో ప్రాణో సాత్మానంతో ఽ
క్షయ్యఃస్థిరశ్శాశ్వతో జస్స్వతంత్ర స్స్వేమహిమ్నితిష్ఠతి"   ౯
(సామ; ౨౮ మైత్రాయణీ; ప్ర ౨)

టీ. ఏషః=యీయాత్మ, శుద్ధః=మాయాసంబంధములేమి శుద్ధుఁడు, పూతః=శరీరములేమిపవిత్రుఁడు, శూన్యః=ఇంద్రియములులేమిశూన్యుఁడు, శాంతః=అంతరింద్రియములులేమి శాంతుఁడు, అప్రాణః=ప్రాణములేనివాఁడు, అసిశాత్మా=స్వతంత్రుఁడు, అనంతః=అపరిచ్ఛిన్నుఁడగుటచే ననంతుఁడు, అక్షయ్యః=నశింపఁజేయ శక్యముగానివాఁడు, స్థిరః=స్థిరమైనవాఁడు (నిశ్చలుఁడు), శాశ్వతః=నిత్యుఁడు, అజః=జన్మములేనివాఁడు, స్వతంత్రః = సర్వేశ్వరుఁడునై, స్వే = తన, మహిమ్ని=మహిమయందే, తిష్ఠతి=ఉండుచున్నాఁడు.

తా. ఆత్మశుద్ధుఁడై, పవిత్రుడై, శాంతుఁడై, యప్రాణుఁడై, నిర్వికారుఁడై, సర్వతంత్రస్వతంత్రుఁడై, యసంగుఁడై తన మహిమయందే యుండుచున్నాఁడు.

"చక్షుషోద్రష్టా శ్రోత్రస్యద్రష్టా మనసోద్రష్టా వాచోద్రష్టా
బుద్ధేర్ద్రష్టా ప్రాణస్యద్రష్టా తమసోద్రష్టా సర్వస్యద్రష్టా
తతస్సర్వస్మాదన్యోవిలక్షణః సద్ఘనో యంచిద్ఘన
ఆనందఘనఏవైకరసో ఽవ్యవహార్యః"   ౧౦

(అధర్వ; ౨౭ నృసింహోత్తరతాపిని; ఖం ౨)

టీ. చక్షుషః=నేత్రేంద్రియమునకు, ద్రష్టా=సాక్షి, శ్రోత్రస్య=శ్రవణేంద్రియమునకు, ద్రష్టా=సాక్షి, మనసః=మనస్సునకు, ద్రష్టా=సాక్షి, వాచః=వాగింద్రియమునకు, ద్రష్టా=సాక్షి, బుద్ధేః=బుద్ధికి, ద్రష్టా=సాక్షి, ప్రాణస్య=ప్రాణమునకు, ద్రష్టా=సాక్షి, తమసః=అజ్ఞాన

మునకు, ద్రష్టా=సాక్షి, సర్వస్య=సర్వమునకు, ద్రష్టా=సాక్షి, తతః = అందువలన, సర్వస్మాత్ =అన్నిటికంటెను, అన్యః=పరుడు, విలక్షణః= వానిలక్షణములు లేనివాఁడు, అయం=ఈయాత్మ, సద్ఘనః=సన్మాత్రుఁడు, చిద్ఘనః=చిద్రూపుఁడు, ఆనందఘనఏవ=ఆనందఘనుఁడే, ఏకరసః= కేవలానుభవస్వరూపుఁడు. అవ్యవహార్యః=వ్యవహరింపనశక్యుఁడు

తా. ఆత్మ నేత్రవృత్తికి శ్రోత్రవృత్తికి మనోవాగ్బుద్ధి ప్రాణాజ్ఞానవృత్తులకు సాక్షి. సమస్తమునకు సాక్షి. ఇంద్రియప్రాణాజ్ఞానముల కంటె నన్యమైనవాఁడు. వాని న్యాసారములేనివాఁడు. ఆత్మనిస్సంగుఁడనియును నిర్వికారుఁడనియును నిరవయవుఁడనియు నభిప్రాయము.

'సన్మాత్రో నిత్యశ్శుద్ధో బుద్ధో నిరంజనో
విభురద్వితీయానందః పరః ప్రత్యగేకరసః. ౧౧

(అథర్వణ ; ౨౭ నృసింహోత్తరతాపిని ; ఖం ౯)

టీ. సన్మాత్రః = సన్మాత్రుఁడు, నిత్యః = నాశములేనివాఁడు, శుద్ధః=నిర్మలుఁడు, బుద్ధః=బోధస్వరూపుఁడు, ముక్తః=అవిద్యాముక్తుఁడు, నిరంజనః=అలేపుఁడు, విభుః=సర్వవ్యాపకుఁడు, అద్వితీయానందః=ద్వైతదుఃఖములేని, కేవలానంద స్వరూపుఁడు, పరః=పరమాత్ముఁడు, ప్రత్యగేకరసః=ప్రత్యగభిన్న బ్రహ్మస్వరూపుఁడు.

తా. ఆత్మశాశ్వతుఁడు, సద్రూపుఁడు, నిర్మలుఁడు, బోధస్వరూపుఁడు, నిరంజనుఁడు, ప్రత్యగాత్మ స్వరూపుఁడు, అద్వితీయుఁడు. (తనకన్న నితరములేనివాఁడు)

అదృష్టోఽవ్యవహార్యోప్యలోపినాల్పః సాక్ష్యవిశేషః సర్వజ్ఞో
నంతోభిన్నోఽద్వయోవిదితావిదితాత్పరః
అద్వైతపరమానందోవిభుర్నిత్యోనిష్కలంకో నిర్వికల్పో
నిరంజనో, నిరాఖ్యాతశ్శుద్ధో దేవఏకోనారాయణో
నద్వితీయోస్తికశ్చిత్ ౧౨

(అథర్వ ; -౨౭ నృసింహోత్తరతాపిని ; ఖం ౯ ; అథర్వ- ౫-౨ మహానారాయణ-అ ౧)

టీ. అదృష్టః=కనబడనివాఁడు, అవ్యవహార్యః=వ్యవహరింపశక్యముకాని వాఁడు, అల్పోపి=అణువువలె నల్పుఁడైనను, నాల్పః= అల్పుడుగాడు (గొప్పవాఁడు) సాక్షీ=సమస్తమునకు ద్రష్టయైనవాఁడు, సాక్ష్యవిశేషః = సాక్షిత్వధర్మముగలవాఁడు, అవిశేషః=గుణములు లేనివాఁడు, సర్వజ్ఞః=అన్నిటినెఱుఁగువాఁడు, అనంతః=అపరిచ్ఛిన్నుఁడు, అభిన్నః= స్వగతసజాతీయవిజాతీయభేదములేని వాఁడు, విదితావిదితాత్ =విదితమైన దృశ్యముకన్నను అవిదితమైన యదృశ్యముకన్నను, పరః=అన్యుఁడు (జ్ఞానముచే నెఱుఁగబడినవానికన్న నెఱుఁగఁబడని వానికన్ననాత్మ అన్యుఁడు), అద్వైతః=అద్వితీయమైన, పరమానందః= ఉత్కృష్టానందమే స్వరూపముగాగలవాఁడు, విభుః = వ్యాపకుఁడు, నిత్యః=శాశ్వతుఁడు, నిష్కలంకః=నిర్మలుఁడు, నిర్వికల్పః వికల్పము లేనివాఁడు (ఎడతెగకయుండువాఁడు), నిరంజనః = దేనినంటనివాఁడు (నిర్దోషుఁడు), నిరాఖ్యాతః = ఇట్టివాఁడని జెప్పశక్యము కానివాఁడు, శుద్ధ=పరిశుద్ధుఁడు. దేవః=దేవుఁడు, ఏకః=ఒక్కడు, నారాయణః= నారాయణుఁడు, ద్వితీయః=రెండవవాఁడు, కశ్చిత్ =ఒకడును, నాస్తి= లేడు.

తా. అద్వితీయ పరమానందస్వరూపుఁడు సర్వేశ్వరుఁడు. శాశ్వతుఁడు నిర్వికల్పుఁడునగు నారాయణస్వరూపుఁడైన యాత్మ యొక్కఁడే యున్నాఁడు. ఆత్మకన్న నన్యుఁడు లేఁడు. ఆత్మకన్న నన్యముగ దోఁచు జగజ్జీవేశ్వరాదులు మిథ్యయని తెలియవలెను.

" అచక్షుర్విశ్వతశ్చక్షురకర్ణోవిశ్వతఃకర్ణ అపాదోవిశ్వతః పాద అపాణిర్విశ్వతః పాణిరశిరావిశ్వతశ్శిరా విద్యామాత్రైక సంశ్రయో విద్యారూపః" ౧౩

(అథర్వ ; ౮౭ భస్మజాబాల.)

టీ. అచక్షుః=నేత్రములు లేనివాఁడు, విశ్వతశ్చక్షుః=అంతట గన్నులుగలవాఁడు, అకర్ణః=చెవులు లేనివాఁడు, విశ్వతఃకర్ణః=అంతట చెవులుగలవాఁడు, అపాదః=పాదములు లేనివాఁడు, విశ్వతఃపాదః=అంతట బాదములుగలవాఁడు, అపాణిః=చేతులు లేనివాఁడు, విశ్వతఃపాణిః=అంతట జేతులుగలవాఁడు, అశిరాః=నరములు లేనివాఁడు, విశ్వతశ్శిరాః=అంతటను నరములుగలవాఁడు, (అశిరః=శిరస్సు లేనివాఁడు, విశ్వతఃశ్శిరాః=అంతటను శిరస్సులుగలవాఁడు), విద్యామాత్రైకసంశ్రయః, విద్యామాత్ర=విద్యకే, ఏక=ముఖ్యమైన, సంశ్రయః=ఆశ్రయమైనవాఁడు, విద్యారూపః=జ్ఞానస్వరూపుఁడు.

తా. ఆత్మనిరవయవుఁడయ్యు నుపాధిచే విరాడ్రూపుఁడగునంతట నవయవములు గలవాఁడయ్యెను. విద్యచే నాశ్రయింపఁదగినవాఁడు (జ్ఞానస్వరూపుఁడు)

"దివ్యోహ్యమూర్తః పురుషోహ్యబాహ్యాంభ్యంతరోహ్యజః" ౧౨
(అధర్వ ; ౫ ముండక; ముం-౨)

టీ. దివ్యః=ప్రకాశించువాఁడు, అమూర్తః=ఆకారము లేనివాఁడు, పురుషఃహి=పురుషుఁడు, అబాహ్యాభ్యంతరఃహి=బాహ్యాంతరములు లేనివాఁడు, అజః=పుట్టువు లేనివాఁడు.

తా. ఆయాత్మ పరిపూర్ణుఁడగుటచే బాహ్యాంతరములు లేనివాఁడు ఉపాధియందుండుటచే బురుషుఁడయ్యెను. పుట్టువు లేనివాఁడు.

"అప్రాణోహ్యమనాశ్శుభ్రో హ్యక్షరాత్పరతః పరః" ౧౫
(అధర్వ ; ౫ ముండక ; ముం ౨.)

టీ. అప్రాణఃహి=ప్రాణములేనివాఁడు, అమనాః = మనస్సు లేనివాఁడు, శుభ్రఃహి=స్వచ్ఛుఁడు, అక్షరాత్=అవిద్యా ప్రతిబింబిత, కూటస్థునికన్నను, పరతః = మాయా ప్రతిబింబిత ఈశ్వరునికన్నను, పరః=అన్యుఁడు.

తా. ఆయాత్మప్రాణములేనివాఁడు అమనస్కుఁడు మాయా సంబంధములేమిచే బరిశుభ్రుఁడు ప్రత్యగాత్మ ఈశ్వరులకన్న నన్యమైన శుద్ధబ్రహ్మము.

" అద్వైతస్సర్వ భావానాం దేవస్తుర్యోవిభుస్స్మృతః " ౧౬
" అపూర్వోనంతరోబాహ్యో నపరఃప్రణవోవ్యయః " ౧౭
(అధర్వ ; ౬ మాండూక్య, గౌడపాదకారి కాంతర్గతం)

టీ. సర్వభావానాం=సమస్తజ్ఞానములలో, అద్వైతః=అద్వైత జ్ఞానమైనవాఁడు, దేవః=దేవుఁడు, తుర్యః=అవస్థాత్రయసాక్షి, విభుః= ఈశ్వరుఁడు, అపూర్వః=తనకుపూర్వము (కారణము) లేనివాఁడు, అనంతరః=అంతరములేనివాఁడు, అబాహ్యః=బాహ్యములేనివాఁడు, నపరః=తనకన్న నన్యములేనివాఁడు, ప్రణవః = ఓంకారస్వరూపుఁడు, అవ్యయః=నాశములేనివాఁడునని, స్మృతః=చెప్పబడుచున్నాఁడు.

తా. సమస్తజ్ఞానములలో నుత్కృష్టమైన యద్వైతజ్ఞానమైన వాఁడు తనకు గారణములేనివాఁడు, తనవలననైన కార్యములేనివాఁడు (జగత్తులేనివాఁడు) ప్రణవస్వరూపుఁడు, పూర్ణుఁడని చెప్పబడును.

" అమాత్రోనంతమాత్రశ్చ ద్వైతస్యోపశమశ్శివః " ౧౮
(అధర్వ ; ౬ మాండూక్య, గౌడపాదీయకారికాంతర్గతం)

టీ. అమాత్రః = మాత్రకానివాఁడు, అనంతమాత్రః=అనంత మాత్రాస్వరూపుడు, ద్వైతస్య=ద్వైతప్రపంచమునకు, ఉపశమః=శాంతి నిజేయువాఁడు, శివః=మంగళస్వరూపుఁడు (పరమాత్మ)

తా. స్పష్టము.

" కర్మాధ్యక్షస్సర్వ భూతాధివాసస్సాక్షీచేతా కేవలోనిర్గుణశ్చ " ౧౯
(కృ-య ; ౧౧బ్రహ్మ ; ౧౪ శ్వేతాశ్వతర)

" అఖైండైకరసోవాహ మానందోఽస్మీతి వర్జితః " ౨౭

(కృ–య ; ౩౭ తేజోబిందు. అ ౫)

" దృశ్యదర్శననిర్ముక్తః కేవలామలరూపవాన్ " ౨౮

(సామ–౬౧ మహో–అ ౬)

టీ. అహం=నేను, అఖండైకరసః=అఖండానుభవ, స్వరూపుడను ఆనందోస్మి=ఆనందరూపుడనగుచున్నాను, ఇతి=అనునట్టి జ్ఞానముచేత, వర్జితః = విడువబడినవాఁడు, దృశ్యదర్శననిర్ముక్తః = చూడబడునది చూపు వీనినుండి విడువబడినవాఁడు, కేవల=అద్వితీయమైన, అమల= స్వచ్ఛమైన, రూపవాన్=రూపముగలవాఁడు.

తా. తానే బ్రహ్మముగావున నేను బ్రహ్మమునైతిననువాఁడు బ్రహ్మము నెఱిఁగినవాడుకాడు అట్టిజ్ఞానముండు నంతవరకును బ్రహ్మైక్యము లేదని తెలియవలయును. పరమార్థమున దానే బ్రహ్మమైయున్నాఁడు ఈ హేతువుచే మహావాక్యార్థాదులకు బ్రహ్మదూరము.

" నిత్యోదితో నిరాభాసో ద్రష్టాసాక్షీచిదాత్మకః " ౨౯

" సఏవవిదితాదన్యస్తథైవావిదితాదపి " 30

(సామ ; ౬౧ మహో ; అ ౬)

టీ. నిత్యోదితః=సదారూపుడౌటచే నెల్లప్పుడును స్ఫురించువాడును, నిరాభాసః= అంతఃకరణము లేమిచే నాభాసస్వరూపమైన జీవత్వము లేనివాఁడు, ద్రష్టా = జీవస్వరూపమున వ్యష్టిప్రపంచముజూచువాఁడు, సాక్షీ=అంతర్యామియైన సమష్టిప్రపంచమునుజూచువాడు, చిదాత్మకః=చిద్రూపుడు, సఏవ=ఆయాత్మే, విదితాత్ =జ్ఞానముచే దెలియబడుదానికన్న, అన్యః=ఇతరమైనవాడు, తథైవ=అట్లే, అవిదితాదపి= జ్ఞానముచే నెఱుఁగబడనిదానికన్నను, అన్యః= ఇతరమైనవాఁడు,

తా. సత్తామాత్రుడౌటచే నెల్లప్పుడు స్ఫురించువాఁడు బ్రహ్మ మెఱిగితిననువానికిని బ్రహ్మ మెఱుఁగననువానికిని దెలియబడనివాఁడు (కేవల సంవిద్రూపుడౌటవలన.)

ఇతి సార్థాంతిక పుంలింగస్వరూప వాక్యానిత్రింశత్.

ఇట్లు సార్థాంతిక పుంలింగవాక్యములు ముప్పది

ఇతి ద్వాదశప్రకరణం సమాప్తం

ఇట్లు పండ్రెండవప్రకరణము సమాప్తము.

శ్రీ

సద్గురవేనమః.

# ౧౩ శ్రీలింగస్వరూపవాక్య ప్రకరణము.

"అలౌకికపరమానంద లక్షణాఖండామిత తేజోరాశిః"

(అధర్వ-౫౨ మహానారాయణ; అ ౧)

టీ. అలౌకిక = లోకసంబంధముగాని, పరమ=ఉత్కృష్టమైన, ఆనంద=ఆనందమే, లక్షణా=లక్షణముగాగలది, అఖండ=పరిపూర్ణమైనదియును, అమిత=మితముకానిదియునగు, తేజోరాశిః= తేజఃపుంజమైనది.

తా. పరబ్రహ్మమయిన సంవిత్తువిషయసంబంధముకాని నిరతిశయ ప్రేమస్వరూపమైనది. అఖండ తేజోరూపమయినది.

"భావాభావకలావినిర్ముక్తా చిద్విద్యాబ్రహ్మసంవిత్తిస్సచ్చి" ౧
"దానందలహరీమహాత్రిపురసుందరీబహిరంతరనుప్రవిశ్యస్వయమేకైవవిభాతి" ౨

(ఋ ; ౧౦౭ బృహ్వృచ.)

టీ. బ్రహ్మసంవిత్తిః = బ్రహ్మస్వరూపిణియైన సంవిత్తి, భావాభావకలావినిర్ముక్తా = భావాభావసంబంధములైన షోడశకలలులేనిది, చిద్విద్యా=జ్ఞానస్వరూపిణి, సచ్చిదానందలహరీ=సత్యజ్ఞానానంద ప్రవాహస్వరూపిణి, మహాత్రిపురసుందరీ=జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడు పురములందు సత్యజ్ఞానానంద స్వరూపమున నున్నదియునై, బహిరంతరనుప్రవిశ్య=బాహ్యాంతరముల బ్రవేశించి, స్వయం = తనంతదాను, ఏకైవ=అద్వితీయయై, విభాతి=ప్రకాశించు చున్నది.

తా. శ్రోత్రాదీంద్రియ గ్రాహ్యములైన శబ్దాదులు భావములు. మన ఆదిగ్రాహ్యములైన సంకల్పాదు లభావములు. సంవిత్తు షోడశకలావికారములు లేక జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడు పురముల సత్యజ్ఞానానంద స్వరూపమున బాహ్యాంతరములందు దనంత దానద్వితీయమై ప్రకాశించు చున్నది ఆసంవిత్తు బ్రహ్మము.

" సర్వసంకల్పరహితా సర్వసంజ్ఞావివర్జితా " ౩

(సామ; ౬౧ మహా; అ ౫.)

టీ. సర్వసంకల్ప రహితా=సమస్త సంకల్పములు లేనిది, సర్వసంజ్ఞావివర్జితా=సమస్తసంజ్ఞలు లేనిది.

తా. అంతఃకరణము గాక దానికి సాక్షిరూపమున నున్నందున సంవిత్తు సంకల్పములు లేనిది. నామరూపములు లేమిని సంవిత్తునకు సంజ్ఞలు లేవు. సంవిత్తని బోధకై వ్యవహరింపబడెనని తెలియవలెను.

" సైషాచిదవినాశాత్మా సాత్మేత్యాదికృతాభిదా " ౪

(సామ; ౬౧. మహా; అ ౫.)

టీ. సైషా=ఆయీసంవిత్తు; చిత్=జ్ఞానస్వరూపమైనది; అవినాశాత్మా=నాశములేనిది (సద్రూపమైనది) సా=ఆసంవిత్తే; ఆత్మేత్యాది=ఆత్మయనుమొదలైన పదములచే; కృతా=చేయబడిన; అభిదా=పేరుగలది.

తా. ఆసంవితు జ్ఞానస్వరూపమైనది–నాశములేనిది–ఆసంవితే ఆత్మ–బ్రహ్మము ఈమొదలైన పేరులుగలది.

" ఆకాశశతభాగాచ్ఛాజ్ఞేషునిష్కలరూపిణీ " ౫

" నాస్తమేతినచోదేతి నోత్తిష్ఠతినతిష్ఠతి " ౬

(సామ; ౬౧ మహా; అ ౫.)

టీ. ఆకాశశతభాగా - ఆకాశమునకు నూరవవంతుది (మిక్కిలి సూక్ష్మమైనది) అచ్ఛా=స్వచ్ఛమైనది, అజ్ఞేషు=జ్ఞానములు కానివారియందు (మూఢులందు), నిష్ఫలరూపిణీ=ఫలమునిచ్చునది కానిది, నాస్తమేతి=నాశముబొందదు, నచోదేతి=ఉదయమునొందదు, నోత్తిష్ఠతి=లేవదు, నతిష్ఠతి=నిలువబడదు.

తా. ఆకాశముకన్నను యీసంవిత్తు మిక్కిలి సూక్ష్మమైనది. మూఢులకు నిష్ప్రయోజనమైనది. స్వచ్ఛమైనది. కాలత్రయమందు నుత్పత్తివినాశములులేక పరిపూర్ణమై నిశ్చలమైయున్నది.

"నచయాతినచాయాతి నచనేహానచేహాచిత్" ౭

"సైషాచిదమలాకారా నిర్వికల్పానిరాస్పదా" ౮

(సామ; ౬౧ మహా; అ ౫.)

టీ. సైషా = ఈసంవిత్తు; నచయాతి=పోదు; నచాయాతి=రాదు; నచనేహా=ఇక్కడలేనిది కాదు; నచేహా=ఇక్కడలేనిది; చిత్ = స్వప్రకాశస్వరూపమైనది; చిదమలాకారా = జ్ఞానమునవిర్మలాకారమైనది; నిర్వికల్పా=వికల్పములేనిది; నిరాస్పదా=ఆధారములేనిది.

తా. సంవిత్తు నిరవయమైనదిగావున నొకచోటికిబోదు, ఒకచోటనుండిరాదు, సర్వపరిపూర్ణమైనదికావున నిక్కడనున్నది నిక్కడలేనిది యను వ్యవహారములేనిది. నిర్మలజ్ఞానరూపమైనది. నిర్వికల్పమైనది. సర్వాధారమైనది. తనకాధారములేనిది.

"మహాచిదేకైకేహాస్తి మహానత్తేతియోచ్యతే" ౯

"నిష్కలంకాసమాశుద్ధా నిరహంకారరూపిణీ" ౧౦

(అథర్వ; ౭౦ అన్నపూర్ణ; అ౫.)

టీ. యా=ఏసంవిత్తు, మహానత్తేతి=మహానత్తయని, ఉచ్యతే=చెప్పబడుచున్నదో, ఇహ=ఈ జగమందు, ఏకైకా=ఒక్కటియొక్కటి

ష్యై, (ప్రతిదేహమందుండుటచే నానాకృతి యొక్కటియై కనబడుచు), మహాచిత్ = చిద్రూపమున (జ్ఞానరూపమున) అస్తి = ఉన్నదో, సా = ఆసంవిత్తు, నిష్కలంకా = కలంకములేనిది, సమా = సర్వసమత్వము గలది, శుద్ధా = స్వచ్ఛమైనది, నిరహంకారరూపిణీ = అహంకారములేని స్వరూపముగలది.

తా. 'సదేవసౌమ్యే దమగ్రఆసీత్' అను శ్రుతిప్రకారము సృష్టికి ముందు సద్రూపమున నే తత్వముగలదో ఆసత్తే యీ జగమున నుపాధులందు చిద్రూపమున (జ్ఞానరూపమున) ప్రత్యేకమున్నట్లు కనబడుచున్నది. అదియే సంవిత్తు (తెలివి) అది యొక్కటియే గాని భిన్నముగాదు. నిష్కలంకమైనది. శుద్ధమైనది. నిరహంకార స్వరూపమైనది.

"సత్కృద్విభాతావిమలానిత్యోదయవతీసమా" ౧౧
"సాబ్రహ్మాపరమాత్మేతి నామభిఃపరిగీయతే" ౧౨

(అథర్వ; ౭౧ అన్నపూర్ణ; అ ౫.)

టీ. సత్కృద్విభాతా = సదాది త్రివ్యత్తులుగేక ప్రకాశించునది, విమలా = నిర్మలమైనది, నిత్యోదయవతీ = ఎల్లప్పుడు చిద్రూపమున స్ఫురించునది, సమా = సమత్వమే స్వరూపముగాగలది, సా = ఆసంవిత్తే, బ్రహ్మా = బ్రహ్మమును, పరమాత్మేతి = పరమాత్మయునను, నామభిః = నామములచేత, పరిగీయతే = వర్ణించబడుచున్నది.

తా. సంవిత్తే ఆత్మ, బ్రహ్మము, యీ మొదలైనపేర్లచే వ్యవహరింప బడుచున్నది. స్త్రీలింగములైన సంవిదాది శబ్దములచే బ్రహ్మ

ము బోధింపబడుచున్నది కావున వాక్యములు స్త్రీలింగ స్వరూపము లనబడును.

ఇతి సార్థాంతిక స్త్రీలింగ స్వరూప వాక్యాని ద్వాదశ.
ఇట్లు సార్థాంతిక స్త్రీలింగ స్వరూప వాక్యములు పండ్రెండు.
ఇతి త్రయోదశ ప్రకరణం సమాప్తం.
ఇట్లు పదమూడవ ప్రకరణము సమాప్తము.

---

శ్రీ

సద్గురవేనమః.

# ౧౪ నపుంసకలింగస్వరూపవాక్య ప్రకరణము.

" అన్యదేవతద్విదితాదథో అవిదితాదధి " ౧

(సామ; ౨ కేన.)

టీ. తత్=ఆబ్రహ్మము, విదితాత్=తెలియబడినదానికన్నను, అవిదితాత్ = తెలియబడనిదానికన్నను, అన్యదేవ=ఇతరమైనదే.

తా. బ్రహ్మము తెలియబడుచున్నజాగ్రత్స్వప్న సుషుప్తిస్థితికన్నను దెలియబడని తురీయస్థితికన్నను నన్యమైనదే. ఇట్లనుటవలన దెలియబడినది తెలియబడనిది బ్రహ్మముకాదు. తెలిసికొను తెలివియే బ్రహ్మము.

"యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్ర మవర్ణమచక్షుశ్శ్రోత్రంతదపాణిపాదం" ౨

(అధర్వ; ౫ ముండక; ముం ౧; ఖం ౧.)

టీ. యత్=ఏది, అద్రేశ్యం=అదృశ్యమైనదియో, అగ్రాహ్యం =విషయమువలెగ్రహింపరానిదో; అగోత్రం=దేహములేమి గోత్రములేనిదియో, అవర్ణం=వర్ణములేనిదియో,అచక్షుశ్శ్రోత్రం=కన్నులుచెవులుమొదలైన యింద్రియములులేనిదియో, అపాణిపాదం=చేతులుకాళ్లునులేనిదియో, తత్=అది, తత్=తత్పదలక్ష్యమైనబ్రహ్మము.

తా. బ్రహ్మమింద్రియముల కగోచరమైనది. వర్ణములేనిది. గోత్రములేనిది. జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు, నంతఃకరణమును లేనిది, గ్రహింపరానిది.

"సదేవసౌమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం" 3

(సామ; ఛాందోగ్య; ప్ర ౬; ఖం ౨.)

టీ. సౌమ్య=సౌమ్యుఁడవైనయో శ్వేతకేతూ, అగ్రే=సృష్టికి ముందు, ఇదం=ఈజగత్తు, ఏకమేవ=ఒక్కటేయైన, అద్వితీయం=రెండవదిలేనిదియునైన, సదేవ=సత్తేగా, (సద్వస్తువైనబ్రహ్మమై) ఆసీత్=ఉండెను.

తా. గ్రాహ్యమునందుభ్రాంతిచేఁజేసిన సాము తోఁచకముందే త్రాడైయున్నట్లు సృష్టికి ముందీజగత్తు సద్వస్తువైన బ్రహ్మముగ నున్నది. సద్వస్తువున నామరూపాత్మకమగు జగత్తు కల్పింపబడినదిగాని వాస్తవముగాదనియు నామరూపములు తోఁచుటయే సృష్టియనియు నామరూపములు మిథ్యాభూతములనియు, నామరూపములు పొందుట కాధారమైన (అధిష్ఠానమయిన) సత్తే కాలత్రయాబాధ్యమై యున్నదనియు, దెలియవలెను; 'ఏకమేవాద్వితీయమ'నువాక్యమున "ఏక"మని నందున సత్తుకు స్వగతభేదము లేదనియును, "ఏవ" అనినందున సజాతీయభేదము లేదనియును "అద్వితీయ" మనినందున విజాతీయభేదము లేదనియును తెలియవలయును. స్వగతభేదమనఁగా;—తనయందుగలభేదము. సత్తున కవయవనఖకేశరూపాదులు లేనందున స్వగతభేదము లేదు, సజాతీయభేదమనఁగా:—తనజాతియందున్న భేదము. ఈసత్తువంటి మఱియొకసత్తు లేదు. కావున సజాతీయభేదమును లేదు, విజాతీయభేదమనఁగా:—తనకు వ్యతిరేకమైన జాతియందుండుభేదము. సత్తునకు వ్యతిరేకమైనది లేదుకావున విజాతీయభేద

మును లేదు. సత్తనఁగా నున్నది. అసత్తనఁగా లేనిది సత్తునకు విజాతీయమసత్తగును. అసత్తుండుటెట్లు? కావున సత్తునకు వ్యతిరేకమైనది లేదు. 'ఘట' మున్నది, 'పట' మున్నది యను వ్యవహారమున ననేక సత్తులున్నవని శంక తోఁచవచ్చును. ఉపాధిభేదమున నొకసత్తే భిన్నములుగానున్నట్లు గనబడుచున్నది. ఘటపటాద్యుపాధులద్రోయగా నుండు టొక్కటియే గాని భిన్నములుగావు. కావున సత్తువంటిది సత్తే గాని మఱియొకసత్తు లేదు. అందుచే సజాతీయభేదము లేదు. వృక్షమునకు పత్రపుష్పఫలాదులవలన స్వగతభేదమును, మఱియొకవృక్షమువలన సజాతీయభేదమును శిల మొదలైనదానివలన విజాతీయభేదమును గలుగుచున్నవి. భేదత్రయమిట్లు సర్వత్ర తెలియవలయును. భేదత్రయమునకే భేదమున్నను మిథ్యయని తెలియవలెను. దానినీహేతువున బ్రహ్మవిష్ణ్వాది దేవతాస్వరూపమును, మనుష్యాదికమును, జగత్తును, కాలత్రయమాదియును బాధ్యమై మిథ్యయగుచున్నది. కొందఱిమతప్రకారము సర్వేశ్వరుఁడు కరచరణాద్యవయవములు గలవాడని వాడుకొనబడుచున్నాఁడు. ఆవాదము యుక్తివిధురము. అనుభవవిరుద్ధము. అట్లయిన యీజగత్తునకు గతియేమనిన నది యచింత్యమైన మాయారచనాత్మకము. ఇంద్రజాలమువంటిది. మిథ్య యంతియే కాని యదార్థము కాదు. సద్వస్తువైన బ్రహ్మముకన్న నన్యమెద్దియును లేనిదే.

" అస్థూలమనణ్వహ్రస్వ మదీర్ఘమలోహితమస్నేహ
మచ్ఛాయమతమో వాయ్వనాకాశమసంగమరస
మగంధమచక్షుష్క మశ్రోత్ర మవాఙ్మనో తేజస్క
మప్రాణమముఖ మమాత్రమనంతరమబాహ్యం ''  ౮

(శు-యు ; ౧౦. బృహదారణ్యక ; అ ౫.)

“ నిత్యంశుద్ధంబుద్ధముక్తంసత్యంసూక్ష్మంపరిపూర్ణంఅద్వ
యానందచిన్మాత్రం పురతస్సువిభాతం ” ౫

(అధర్వ; ౨౭ నృసింహోత్తరతాపినీ; ఖం ౯.)

టీ. అస్థూలం=స్థూలము కానిదియును, అనణు=అణువుకానిది యును, అహ్రస్వం=పొట్టిదికానిదియును, అదీర్ఘం=పొడుగుకానిదియును, అలోహితం = ఎఱుపు మొదలైన రంగులు లేనిదియును, అస్నేహం= రాగము మొదలైనది లేనిదియును, అచ్ఛాయం = ఛాయకానిదియు (ఛాయయనంగా ప్రతిబింబితమైన జీవుండు మొదలైనది), అతమః= చీకటి (అజ్ఞానము) కానిదియు, అనాకాశం = ఆకాశము కానిదియు, అవాయు=వాయువు కానిదియు, అసంగం=సంగములేనిదియు, అరసం= రసముకానిదియు (జిహ్వేంద్రియముచే గ్రహించ బడనిదియు), అగంధం=గంధము కానిదియు (ఘ్రాణేంద్రియముచే గ్రహించబడనిదియు), అచక్షుష్కం=నేత్రము గానిదియు, అశ్రోత్రం శ్రవణేంద్రియము గానిదియు, అవాఙ్మనః=వాఙ్మనస్సులు లేనిదియు, అతేజస్కం = తేజస్సు కానిదియు, అప్రాణం=ప్రాణము కానిదియు, అముఖం=ముఖాద్యవయవములు కానిదియు, అమాత్రం=మాత్రకానిదియు, అనంతరం= అంతరములేనిదియు, అబాహ్యం = బాహ్యము లేనిదియు (పరిపూర్ణమైనది), నిత్యం=నాశము లేనిదియు, శుద్ధం = మాయాసంబంధము లేమిని శుద్ధమైనదియు, బుద్ధం=బోధస్వరూపమైనదియు, ముక్తం=స్వతస్సిద్ధముగ ముక్తిమైనదియు, సత్యం = కాలత్రయాబాధ్యమైనదియు సూక్ష్మం=నిరవయవ మగుటచే సూక్ష్మమని వ్యవహరింపబడునదియు, పరిపూర్ణం=అంతటను నిండియున్నదియు, అద్వయానంద చిన్మాత్రం= అద్వితీయమైన జ్ఞానానందమే స్వరూపముగాగలదియునై, పురతః=సృష్టికిముందు, సువిభాతం=లెస్సగ ప్రకాశించునదియునై యుండెను.

తా. నామరూపాత్మకమైన సృష్టికిముందు సజాతీయవిజాతీయస్వగతభేదములులేనిదియై దేహేంద్రియములు గానిదియై, దేహేంద్రియములు లేనిదియై, దేహేంద్రియగ్రాహ్యమైన విషయముగానిదియై సత్యజ్ఞానానందస్వరూపమై, పరిపూర్ణమై బ్రహ్మము ప్రకాశించుచుండెను.

" అవిభాతమద్వైతమచింత్యమలింగం స్వప్రకాశ మానందఘనం" ౬

(అధర్వ; ౨౭ నృసింహోత్తరతాపినీ; ఖం ౬.)

టీ. అవిభాతం=సూర్యాదులచే బ్రకాశింపబడనిది, అద్వైతం=అద్వితీయమైనది, అచింత్యం=చింతింపశక్యముగానిది, అలింగం=చిహ్నములేనిది, స్వప్రకాశం=ఇతరప్రకాశ మపేక్షింపక (దీపమువలె) తన ప్రకాశముగలది, ఆనందఘనం=ఆనందఘనమైనది.

తా. బ్రహ్మము సూర్యాదులను ప్రకాశింపచేయును గాని యా సూర్యాదులచే ప్రకాశింపబడదు. ద్వైతమైన జగత్తులేనిది చింతించుటకు శక్యముగానిది, ఏలక్షణము లేనిది, స్వప్రకాశమైనది, ఆనందఘనమైనది.

" ఏతద్ధ్వశబ్దమస్పర్శమ రూపమ రసమ గంధమ వ్యక్తవ్యమ దాతవ్యమ గంతవ్యమ విసర్జయితవ్యమ నానందయితవ్యమ మంతవ్యమ బోద్ధవ్యమ నహంకర్తయితవ్యమ ప్రాణయితవ్యమ నింద్రియమ విషయమ కరణమలక్షణమ సంగమ గుణమ విక్రియమ మాయమ భయమాపనిషదం సువిభాతంసకృద్విభాతం పురతోస్మాత్సర్వస్మాత్సువిభాతమద్వయం " ౭

(అధర్వ—౨౭ నృసింహోత్తరతాపినీ; ఖం ౯)

టీ. సతత్ = ఈసద్వస్తువైన బ్రహ్మము. హి=నిశ్చయముగ, అశబ్దం=శబ్దముకానిదియు, అస్పర్శం=స్పర్శముకానిదియు, అరూపం=రూపముగానిదియు, అరసం=రసముగానిదియు, అగంధం=గంధముగానిదియు (జ్ఞానేంద్రియపంచకమున వ్యవహరించరానిది), అవక్తవ్యం=చెప్పరానిదియు, అదాతవ్యం=ఇవ్వరానిదియు, అగన్తవ్యం=పోరానిదియు. అవిసర్జయితవ్యం = విడువరానిదియు, అనానందయితవ్యం=ఆనందింపరానిదియు, (కర్మేంద్రియపంచకమున వ్యవహరింపరానిది), అమంతవ్యం=మననముచేయరానిదియు, అబోద్ధవ్యం=తెలియరానిదియు, అనహంకర్తయితవ్యం = అహంకరింపరానిదియు, (మనోబుద్ధ్యహంకారములచే వ్యవహరింపరానిది) అప్రాణయితవ్యం = ప్రాణముచే వ్యవహరింపరానిదియు, అనింద్రియం = ఇంద్రియములు కానిదియు, అవిషయం = విషయములు కానిదియు, అకరణం=అంతఃకరణముకానిదియు, అలక్షణం=లక్షణముగానిదియు, అసంగం=సంగములేనిదియు. అగుణం=సత్త్వరజస్తమో గుణములు లేనిదియు, అవిక్రియం=షడ్భావవికారములు లేనిదియు, అమాయం=మాయలేనిదియు, అభయం=భయములేనిదియు, ఔపనిషదం=ఉపనిషత్ప్రతిపాదితమైనదియు, సువిభాతం=లెస్సగ తనంతటప్రకాశించునదియు, సకృద్విభాతం=సదాత్రివ్యక్తులులేక సకృత్తుగ ప్రకాశించునదియునై, పురతః=సృష్టికిముందున్నది, అస్మాత్ = ఈహేతువువలన, సర్వస్మాత్ =సమస్తముకన్నను, సువిభాతం = లెస్సగప్రకాశించునది అద్వయం=అద్వితీయమైనది.

తా. ఇంద్రియములు గలదిగాక, ఇంద్రియములుగాక, విషయములుగాక, గుణములుగాక, గుణిగాక, షడ్భావవికారములులేక, భేదత్రయములేక నామరూపాత్మకమైన సృష్టికిముందు సద్వస్తువైన బ్రహ్మము ప్రకాశించుచుండెను.

"అనిర్వచనీయ జ్యోతిస్సర్వవ్యాపకం నిరతిశయానంద
లక్షణం పరమాకాశం" ౮

(శు-య-౮౮ మండలబ్రాహ్మణ)

టీ. అనిర్వచనీయజ్యోతిః=నిర్వచించుటకు శక్యముకాని జ్యోతిస్స్వరూపమైనది. సర్వవ్యాపకం=అంతట వ్యాపించియున్నది, నిరతిశయానందలక్షణం=నిరతిశయానందమే చిహ్నముగాగలది (అంతకన్న నెక్కువానందములేమి నిరతిశయానందము) పరమాకాశం=చిదాకాశస్వరూపమైనది.

తా. వస్తుస్వరూపము ఏవిధముననైన మిగులకుండ తెలియునట్లు స్పష్టముగ చెప్పుట నిర్వచనము. ఒకవస్తువుస్వరూపము నిర్వచించినదానికి నింక నవరణ యుండరాదు. అట్లు చెప్పుటగా నిర్వచించుట అనగా నతివ్యాప్తి అవ్యాప్తి అసంభవము అను దోషములు లేకుండ చెప్పవలయునని తాత్పర్యము. గోవెట్టిదనిన కొమ్ములుగలది యని చెప్పిన నీలక్షణము లక్ష్యమైన గోవునందేగాక శక్కినజంతువులందును వర్తించును. ఇది యతివ్యాప్తియను దోషము. నల్లనిది గోవనిన తెల్లని యెఱ్ఱని గోవులున్నందున లక్ష్యమందు లక్షణము సరిగా వర్తింపదు. ఇది యవ్యాప్తియను దోషము. కోరలుగలది గోవనిన నీలక్షణము గోవను లక్ష్యమందు వర్తింపదు. ఇది యసంభవమనుదోషము. ఈదోషములు లేకుండ చెప్పుట నిర్వచించుటయగును గళకంబళముగలది గోవనిన నతివ్యాప్తి అవ్యాప్తి అసంభవమునను దోషత్రయము గలుగదు. గళకంబళమనగా మెడక్రిందుగ వ్రేలాడు చర్మవిశేషము. ఇట్లు దోషత్రయము లేకుండ బ్రహ్మమును చెప్పలేము గావున ననిర్వచనీయమనబడును. వేదాంతశాస్త్రమున మాయ యనిర్వచనీయయని చెప్పబడెను. బ్రహ్మము నట్టిదేయనిన బ్రహ్మముకు మాయకు భేదమేమియనిన బ్రహ్మము దృశ్యముకానిది (తెలియబ

టీ. సత్యం=సద్రూపమును, విజ్ఞానం=చిద్రూపమును, ఆనందం=ఆనందరూపమును, నిష్క్రియం = క్రియలేనిదియు, నిరంజనం=నిర్దోషమైనదియు, సర్వగతం=సమస్తమునయున్నదియు, సుసూక్ష్మం=శరీరములేమి సూక్ష్మమని వ్యవహరింప బడుచున్నదియు, సర్వతోముఖం=అంతట ముఖములు గలదియు, అనిర్దేశ్యం=చెప్పుట కశక్యమైనదియు, అమృతం=నాశరహితమైనదియు, నిష్కళం=షోడశకళలు లేనిదియు, యత్=ఏదియో, తత్=అది, బ్రహ్మము.

తా. సత్యజ్ఞానానంద స్వరూపమైన ప్రత్యగాత్మ రూపమున బ్రహ్మమున్నదని తాత్పర్యము.

"ఏకమద్వైతం నిష్కళంనిష్క్రియం శాంతంనిరతిశయ
మనామయంచతుర్థం బ్రహ్మవిష్ణురుద్రాతీత మాశాస్యం" ౧౨

(అధర్వ-౧౭ ధర్మజాబాల.)

టీ. ఏకం= స్వగతసజాతీయ భేదములేనిది, అద్వైతం=ద్వైతముగానిది, నిష్కళం=షోడశకళలు లేనిది, నిష్క్రియం=నైష్కర్మ్యము చేపొందదగినది. శాంతం=శాంతమైనది. నిరతిశయం=తనకన్ననతిశయమైనదిలేనిది, అనామయం=రోగములేనిది, చతుర్థం=జాగ్రత్స్వప్నసుషుప్తులకు విలక్షణమైనది. బ్రహ్మవిష్ణురుద్రాతీతం=త్రిమూర్త్యతీతమైనది, ఆశాస్యం=సర్వమును శాసించునది (కోరదగినది.)

తా. సర్వశాసకము బ్రహ్మము. ఆశాస్యమనగా కోరదగినది. ధర్మార్థకామములు అనాశాస్యములు (కోరదగినవికావివి.) మోక్షము=కోరదగినది, మోక్షమనగా బ్రహ్మముగావున బ్రహ్మము ఆశాస్యమని వ్యవహరింప బడుటకు సందేహములేశమైన నుండదని భావము.

" అద్వయమనాద్యంతమశేష వేదవేదాంత వేద్య
మనిర్దేశ్యమనిరుక్తమ ప్రచ్యవమాశాస్యమవ్యయం
సర్వాధారమనాధారమనిరీక్ష్యం" ౧౩

(అధర్వ–౮౭ భస్మజాబాల–అ ౨)

టీ. అద్వయం = అద్వితీయము, అనాద్యంతం = ఆద్యంతములు లేనిది, అశేషవేద వేదాంతవేద్యం = సమస్తవేద వేదాంతములచే తెలియబడునది, అనిర్దేశ్యం = నిర్దేశించశక్యముకానిది, అనిరుక్తం= నిశ్చయింప శక్యముగానిది, అప్రచ్యవం = చ్యుతము లేనిది, ఆశాస్యం= సర్వమును శాసించునది, అవ్యయం = నాశము లేనిది, సర్వాధారం=సమస్తమున కాధారమైనది. అనాధారం = తనకాధారము లేనిది, అనిరీక్ష్యం=చూడశక్యముగానిది.

తా. బ్రహ్మము సర్వమున కాధారమగుటచే ననాధారమైనది.

" అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథారసంనిత్యమగం
ధవచ్చయత్ " ౧౪

(శు–య–౧౦౮ ముక్తిక–అ ౨) (కృ–య–౮౬ యోగకుండలీ) (కృ–య–3కఠ–అ ౧వ) (3 శు–య–౫౯ పైంగల అ 3)

టీ. అశబ్దం= శబ్దముగానిది, అస్పర్శం = స్పర్శముగానిది, అరూపం=రూపముగానిది, అవ్యయం=నాశముగానిది, తథా = అట్లు, అరసం= రసముగానిది, నిత్యం=నిత్యమైనది, అగంధవత్ =గంధవంతముగానిది, యత్ =ఏదియో, (అదిబ్రహ్మము.)

తా. జ్ఞానేంద్రియములచే నెఱుగదగిన విషయమేదియు బ్రహ్మముకాదు.

" పరంవిజ్ఞానాద్యద్వరిష్ఠం ప్రజానాంయదర్భిమద
ణుభ్యోఽణుయచ్ఛ " ౧౫

(అధర్వ–౫ ముండక; ముం ౨.)

టీ. విజ్ఞానాత్=విజ్ఞాన కోశముకన్న, యత్=ఏది, పరం=పరమైనదో, వరిష్ఠం=శ్రేష్ఠమైనదో, యత్=ఏది, ప్రజానాం = ప్రజలకు, అర్చిమత్=పూజ్యమైనదో, యత్=ఏది, అణుభ్యః = అణువులకన్న, అణు=అణువైనదో, (అది బ్రహ్మము.)

తా. విజ్ఞానమయ కోశముకన్న పరమైనదియును శ్రేష్ఠమైనదియునై ముముక్షువులకు పూజ్యమై బ్రహ్మమున్నది.

"బృహచ్చ యద్దివ్యమచింత్య రూపంసూక్ష్మాచ్చ తత్సూక్ష్మతరంవిభాతి" ౧౬.

(అథర్వ-౫ ముండక-ముం 3; ఖం ౧.)

టీ. యత్=ఏది, బృహచ్చ=మిక్కిలి గొప్పదియో, దివ్యం=ప్రకాశ రూపమైనదియో, అచింత్యరూపం=చింతింప శక్యముగానిదో, సూక్ష్మాచ్చ=సూక్ష్మమైన పరమాణువుకన్నను, సూక్ష్మతరం=మిక్కిలి సూక్ష్మమై, విభాతి=ప్రకాశించుచున్నదో, తత్=అది బ్రహ్మము.

తా. బ్రహ్మమనంతమైనది యచింత్యమైన స్వరూపముగలది.

"ఏతజ్జ్ఞేయం నిత్యమేవాత్మసంస్థం నాతఃపరంవేదితవ్యంహి కించిత్" ౧౭

(అథర్వ-౪౩ నారదపరివ్రాజక) (శు-య-౧౪ శ్వేతశ్వతర.)

టీ. ఏతత్=ఈబ్రహ్మము, జ్ఞేయం=తెలిసికొనదగినది, నిత్యమేవ=నాశములేనిదగు, ఆత్మసంస్థం=తనయందేయున్నది, అతఃపరం=దీనికన్ననన్యము, వేదితవ్యం=తెలిసికొనదగినది, కించిత్=మరియొకటి కొంచమును. నహి=లేదు.

తా. బ్రహ్మమే తెలిసికొనదగినది. దీనికన్న మరియొకటి తెలిసికొనదగినదిలేదు. తనయందే తానై బ్రహ్మమున్నది. బ్రహ్మమెరుంగుటకు తీర్థాదులకుబోవ బనిలేదు.

"అఘోషమవ్యంజనమస్వరంచ అతాలుకంఠోష్ఠమనాసికంచ యత్" ౧౮

"అరేఫజాతముభయోష్మవర్జితం యదక్షరం నక్షరతేకథంచిత్" ౧౯

(కృ-య-౨౧ అమృతనాద)

టీ. అఘోషం = ఖఛమొదలైన ఘోషాక్షరములు కానిది, అవ్యంజనం=కకారాదివ్యంజనములుగానిది, అస్వరం=అకారాదిస్వరములుకానిది, అతాలుకంఠోష్ఠం=ఇచవర్గయశలు (తాలువులు) కానిది- అకవర్గహ (కంఠ్యములు) కానిది, ఉఊపఫబభమవ (ఓష్ఠ్యములు) కానిది, అనాసికం=వర్గపంచమాక్షరములు కానిది, అరేఫజాతం=రేఫజాతికానిది, ఉభయోష్మవర్జితం = సంయుక్తాక్షరములు శషసలు గానిది, కథంచిత్=ఏవిధముననైనను, యదక్షరం=ఏయక్షరము, నక్షరతే=నశింపదో, (ఆయక్షరము బ్రహ్మము.)

తా. ఓంకారమేయక్షరమైన పరబ్రహ్మము ఆదోంకారము సర్వాక్షర విలక్షణమైనది.

"అగోచరంమనోవాచామవధూతాదిసంప్లవం"

(సామ-౨౯ మైత్రేయ; అ ౧)

టీ. మనోవాచాం=మనోవాక్కులకు, అగోచరం=తెలియబడనిది, అవధూతాదిసంప్లవం, అవధూతాది = అవధూతాదులకు, సంప్లవం=సంసారసాగరమును తరింపజేయుటకు సాధనమైన యోడయైనది.

తా. స్పష్టము.

"సత్తామాత్రప్రకాశైక ప్రకాశంభావనాతిగం" ౨౧

"అహేయమనుపాదేయమ సామాన్యవిశేషణం" ౨౨

(సామ-౨౯ మైత్రేయ; అ ౧)

టీ. సత్తామాత్రప్రకాశైక ప్రకాశం, సత్తామాత్రప్రకాశ=సద్రూపమైనప్రకాశమే, ఏక=ముఖ్యమైన, ప్రకాశం=ప్రకాశముగాగలది, భావనాతిగం= భావనకతీతమైనది, అహేయం = విడువదగినదికాదు. అనుపాదేయం=గ్రహింపదగనది, అసామాన్యవిశేషణం=సామాన్యమైన విశేషణములు గలదికాదు.

తా. ఎవ్విధమైన విశేషములను చెప్పుట కశక్యమైనది బ్రహ్మము. బ్రహ్మమిట్టిదని చెప్పుటకు విశేషణములు లేవు కేవల నిర్విశేషణమగునది (విశేష్యస్వరూపమైనది)

" ధ్రువంస్తిమితగంభీరంన తేజ నతమస్తతం " ౨౩

(సామ-౨౯ మైత్రేయ; అ ౧.)

" నిష్కలంనిర్మలం శాంతంసర్వాతీతంనిరామయం " ౨౪

(కృ-య-౪౧ యోగతత్త్వ.)

టీ. ధ్రువం=నిశ్చయమైనది, స్తిమితగంభీరం= శాంతముతోగూడిన గాంభీర్యము గలది, న తేజః= తేజస్సుకానిది. నతమః=చీకటికానిది, తతం=పరిపూర్ణమైనది, నిష్కలం=షోడశకళలులేనిది, నిర్మలం=స్వచ్ఛమైనది, శాంతం= శాంతమైనది, సర్వాతీతం=సమస్తదృశ్యములకు నతీతమైనది. నిరామయం=రోగహీనమగునది.

తా. బ్రహ్మము ఉష్ణస్పర్శగల తేజస్సుకానిది ఆ లోకాభావమగు చీకటికాదు. నిష్కళమైనది. శాంతమైన గంభీరస్వరూపమైనది. (తరంగహీన సముద్రము చందమున నిశ్చలమై గంభీరమై యున్నది.)

" నశూన్యంనాపిచాకారి నదృశ్యం నాపిదర్శనం " ౨౫

" చిన్మాత్రంచైత్యరహితం అనంతమజరంశివం " ౨౬

(సామ-౬౧ మహా; అ ౨.)

టీ. న తూ స్యం = స్వము కాదు, ఆకారం = ఆకారము గలది, న = కాదు. న దృశ్యం = దృశ్యము కాదు, దర్శనం = చూచుటయును, న = కాదు, చిన్మాత్రం = జ్ఞానమాత్రమైనది, చైత్యరహితం = వృత్తులు లేనిది, అనంతం = అంతము లేనిది, అజరం = ముసలితనము లేనిది, శివం = మంగళస్వరూపమైనది.

తా. బ్రహ్మము దర్శనము కానిది. దృశ్యము కానిది. చిన్మాత్రమైనది. ఆకారము గలది కాదు. శూన్యమైనది కాదు.

చైతన్యానుపాతరహితం సామాన్యేనచ సర్వగం " ౨౭
అనామయమనాభాసం అనామకమకారణం " ౨౮

(సామ-౬౧ మహా-అ ౫.)

టీ. చైతన్యానుపాతరహితం = చిత్తవృత్తులతో సంబంధము లేనిది, సామాన్యేనచ = సామాన్యముగ, సర్వగం = అంతటనున్నది, అనామయం = రోగము లేనిది, అనాభాసం = ఆభాసము లేనిది, అనామకం = పేరు లేనిది, అకారణం = తనకు హేతువు లేనిది.

తా. లేనిది యున్నట్లు కనబడుట యాభాసము. బ్రహ్మము నామరూపము లేనిది. సర్వవ్యాపకమైనది. తనకు నితరమొద్దియు కారణము లేనిది. స్వయముగానున్నది. సర్వకారణమైనది.

" మనోవచోభిరగ్రాహ్యం పూర్ణాత్పూర్ణంసుఖాత్సుఖం " ౨౯
" ద్రష్టృదర్శన దృశ్యాదివర్జితంతదిదంపదం " ౩౦

(సామ-౬౧ మహా-అ ౫.)

టీ. మనోవచోభిః = మనోవాక్కులచే, అగ్రాహ్యం = గ్రహింపబడనిది, పూర్ణాత్ = పూర్ణముకన్నను, పూర్ణం = పూర్ణమయినది, సుఖాత్ = సుఖముకన్నను, సుఖం = సుఖమైనది, ద్రష్టృదర్శనదృశ్యాది

వర్జితం=చూచువాడు చూపుచూడబడునదియను త్రిపుటిలేనిదియు నైన, ఇదంపదం=ఈస్థానము, (అనగా యుట్లిసిద్ధి) తత్ =ఆబ్రహ్మము.

తా. బ్రహ్మము పూర్ణమైన యాకాశముకన్న పూర్ణమయినది. సుఖమనియెంచబడు విషయానుభవముకన్న సుఖమైనది. ద్రష్టృదర్శన దృశ్యములను త్రిపుటిలేనిది. అగ్రాహ్యమైనది.

" శుద్ధంసూక్ష్మంనిరాకారం నిర్వికారంనిరంజనం " ౩౧

" అప్రమాణమనిర్దేశ్యం అప్రమేయమతీంద్రియం " ౩౨

(కృ-య-౬౩ యోగశిఖ-అ ౨-౩.)

టీ. శుద్ధం=శుద్ధమైనది, సూక్ష్మం-సూక్ష్మమని వ్యవహరింపబడుచున్నది. నిరాకారం=వికారములేనిది, నిరంజనం=నిర్దోషమయినది, అప్రమాణం=ప్రమాతృగోచరమగు ప్రమాణముగానిది, అనిర్దేశ్యం=నిర్దేశింపబడనిది, అప్రమేయం=ప్రమాణగోచరమగు ప్రమేయముకానిది, అతీంద్రియం=ఇంద్రియాతీతమయినది.

తా. సాధిష్ఠానబుద్ధిస్థచిదాభాసుడు ప్రమాతయనబడును. కూటస్థసహితమైన బుద్ధితోగూడిన జీవుడు ప్రమాతయనియర్థము. ప్రమాతవలన ప్రమాణము పుట్టుచున్నది. సాభాసాంతఃకరణవృత్తి ప్రమాణము. జీవునితోగూడిన మనోవృత్తి ప్రమాణమని యర్థము. ఈప్రమాణమువలన ప్రమేయము తెలియబడుచున్నది. ప్రమేయమనగా ఘటాదివిషయము. ప్రమేయముతోగూడుటవలన ప్రమాణమందు విషయాకృతికలుగుచున్నది. ఆవిషయాకృతిని ప్రమాతగ్రహించుచున్నాడు, కావున సమస్త విషయములు ప్రమాణముననున్నవి. మనస్సే సమస్తవిషయస్వరూపమని ఈహేతువుచే చెప్పబడెను. బ్రహ్మము ప్రమాతృప్రమాణప్రమేయములు కాదని తెలియవలయును.

నిర్లేపకంనిరపాయం కూటస్థమచలంధ్రువం" ౩౩

(కృ-య-౬౩ అధ్యాత్మ.)

" సద్ఘనంచిద్ఘనంనిత్యమానంద ఘనమద్వయం "     ౩౮
(శు-య 23 అధ్యాత్మ.

టీ. నిర్లేపకం=నిరంజనమైనది. నిరపాయం = అపాయములేనిది కూటస్థం=ప్రత్యగాత్మ స్వరూపమయినది. అచలం = నిశ్చలమైనది ధ్రువం=నిశ్చయమయినది. సద్ఘనం=సద్ఘనమైనది. చిద్ఘనం=జ్ఞానఘనమైనది. నిత్యం=నాశములేనిది. ఆనంద ఘనం = ఆనంద ఘనమైనది. అద్వయం. అద్వితీయమైనది.

తా. బ్రహ్మము నిస్సంగమైనది. ప్రత్యగాత్మ స్వరూపమయినది. సత్యజ్ఞానానంద ఘనమైనది. అద్వితీయమైనది.

" ప్రత్యగేకరసంపూర్ణమనంతం విశ్వతోముఖం "     ౩౫
" అహేయమనుపాదేయమనాధేయమనాశ్రయం "     ౩౬
(శు-య-23 అధ్యాత్మ)

టీ. ప్రత్యగేకరసం = ప్రత్యగభిన్న బ్రహ్మస్వరూపమయినది. పూర్ణం=అంతటనిండియున్నది. అనంతం= దేశకాలవస్తుపరిచ్ఛేదములేనిది. విశ్వతోముఖం=విరాడ్రూపమున నంతటముఖములు గలది. అహేయం=విడువదగనిది. అనుపాదేయం=గ్రహింపరానిది. అనాధేయం=ఆధేయముకానిది (ఆధారముకలదికాదు) అనాశ్రయం=ఆశ్రయములేనిది. (ఒకదానిని ఆశ్రయించియుండనిది.)

తా. పరిచ్ఛేదత్రయములేని దాటచే బ్రహ్మమనంతమైనది. ఆశ్రయములేనిది ఆధారములేనిది. సర్వపరిపూర్ణమయినది. అద్వితీయమయినది.

" శుద్ధంబుద్ధంసదాముక్తం అనామకమరూపకం "     ౩౭
(కృ-య-32 తేజోబిందు ; అ 2)

టీ. శుద్ధం=శుద్ధమైనది. బుద్ధం=బోధస్వరూపమైనది. సదాముక్తం=ఎల్లప్పుడును ముక్తమయినది. అనామకం = నామములేనిది. అరూపకం=రూపములేనిది.

తా. స్పష్టము.

"సంకల్పసంక్షయవశాద్గలితే తు చిత్తే సంసారమోహ
మిహికా గలితా భవంతి" ౩౮

"స్వచ్ఛం విభాతి శరదీవ ఖమాగతాయాం చిన్మాత్ర
మేకమజమాద్యమనంతమంతం" ౩౯

(రామ-౬౦ మహా-౭ స.)

టీ. సంకల్ప సంక్షయవశాత్ = సంకల్పములు నశించుటవలన, చిత్తే = చిత్తము, గలితే తు = జారిన దగుచుండగా, సంసారమోహమిహికాః = సంసార మోహమను మంచుపల్లులు, గలితాః = జారిన వగుచున్నవి. శరది = శరత్కాలము, ఆగతాయాం = వచ్చిన దగుచుండగా, స్వచ్ఛం = నిర్మలమైన, ఖమివ = ఆకాశమువలె, చిన్మాత్రం = జ్ఞానమాత్రమును, ఏకం = ఒక్కటియును, అజం = పుట్టుకలేనిదియును, ఆద్యం = సమస్తమునకు మొదటిదియు, అనంతం = అంతములేనిదియును, అంతం = సర్వము నంతము చేయునదియును (అన్నిటిని అతిక్రమించి యుండునదియును) అగు బ్రహ్మము, విభాతి = ప్రకాశించుచున్నది.

తా. మంచు నశింపగా నాకాశము స్వచ్ఛమైనట్లు సంకల్పములతో గూడిన మనస్సు నశించుచుండగా నిర్మలమైన సత్యజ్ఞానానంద స్వరూపమగు బ్రహ్మము ప్రకాశించు చుండును.

ఇతి సాత్త్వికప్రకరణాంతర్గత స్వరూప వాక్యసన్దోహే సచత్వారింశత్.

ఇట్లు సాత్త్వికప్రకరణాంతర్గత స్వరూపవాక్యములు ముగిసినవి.

ఇతి చతుర్దశ ప్రకరణం సమాప్తం.

ఇట్లు పదునాలుగవ ప్రకరణము సమాప్తము.

శ్రీ

సద్గురవేనమః.

# ౧౫. ఆత్మస్వరూపవాక్యములు.

"ఆకాశో హవై నామ నామరూపయోర్నిర్వహితా తే యదంతరా తద్బ్రహ్మ తదమృతం స ఆత్మా" ౧

(సామ-ఛాందోగ్య-ప్ర-౮-ఖం ౧౪.)

ప. ఆకాశోహ వై నామ - ఆకాశమెట్టిదనిన, నామరూపయోర్నిర్వహితా = నామరూపములను నిర్వహించునదియగునో, తే = ఆ నామ రూపములను, యత్ = ఏది, అంతరా = అంతరమగునట్లుచేయునో, తత్ = అది, బ్రహ్మ = బ్రహ్మము, అమృతం = నాశములేనిది, సః ఆత్మా = అది యాత్మ.

తా. శబ్దగుణమును గలిగియున్నందున ఆకాశమును రూపము గల భూతమువలె వ్యవహరింపబడుచున్నది. ఆకారణమున నామ రూపములు ఆకారముగల ఆకాశము మాయాకార్యమే బ్రహ్మము నిర్గుణముకావున నామరూపములు లేనిది.

"ఇదంసర్వం యదయమాత్మా" ౨

(అథర్వ-౨నృసింహోత్తరతాపినీ. శు-య-౧౦బృహదారణ్యక-అ ౪-బ్రా-౪-అ ౬-బ్రా ౫) శు-య-౪౫ మండలబ్రాహ్మణ.

ప. యత్ = ఏది. ఇదంసర్వం = ఈసర్వమో. (అది) అయమాత్మా = ఈ ఆత్మయే.

తా. వివర్తరూపముగానేది యీ జగత్తుగాగనబడుచున్నదో యదియే యీప్రత్యగాత్మస్వరూపముననున్నది.

" చిదేకరసోహ్యయమాత్మా " ३
" ఓతో౽హ్యయమాత్మా " ४
(అథర్వ-౨౭ నృసింహోత్తరతాపిని)

టీ. అయమాత్మా=ఈయాత్మ, చిదేకరసఃహి=చిదేకరసమైనవాఁడు, అయమాత్మా = ఈయాత్మ, ఓతః = పొడుపుమొగ్గలైనవాని స్వరూపమైనవాఁడు, హి=నిశ్చయము.

తా. స్పష్టము.

" అనుజ్ఞాతాహ్యయమాత్మా " ५
" హ్యనుజ్ఞైకరసోహ్యయమాత్మా " ६
(అథర్వ-౨౭ నృసింహోత్తరతాపిని.)

టీ.అయమాత్మా=ఈయాత్మ, అనుజ్ఞాతాహి = అనుజ్ఞనిచ్చువాఁడు, అయమాత్మా=ఈయాత్మ, అనుజ్ఞైకరసఃహి. అనుజ్ఞా స్వరూపుడు.

తా. ఆజ్ఞ నిచ్చువాఁడు ఆజ్ఞయు నాత్మయే యని తాత్పర్యము.
" అవికల్పోహ్యయమాత్మా " ७
(అథర్వ-౨౭ నృసింహోత్తరతాపిని.)
" దేహాదేఃపరతరత్వాద్ బ్రహ్మైవ పరమాత్మా " ८
(శు-య-౩४ నిరాలంబ.)

టీ. అయమాత్మా=ఈయాత్మ, అవికల్పఃహి=నిర్వికల్పుడు, దేహాదేః=దేహేంద్రియాదికమునకు, పరతరత్వాత్ = పరముడగుటవలన, పరమాత్మా=పరమాత్మ యనబడును, బ్రహ్మైవ=ఆ పరమాత్మ బ్రహ్మమె.

తా. ఆత్మ నిర్వికల్పుడు. దేహేంద్రియాదులకు పరుడౌటచే పరమాత్మ యనబడును. ఆ పరమాత్మయే బ్రహ్మము.

"అఖండైక రసో హ్యయమాత్మా" ౯

"నిర్గుణస్సాక్షీభూతో నిష్క్రియో నిరవయవోయమాత్మా" ౧౦
(అధర్వ-౭౬ ఆత్మ.)

టీ. అయమాత్మా=ఈయాత్మ, అఖండైకరసః = అఖండానంద స్వరూపుడు, నిర్గుణః=గుణరహితుడు, సాక్షీభూతః=బుద్ధివృత్తులకు సాక్షియైనవాడు, అయమాత్మా=ఈయాత్మ, నిష్క్రియః=క్రియ లేనివాడు (నైష్కర్మ్యమును బొందకగినవాడు), నిరవయవః=స్వగత భేదము లేనివాడు.

తా. ఆత్మ స్వగతభేదములేక ఏకాకృతి కలవాడు. పశుపక్షి మనుష్య దేవతాదుల కున్నట్లు శరీరములేనివాడు. సర్వేంద్రియ సాక్షి. అఖండానంద రూపుడు.

"విరజఃపర ఆకాశాదజ ఆత్మా మహాన్ ధ్రువః" ౧౧
(శు-య-౧౦ బృహదారణ్యక; అ ౬ ; బ్రా ౪.)

టీ. ఆత్మ=ఆత్మ, విరజః=రజోగుణములేనివాడు, ఆకాశాత్=ఆకాశముకన్నను, పరః=పరుడు, మహాన్=గొప్పవాడు, ధ్రువః-నిశ్చయమైనవాడు, అజః=పుట్టువు లేనివాడు.

తా. ఆత్మపరిశుద్ధుడు పుట్టువులేనివాడు. ఆకాశతత్త్వముకన్న పరమైనవాడు.

"ఏకోదేవస్సర్వభూతేషుగూఢస్సర్వవ్యాపీసర్వభూతాంతరాత్మా" ౧౨
(కృ-య-౧౪ శ్వేతాశ్వతర-కృ-య ౧౧ బ్రహ్మ.)

టీ. ఏకః = ఒక్కడును, దేవః=దేవుడును, సర్వభూతేషు=సమస్తభూతములందు, గూఢః=పైకిస్ఫురింపక కూటస్థస్వరూపముగ

నున్నవాఁడు, సర్వవ్యాపీ = సర్వవ్యాపకుఁడు. సర్వభూతాంతరాత్మా = సమస్తభూతములకు అంతర్యామియైన ఈశ్వరుఁడు.

తా. ఆత్మయను దేవుఁడు, సమస్తభూతములందు ప్రత్యగాత్మస్వరూపమున గూఢముగనున్నవాఁడు. కూటస్థజీవుల కన్యోన్యాధ్యాసముగలిగినందున కూటస్థుడుగూఢముగ నున్నవాఁడు. జీవునికి గనబడుచున్నాఁడు ఆత్మకే యంతర్యామిగ నున్నవాఁడు.

"నిశ్శబ్దం పరమంబ్రహ్మ పరమాత్మాసమీయతే" ౧౩

(ఋ-౩౮ నాదబిందు.)

"సకలేనిష్కలేభాతే సర్వత్రాత్మావ్యవస్థితః" ౧౪

(కృ-య-౩౯ ధ్యానబిందు.)

టీ. ఆత్మా=ఆత్మ, నిశ్శబ్దం=శబ్దములేనిదియు, పరమం=ఉత్కృష్టమైనదియు, బ్రహ్మ=పరబ్రహ్మమనియు, పరమాత్మా=పరమాత్మయనియు, సమీయతే=చెప్పబడుచున్నది. సకలేభాతే=షోడశకలాయుతమైన ఇంద్రియమనః ప్రచారసమయమందు, నిష్కలే=కలారహితమైన తురీయమందు, సర్వత్ర=అంతట, వ్యవస్థితః=ఆత్మయున్నది.

తా. ఆత్మనిర్విషయముగావున నిశ్శబ్దమనబడును. శబ్దములేకున్న శక్తిని స్పర్శరూపరస గంధములును నుండవు. భూమియందు శబ్దస్పర్శ రూపరస గంధములును, జలమునందు గంధేతరములగు నాలుగు విషయములును, అగ్నియందు రసగంధేతరములైన మూడు విషయములును, వాయువునందు రూపరసగంధేతరములైన రెండు విషయములును, ఆకాశమున నొక్కశబ్దమును నున్నవి. ఆత్మయందు శబ్దమునూలేదుగావున ఆత్మనిర్విషయ మనబడును. అదిగానే బ్రహ్మమనియు పరమాత్మయనియు చెప్పబడును. ఆయాత్మజాగ్రత్స్వప్నసుషుప్తి తురీయములయందు నున్నది.

" సర్వదా సర్వకృత్సర్వః పరమాత్మేత్యుదాహృతః " ౧౫
(సామ-౬౧ మహో-అ ౪.)

" అనాద్యంతోవభాసాత్మా పరమాత్మేహవిద్యతే " ౧౬
(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ ౨.)

టీ. సర్వదా=ఎల్లప్పుడును, సర్వకృత్ = సర్వమునుచేయువాడు, సర్వః=సర్వస్వరూపుడు, పరమాత్మేతి=పరమాత్మయని, ఉదాహృతః=చెప్పబడెను. అనాద్యంతః=ఆద్యంతములులేని, పరమాత్మా=పరమాత్మయే, ఇహ=ఈలోకమందు, (ఈదేహమునందు) అవభాసాత్మా=జీవాత్మయై, విద్యతే=కనబడుచున్నాడు.

తా. పరమాత్మయైన కూటస్థుడేయంతఃకరణోపాధిని ప్రతిబింబించి జీవుడుగానున్నాడు.

" నిత్యస్సర్వగతోహ్యాత్మా కూటస్థోదోషవర్జితః " ౧౭
(సామ-౯౦దర్శన-ఖం౧౦. అధర్వ-౭౦అన్నపూర్ణ-అ౫.)

" తత్పరః పరమాత్మాచ శ్రీరామః పురుషోత్తమః " ౧౮
(శు-య-౯౧ తారసార.)

టీ. ఆత్మా=ఆత్మ, నిత్యః=నాశములేనివాడు, సర్వగతఃహి=అంతటనున్నవాడు, దోషవర్జితః=దోషమేమియులేనివాడు, కూటస్థః=ప్రత్యగాత్మ, తత్పరః=తత్పదవాచ్యమైన ఈశ్వరునికిపరుడు. కావున, పరమాత్మా=పరమాత్మ, శ్రీరామః=బ్రహ్మవిద్యయందుక్రీడించువాడు (శ్రీరాముడు) పురుషోత్తమః=పురుషుడైనహిరణ్యగర్భునికన్న నుత్తముడు.

తా. ఆత్మగా పరమాత్మయనియు కూటస్థుడనియు పురుషోత్తముడనియు చెప్పబడును. భగవద్గీతలు ౧౫ వ అధ్యాయములో

ద్వావిమౌపురుషౌలోకే అను ౧౬ శ్లోకము మొదలుగ ౪ శ్లోకముల వలన పురుషోత్తముడు సర్వభూతములు కూటస్థుడు అను నిద్దరు పురుషులకంటెలన్యుడగు పరమాత్మయని కనుబడుచున్నది. హిరణ్యగర్భునికంటె నన్యుడను యర్థముకనబడెను.

"సర్వకారణకార్యాత్మా కార్యకారణవర్జితః ౧౯
"సర్వాతీతస్వభావాత్మా నాదాంతర్జ్యోతిరేవసః ౨౦

(కృ-య-౩౮ తేజోబిందు-౪ ఖ.)

టీ. సః=ఆయాత్మ, సర్వకారణకార్యాత్మా = సమస్త కారణ కార్యస్వరూపుడు, కార్యకారణవర్జితః=కార్యకారణధర్మములు లేనివాడు, సర్వాతీతస్వభావాత్మా=సమస్తము నతిక్రమించు స్వభావముగలవాడు, నాదాంతర్జ్యోతిరేవ = నాదాంతమందు ప్రకాశించువాడు.

తా. ఆత్మయైన బ్రహ్మమే మాయాభేదములగు నుపాధులనుబూని కారణస్వరూపుడైన ఈశ్వరుడుగను కార్యస్వరూపమైన జగత్తుగను తోచుచున్నది. ఉపాధి నాశమున కార్య కారణధర్మములు లేనిది సమస్తమునకు నతీతమైనది.

"నిర్వికల్పస్వరూపాత్మా సవికల్పవివర్జితః ౨౧
"సదాసమాధిశూన్యాత్మా ఆదిమధ్యాంతవర్జితః ౨౨

(కృ-య-౩౮ తేజోబిందు; అ ౪.)

టీ. నిర్వికల్ప స్వరూపాత్మా=నిర్వికల్ప స్వరూపుడైన యాత్మ, సవికల్ప వివర్జితః=వికల్పము లేనివాడు. సదా=ఎల్లప్పుడును, సమాధిశూన్యాత్మా=సమాధి లేనివాడు, ఆదిమధ్యాంతవర్జితః=ఆదిమధ్యాంతములు లేనివాడు.

తా. ఆత్మ నిర్వికల్పుడుగాని సవికల్పుడు గాడు. అవస్థాత్రయము లేనివాడు గావున సమాధి లేనివాడు. అవస్థాత్రయ మున్నందున

సమాధి వ్యవహరింపబడుచున్నది. అవస్థాత్రయములేకుండిన నిత్యము ఎప్పుడు సమాధియే అయినను నట్టిపేరుచే వ్యవహరింపబడదు. సమాధి కన్న నితరములేదు గావున నిట్టిట్టిదని చెప్ప శక్యముగాని కేవల సచ్చిదానంద పరబ్రహ్మము ప్రకాశించుచున్నది.

"ప్రజ్ఞానవాచ్యహీనాత్మా అహంబ్రహ్మాస్మివర్జితః" ౨౩
"తత్త్వమస్యాదిహీనాత్మా అయమాత్మావివర్జితః" ౨౪
(కృ-య-32 తేజోబిందు-అ ౪.)

టీ. ప్రజ్ఞానవాచ్యహీనాత్మా=ఆత్మ ప్రజ్ఞానమను శబ్దముచే చెప్పబడువాడుకాడు (అంతఃకరణ వృత్తులతోగూడి ఇంద్రియముల ద్వారమున విషయముల నెఱుంగునది ప్రజ్ఞానము పరమార్థమున నంతఃకరణములు ఇంద్రియములు మిథ్యలగుటచే తెలిసికొనుట యుండదు. కావున ప్రజ్ఞాననామమున కవకాశము లేదు. బోధకొరకు ప్రజ్ఞానము బ్రహ్మయని చెప్పబడెను. వాస్తవమున నేపేరును లేదు. ఉపాధులనుబట్టి యాత్మకు బోధార్థము ఆయా పేరులు గలిగెను. అట్లే తక్కిన వాక్యములకు నూహింపవలెను.) అహం బ్రహ్మాస్మివర్జితః= అహం బ్రహ్మాస్మియను వాక్యమునకు వాచ్యుడుగాడు తత్త్వమస్యాదిహీనాత్మా=తత్త్వమసియను వాక్యమునకు వాచ్యుడుగాడు, అయమాత్మా వివర్జితః= 'అయమాత్మా' యను దానికి వాచ్యుడుగాడు.

తా. స్పష్టము.

"ఓంకారవాచ్యహీనాత్మా సర్వవాచ్యవివర్జితః" ౨౫
"సర్వత్రపూర్ణరూపాత్మా విశ్వాత్మావిశ్వహీనకః" ౨౬
(కృ-య ; 32 తేజోబిందు ; అ ౪.

టీ. ఓంకారవాచ్యహీనాత్మా=ఓంకారవాచ్యుడుగాడు, సర్వవాచ్య వివర్జితః=ఏశబ్దమునకును వాచ్యుడుగాడు, సర్వత్రపూర్ణరూపా

త్మా=తనయందు కల్పింపబడిన మాయాకార్యమైన జగత్తున నిండి యున్నవాడు, విశ్వాత్మా=సమస్తమునకును ఆత్మయైనవాడు, విశ్వహీనకః=మాయాతిరోభావమున తత్కార్యమైన జగత్తు లేనివాడు.

తా. ఆత్మస్వరూపమును తెలియజేయు శబ్దములు లేవనియు నా శబ్దములకు ఆత్మవాచ్యము గాదనియు కేవలానుభవ వేద్యమైన స్వరూపము గలదనియు తాత్పర్యము.

" శుద్ధచైతన్యరూపాత్మా సర్వసిద్ధివివర్జితః " ౨౭
" శూన్యాత్మా సూక్ష్మరూపాత్మా సర్వత్రాత్మావశేషకః " ౨౮
(కృ-య ; ౩౭ తేజోబిందు.)

టీ. ఆత్మా=ఆత్మ, శుద్ధచైతన్య రూపాత్మా - శుద్ధచైతన్య స్వరూపమైనది (ఉపాధిరహితమైన చైతన్యము), సర్వసిద్ధి వివర్జితః= అణిమాద్యష్టసిద్ధుల వికారములేనిది, శూన్యాత్మా=మాయావికారము లేమియులేనిది, సూక్ష్మరూపాత్మా=శరీరములేమిసూక్ష్మముగ నున్నట్లు వ్యవహరింపబడునది, సర్వత్ర=అంతటను, అవశేషకః = మిగిలియుం డునది.

తా. సర్వోపాధి విరహితమైన చైతన్యము శుద్ధచైతన్య మన బడును. అదియే శుద్ధమనియు వ్యవహరింపబడును. నేతి నేతి వాక్య ముల సమస్తము నిషేధింపగ నాత్మయే శేషించును.

" ఆనందాత్మా ప్రియోహ్యాత్మా మోక్షాత్మా బంధవర్జితః " ౨౯
" సత్తామాత్రస్వరూపాత్మా నాన్యత్కించిజ్జగద్భయం " ౩౦
(కృ-య ; ౩౭ తేజోబిందు.)

టీ. ఆనందాత్మా=ఆనందస్వరూపమైనది. ప్రియఃహి= ప్రేమ స్వరూపమైనది. మోక్షాత్మా=మోక్షస్వరూపమైనది. బంధవర్జితః= అవిద్యాబంధములేనిది, సత్తామాత్ర స్వరూపాత్మా=సత్తయే స్వరూప

ముగా గలది. అన్యత్ =ఆత్మకన్న నితరమైనదగు, జగద్భయం=మిథ్యయగు జగద్భయము, కించిత్ =కొంచెమును, న=లేదు.

తా. ఆత్మ నిత్య ముక్తస్వరూపమైనది. అవిద్యాబాధములేనిది. సత్తామాత్రమైనది. నిరతిశయప్రేమస్వరూపమైనది.

“ సాక్ష్యసాక్షివిహీనాత్మా కించిత్కించిన్న కించన ” ౩౦

“ ముక్తాముక్తస్వరూపాత్మా ముక్తాముక్తవివర్జితః ” ౩౧

(కృ-య-౩౭ తేజోబిందు; అ ౪)

టీ. సాక్ష్యసాక్షి విహీనాత్మా=సాక్ష్యత్వమును సాక్షియులేనిది, కించన=కొంచమును, కించిత్కించిత్ = కొంచము కొంచమును (ఈ దేహమందు కొంచెము నాదేహమందు కొంచముగ నుండునది.) న=కాదు. ముక్తాముక్త స్వరూపాత్మా-ముక్తస్వరూపమైనది. అముక్త స్వరూపమైనది. (విద్యచే ముక్తస్వరూపమైనది. యవిద్యచే నముక్త స్వరూపమైనది) ముక్తాముక్తవివర్జితః=నిరుపాధికనగుటచే ముక్తాముక్త ధర్మములు లేనిది.

తా. దృశ్యములేదు గావున సాక్ష్యసాక్షి ధర్మములు లేనిది. నిరుపాధికము గావున బంధమోక్షములులేనిది. అవిద్యచే బంధమును పొందినట్లును నవిద్యానాశమున ముక్తిగాంచినట్లును మూఢులకు గనబడుచున్నది.

“ అపరిచ్ఛిన్నరూపాత్మా అణుస్థూలాదివర్జితః ” ౩౩

“ నామరూపవిహీనాత్మా పరసంవిత్సుఖాత్మకః ” ౩౪

(కృ-య-౩౭ తేజోబిందు.)

టీ. అపరిచ్ఛిన్నరూపాత్మా=దేశకాలవస్తు పరిచ్ఛేదము లేనిది, అణుస్థూలాది వర్జితః=శరీరములేమి అణుస్థూలాదులులేనిది, నామరూపవిహీనాత్మా=నామరూపములులేనిది. పరసంవిత్ = బుద్ధివృత్తులకు పరమైనజ్ఞాన స్వరూపము, సుఖాత్మకః=నిరతిశయసుఖ స్వరూపము.

తా. దేశకాలవస్తు పరిచ్ఛేదములేమిచే నాత్మయనంతమైనది. శరీరత్రయములేమిచే నణుస్థూలాదులులేనిది. నామరూపములులేనిది. చిద్రూపమైనది. సుఖస్వరూపమైనది.

" ద్వైతాద్వైతస్వరూపాత్మా ద్వైతాద్వైతవివర్జితః " ౩౫
" నిష్కలాత్మానిర్మలాత్మా బుద్ధాత్మాపురుషాత్మకః " ౩౬
(కృ-య-౩౭ తేజోబిందు-అ ౪.)

టీ. ద్వైతాద్వైతస్వరూపాత్మా=ద్వైతాద్వైతస్వరూపముగనున్నది. ద్వైతాద్వైతవివర్జితః=ద్వైతాద్వైతధర్మములులేనిది, నిష్కలాత్మా=నిష్కలమైనది, నిర్మలాత్మా=మాలిన్యములేనిది, బుద్ధాత్మా=బోధస్వరూపమైనది, పురుషాత్మకః=పురుషస్వరూపకమైనది. ఈపురుషశబ్దమునకు స్త్రీభిన్నత్వమర్థము కాదు.

తా. అజ్ఞానికినానాత్వమైన ద్వైతముగను తత్త్వజ్ఞానికి నభిన్నమయినయద్వైతముగను గనబడును. ఈయవిద్యాజ్ఞానములు పరమార్థమున లేవుగానయనాత్మద్వైతాద్వైతములు లేనిది. ఆత్మనెరిగిన పిదపవేరుఫలములేదుగావున నిష్కలమైనది. నిర్మలమైనది. శరీరములను పురములందుండుటచే పురుషుడనబడును.

" ఆత్మేతిశబ్దహీనోయం ఆత్మశబ్దార్థవర్జితః " ౩౭
" సచ్చిదానందహీనోయ ఏషైవాత్మాసనాతనః " ౩౮
(కృ-య-౩౭ తేజోబిందు.)

టీ. అయం=ఈయాత్మ, ఆత్మేతిశబ్దహీనః=ఆత్మయనుశబ్దములేనివాడు, ఆత్మశబ్దార్థవర్జితః=ఆత్మయనుశబ్దముయొక్క అర్థములేనివాడు, యః=ఏఆత్మ, సచ్చిదానందహీనః=సత్యజ్ఞానానందస్వరూపుడను వ్యవహారములేనివాడో, ఏషైవాత్మా=ఈఆత్మయే, సనాతనః=అనాదిస్థిరమైనవాడు.

తా. మాయాకార్యమైనజగత్తు అనృతదుఃఖస్వరూపమైయు న్నది గావున జగద్వ్యతిరేకమయిన యాత్మ సత్యజ్ఞానానందస్వరూపమని చెప్పబడెనుగాని మాయాతత్కార్యములులేని పరమార్థదశయందు ఆత్మసత్యజ్ఞానానందస్వరూపమని చెప్పుట కవకాశములేదు. అనృతజడ దుఃఖమైన జగత్తెవరికి దోచునో, వారికి జగత్తు మిథ్యయనియు నా త్మసత్యజ్ఞానానందస్వరూపమనియు చెప్పబడెను.

"యస్యకించిద్బహిర్నాస్తి కించిదంతఃకియచ్చన" ౩౯

"యస్యలింగంప్రపంచంవా బ్రహ్మైవాత్మానసంశయః" ౪౦

(కృ-య ; ౩౭ తేజోబిందు.)

ప. యస్య=పరిపూర్ణమైన ఏ యాత్మకు, కించిత్ = కొంచె మైనను, బహిః=బాహ్యము, నాస్తి=లేదో, కించిత్ = కొంచెమైనను, అంతః=లోపలిభాగమును, (నాస్తి=లేదో), యస్య=ఏయాత్మకు, కియ చ్చ=ఏమాత్రమును, లింగం=చిహ్నమును, ప్రపంచంవా=ప్రపంచము ను, న=లేవో, ఆత్మా=ఆయాత్మ, బ్రహ్మైవ=పరబ్రహ్మమే, నసంశయః= సందేహము లేదు.

తా. ఆత్మ పరిపూర్ణము గావున అంతర్బాహ్యములు లేనిది. ఏ చిహ్నమును లేని ప్రత్యగాత్మయైన నదిగో పరబ్రహ్మము. సందే హము లేదు.

ఇతి సార్థాంతికాత్మస్వరూప వాక్యానిచత్వారింశత్.

ఇట్లు సార్థాంతిక ఆత్మస్వరూప వాక్యములు నలుబది.

ఇతి పంచదశ ప్రకరణం సమాప్తమ్.

ఇట్లు పదునేనవ ప్రకరణము సమాప్తము.

---

శ్రీ

సద్గురువే నమః.

# ౧౬ సర్వస్వరూపవాక్యములు.

"ఓంకార ఏవేదం సర్వం" ౧

(సామ- ఛాందోగ్య-ప్ర-౨-ఖం ౨౩.)

ప్ర. ఇదంసర్వం=ఈజగత్తు అంతయు, ఓంకార ఏవ=ఓంకారమే.

తా. ఈశ్వరత్రయము, ఉపత్రయము, ప్రత్యగాత్మ, పరమాత్మయను భేదము మాయచే గలిగెను. ఈయనియుదియంగములు, అకారోకారమకారార్థ మాత్రలు చతుర్వ్యూహములు, జాగ్రత్స్వప్నసుషుప్తులు త్రిస్థానములు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, రుద్ర, సదాశివులను పంచదేవతలతో గూడిన జగత్తు. ఇదే యోంకారము. దీని నెఱుగువాడు బ్రాహ్మణుడు.

"స ఏవాధస్తాత్స ఉపరిష్టాత్స పశ్చాత్స పురస్తాత్స దక్షిణతస్స ఉత్తరతస్స ఏవేదం సర్వం" ౨

(సామ-౯ ఛాందోగ్య-ప్ర-౭-ఖం ౨౫)(అధర్వ-౫౦ శాండిల్య-అ 3)

ప్ర. సః=ఆయోంకారమే, అధస్తాత్=క్రిందిభాగముననున్నది, సః=ఆయోంకారమే, ఉపరిష్టాత్=మీఁదిభాగముననున్నది, సః=ఆయోంకారమే, పశ్చాత్=వెనుకభాగముననున్నది. సః=ఆయోంకారమే, పురస్తాత్=ముందుగానున్నది, సః=ఆయోంకారమే, దక్షిణతః=కుడివైపుననున్నది, సః=ఆయోంకారమే, ఉత్తరతః=ఎడమభాగముననున్నది, స ఏవ=ఆయోంకారమే, ఇదం సర్వం=ఈజగత్తంతయును.

తా. ఈజగమంతయు నోంకారమే. ఓంకారమే సర్వభాగములనున్నది.

"అహమేవాధస్తాత్ అహముపరిష్టాత్ అహంపశ్చాదహం పురస్తాదహం దక్షిణతోహముత్తరత అహమేవేదం సర్వం" 3

(సామ-౯ ఛాందోగ్య-ప్ర-౭-ఖం ౨౫.)

టీ. అహమేవ=నేనే, అధస్తాత్ = క్రిందుగా నున్నవాడను, అహం=నేను, ఉపరిష్టాత్=మీదుగా నున్నవాడను, అహం = నేను, పశ్చాత్ = వెనుకగ నున్నవాడను,అహం=నేను, పురస్తాత్=ముందుగ నున్నవాడను, అహం=నేను, దక్షిణతః = దక్షిణముగ నున్నవాడను, అహం=నేను, ఉత్తరతః=ఉత్తరముగ నున్నవాడను, అహమేవ=నేనే, ఇదంసర్వం=ఈ జగమంతయు.

తా. పరిపూర్ణమగు నేనే ఈ సమస్తమును.

"ఆత్మైవాధస్తాత్ ఆత్మోపరిష్టాత్ ఆత్మాపశ్చాత్ ఆత్మా పురస్తాత్ ఆత్మాదక్షిణతః ఆత్మోత్తరతః ఆత్మైవేదంసర్వం" ౪

(సామ-౯ ఛాందోగ్య-ప్ర ౭-ఖం ౨౫.)

టీ. ఆత్మైవాధస్తాత్=ఆత్మయే క్రిందుగానున్నది, ఆత్మోపరిష్టాత్=ఆత్మయే మీదుగానున్నది, ఆత్మాపశ్చాత్=ఆత్మయే వెనుకగా నున్నది, ఆత్మాపురస్తాత్=ఆత్మ ముందుగానున్నది, ఆత్మాదక్షిణతః= ఆత్మయే అపసవ్యముగా నున్నది, ఆత్మాఉత్తరతః=ఆత్మయే సవ్యముగా నున్నది, ఇదంసర్వం=ఈ జగమంతయు, ఆత్మైవ=ఆత్మయే.

తా. ఈ జగమంతయు ఆత్మ. ఆత్మకన్న నితరము లేదని తాత్పర్యము.

"ఆత్మైవేదమమృతమిదం బ్రహ్మేదంసర్వం" ౫

(శు-య-౧౦ బృహదారణ్యక ; అ ౪-బ్రా ౫.)

టీ. ఇదం=ఈ జగమంతయు, ఆత్మైవ=ఆత్మయే, ఇదం=ఈ జగమంతయు, అమృతం=నాశన రహితమైన పరమాత్మయే, ఇదంసర్వం=ఈ జగమంతయు, బ్రహ్మైవ-పరబ్రహ్మమే.

తా. త్రాడునందు ఆరోపింపబడిన పాము త్రాడునకు విరుద్ధమైనది యెట్లుకాదో, అట్లే సద్వస్తువున కల్పింపబడిన జగత్తు సద్వస్తువుకన్న వ్యతిరేక మైనది కాదు. మిథ్యయే.

"ఏతద్బ్రహ్మైతత్సర్వం" ౬

(అథర్వ-౨౭ నృసింహోత్తరతాపిని.)

"నారాయణ ఏవేదం సర్వం" ౭

(కృ-యు ; ౧౫ నారాయణ.)

టీ. ఏతత్సర్వం=మిథ్యారూపమైన ఈ జగమంతయు, ఏతత్ బ్రహ్మ=పరమార్థముగ సద్వస్తువైన ఈబ్రహ్మమే, ఇదంసర్వం=ఈసర్వము, నారాయణఏవ=నారాయణస్వరూపమే (నరసంబంధమైన బుద్ధియందు సేవించుటచే నారాయణుడనబడును.) నరస్యఇదం=నారం, నరునిసంబంధమైనయంతఃకరణము నారం=నారము ఈయంతఃకరణ,అయనం=స్థానము,ఎవనికోవాడు(నారాయణుడు) నరస్యఇదం నారం, నారంఅయనం యస్యసః నారాయణః ఇతివ్యుత్పత్తిసంనాంశోవ్యా(?)యతే.

"సచ్చిదానందరూపమిదంసర్వం" ౮

(అథర్వ-౨౭ నృసింహోత్తరతాపినీ-ఖం ౭.)

"సత్తామాత్రంహీదంసర్వం" ౯

(అథర్వ-౨౭ నృసింహోత్తరతాపినీ-ఖం ౯)

టీ. ఇదంసర్వం=ఈజగమంతయు. సచ్చిదానందరూపం=జ్ఞానదృష్టిచే సత్యజ్ఞానానందస్వరూపమైనది, ఇదంసర్వం=ఈజగమంతయు. సత్తామాత్రంహి=సదాత్రిపన్నైనది.

తా. ఆరోపితమైనజగత్తు వస్తువిచారమున మిథ్యయై యధిష్ఠానబ్రహ్మమే యగుచున్నది. కావున సత్యమై సచ్చిదానందరూపమని చెప్పబడుచున్నది.

" సత్స్వరూపమేవేదంసర్వం " ౧౦
" సఏవసర్వం యద్భూతంయచ్చభవ్యంసనాతనం " ౧౧

(కృ-య-౧౨ కైవల్య)

టీ. ఇదంసర్వం=ఈయావత్తును, సత్స్వరూపమేవ=సద్రూపమే యద్భూతం=ఏదిఅయినదో, యచ్చభవ్యం=ఏదికాబోవునదో, సఏవ=అదియే, సనాతనం=ప్రాచీనమైనది.

తా. సత్తునకభావములేదు. అసత్తునకుభావములేదు. ఉన్నది త్రికాలములందునున్నదే. లేనిది కాలత్రయమందు లేనిదే. మిథ్యయనగా నంతకుముందు లేక తర్వాత లేక స్వకాలమునందున్నట్లు గనబడునది.

" స్వయంబ్రహ్మాస్వయంవిష్ణు స్స్వయమింద్రస్స్వయంశివః " ౧౨
" స్వయంవిశ్వమిదంసర్వం స్వస్మాదన్యంనకించన " ౧౩

(శు-య-౨౩ అధ్యాత్మ.)

టీ. స్వయం=పరమాత్మస్వరూపుడగుతానే, బ్రహ్మా=బ్రహ్మయు, (చతుర్ముఖుడు) స్వయం=తానే, విష్ణుః=విష్ణువు, స్వయం=తానే, ఇంద్రః=ఇంద్రుడు, స్వయం=తానే, శివః=శివుడు, స్వయం=తానే, ఇదంసర్వంవిశ్వం=ఈసమస్తమయినజగత్తును, స్వస్మాత్=సర్వపరిపూర్ణుడగు తనకంటె, అన్యం=ఇతరము, కించన=కొంచమును, న=లేదు.

తా. స్పష్టము.

" మరుభూమౌ జలంసర్వం మరుభూమాత్రమేవతత్ " ౧౪
" జగత్త్రయమిదంసర్వం చిన్మాత్రంస్వవిచారతః " ౧౫

(కృ-య-౯ వరాహ) (సా-మ-౬౧ మహా-అ ౪.)

టీ. మరుభూమౌ = నీరులేనిస్థలమందు, (ఎండ మావులందు,) సర్వం=సమస్తమైన, తజ్జలం=(ఆరోపింపబడిన) ఆనీరు, మరుభూమాత్రమేవ=ఎండమావి మాత్రమే, (కాని,నీరు కాదు) ఇదంసర్వం=ఈ సమస్తమయిన, జగత్త్రియం=ముజ్జగమును, స్వవిచారతః=ఆత్మ విచారమున, చిన్మాత్రం=అధిష్ఠానమయిన చిద్వస్తువేయగును.

తా. మృగతృష్ణయం దారోపింపబడినది నీరుగాక మృగతృష్ణయే యెట్లగునో చిద్వస్తువైన బ్రహ్మమున నధ్యస్తమయినజగత్తు జగత్తుగాక బ్రహ్మమేయగును.

" భావవర్జితచిన్మాత్రం సర్వంచిన్మాత్రమేవహి " ౧౬

" యత్కించిద్యన్నకించిచ్చ సర్వంచిన్మాత్రమేవహి " ౧౭

(కృ-య-౩౭ తేజోబిందు.)

టీ. భావవర్జితచిన్మాత్రం = నిర్విషయచిన్మాత్ర మయినది, సర్వం=సమస్తమును, చిన్మాత్రమేవహి = చిన్మాత్రమైన బ్రహ్మమే, యత్ =ఏది, కించిత్ =కొంచెమో, యత్ =ఏది, నకించిత్ =కొంచెము గాదో, సర్వం = ఆసమస్తము, చిన్మాత్రమేవహి = చిన్మాత్రమైన బ్రహ్మమే.

తా. సమస్తము బ్రహ్మమే. ఆబ్రహ్మము చిన్మాత్రమైనది. నిర్విషయమైనది. బ్రహ్మముకన్న నన్యమెద్దియును లేదు.

" అఖండైకరసంసర్వం యద్యచ్చిన్మాత్రమేవహి " ౧౮

భూతంభవ్యంభవిష్యచ్చ సర్వంచిన్మాత్రమేవహి " ౧౯

(కృ-య-౩౭ తేజోబిందు.)

టీ. సర్వం=సమస్తమును, అఖండైకరసం = అఖండబ్రహ్మస్వరూపము, యద్యత్ =ఏదేదిగలదో, చిన్మాత్రమేవహి=అదియంతయు చిన్మాత్రమే, భూతం=జరిగినది, భవ్యం=కాదగినది, భవిష్యచ్చ=కాబోవునది, సర్వం=సమస్తమును చిన్మాత్రమేహి=చిద్రూపమైనబ్రహ్మమే.

తా. భూతభవిష్యద్వర్తమానములు బ్రహ్మమే. ఏదేదిగలదో దాని నధిష్ఠానమైన బ్రహ్మముగ నెంచవలెను.

"జ్ఞాతాచిన్మాత్రరూపశ్చ సర్వంచిన్మాత్రమేవహి" ౧౦
"యచ్చయావచ్చదూరస్థం సర్వంచిన్మాత్రమేవహి" ౨౧
(కృ-య ; 32 తేజోబిందు)

టీ. జ్ఞాతా=జీవుడు, చిన్మాత్రరూపః = చిద్రూపుడే, సర్వం= సమస్తమును, చిన్మాత్రమేవహి=చిన్మాత్రస్వరూపమె, యచ్చ=ఏదియో, యావచ్చదూరస్థం=ఎంతదూరముననున్నదియు, సర్వం=సమస్తమును, చిన్మాత్రమేవహి=చిద్రూపమే.

తా. మనోవాక్కుల కగోచరమైనదంతయు నధిష్ఠానమయిన బ్రహ్మమే. జీవుడు బ్రహ్మమే.

"చిన్మాత్రాన్నాస్తిలక్ష్యంచ సర్వంచిన్మాత్రమేవహి" ౨౨
"ఆత్మనోఽన్యగతిర్నాస్తి సర్వమాత్మమయంజగత్" ౨3
(కృ-య-32 తేజోబిందు)

టీ. చిన్మాత్రాత్=చిన్మాత్రమయినబ్రహ్మముకన్న, లక్ష్యంచ= ఇతరమైన లక్ష్యము, నాస్తి=లేదు. సర్వం=సమస్తమును, చిన్మాత్రమేవహి=చిన్మాత్రమే, ఆత్మనః=తనకన్న, అన్యగతిః = ఇతరమైనగతి, నాస్తి=లేదు, సర్వంజగత్=సమస్తజగత్తును, ఆత్మమయం = ఆత్మమయము.

తా. బ్రహ్మముకన్న ఇతరమైన లక్ష్యములేదు. బ్రహ్మముకన్న నన్యమైనగతిలేదు. జగమంతయు బ్రహ్మమయము.

"ఆత్మనోన్యత్తుయన్నాస్తి సర్వమాత్మమయంజగత్" ౨౮
"సర్వమాత్మైవశుద్ధాత్మా సర్వచిన్మాత్రమద్వయం" ౨౫
(కృ-య ; 32 తేజోబిందు అ ౫)

టీ. యత్ = ఏది, ఆత్మనః=ఆత్మకన్న, అన్యత్తు=ఇతరమైనదో యది, నాస్తి=లేదు, సర్వంజగత్ =సమస్తజగత్తును, ఆత్మమయం= ఆత్మమయము, సర్వం=సమస్తమును, ఆత్మైవ=ఆత్మయే, శుద్ధాత్మా= కేవలాత్మయే, సర్వం=సమస్తమును, అద్వయం = అద్వితీయమైన, చిన్మాత్రం=చిద్రూపబ్రహ్మము.

తా. ఆత్మకన్న నితరమైనది లేనిదే ఈ జగమంతయు తత్త్వ సృష్టిని కేవలాత్మయే యగును. గాని యన్యముగాదు. సమస్తమును నద్వితీయమైన చిద్రూపబ్రహ్మమే.

"సర్వంచఖల్విదం బ్రహ్మనిత్యం చిద్ఘనమక్షతం" ౨౬
(సామ - ౬౧ - మహా - అ ౪.)

"సమస్తంఖల్విదం బ్రహ్మసర్వమాత్మేదమాతతం" ౨౭
(సామ - ౬౧ - మహా - అ ౬.)

టీ, ఇదంసర్వంచ=ఈసమస్తమును, నిత్యం=నాశనరహితమయి నదియు, చిద్ఘనం=చిద్ఘనమైనదియు, అక్షతం=వికారములేనిదియు, (దె బ్బలేనిదియు) నగు, బ్రహ్మఖలు=బ్రహ్మమే, ఇదంసమస్తం=ఈసమస్త జగమును, బ్రహ్మఖలు=బ్రహ్మమే, ఇదంసర్వం= ఇదంతయు, ఆతతం= సర్వవ్యాపకమైన, ఆత్మా=ఆత్మయే.

తా. సమస్తము బ్రహ్మమున నారోపింపబడెను. గావున వాస్త వమున నంతయుబ్రహ్మమే.

"నత్వంనాహంచనా న్యద్వాసర్వం బ్రహ్మైవకేవలం" ౨౮
"నతదస్తినయతోఽహం నతదస్తినతన్మయం" ౨౯
(కృ - య - ౨౭ తేజోబిందు - అ ౫)

"కిమన్యమభివాంఛామి సర్వంచిన్మయంతతం" ౩౦
(సామ - ౬౧ - మహా - అ ౬.)

టీ. నత్వం=నీవులేవు, నాహంచ=నేనునులేను, నాన్యద్వా=అన్య మైనదియులేదు, సర్వం=సమస్తమును, కేవలంబ్రహ్మైవ=ఒక్కటైయైన బ్రహ్మమే, నతదస్తి=అదిలేదు, యత్ర=ఎక్కడను, నాహం=నేనులేనో అక్కడను, నతదస్తి=అదియునులేదు, నతన్మయం=దాని సంబంధమును లేదు, కిమన్యం=ఇతరమైన దేనిని, అభివాంఛామి = కోరుచున్నాను, సర్వం=సమస్తమును, తతం=పరిపూర్ణమైన, సచ్చిన్మయం = సత్యజ్ఞాన మయమైన బ్రహ్మమె.

తా. నేనులేను, నీవులేవు, ఇతరమైనది లేదు, ఇతరవస్తు సంబంధమైనదిలేదు. సమస్తము సత్యజ్ఞానానందమయిన బ్రహ్మమే. ద్వైత మయిన జగత్తు మిథ్య. తత్త్వమిట్లుండగా దేనిని జ్ఞాని కోరును? సర్వము బ్రహ్మమని నిశ్చయము గావున దేనిని గోరడు.

"భ్రాంతిరభ్రాంతిరాన్యేవ సర్వంబ్రహ్మైవ కేవలం"        ౩౧
"నదేహోనచకర్మాణి సర్వంబ్రహ్మైవ కేవలం"        ౩౨

(కృ-య-32 తేజోబిందు.)

టీ. భ్రాంతిః=భ్రమయును, అభ్రాంతిః = అభ్రమయును, నాస్త్యేవ= లేనేలేదు. సర్వం=సమస్తమును, కేవలం=అద్వితీయమైన, బ్రహ్మైవ=బ్రహ్మమే, నదేహః= దేహము లేదు, నచకర్మాణి=కర్మలులేవు సర్వం=సమస్తమును, కేవలం=అద్వితీయమైన, బ్రహ్మైవ=బ్రహ్మమే.

తా. వాస్తవమున అద్వితీయమయిన బ్రహ్మమేయున్నది. గాని భ్రాంతియు నభ్రాంతియును లేవు. దేహమునులేదు. కర్మములేదు. అద్వితీయమైన బ్రహ్మమే సమస్తము. దానికన్న నితరమగునది ఎద్దియు నులేదు. మూలగుచ్చుటకు సందు లేక నిండియున్నది.

"లక్షణాత్రయవిజ్ఞానం సర్వంబ్రహ్మైవ కేవలం"        ౩౩

(కృ-య-32 తేజోబిందు.)

"జగన్నామ్నా చిదాభాతి సర్వంబ్రహ్మైవ కేవలం" ౩౪
(శు-య-౬౩ యోగశిఖా. అ ౪.)

టీ. లక్షణాత్రయ విజ్ఞానం=జహదజహ ద్భావలక్షణాత్రయమున గలుగుజ్ఞానము, సర్వం=సమస్తమును, కేవలం=ఒక్కటియగు, బ్రహ్మైవ=బ్రహ్మమే, జగన్నామ్నా = జగత్తనుపేరిచే, చిదాభాతి = చిత్తేప్రకాశించుచున్నది. సర్వం = సమస్తమును, కేవలం=అద్వితీయమైన బ్రహ్మైవ=బ్రహ్మమే.

తా. లక్షణాత్రయ విజ్ఞానము బ్రహ్మమే; మన్నేకుండరూపమున ప్రకాశించునట్లు చిత్తేజగద్రూపమున ప్రకాశించుచున్నది, బ్రహ్మముకన్న నన్యమైనదిలేదు.

"బ్రహ్మమాత్రమిదంసర్వం బ్రహ్మమాత్రమసన్నహి." ౩౫
(కృ-య-౫౮ తేజోబిందు.)

"బ్రహ్మమాత్రంవ్రతంసర్వ బ్రహ్మమాత్రంరసంసుఖం." ౩౬

టీ. ఇదంసర్వం=ఈజగమంతయు, బ్రహ్మమాత్రం=బ్రహ్మమాత్రము, బ్రహ్మమాత్రం = బ్రహ్మమాత్రము, అసత్ =శూన్యము, నహి=కాదు, అసత్ =బ్రహ్మేతరమైన యసత్తు, నహిం=లేదు. వ్రతంసర్వం=సమస్తవ్రతములు, బ్రహ్మమాత్రం=బ్రహ్మమే, రసం=అనుభవమును, సుఖం=సుఖమును, బ్రహ్మమాత్రం=బ్రహ్మమాత్రమే.

తా. సమస్తవ్రతములు సమస్తానుభవములు సమస్తసుఖములు కేవల పరబ్రహ్మమేగాని యితరముగాదని తెలియుఁడు,

"బ్రహ్మమాత్రంశ్రుతంసర్వం స్వయంబ్రహ్మైవ కేవలం" ౩౭

బ్రహ్మైవసర్వచిన్మాత్రం బ్రహ్మమాత్రంజగత్త్రయం" ౩౮

టీ. శ్రుతం=సమస్తవేదవేదాంత శ్రవణమును, బ్రహ్మమాత్రం=బ్రహ్మమాత్రము, స్వయం = తాను, కేవలం = అద్వితీయమైన, బ్రహ్మైవ=బ్రహ్మమే, సర్వం=సమస్తమును, చిన్మాత్రం=చిన్మాత్రమైన, బ్రహ్మైవ=బ్రహ్మమే. జగత్త్రయం = ముజ్జగమును, బ్రహ్మమాత్రం=బ్రహ్మస్వరూపము.

తా. సమస్తము బ్రహ్మము.

"సర్వంప్రశాంతమజమేక మనాదిమధ్యమాభాస్వరం
స్వదనమాత్రమచైత్యచిహ్నం" ౩౯
"సర్వంప్రశాంతమితిశబ్దమయీచదృష్టిర్బోధార్థమేవ
హిముధైవతదోమితీదం" ౪౦

(సామ-౬౧ మహో-అ ౪.)

టీ. సర్వం=సమస్తమును, ప్రశాంతం = అత్యంతశాంతమును, అజం=పుట్టువులేనిధియును, ఏకం = అద్వితీయమైనదియును, అనాదిమధ్యం=ఆదిమధ్యములు లేనిదియును, ఆభాస్వరం = అంతట ప్రకాశించునదియు, స్వదనమాత్రం=అనుభవమాత్రమైనదియు, అచైత్యచిహ్నం=చిత్తవృత్తి లేకుండుటయే చిహ్నమైనదియు, (బ్రహ్మమే) సర్వం ప్రశాంత మితిశబ్దమయీచదృష్టిః=సమస్తము శాంతము అజమునను శబ్దజ్ఞానము, బోధార్థమేవ=బోధకొరకే, ముధైవ = బ్రహ్మస్వరూపమును శబ్దములచెప్పుట వృధయే, (చెప్పశక్యముగాదు) ఇదం = ఈజగమంతయు, తదోమితి=బ్రహ్మస్వరూపమైన ఓంకారమని తెలియవలెను.

తా. బ్రహ్మమిట్టిదని శబ్దములచే చెప్పుట శిష్యునకు బోధకొరకే గాని పరమార్థమున బ్రహ్మమే శబ్దవాచ్యమును గానిది అనుభవైకవేద్యమని తెలియవలెను.

ఇతి సార్థాంతిక సర్వస్వరూపవాక్యాని చత్వారింశత్.
ఇట్లు సార్థాంతిక సర్వస్వరూప వాక్యములు నలుబది.
ఇతి షోడశప్రకరణం సమాప్తమ్.
ఇట్లు పదియారవ ప్రకరణము సమాప్తము.

శ్రీ

సద్గురవేనమః.

# ౧౭ బ్రహ్మస్వరూప వాక్యములు.

" సర్వం హ్యేతద్బ్రహ్మ "

(అథర్వ-౯ మాండూక్య-౨౭ నృసింహపూర్వతాపిని-ఖం ౫.)

టీ. ఏతత్సర్వం=ఈజగమంతయు, బ్రహ్మ=బ్రహ్మము, హ=నిశ్చయము.

తా. జగత్తు బ్రహ్మముయొక్క వివర్తముగాన వాస్తవముగ బ్రహ్మమే. ఆరంభవాదమనియు, పరిణామవాదమనియు, వివర్తవాదమనియు, సృష్టివిషయమై మూడువాదములు గలవు. కుమ్మరి కుండల నుచేయునట్లు పరమేశ్వరుడు జగత్తు సృష్టించెననుట యారంభవాదము. మన్నుకుండయైనట్లు పరమేశ్వరుడే జగత్తుగానయ్యెననుట పరిణామవాదము, భ్రాంతిచే త్రాడు పాముగా తోచినట్లు మాయచే బ్రహ్మమే జగత్తుగాతోచుననుట వివర్తవాదము. ఈమూడువాదములందు సృష్టికిహేతువైన యొకవస్తువున్నది గావున నవి యాస్తికవాదములయ్యెను. ఇట్లు జగత్కారణమునకు వస్తువునుజెప్పమి నాస్తికవాదమనబడును. నిస్సంగుడు నద్వితీయుడునగు నీశ్వరునకు జగదారంభమును జగత్తుండుటయుగూడదు. నిరవయవునకు నిర్వికారునకు పరిణామముకూడదు. ఆహేతువుచే వివర్తవాదమనుసరించి త్రాడుభ్రాంతిచే సర్పముగ వివర్తమగునట్టుల మాయచే బ్రహ్మము జగద్రూపముగ వివర్తమాయెను. కావున త్రాడునకల్పితమైన సర్పము యథార్థరజ్జుజ్ఞానమున నశించి సంపూర్ణముగ త్రాడేస్ఫురించుచున్నట్లు యథార్థమగు బ్రహ్మజ్ఞానమున మాయాకల్పితమైన జగన్నిరసనపూర్వక

ముగ కేవల బ్రహ్మమే యవశేషించునుగాన సర్వము బ్రహ్మమని యీవాక్యమున చెప్పబడెను.

"అయమాత్మాబ్రహ్మ" ౨

(అథర్వ–౬ మాండూక్య: ౨ నృసింహపూర్వతాపిని–ఖం ౪)

టీ. అయమాత్మా=ఈప్రత్యగాత్మ, బ్రహ్మ=బ్రహ్మము.

తా. ప్రత్యగాత్మ బ్రహ్మమే యని తాత్పర్యము.

"సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ" 3

(కృ–యు–౭ తై త్తిరీయ–ఆనందవల్లి.)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, సత్యం=సత్యమైనది, జ్ఞానం=జ్ఞానమైనది అనంతం=అనంతమైనది.

తా. బ్రహ్మము సత్యజ్ఞానానంత స్వరూపమైనది. కాలత్రయాబాధ్యమై యుండుట సత్యము. (సత్తు) ఒకదానిచే తెలియబడక ఇతర సాపేక్ష్యములేక సర్వమును తెలిసికొనుచు దీపమువలె స్వయముగ ప్రకాశించుట జ్ఞానము (చిత్తు) దేశకాలవస్తు పరిచ్ఛేదము లేకుండుట యనంతము ఇట్టివంటిది బ్రహ్మము తనయందు మాయచే గల్పింపబడిన యుపాధులలోనుండుటచే బ్రహ్మమునకే కూటస్థుడని (ప్రత్యగాత్మయని) పేరు వ్యవహారకాలమున గలిగెను. కూటమనగా వాస్తవముగానికృత్రిమము కూటమైన స్థూలసూక్ష్మశరీరములకు అధిష్ఠానమైయుండుటచే బ్రహ్మముకూటస్థుడనబడెను వాస్తవమున కూటస్థుడు బ్రహ్మమేగావున బ్రహ్మలక్షణములైన సత్యజ్ఞానానందత్వములు గలిగియున్నాడు. ఇట్లుకలిగియుండుట జాగ్రత్స్వప్న సుషుప్తులయందు అనుభవమున తెలియనగును, ఆయవస్థలందు దృశ్యములు సత్యములై తెలియబడునవియై జడములై యున్నవి. వాని నెరుంగుసంవిత్తు (తెలివి) సత్యజ్ఞానానంత స్వరూపమైయున్నది. ఆ తెలివియే కూటస్థచైతన్యము.

ఉపాధులనుండగా వస్తుపరిచ్ఛేదము గలుగుచుండగా ననంతస్వభావ మెట్లుగలుగునని శంకగలుగును. సూర్యకాంతి అద్దములయందును అద్దములమధ్య భాగములందును నేకతీరుగనే యున్నది. అద్దమునం దున్నది. సూర్యప్రతిబింబమునకు హేతువగుచున్నది. అద్దములనడుమ నున్నది ప్రతిబింబములకు హేతువుగానున్నది. సూర్యకాంతియనంత ముగ నద్దములవలన బాధింపబడకనే యున్నది. అట్లేపరిపూర్ణ బ్రహ్మమును, బుద్ధులందును (లింగదేహము స్థూలదేహము) బుద్ధులనడు మను అనంతమైయున్నది. బుద్ధియందున్నది. కూటస్థుడు, (చిదాభాసుడైన జీవుడు) గలుగుటకు హేతువగుచున్నది. ఇతరత్రనున్న జీవులు గలుగుటకు హేతువుగానున్నది. కావున దేశకాల వస్తుపరిచ్ఛేదములేక యనంతమైయున్నదని తెలియవలయును. ఉపాధినాశమున కూటస్థచైతన్యము, ఆపేసుపోయి, శుద్ధచైతన్యమే యగును. బ్రహ్మము సత్యజ్ఞానానంత స్వరూపమయినది. దానికి వ్యతిరేకమైనది. అనృతజడమైనది. అనృతమెట్లు సత్యమగును. కావున జగత్తు మిథ్యయని నిశ్చయముగా తెలియవలెను.

"ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞానంబ్రహ్మ" ౪

(ఋ-ు ఐతరేయ అ౩. ఋ-౪-౨ ఆత్మబోధ)

"తదేతద్బ్రహ్మ అపూర్వమన పరమనంతరను బాహ్యమయ మాత్మా బ్రహ్మసర్వానుభూః," ౫.

(శు-యజు బృహదారణ్యక అ ౪-బ్రా ౫)

టీ. ప్రజ్ఞా=ప్రజ్ఞ, (నిర్వికల్పమైన చిన్మాత్రమగు వృత్తి ప్రజ్ఞయనియు ప్రజ్ఞానమనియు చెప్పబడును) ప్రతిష్ఠా=సర్వమునకు స్థానమైనది. (ఆధారమైనది.) ప్రజ్ఞానం = జ్ఞానమయినది. బ్రహ్మ=బ్రహ్మము ఏతత్=ఇది, తద్బ్రహ్మ=ఆబ్రహ్మమే అపూర్వం=పూర్వములేనిదియు (పూర్వమనగా కారణము. తనకుకారణములేనిది) అనపరం=పరము

లేనిది. (పరమునగా తన తరువాత గలిగినది. తనవలననైన కార్యరూపమైన జగత్తులేనిది, అనంతరం=అంతరములేనిది. అబాహ్యం=బాహ్యప్రదేశములేనిది. (పరిపూర్ణముగావున బాహ్యాంతరములు లేనిదియు) సర్వానుభూః=సమస్త బ్రహ్మాదులకు అనుభవ స్వరూపమైన, అయమాత్మా=ఈప్రత్యగాత్మ, బ్రహ్మ=పరబ్రహ్మమే.

తా. ప్రజ్ఞానస్వరూపమున ప్రజ్ఞానమే సమస్తమునకు నాధారమైనది. అదిగాను బ్రహ్మము. కార్యకారణములు లేనిదియు, పరిపూర్ణమైనదియు, జాగ్రత్స్వప్న సుషుప్తులయందేకాకృతిగ సమస్తబ్రహ్మాదులకు ననుభవైకవేద్యమైయున్నదియునగు నీప్రత్యగాత్మ కేవలపరబ్రహ్మమే. కార్యకారణములులేనిదగుటచే నిస్సంగమైనదని యభిప్రాయము.

" విజ్ఞానమానందంబ్రహ్మ "

(శు-య-౧౦ బృహదారణ్యక-అ ౫-బ్రా-౯.)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, విజ్ఞానం = అనుభవస్వరూపమైనది ఆనందం=ఆనందస్వరూపమైనది.

తా. అనుభవజ్ఞాన మమనస్కముగావున బ్రహ్మమమనస్కమైనది యనంతస్వరూపమయినది.

" అజరోమరోభయో మృతోబ్రహ్మ అభయంవైబ్రహ్మ " ౭

(శు-య-౧౦ బృహదారణ్యక-అ ౬-బ్రా-౪.)

" సర్వభూతస్థమేకం నారాయణం కారణపురుషం అకారణం పరంబ్రహ్మాం " ౮

(కృ-య-౧౮ నారాయణ.)

" స్వయంప్రకాశం స్వయంబ్రహ్మ " ౯

టీ. అజరః = ముదిమిలేనియు, అమరః = మరణములేనియు, అభయః=భయములేనియు, అమృతః=కైవల్యస్వరూపమైనట్టి ప్రత్యగాత్మయగు. బ్రహ్మ=బ్రహ్మము, అభయం=భయములేనిది, సర్వభూతస్థం=సమస్తభూతములందున్నది, ఏకం=ఏకాకృతియైయునది, నారాయణం=నారాయణస్వరూపమైన, కారణపురుషం=కారణపురుషాత్మకమయినది, అకారణం=తనకుకారణములేనిది, పరం=ప్రకృతికి పరమైనది, బ్రహ్మ=బ్రహ్మము, ఓం=ఓంకారమైనది, స్వయంప్రకాశం=ఇతరప్రకాశమపేక్షింపక తనంతప్రకాశించునది, స్వయం=తానైయున్నదియై, బ్రహ్మ=బ్రహ్మమైనది.

తా. శరీరములేదుగావున నజరమనియు, అమృతమనియు నిట్లు చెప్పబడెను. బ్రహ్మము భయముకలుగఁజేయునది కాదు. బ్రహ్మము భయముకలిగినది కాదు. జ్ఞానులభయమును పోఁగొట్టునుగావున నభయమనబడును. నేను స్వయముగ చూచుచున్నాను, నీవుస్వయముగ చూచితివి, వాడు స్వయముగఁబోయెననుచో స్వయంశబ్దము మూఁడు పురుషులయందు వర్తించుచున్నది. ఆవిధమున అహంశబ్దము సశబ్దమును, సశబ్దము త్వంశబ్దమునను వర్తించుట లేదు, కావున స్వయంశబ్దము సాధారణమైనది. బ్రహ్మము స్వయంశబ్దవాచ్యమగునది. ఇతర సాహాయ్యమపేక్షింపక తనంతనున్నది కావున స్వయంశబ్దవాచ్యమయ్యెను.

“ తదేతదద్వయంస్వయం ప్రకాశమహానందాత్మైవ
తదమృతమభయమేతద్బ్రహ్మ,” ౧౧

(అధర్వ-౨౭ నృసింహోత్తరతాపినీ; ఖం ౮.)

టీ. ఏతత్=ఈ కూటస్థచైతన్యము, తత్ = తత్పదలక్ష్యమైన బ్రహ్మము; అద్వయం=అద్వితీయమయినది, స్వయంప్రకాశ మహానందాత్మైవ = తనంతప్రకాశించు మహానందరూపమైన యాత్మయే, ఏత

బ్రహ్మ= ఈబ్రహ్మము, తత్ =ఆకూటస్థ చైతన్యమే, అమృతం=నాశము లేనిది, అభయం=భయము లేనిది.

తా. బ్రహ్మమే ప్రత్యగాత్మ. ప్రత్యగాత్మ బ్రహ్మము.

“ సదేవపురస్తాత్ స్థితం బ్రహ్మ ” ౧౧

(అథర్వ-౨౭ నృసింహోత్తరతాపిని ; ఖం ౯.)

టీ. బ్రహ్మ=బ్రహ్మమైన, సదేవ=సద్వస్తువే, పురస్తాత్=సృష్టికి ముందు, స్థితం=ఉన్నది.

తా. సృష్టికి ముందున్న వస్తువే బ్రహ్మము. అదియే సమస్తమునకు అధిష్ఠానమయ్యెను.

“ ఆకాశవత్సూక్ష్మం కేవలసత్తామాత్రస్వభావం
పరంబ్రహ్మ ” ౧౨

టీ. పరం=సమస్తమునకు పరమైన, బ్రహ్మ=బ్రహ్మము, ఆకాశవత్=ఆకాశమువలె, సూక్ష్మం=నిరవయవమగుటచే సూక్ష్మమని వ్యవహరింపబడుచున్నది. కేవలసత్తామాత్ర స్వరూపం, కేవల=అన్యధర్మము లేకుండుటయు, సత్తామాత్ర=సత్తుగా నుండుటయు, స్వభావం=స్వభావముగా గలది.

తా. స్పష్టము.

“ అద్వితీయమఖిలోపాధి వినిర్ముక్తం తత్సకలశక్త్యుప
బృంహితమనాద్యనంతం శివం శాంతం నిర్గుణం ఇత్యాదివా
చ్యమనిర్వాచ్యం చైతన్యం బ్రహ్మ. ” ౧౩

(శు-య-౩ర నిరాలంబ.)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, అద్వితీయం = విజాతిభేదములేనిది, అఖిలోపాధివినిర్ముక్తం=మాయావిద్యాది సకలోపాధులు లేనిది, తత్సక

లక్షత్వ్యేప బృంహితం=ఆమాయావిద్యాద్యుపాధి శక్తులచే వ్యాప్తమైనది, అనాద్యంతం=ఆద్యంతములు లేనిది, శివం=మంగళ స్వరూపమైనది, శాంతం=శాంతమైనది, నిర్గుణం=నిర్గుణము లేనిది, ఇత్యాదివాచ్యం=శాంతమునిర్గుణమును నీ మొదలయిన శబ్దములకు వాచ్యమైనది (బోధార్థము వాచ్యమైనది) అనిర్వాచ్యం=అనుభవైక గమ్యమగుటచే నిట్టిదనిమాటలచే చెప్పరానిది, చైతన్యం=శుద్ధచైతన్య స్వరూపమైనది.

"ఏకమేవాద్వితీయంబ్రహ్మ" ౧౪

(అధర్వ-౫౨. మహా-అ 3)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, ఏకం=ఏకాకృతిగలదైనది. (నిరవయవమైనది) ఏవ=(ఒక్క టియే) అనవంటిది మరియొకటిలేనిది., అద్వితీయం=రెండవది లేనిది (అనకంటె వ్యతిరేకమైనది మరియొకటిలేనిది)

తా. ఏకమనుశబ్దము స్వగతభేదమును లేదని తెలియచేయు చున్నది. ఏవయనునది సజాతీయభేదములేదని తెలియచేయుచున్నది. అద్వితీయమను శబ్దము విజాతీయభేదములేదని తెలియచేయుచున్నది. బ్రహ్మము సజాతీయవిజాతీయ స్వగతభేదములు లేనిదని యీ వాక్యము తెలియజేయుచున్నది.

"సర్వదానవచ్ఛిన్నం బ్రహ్మ" ౧౫

(సామ-౪౬ యోగచూడామణి)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, సర్వదా = ఎప్పుడును, అనవచ్ఛిన్నం= ఆవరింపబడనిది.

తా.—దేశకాల వస్తువులచే నావరింపబడనిది గావున ననంతమని బ్రహ్మము చెప్పబడును.

"సచ్చిదానందతేజః కూటస్థరూపంతారకంబ్రహ్మ" ౧౬

(శు-య-౫౮ మండలబ్రాహ్మణ. బ్రా) ౧)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, సచ్చిదానంద తేజః=సత్యజ్ఞానానందప్రకాశమైన, కూటస్థరూపం=ప్రత్యగాత్మ స్వరూపము, తారకం=సూర్యచంద్రాగ్నిమండల మధ్యమున హిరణ్మయమయి నీవారశూకమువంటి సూక్ష్మరూపముగనున్న తేజసు

తా. షణ్ముఖీ, భూచరీ, శాంభవీ మొదలయిన ముద్రలచే స్థిర దృష్టిని జూడ నానావిధములయిన చిత్కళలు మొదట గనబడును. పిదప నగ్నిమండలము, దాని యంతరమున సూర్యమండలము, దాని నడుమ చంద్రమండలమును గనబడును. ఆ చంద్రమండల మధ్యమందు నీలమేఘమండలి విద్యుల్లేఖవలె నీవారశూకమువోలె సూక్ష్మమయిన తేజస్సు హిరణ్మయమై గనబడును. అదియే త్రిమూర్తులు. (తారకము.)

" తన్నిత్యముక్తమవిక్రియం సత్యజ్ఞానానంతానంద
పరిపూర్ణం సనాతనమేకమేవా ద్వితీయంబ్రహ్మ " ౧౭

(శు-య-౫౯ పైంగల.)

టీ. తద్బ్రహ్మ=ఆబ్రహ్మము, నిత్యముక్తం=ఎప్పుడును ముక్తమయియున్నది. అవిక్రియం-వికారములులేనిది. సత్యజ్ఞానానంతానంద పరిపూర్ణం=సత్యమైనది. జ్ఞానమయినది. అనంతమైనది, ఆనందమైనది, పరిపూర్ణమైనది, సనాతనం=అనాదిసిద్ధమైనది, ఏకమేవ=ఒక్కటియేయైనది, అద్వితీయం=రెండవదిలేనిది.

తా. సూర్యుడు మేఘావరణతో గూడినవాడైనను నెట్లు బాధింపబడలేదో యట్లే మాయావిద్యాద్యుపాధులచే గూడినను బ్రహ్మము నిత్యముక్తమే-మరియు బ్రహ్మము నిర్వికారమయినది. సత్యజ్ఞానానంతానంద పరిపూర్ణమయినది-సనాతనమైనది - యేభేదములేనిది (భేదత్రయములేనిది.)

"చిత్స్వరూపనిరంజనం పరం బ్రహ్మ" ౧౭

(అధర్వ-౫౨ మహానారాయణ-అ 2)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, చిత్స్వరూపనిరంజనం=జ్ఞానస్వరూపమైనది దేనినంటనిది (నిర్దోషమయినది,) పరం=సమస్తమునకు పరమైనది.

తా. సూర్యుడు సమస్తమును వెలిగించుచు వానివ్యాపారము తాను బొందక నిరంజనుడగునట్లు ప్రత్యగాత్మస్వరూపబ్రహ్మము సమస్తదృశ్యములకు సాక్షియై వానివృత్తులను బొందక యుండుటచే నిరంజనుడయ్యెను.

"తత్త్వం పదలక్ష్యం ప్రత్యగభిన్నం బ్రహ్మ" ౧౯

(శు-య-౫౯ పైంగల-అ 3)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, తత్త్వంపదలక్ష్యం=తత్పదమునకును త్వంపదమునకును లక్ష్యమైన పరమాత్మయును ప్రత్యగాత్మయును స్వరూపముగాగలది, ప్రత్యగభిన్నం=ప్రత్యగాత్మకంటె భిన్నముగానిది.

తా. తత్పదలక్ష్యమైన పరమాత్మయు, త్వంపదలక్ష్యమైన ప్రత్యగాత్మయు, బ్రహ్మమే - మాయావిద్యోపాధులనుబట్టి యీపేరులు గలిగెను.

"అఖండార్థం పరం బ్రహ్మ" ౨౦

(ఋ-౧౦౭ బహ్వృచ)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, అఖండార్థం=అంతరములులేక పరిపూర్ణమయినందున నఖండమైనది, పరం=శ్రేష్ఠమైనది, ప్రకృతికి నతీతమైనందున పరమని శ్రేష్ఠమని చెప్పబడుచున్నది.

తా. అఖండార్థమనగా భేదములేక యఖండార్థముగలది. తత్త్వమస్యాదివాక్యములయొక్క సంసర్గార్థముగాని విశిష్టార్థముగాని లేక యఖండార్థముగలది సంసర్గోవా విశిష్టోవా వాక్యార్థోనాత్రసమ్మ

తః! అఖండార్థైకబోధస్తు వాక్యార్థోవిదుషాంమతః అని శంకరాచార్యులవారు.

" సర్వకాలాబాధితం బ్రహ్మ " ౨౧

(అథర్వ-౫౨ మహానారాయణ-అ ౧)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, సర్వకాలాబాధితం=కాలత్రయాబాధ్యమయినది.

తా. సత్యమైనదని తాత్పర్యము.

" సగుణనిర్గుణస్వరూపకం బ్రహ్మ " ౨౨

(అథర్వ-౫౨ మహానారాయణ-అ-౧)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, సగుణనిర్గుణస్వరూపకం=సగుణనిర్గుణస్వరూపకమైనది.

తా. వ్యవహారదశయందు బ్రహ్మమే మాయోపాధికమై ఈశ్వరుడనబడి జగత్సృష్టిస్థితిలయములు చేయుచుండుటచే సగుణమనబడును. మాయలేని పరమార్థదశయందు నిర్గుణమనబడును.

" ఆదిమధ్యాంతశూన్యం బ్రహ్మ " ౨౩

(అథర్వ-౫౨ మహానారాయణ-అ౧)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, ఆదిమధ్యాంతశూన్యం=ఆదిమధ్యాంతములులేనిది, సత్యమైనది.

తా. స్పష్టము.

" మాయాతీతం గుణాతీతం బ్రహ్మ " ౨౪

(అథర్వ-౫౨ మహానారాయణ-అ ౧)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, మాయాతీతం=మాయకతీతమయినది, గుణాతీతం=గుణములకతీతమైనది.

తా. నిస్సంగమైనది. నిర్గుణమైనది. బ్రహ్మము శుద్ధచైతన్యస్వరూపమైనది.

" అనంతమప్రమేయం అఖండం పరిపూర్ణం బ్రహ్మ " ౨౫
(అథర్వ-౫౨ మహానారాయణ-అ ౧)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, అనంతం=దేశకాలవస్తు పరిచ్ఛేదము లేనిది. అప్రమేయం=ఏప్రమాణములచే తెలియబడువిషయముగానిది, అఖండం=ఖండముగానిది. పరిపూర్ణం = ఖండముగామి పరిపూర్ణమైనది.

తా. పరిస్ఫుటమై యున్నదని సమ్మతి.

" అద్వితీయపరమానంద నిత్యశుద్ధబుద్ధముక్త
సత్యరూపవ్యాపకాభిన్నా పరిచ్ఛిన్నం బ్రహ్మ " ౨౬
(అథర్వ-౫౨ మహానారాయణ-అ-౧)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, అద్వితీయ = అద్వితీయమై, పరమానంద=పరమానందమై, నిత్య=నాశనరహితమై, శుద్ధ=నిస్సంగమగుటచేపరిశుద్ధమై, బుద్ధ=బోధస్వరూపమై, ముక్త=అవిద్యాముక్తమయి, సత్యరూప=కాలత్రయాబాధ్యమైన రూపమై, వ్యాపక=సర్వవ్యాపకమై, అభిన్న=సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేనిదై, అపరిచ్ఛిన్నం=దేశకాలవస్తుపరిచ్ఛిన్నముగాని యనంతము.

తా. స్పష్టము.

" సచ్చిదానంద స్వప్రకాశం బ్రహ్మ " ౨౭
(అథర్వ-౫౨ మహానారాయణ.-అ౧)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, సచ్చిదానంద స్వప్రకాశం = సత్యజ్ఞానానంద స్వప్రకాశరూపమయినది.

తా. స్పష్టము.

" మనోవాచామగోచరం బ్రహ్మ " ౨౮

టీ. మనోవాచాం=మనోవాక్కులకు, అగోచరం=గోచరముగానిది. బ్రహ్మ=బ్రహ్మ.

తా. స్పష్టము.

" అఖిలప్రమాణా గోచరంబ్రహ్మ " ౨౯

(అధర్వ-౫౨ మహానారాయణ అ ౧)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, అఖిలప్రమాణా గోచరం=సమస్తప్రమాణముల కగోచరమైనది. ఏప్రమాణముచేతను తెలియబడనిది.

తా. ప్రత్యక్షము, అనుమానము, శబ్దము, ఉపమానము, అర్థాపత్తి, అనుపలబ్ధి, సంభవము. ఐతిహ్యము నని ప్రమాణము లెనిమిదివిధములు. బ్రహ్మము తెలియబడునది (దృశ్యము) కామిచే నీప్రమాణముల కగోచరమైనది. ఒకరుచెప్పినను చెప్పకున్నను తనంతవస్తుస్వరూపమును తెలిసికొనుట ప్రత్యక్షము. ఉదాహరణము అగ్నిని ముట్టి యది వేడిగనుండునని తెలిసికొనుట. కారణమును జూడకున్నను కార్యమునుబట్టి కారణమున్నదని యెరుంగుట యనుమానము. ఉదాహరణము-పొగవచ్చుచుండనగ్నిని జూడకయే యగ్నిగలదని నిశ్చయించుట. ఈయనుమానప్రమాణమున నిశ్చయించినది ప్రత్యక్షముగ మున్నెప్పుడైనను తెలిసియే యుండుననియు నిది ప్రత్యక్షములోచేరినదియేయనియు చార్వాకులుచెప్పుదురు. వారికి ప్రత్యక్షమొక్కటియే ప్రమాణము. తక్కినవిలేవు. ఆప్తవాక్యమునుగాని వేదాదిగ్రంథవాక్యములనుగాని విశ్వసించుట శబ్దప్రమాణము. ఉదాహరణము— అన్నదానముచేసినవానికి స్వర్గముగలుగునను శాస్త్రవాక్యమును విశ్వసించి యట్లుచేయుట. ఒకవస్తువువంటి మరియొకవస్తువునువిని (రెండు వస్తువులకు కొన్నిధర్మములు సమానముగనుండవలయును) యావస్తువుదీనివలెనుండుననుట యుపమానము. ఉదాహరణము-స్త్రీముఖము చంద్రునివలెనున్నదని విని చంద్రునిజూచి యట్లెగుండ్రముగను మనోహరముగను స్త్రీముఖమున్నదని యెరుంగుట. కొన్నిలక్షణములను బట్టి యీవస్తువు ఇట్లుండవచ్చునని యెరుగుట యర్థాపత్తి. ఉదాహరణము—ఒకడు రామాయణమును జదువకున్నను రామకథ బాగుగ

నెరిగియున్నాడని వినినప్పుడు, వాడుచదువకున్నను రామకథ బాగుగ వినియుండవచ్చునని-పదార్థములేకపోవుట తెలిసికొనుటయే యనుపలబ్ధి. ఉదాహరణము—తనకుచదువురానప్పుడు చదువురాలేదని తెలిసికొనుట. మొత్తమునందు దాని భాగములున్నవని యెరుంగుట సంభవప్రమాణము. ఉదాహరణము — మొత్తమయిననూటిలో దానిభాగమైన యేదున్నదని యెరుంగుట. ఈభాగములెప్పుడును నామొత్తముకన్న నెక్కువగాజాలవు. ఒకడొకమాటచెప్పిన విని ప్రత్యక్షముగ దానినిగూర్చి భయాదులనుబొందుట ఐతిహ్యము. ఉదాహరణము— ఒకచెట్టుమీదదయ్యమున్నదని విని యాచెట్టుదగ్గిరకుబోయి యామాటజ్ఞాపకముంచుకొని భయమునొందుట. దీనికి శబ్దప్రమాణమునకు భేదమాయనిన ప్రత్యక్షముగ జూడక విశ్వసించుటయె శబ్దప్రమాణము గావున దీనికిని శబ్దమునకును భేదమున్నదని తెలియవలయును.

" దేశతఃకాలతోవస్తుతః పరిచ్ఛేదరహితంబ్రహ్మ." ౩౦

(అథర్వ-౫౨ మహానారాయణ-అ ౧ ")

టీ. బ్రహ్మ=బ్రహ్మము, దేశతః=దేశమునను, కాలతః-కాలమునను, వస్తుతః=వస్తువునను, పరిచ్ఛేదరహితం=పరిచ్ఛేదము (ఆవరము) లేనిది అనంతమైనదని యర్థము.

తా. స్పష్టము

" తురీయం నిరాకారమేకం బ్రహ్మ " ౩౧

(అథర్వ-౫౨ మహానారాయణ-అ ౧)

టీ. తురీయం=అవస్థాత్రయాతీతమైనది, నిరాకారం=ఆకారములేనిది. ఏకం=అద్వితీయమయినది.

తా. స్పష్టము.

" అద్వైతమనిర్వాచ్యం బ్రహ్మ " ౩౨

అథర్వ-౫౨ మహానారాయణ-అ ౧)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, అద్వైతం = ద్వైతముకానిది, అనిర్వాచ్యం=ఇట్టిదని చెప్పరానిది.

తా. స్పష్టము.

" శివంప్రశాంత మమృతంపరంబ్రహ్మ " ౩౩

(అథర్వ-౫౮ శాండిల్య-అ ౨)

" యదేకమక్షరం నిష్క్రియంశివం సన్మాత్రపరంబ్రహ్మ " ౩౪

(అథర్వ-౫౮ శాండిల్య-అ. ౩)

టీ. యత్ =ఏది, శివం = మంగళ స్వరూపమైనదో, ప్రశాంతం= శాంతమయినదో, అమృతం=నాశరహితమైనదో, పరం=ప్రకృతికిపరమైనదో, ఏకం=అద్వితీయమైనదో, అక్షరం=నశింపనిదో, నిష్క్రియం = నిష్క్రియమైనదో, శివం=శుభమైనదో, సన్మాత్రపరం = సద్రూపమున నుత్కృష్టమైనదో, అది బ్రహ్మము.

తా. స్పష్టము.

" అసావాదిత్యోబ్రహ్మ " ౩౫

(అథర్వ-౭౧ సూర్య.)

టీ. అసౌ=ఈ, ఆదిత్యః=సూర్యుడు, బ్రహ్మ=బ్రహ్మము.

తా. బ్రహ్మము ఈ సూర్యుడు "జ్యోతిషాంరవిరంశుమాన్" అనుగీతావాక్యము చొప్పున ప్రకాశించువస్తువులందు సూర్యుడే చివరవాడు గావున ప్రకాశస్వరూపమైనదని చెప్పుట కుపమానములో సూర్యునిమించిన పదార్థములేమి సూర్యుడే బ్రహ్మమనిచెప్పబడెను. బ్రహ్మమిట్టి స్వప్రకాశ స్వరూపమైన యుత్కృష్టవస్తువని యెఱుంగవలయును.

" ఓమిత్యేతదక్షరం బ్రహ్మ " ౩౬

(అథర్వ-౨౩ అథర్వశిఖ) (శు-య-౯౧ తారసార)

టీ. ఓమితి=ఓంకారమను, ఏతదక్షరం=ఈయక్షరము, బ్రహ్మ=బ్రహ్మము.

తా. ఓమిత్యేకాక్షరం బ్రహ్మయను గీతావాక్యము (౮-౧౩) చెప్పిన ఓంకారమే బ్రహ్మమని తెలియవలయును.

బ్రహ్మైవేదమమృతం పురస్తాద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణతశ్చోత్తరేణ " 3౭

(అథర్వ-౫ ముండక-ముం-౨-ఖం-౨)

టీ. ఇదం=ఈజగత్తు, అమృతం=నాశనరహితమగు‌న, బ్రహ్మైవ=బ్రహ్మమే, పురస్తాత్=ముందును, బ్రహ్మ=బ్రహ్మము, పశ్చాత్=వెనుకను, బ్రహ్మ=బ్రహ్మము, దక్షిణతః=దక్షిణమునను, ఉత్తరేణచ=ఉత్తరమునను, బ్రహ్మమే. సర్వపరిపూర్ణము బ్రహ్మమని తాత్పర్యము.

తా. స్పష్టము.

" అధశ్చోర్ధ్వంచ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం " 3౮

(అథర్వ-౫ ముండక-ముం-౨-ఖం-౨)

టీ. ఇదం=ఈ, అధశ్చ=క్రిందుభాగము, ఊర్ధ్వంచ=మీదుభాగమును, ప్రసృతం=వ్యాప్తమగు‌న, ఇదంవిశ్వం = ఈవిశ్వము, వరిష్ఠం=శ్రేష్ఠమగు‌న, బ్రహ్మ=బ్రహ్మము.

తా. సమస్తము బ్రహ్మమని తాత్పర్యము.

" తదేవనిష్కళం బ్రహ్మనిర్వికల్పం నిరంజనం" 3౯

" చైతన్యమేకం బ్రహ్మాతఃప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి " ౪౦

(శు-య-౨౦ అమృతబిందు)(అథర్వ-౮౦ త్రిపురతాపినీ-ఉ౫)

టీ. తద్బ్రహ్మైవ=ఆబ్రహ్మమే, నిష్కళం=షోడశకళలులేనిది, నిర్వికల్పం=వికల్పములేనిది, నిరంజనం=దేనినంటనిది, ఏకం=సమస్తభూతములందు నేకాకృతిగనున్న, చైతన్యం=చైతన్యము, బ్రహ్మ=బ్రహ్మము, అతః=ఆకారణమువలన, మయ్యపి=నాయందునున్న, ప్రజ్ఞానం=ప్రజ్ఞానముకూడా, బ్రహ్మ=బ్రహ్మము.

తా. సమస్తభూతములందున్న చైతన్యమే (బ్రహ్మమే) మాయాభేదములయిన యుపాధులనుబట్టి, సర్వజ్ఞత్వ కించిద్జ్ఞత్వాది గుణ విశిష్టములైన ఈశ్వరత్వ జీవత్వముల నొప్పుచుండు గావున నాయందు కించిద్జ్ఞత్వవిశిష్టమైయున్న చైతన్యము బ్రహ్మమే, అవిద్యోపాధిచే కించిద్జ్ఞత్వముగలిగెను.

" బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకం " ౪౧

" ఏతద్భావ వినిర్ముక్తం తద్బ్రహ్మ బ్రహ్మతత్పరం " ౪౨

(కృ-య-౩౭ తేజోబిందు)

టీ. బ్రహ్మశబ్దేన=జగత్తునకధిష్ఠానమైన వస్తువు బ్రహ్మశబ్దమున చెప్పబడును. గాన తద్బ్రహ్మ= ఆబ్రహ్మము, స్వప్రకాశాత్మరూపకం=స్వప్రకాశ స్వరూపమైన ప్రత్యగాత్మగా యగును, ఏతద్భావ= స్వాతిరిక్తమయిన యీ జగద్భావమునుండి, వినిర్ముక్తం=విడువబడినది, (జగద్భావములేనిది) బ్రహ్మ=బ్రహ్మము, తత్ బ్రహ్మ=తత్పదలక్ష్యమైన బ్రహ్మ, తత్పరం=తత్పదవాచ్యుడయిన ఈశ్వరునకు పరమైనది.

తా. సృష్టికిముందున్న బ్రహ్మమే సృష్టియైన తరువాత శిష్యునకు తెలియుటకు సృష్టికంటె విలక్షణమైనదని తత్తనుపదమున చెప్పబడెను. తత్తనిచెప్పుట వలన నింక ప్రత్యక్షముగాలేదని తెలియవలయును.

" చిన్మాత్రాత్పరమం బ్రహ్మ చిన్మాత్రాన్నాస్తి కోపివా" ౪౩

" అఖండైకరసంబ్రహ్మ చిన్మాత్రాన్నహివిద్యతే " ౪౪

(కృ-య-౩౭ తేజోబిందు.)

టీ. చిన్మాత్రాత్=చిద్రూపముగా నుండుటవలన, బ్రహ్మ=బ్రహ్మము, పరమం=ఉత్కృష్టమైనది, చిన్మాత్రాత్ = చిన్మాత్రముకన్న,

కోపివా=ఎవడును, నాస్తి=లేదు, అఖండైకరసం = అఖండానుభవమైనది, బ్రహ్మ=బ్రహ్మము, చిన్మాత్రాత్=చిద్వస్తువుకన్న, నహివిద్యతే=ఏదియునులేదు.

తా. చిత్సాన్నిధ్యముననే జడముచైతన్యమును వహించిపనిచేయుచున్నది. చిద్వస్తువులేని యెడను సర్వము మృతమై జడమై యుండును. బ్రహ్మముచిద్వస్తువగుటచే సర్వోత్కృష్టమైనది. కావున చిత్తుకంటె నితరమైనదిలేదు.

"సదోదితంపరంబ్రహ్మ జ్యోతిషాముదయోయతః" ౨౫

(ఋ-౩౮ నాదబిందు)

"యస్మిన్సంవీయతే శబ్ద స్తత్పరబ్రహ్మగీయతే" ౨౬

(కృ-య-౨౦ బ్రహ్మవిద్యా అ-౨)

టీ. జ్యోతిషాం=స్వప్రకాశ స్వరూపులైన సూర్యాదులకు, యతః=దేనివలన, ఉదయః = ఉత్పత్తియగుచున్నదో, యస్మిన్=దేనియందు, శబ్దః=శబ్దము, సంవీయతే=లయించుచున్నదో, తత్=అది, సదోదితం=ఎల్లపుడుప్రకాశించునదియు,పరంబ్రహ్మ=ఉత్కృష్టమైనబ్రహ్మమై, పరబ్రహ్మ=పరబ్రహ్మమని, గీయతే=చెప్పబడుచున్నది.

తా. ప్రకాశస్వరూపులగు సూర్యాదులకు కారణమైనందున బ్రహ్మము సదోదితమనబడును. నిర్విషయమైనందున పరమనబడును. శబ్దము లయించిన తక్కిన నాలుగువిషయములు లయించును గాన బ్రహ్మము నిర్విషయమైనది. అఖండప్రకాశస్వరూపమైనది.

" సర్వశక్తిపరం బ్రహ్మనిత్యమాపూర్ణమద్వయం " ౨౭

" సత్తాసర్వపదార్థానాం గమ్యం బ్రహ్మేదంపరం " ౨౮

టీ. బ్రహ్మ=బ్రహ్మము, సర్వశక్తిపరం=సర్వశక్తియుక్తమయిన ప్రకృతికి పరమైనది, నిత్యం=నాశనరహితమయినది, ఆపూర్ణం=పరిపూర్ణమైనది, అద్వయం=అద్వితీయమైనది, సర్వపదార్థానాం=సమస్తపదార్థములకు, సత్తా=సత్తమైనది, (సద్ధర్మమైనది) బ్రహ్మాభిదం=బ్రహ్మమను పేరనొప్పు, పదం=స్థానము, గమ్యం=పొందదగినది.

తా. ఘటమున్నది పటమున్నది యనుచో నాయుండుటయే సత్తయనబడును. అదియే బ్రహ్మాంశము. ఈబ్రహ్మాంశము సర్వపదార్థములనున్నది. బ్రహ్మమున తోచిన మాయయందు మాయాంశమైన మిథ్యాత్వమును, బ్రహ్మాంశమయిన సత్తయును గలవు. మాయయున్నదనుచోట బ్రహ్మాంశము యథార్థముగా లేకపోవుట (మిథ్యాత్వము) మాయవలన గలిగిన యాకాశమున బ్రహ్మాంశమును, మాయాంశమును నాకాశాంశమును గలవు. ఆకాశమున్నదనుట బ్రహ్మాంశమయిన సత్త శబ్దము ఆకాశగుణము వాస్తవమున నుండదు గావున మిథ్యాత్వమయిన మాయాంశము నున్నది. ఇట్లే యాకాశమునుండి గలిగిన వాయువునందు వాయుగుణమయిన స్పర్శమును నాకాశాంశమయిన శబ్దమును మాయాంశమయిన మిథ్యాత్వమును బ్రహ్మాంశమయిన సత్తయును గలవు. ఇట్లే సమస్తపదార్థములు నూహింపవలయును. బ్రహ్మాంశమైన సత్తనువిడువగా సమస్తపదార్థములను మిథ్యాత్వమును మిథ్యాభూతములైన గుణములును మిగిలియుండు గావున మిథ్యలగుచున్నవి. గావున బ్రహ్మ వ్యతిరిక్తమగు సర్వమును మిథ్యయనబడును. మిథ్యయనగా సత్యమునసనుండక యున్నట్లు కనబడుటగాని శూన్యముగాదు. మిథ్యాభూతమున కధిష్ఠానమై సత్తుండును. శూన్యమున కధిష్ఠానముగాని మిథ్యారూపమునకు శూన్యమధిష్ఠానముగాగాని యుండదు. ఈహేతువుచే మిథ్యయైన సృష్టికి మును సత్తైన బ్రహ్మమున్నదని యొఁగవలెను.

" పరంబ్రహ్మపరం తత్త్వంసచ్చిదానందలక్షణం " ౪౯

(శు-యు-౬౩ యోగశిఖ-అ ౨.)

" అక్షరంపరమంబ్రహ్మ నిర్విశేషంనిరంజనం " ౫౦

(కృ-యు-౬౩ యోగశిఖ-౩.)

టీ. పరంబ్రహ్మ=పరబ్రహ్మము, పరంతత్త్వం=పరతత్త్వమైనది, సచ్చిదానందలక్షణం=సత్యజ్ఞానానంద స్వరూపమయినది. అక్షరం=నశింపనిది, పరమం=ఉత్కృష్టమైనది, బ్రహ్మ=బ్రహ్మమైనది. నిర్విశేషం=గుణములు లేనిది. (తనకన్న మిగిలినది మరియొకటిలేనిది.) నిరంజనం=దేనినంటక పరిశుద్ధమైనది.

తా. బ్రహ్మమసంగము. సచ్చిదానందస్వరూపము.

" బ్రహ్మైవైకమనాద్యంతమబ్ధివత్ప్రవిజృంభతే. " ౫౧

" నకించిద్భావనాకారం యత్తద్బ్రహ్మపరంవిదుః " ౫౨

(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ ౫.)

టీ. ఏకం=అద్వితీయమైన, అనాద్యంతం=ఆద్యంతములులేని, బ్రహ్మైవ=బ్రహ్మమే, అబ్ధివత్=సముద్రమువలె, ప్రవిజృంభతే=మాయవలన విజృంభించుచున్నది. యత్=ఏది, భావనాకారం=భావించుటకు తగిన యాకారము, నకించిత్=కొంచెమునుగాదో, తత్=అది, పరంబ్రహ్మ=పరబ్రహ్మము అని, విదుః=పెద్దలు తెలియుదురు.

తా. మాయాశక్తివలన సముద్రమువలె బ్రహ్మమేవిజృంభించిసర్వప్రపంచ రూపమయ్యెను. అవాఙ్మానస గోచరమైనదానిని బ్రహ్మమని పెద్దలు తెలియుదురు.

" ఏకమేవాద్వయం బ్రహ్మనేహనానాస్తికించన " ౫౩

(అధర్వ ౫౨ మహానారాయణ-అ ౩)

"బ్రహ్మైవవిద్యతే సాక్షాత్ వస్తుతో౽వస్తుతో౽పిచ" ౫౪
(అథర్వ-౭౭ పాశుపతబ్రాహ్మణ.)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, ఏకమేవ = ఒక్కటియేయైనది, అద్వయం=అద్వితీయమైనది, ఇహ=ఈ బ్రహ్మమునందు, నానా=భేదప్రకారము, కించన=కొంచెమును, నాస్తి=లేదు, సాక్షాత్=ప్రత్యక్షముగ వస్తుతో౽వస్తుతో౽పిచ=సదసత్తులచేతను, బ్రహ్మైవ = బ్రహ్మమే, విద్యతే=ఉన్నది.

తా. సజాతీయ విజాతీయ స్వగతభేదములేని బ్రహ్మమున నానాత్వము కొంచెమును లేదు. సత్తనివ్యవహరించినను అసత్తనివ్యవహరించినను బ్రహ్మమేకాని యన్యము లేదు.

"తద్బ్రహ్మావిషయం బ్రహ్మ సత్యజ్ఞానసుఖాద్వయం" ౫౫
(అథర్వ-౭౦ అన్నపూర్ణ-అ-3)

"శాంతంచ తదతీతంచ పరబ్రహ్మ తదుచ్యతే" ౫౬
(కృ-య-౬3 యోగశిఖ-అ ౬)

టీ. తద్బ్రహ్మ=తత్పదలక్ష్యమైన బ్రహ్మము, విద్యావిషయం=జ్ఞానవిషయమయినది, సత్యజ్ఞానసుఖాద్వయం=సత్యజ్ఞానానంద ద్వితీయస్వరూపమయినది, శాంతంచ=శాంతమును, తదతీతంచ=శాంతమునకతీతమయినదియు, తత్పరబ్రహ్మ=ఆపరబ్రహ్మము, ఉచ్యతే= చెప్పబడుచున్నది.

తా. ఏకాదశేంద్రియములకు గోచరమగు విషయముగాక బ్రహ్మము శుద్ధబోధవిషయమయినది. బోధార్థము శాంతస్వరూపమని చెప్పబడునుగాని శాంతమున కతీతమయినది. అద్వితీయమయినది సత్యజ్ఞానసుఖస్వరూపమయినది.

"అనుభూతిపరం తస్మాత్సారం బ్రహ్మేతికథ్యతే" ౫౭
(అథర్వ-౭౦-అన్నపూర్ణ-అ-౨)

"యదిదంబ్రహ్మపుచ్ఛాఖ్యం సత్యజ్ఞానాద్వయాత్మకం" ౫౮
(కృ-య-౮3-౩౭)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, అనుభూతిపరం=అనుభవమునకు పరమయినది, తస్మాత్ =ఆహేతువువలన, సారమితి = సర్వవిలక్షణమై శేషించినదని, కథ్యతే=చెప్పబడుచున్నది. బ్రహ్మపుచ్ఛాఖ్యం=బ్రహ్మపుచ్ఛమని చెప్పబడిన, ఇదం=ఇది, యత్ =ఏదియోఅది, సత్యజ్ఞానాద్వయాత్మకం=సత్యజ్ఞానాద్వితీయస్వరూపమయినది.

తా. ఆనందమయకోశము బ్రహ్మపుచ్ఛమనబడును. బ్రహ్మమానందస్వరూపము.

"సద్రూపంపరమం బ్రహ్మ త్రిపరిచ్ఛేదవర్జితం" ౫౯
"తద్బ్రహ్మానంద మద్వంద్వం నిర్గుణం సత్యచిద్ఘనం" ౬౦
(కృ-య-౮3-౩౭)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, సద్రూపం=సత్యస్వరూపమయినది, పరమం=ఉత్కృష్టమయినది, త్రిపరిచ్ఛేదవర్జితం = దేశకాలవస్తుపరిచ్ఛేదములేనిది, తద్బ్రహ్మ=ఆబ్రహ్మము, ఆనందం=ఆనందస్వరూపమయినది, అద్వంద్వం=సుఖదుఃఖాది ద్వంద్వములులేనిది, నిర్గుణం=గుణరహితమయినది, సత్యచిద్ఘనం=సత్యజ్ఞానఘనమయినది.

తా. చెడరని సత్యజ్ఞానములుస్వరూపముగావున సత్యచిద్ఘనమనబడెను. వడగల్లు జలఘనమగు విధముననే పరబ్రహ్మము సచ్చిదానందఘనమని చెప్పబడుచున్నది. కేవల జ్ఞప్తిమాత్రమే బ్రహ్మము.

"సర్వాధిష్ఠానమద్వంద్వం పరబ్రహ్మసనాతనం" ౬౧
(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ-3, కృ-య-౮౫ శుద్రహృదయ)
"ప్రజ్ఞానమేవతద్బ్రహ్మ సత్యప్రజ్ఞానలక్షణం" ౬౨
(అధర్వ-౬౧ మహా-అ౭- కృ-య-౮౫ శుద్రహృదయ)

టీ. సర్వాధిష్ఠానం=సర్వమునకు నధిష్ఠానమైన, పరబ్రహ్మ=పరబ్రహ్మము, అద్వంద్వం=సుఖదుఃఖాది ద్వంద్వములులేనిది. సనాతనం=అనాదిసిద్ధమైనది, తద్బ్రహ్మ=ఆ బ్రహ్మము, ప్రజ్ఞానమేవ=ప్రజ్ఞానమే, సత్యప్రజ్ఞానలక్షణం=సత్యప్రజ్ఞాన స్వరూపమైనది.

తా. బ్రహ్మముసద్రూపమైనది. చిద్రూపమైనది.

" అస్తీత్యుక్తేజగత్సర్వం సద్రూపంబ్రహ్మతద్భవేత్ " ౬౩

" భాతీత్యుక్తేజగత్సర్వం భానంబ్రహ్మైవకేవలం " ౬౪

(కృ-య-౫ వరాహ)

టీ. జగత్సర్వం=సమస్తజగత్తును, అస్తీత్యుక్తే=ఉన్నదని చెప్పబడుచుండగా, తత్ సద్రూపం=ఆసద్రూపము, బ్రహ్మ = బ్రహ్మము. భవేత్ =అగును, జగత్సర్వం=సర్వజగత్తు, భాతీత్యుక్తే=ప్రకాశించుచున్నదని చెప్పబడుచుండగా, భానం=ఆప్రకాశము, కేవలం=అద్వితీయమయిన, బ్రహ్మైవ=బ్రహ్మమేయగును.

తా. అస్తియను నంశమును భాతియను నంశమును బ్రాహ్మమగును. తక్కిన నామరూపములు జగత్తగును. బ్రహ్మాంశములను విడువగ జగత్తునకు మిథ్యాత్వమే శేషించును. ప్రియము మొదటి రెండు అంశములందే యుండునుగాన నస్తిభాతిప్రియములు బ్రహ్మాంశములు, నామరూపములుజగత్తు-అస్తిభాతిప్రియములనగా సత్యజ్ఞానానందములే.

" బ్రహ్మమాత్రచిదాకాశం సచ్చిదానంద మద్వయం. " ౬౫

" బ్రహ్మణోన్యత్పరంనాస్తి బ్రహ్మణోన్యజ్జగన్నచ " ౬౬

టీ. బ్రహ్మమాత్ర చిదాకాశం = బ్రహ్మస్వరూపమైన చిదాకాశము, సచ్చిదానందం = సత్యజ్ఞానానంద స్వరూపమయినది, అద్వ

యం=అద్వితీయమైనది, బ్రహ్మణః=బ్రహ్మముకన్న, అన్యత్పరం=ఇతర మైనదొకటి, నాస్తి=లేదు, బ్రహ్మణః=బ్రహ్మముకన్న, అన్యత్=ఇతర మైన, జగత్=జగత్తును, న=లేదు.

తా. సత్యజ్ఞానానందస్వరూపమయిన బ్రహ్మమున కితరమ యినది యనృతదుఃఖస్వరూపమయినదిగావున లేనిదగును.

" బ్రహ్మణోన్యదహం నాస్తి బ్రహ్మణోన్యత్ఫలం నహి" ౬౭

" బ్రహ్మణోన్యత్తృణం నాస్తి బ్రహ్మణోన్యత్పదం నహి" ౬౮

(కృ-య-౩౭ తేజోబిందు)

టీ. బ్రహ్మణః=బ్రహ్మముకన్న, అన్యత్=ఇతరమయిన, అహం=అహంవృత్తియయిన బుద్ధి, నాస్తి=లేదు, బ్రహ్మణః=బ్రహ్మముకన్న, అన్యత్=ఇతరమయిన, ఫలం=ఫలము, నహి=లేదు, బ్రహ్మమును తెలిసికొనుటతప్ప ఇతరకార్యములజేసిన ఫలములేదు. బ్రహ్మణః=బ్రహ్మముకన్న, అన్యత్=ఇతరము, తృణం=తృణమయినను, నాస్తి=లేదు, బ్రహ్మణః=బ్రహ్మముకన్న, అన్యత్=ఇతరమయిన, పదం=స్థానము, (గతి) నహి=లేదు.

తా. బ్రహ్మముకన్న నితరమయినగతి లేదు. బ్రహ్మేతరమయి నది తృణమయినను లేదని భావము.

" బ్రహ్మణోన్యోగురుర్నాస్తి బ్రహ్మణోన్యదసద్వపుః" ౬౯
" నిత్యానందమయం బ్రహ్మ కేవలం సర్వదా స్వయం" ౭౦

(కృ-య-౩౭ తేజోబిందు)

టీ. బ్రహ్మణః=బ్రహ్మముకన్న, అన్యః=ఇతరుడైన, గురుః=గురువు, నాస్తి=లేదు, బ్రహ్మణః=బ్రహ్మముకన్న, అన్యత్=ఇతరమయిన, వపుః=శరీరము, అసత్=లేనిదే, బ్రహ్మ=బ్రహ్మము, నిత్యా

నందమయం=నిత్యానందస్వరూపమయినది, కేవలం=అద్వితీయమయి
నది, సర్వదా=ఎప్పుడును, స్వయం=తానుతక్క నితరములేనిది, స్వ
తంత్రమయినది.

తా. ఇతరాధారములేక బ్రహ్మము స్వయముగా నుండును.

" బీజమాయావినుర్ముక్తం పరం బ్రహ్మేతికథ్యతే " ౨౧

" సద్రూపమద్వయంబ్రహ్మ ఆదిమధ్యాంతవర్జితం" ౨౨
(సామ-౫౬ వాసుదేవ)

టీ. బీజమాయా=మూలప్రకృతినుండి, వినుర్ముక్తం=విడువబ
డినది, ఇతి=ఇట్లని, పరబ్రహ్మ=పరబ్రహ్మము, కథ్యతే=చెప్పబడుచు
న్నది, బ్రహ్మ=బ్రహ్మము, సద్రూపం=సద్రూపము, అద్వయం=అద్వి
తీయమయినది, ఆదిమధ్యాంతవర్జితం=ఆదిమధ్యాంతములులేనిది.

తా. మూలప్రకృతిలేని శుద్ధచైతన్యము పరబ్రహ్మమనబడును.
బ్రహ్మమున కుత్పత్తివినాశములులేవు.

" సర్వత్రావస్థితంశాంతం చిద్బ్రహ్మేత్యభిధీయతే " ౨౩
(అథర్వ-౨౦ అన్నపూర్ణ-౮౫)

" సిద్ధాంతో ధ్యాత్మశాస్త్రాణాం సర్వాపహ్నవఏవహి. " ౨౪
(అథర్వ-౨౦ అన్నపూర్ణ-౮౫)

టీ. సర్వత్ర=అంతట, అవస్థితం=ఉన్నది, శాంతం=శాంతమై
నది, చిద్బ్రహ్మ=చిద్రూపమైన బ్రహ్మము, ఇతి=అని, అభిధీయతే=
చెప్పబడుచున్నది. అధ్యాత్మశాస్త్రాణాం=వేదాంతశాస్త్రములయొక్క,
సిద్ధాంతం=సిద్ధాంతము, సర్వాపహ్నవఏవహి=సమస్తమునుమిథ్యయని
నిషేధించుటయే.

తా. బ్రహ్మసూత్రములు మొదలైన వేదాంతశాస్త్రముల
యొక్క సిద్ధాంతము, బ్రహ్మముదక్క నితరమైనది మిథ్యయని నిషే

ధించుటయే యగును. జగజ్జీవేశ్వరాదికము మిథ్యయనుటయే వేదాన్తసిద్ధాంతము.

"నావిద్యాస్తీహనోమాయా శాంతంబ్రహ్మేదమక్లమః" ౭౫
(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ ౫)

"స్వాత్మన్యారోపితా శేషా భానవస్తునిరాసతః" ౭౬
(అధర్వ-23 అధ్యాత్మ)

టీ. స్వాత్మని=పరమాత్మయందు, ఆరోపితః=కల్పింపబడిన, అశేష=సమస్తమయిన, ఆభాసవస్తు=మిథ్యారూపములయిన వస్తువుల యొక్క, నిరాసతః=నిరాకరణమువలన, ఇహ=ఈబ్రహ్మమునందు, నోమాయా=మాయలేదు, అవిద్యా=అవిద్యయును, నాస్తి=లేదు, ఇదంబ్రహ్మ=ఈబ్రహ్మము, శాంతం=శాంతస్వరూపమైనది, అక్లమం=శ్రమములేనిది.

తా. బ్రహ్మమునందు మాయచే గల్పింపబడి కార్యరూపములైన సమస్తపదార్థములను నిరాకరించుటవలన వానికిగారణమైనమాయయును నశించును. ఆహేతువుచే నవిద్యలేదు. మాయలేదు. త్రాడునందు భ్రాంతిచే గల్పింపబడిన పాము మిథ్యయని తోచగానే దానికి కారణమైన భ్రాంతియును మరికొంతసేపునకు నశించునట్లు కార్యమైన జగద్భావము జీవభావము నశింపగ కారణమైన మాయావిద్యాస్వరూపమును నశించును.

"స్వయమేవపరంబ్రహ్మ పూర్ణమద్వయమక్రియం" ౭౭
(అధర్వ-23-అధ్యాత్మ)

టీ. పరంబ్రహ్మ=పరబ్రహ్మము, స్వయమేవ = తానుగనేయున్నది, పూర్ణం=పరిపూర్ణమయినది, అద్వయం = అద్వితీయమయినది, అక్రియం=క్రియలేనిది.

తా. స్పష్టము.

" రామఏవపరంబ్రహ్మ రామఏవపరంతపః " ౭౮
" రామఏవపరంతత్త్వం శ్రీరామోబ్రహ్మతారకం " ౭౯
(అధర్వ-౫౭ రామరహస్య.)

టీ. రామఏవ=రాముడే, పరంబ్రహ్మ=పరబ్రహ్మము, రామఏవ=రాముడే, పరంతపః= పరంతపుడు, రామఏవ=రాముడే, పరంతత్త్వం=పరతత్త్వము, శ్రీరామః=శ్రీరాముడే, బ్రహ్మతారకం=తారకబ్రహ్మము.

తా. శ్రీరామ బ్రహ్మలకభేధా ధ్యవసాయముచేసి బ్రహ్మస్వరూపునిగ రాముని నీవాక్యమున వర్ణించిరి. వృష్ణీనాంవాసుదేవోస్మి, పాండవానాం ధనంజయః, అనిగీతలందు (౧౦-౩౭) చెప్పబడియున్నది. రామోస్మిధనుర్భృతామని గీతలందు శ్రీకృష్ణభగవానులు చెప్పినందున రాజులలో ధనుర్ధరులలో శ్రీరాములు పరబ్రహ్మస్వరూపులని యాశయము. యద్యద్విభూతి మత్సత్త్వమని (౧౦-౪౧) చెప్పుటవలన శ్రీరాములు పరబ్రహ్మమే.

" చిద్రూపమాత్రంబ్రహ్మైవ సచ్చిదానందమద్వయం " ౮౦
(కృష్ణ-౩౭ తేజోబిందు అ-౩)

" ఋతంసత్యంపరంబ్రహ్మ సర్వసంసారభేషజం " ౮౧
(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ౫- సామ-౯౦ దర్శన)

టీ. బ్రహ్మైవ=బ్రహ్మమే, చిద్రూపమాత్రం=చిద్రూపమైనది, సచ్చిదానందం=సత్యజ్ఞానానంద స్వరూపమైనది, అద్వయం=అద్వితీయమైనది, ఋతం=వ్యావహారికమును, సత్యం=పారమార్థికమును, సర్వసంసారభేషజం=సంసారమను రోగమున కౌషధమునైనది, పరంబ్రహ్మ=బ్రహ్మమే.

తా. వ్యవహారదశయందు యథార్థమయినది ఋతమనబడును.

పారమార్థికము సత్యమనబడును. ఈయుభయమును బ్రహ్మస్వరూపమే, బ్రహ్మమేసత్యజ్ఞానానంద రూపమయినది.

" బ్రహ్మచిద్బ్రహ్మభువనం బ్రహ్మభూతపరంపరాః ౮-౨
" బ్రహ్మాహంబ్రహ్మచిచ్ఛత్రుద్బ్రహ్మచిన్మాత్రబాంధవాః" ౮-౩
(అథర్వ-౭౦ అన్నపూర్ణ-అ-౫)

టీ. బ్రహ్మ=బ్రహ్మమే, చిత్ =జ్ఞానము, బ్రహ్మ=బ్రహ్మమే, భువనం=లోకము, బ్రహ్మ=బ్రహ్మమే, భూతపరంపరా=భూతసముదాయము, బ్రహ్మ=బ్రహ్మమే; అహం=నేను, బ్రహ్మ=బ్రహ్మమే, చిత్ =చిత్తు, శత్రుః=శత్రువు, బ్రహ్మ=బ్రహ్మమే, చిన్మాత్రబాంధవాః=చిద్రూపబంధువులు.

తా. స్పష్టము.

" బ్రహ్మరూపతయాబ్రహ్మ కేవలంప్రతిభాసతే " ౮-౪
" జగద్రూపం తథాప్యేత ద్బ్రహ్మైవప్రతిభాసతే " ౮-౫
(అథర్వ-౭౬-ఆత్మ)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, బ్రహ్మరూపతయా=బ్రహ్మరూపముచేతనే, కేవలం=అద్వితీయముయి, ప్రతిభాసతే=ప్రకాశించుచున్నది, తథాపి=అట్లే, ఏతజ్జగద్రూపం=ఈజగద్రూపమున, బ్రహ్మైవ=బ్రహ్మమే, (ప్రతిభాసతే=ప్రకాశించుచున్నది.)

తా. బ్రహ్మము బ్రహ్మరూపముగనే ప్రకాశించును. దానికదియే యుపమానముగాని యన్యములేదు. వివర్తమై జగద్రూపముగ బ్రహ్మమే ప్రకాశించుచున్నది. అన్యమేమియునులేదు.

" విద్యావిద్యాదిభేదేన భావాభావాదిభేదతః " *
" గురుశిష్యాదిభేదేన బ్రహ్మైవప్రతిభాసతే " ౮-౬
(అథర్వ-౭౬ ఆత్మ)

* ఈవాక్యమందు బ్రహ్మశబ్దము లేదు. కాబట్టి బ్రహ్మస్వరూప వాక్యముగ గ్రహించుటకు వీలు లేదని తోస్తుంది. పైగా నొకటివిడిస్తే నేతప్ప ఈప్రకరణమందు ౯౩ వాక్యములు కావు. దీనినికూడ లెక్కించిన ౯౪ వాక్యములు అవుతవి. మొట్టుమొత్తమున ౧౦౦౯ వాక్యములు అవుతవి. అట్లవుట మహావాక్యసంఖ్యానియమవిరుద్ధము. మహావాక్యసంఖ్య (౧౦౦౮) అష్టోత్తరసహస్రముఅని సుప్రసిద్ధమే. పైచెప్పినప్రకారముతప్పమరియొకపద్ధతిగా సంఖ్యనుతగ్గించుటకు వీలు కనపడలేదు. కాబట్టి ఈవిధముగ తగ్గించి లెక్కించడమైనది. పెద్దలు మరివకవిధమున తగ్గించిన సమ్మతమే. ఏవిధముననైన తగ్గించక మాత్రము తప్పదు.

టీ. విద్యావిద్యాదిభేదేన=విద్యావిద్యాది భేదమునను, భావాభావాది భేదతః = విషయనిర్విషయ భేదముచేతను, గురుశిష్యాది భేదేన=గురుశిష్యాది భేదమునను, బ్రహ్మైవ = బ్రహ్మమే, ప్రతిభాసతే= ప్రకాశించు చున్నది.

తా. విద్యాయోగమున గురురూపమునను అవిద్యాయోగమున శిష్యరూపమునను విషయయోగమున రాగిగను నిర్విషయయోగమున విరాగిగను నిట్లే సజ్జన దుర్జన రూపముగ నుపాధులను బట్టి చిద్రూపమైన బ్రహ్మమే ప్రకాశించును. చిద్యోగమున త్రిగుణాత్మకమయిన ప్రకృతి నే గుణభేదమున చైతన్యము వహించి యాయా రూపములుగ పరిణమించుచున్నది. మంచిచెడ్డలకు ప్రకృతి హేతువు. చైతన్యమున వ్యవహరించుటకు చిత్తు హేతువు.

"ఇదంబ్రహ్మపరంబ్రహ్మ సత్యంబ్రహ్మప్రభుర్హినః" ౫౭
"కాలోబ్రహ్మకళా బ్రహ్మ సుఖంబ్రహ్మస్వయంప్రభం" ౫౫
(కృ-య-౩౭ తేజోబిందు-అ ౬)

టీ. ఇదం=ఈలోకము, బ్రహ్మ=బ్రహ్మము, పరం=పరలోకము, బ్రహ్మ=బ్రహ్మము, సత్యం=సత్యము, బ్రహ్మ = బ్రహ్మము, సః=ఆబ్ర

స్వరూపమగు నాత్మయే, ప్రభుహి=ఈశ్వరుడు, కాలః=కాలము, బ్రహ్మ=బ్రహ్మము, కళా=షోడశకళాస్వరూపము, బ్రహ్మ=బ్రహ్మము సుఖం=సుఖము, బ్రహ్మ=బ్రహ్మము, స్వయంప్రభం=స్వప్రకాశస్వరూపమైనది.

తా. సమస్తము బ్రహ్మమని యభిప్రాయము.

"ఏకంబ్రహ్మాద్వయం బ్రహ్మమహాబ్రహ్మశమాదికం" ౮౯
" దోషోబ్రహ్మగుణోబ్రహ్మ దమశ్శాంతం విభుఃప్రభుః " ౯౦
(కృ-య-3౭ తేజోబిందు. అ ౬)

టీ. బ్రహ్మ=బ్రహ్మము, ఏకం=సజాతీయ విజాతీయస్వగతభేదములేనిది, బ్రహ్మ=బ్రహ్మము, అద్వయం=అద్వితీయమయినది, శమాదికం=శమాదిషట్క సంపత్తియు, దోషః=దోషమును, గుణః = గుణమును, దమః = బాహ్యేంద్రియ నిగ్రహమును, శాంతః = అంతరింద్రియ నిగ్రహమును, విభుః=తత్త్వావధారణ సమర్థుడును, ప్రభుః=ప్రభువును, బ్రహ్మ=బ్రహ్మమే.

తా. శమము, దమము, తితిక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము, ఇది శమాది షట్కసంపత్తి గుణదోషస్వరూపమైన సమస్తమునకు బ్రహ్మమే యధిష్ఠానమని తాత్పర్యము.

" లోకోబ్రహ్మగురుర్బ్రహ్మ శిష్యోబ్రహ్మసదాశివః " ౯౧
" పూర్వంబ్రహ్మపరంబ్రహ్మ శుద్ధంబ్రహ్మశుభాశుభం " ౯౨
(కృ-య-3౭ తేజోబిందు-అ౬)

టీ. లోకః=మనుష్యుడు, బ్రహ్మ=బ్రహ్మము, గురుః=గురువు, బ్రహ్మ=బ్రహ్మము, శిష్యః = శిష్యుడును, సదాశివః = సదాశివుడును, బ్రహ్మ=బ్రహ్మము, పూర్వం=పూర్వము, బ్రహ్మ=బ్రహ్మము, పరం=పరమును, బ్రహ్మ=బ్రహ్మము, శుద్ధం=శుద్ధచైతన్యమును, శుభాశుభం=శుభాశుభస్వరూపమును, బ్రహ్మ=బ్రహ్మమే.

తా. సర్వము బ్రహ్మమే, చైతన్యము శుద్ధ చైతన్యమనియు, నీశ్వరచైతన్యమనియు, జీవచైతన్యమనియు, ప్రమాతృచైతన్యమనియు ప్రమాణచైతన్యమనియు, ప్రమేయచైతన్యమనియు, ఫలచైతన్యమనియు నేడు విధములుగనుండును. శుద్ధముగాక తక్కిన యారును బ్రహ్మమునకు, నుపాధిభేదమువలన గలిగినవి. మాయోపాధిగల చైతన్యము ఈశ్వరచైతన్యము. అవిద్యోపాధిగల చైతన్యము జీవచైతన్యము. బుద్ధితోఁగూడిన కూటస్థచైతన్యము ప్రమాతృచైతన్యము. మనోవృత్తితోఁగూడిన కూటస్థచైతన్యము ప్రమాణచైతన్యము, విషయములందు తెలియబడని చైతన్యము ప్రమేయచైతన్యము, వానియందు తెలియబడుచైతన్యము ఫలచైతన్యము, సకలోపాధి వినిర్ముక్తమగు చైతన్యము శుద్ధచైతన్యము (శుద్ధబ్రహ్మము)

" జీవఏవసదాబ్రహ్మ స్వయం బ్రహ్మసనాతనః " ౯౩

(శు-య-౩౭ తేజోబిందు. అ౬)

టీ. జీవఏవ=జీవుడే, సదా=ఎల్లపుడు, బ్రహ్మ=బ్రహ్మమయియున్నాడు, స్వయం=తాను, సనాతనః=అనాదిసిద్ధమైనవాడు. (ఉత్పత్తిలేనివాడు) బ్రహ్మ=బ్రహ్మము.

తా. త్రాడునందు భ్రాంతిచే దోఁచినపాము భ్రాంతికి పూర్వమునను భ్రాంతికాలమందును భ్రాంతికితరువాతను వాస్తవముగ పాముగాక యెట్లుత్రాడై యున్నదో యట్లేమిథ్యయై మాయచే గల్పింపబడిన జీవుడు త్రికాలములందును బ్రహ్మముగ వాస్తవమున నున్నవాడు. ఇక్కడ మాయయనగా మాయాభేదమైన యవిద్యయని తెలియవలయును. తానే బ్రహ్మమని ముఖ్యాశయము.

ఇతి సార్థాంతికబ్రహ్మ స్వరూపవాక్యానిత్రినవతిః

ఇట్లు సార్థాంతికబ్రహ్మ స్వరూపవాక్యములు తొంబదిమూడు.

ఇతి సప్తదశ ప్రకరణం సమాప్తము.

ఇట్లు పదునేడవ ప్రకరణము సమాప్తము.

శ్రీ

సద్గురవేనమః.

# ౧౭ అవశిష్టస్వరూప వాక్యములు.

" సర్వవిశేషం నేతినేతీతివిహాయయదవశిష్యతే తదద్వయం బ్రహ్మ " ౧

(శు-య-౫౩ అద్వయతారక)

టీ. సర్వవిశేషం=సమస్తదృశ్యపదార్థమును, నేతినేతీతి=నేతినేతియని (ఇదికాదిదికాదని నేతినేతివాక్యములచే) విహాయ=విడిచి (విడువగా) యత్=ఏది, అవశిష్యతే=శేషించుచున్నదో, తత్=అది, అద్వయం=అద్వితీయమైన, బ్రహ్మ=బ్రహ్మము.

తా. ఏకాదశేంద్రియములచేతను యుక్తులచేతను శాస్త్రముచేతను తెలియబడు సమస్తదృశ్యములను, ఇది బ్రహ్మముకాదిది బ్రహ్మముకాదని నిషేధింపగా మనోవాక్కులకందక యేది శేషించునో యేది శేషించినదానినుండి మనోవాక్కులు మరలుచున్నవో యది యే యద్వితీయమైన బ్రహ్మము. బ్రహ్మమును దెలియుట కిచ్ఛగింపనందాక మదించిన ఏనుగువలె మనస్సు తనపూర్ణప్రభతో సర్వజ్ఞత్వమభినయించి చరించుచు సర్వమును నిషేధించును. బ్రహ్మమునెరుంగుట కిచ్ఛగించునపుడు సింహమును చూచిన ఏనుగువలెను పట్టపగటి యెండలో దీపమువలెను తనవికారమడగగ బ్రహ్మతేజస్సు కనుగొనలేక నిశ్చలమైయుండును. ఎక్కడమనస్సు తనచాంచల్యము మాని నిశ్చలమగుచున్నదో అక్కడనే బ్రహ్మమున్నది. అప్పుడు తానుబ్రహ్మమగుచున్నాడు.

" జీవభావజగద్భావబాధేప్రత్యగభిన్నంబ్రహ్మైవావశిష్యతే" ౨

(శు-య-౫౯ పైంగల)

టీ. జీవభావ=జీవత్వమునకును, జగద్భావ=జగద్భావమునకు ను, బాధితే=బాధకలుగుచుండగా, ప్రత్యగభిన్నం=ప్రత్యగాత్మకన్న వేరుగాని, బ్రహ్మైవ=బ్రహ్మమే, అవశిష్యతే=శేషించుచున్నది.

తా. మేఘావరణ నశింపగ నదివరకున్న సూర్యబింబము స్పష్టముగ ప్రకాశించువిధమున బ్రహ్మమున కల్పింపబడిన మాయాకార్యమైన జగజ్జీవేశ్వరాదిభేదము నశించుచుండగా బ్రహ్మము శేషించి ప్రకాశించుచుండును.

" పూర్ణమదఃపూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే" ౩
" పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే " ౪
(శు-య-౧౦ బృహదారణ్యక-అ ౭)

టీ. అదః=పరోక్షముగనున్నదియు, పూర్ణం=బ్రహ్మముచేపూర్ణమయినది, ఇదం=ప్రత్యక్షముగనున్నదియు, పూర్ణం=బ్రహ్మముచే పూర్ణమయినదియు, పూర్ణాత్=పూర్ణముకన్న, (పూర్ణముగానున్నదని యూహించబడిన జగత్తుకన్న) పూర్ణం=పరిపూర్ణమయిన బ్రహ్మము, ఉదచ్యతే=అతిక్రమించుచున్నది, పూర్ణస్య=పూర్ణమైనబ్రహ్మముయొక్క, పూర్ణం=పూర్ణమును, అహంబ్రహ్మాస్మియను భావమును, ఆదాయ=గ్రహించి, (పొంది) పూర్ణమేవ=అసంగమైన కూటస్థస్వరూపబ్రహ్మమే, అవశిష్యతే=శేషించుచున్నది.

తా. సమస్తము పరిపూర్ణమైన బ్రహ్మమే ఒకపాదమునుండి పూర్ణముగనున్నట్లు గనబడు మాయాకార్యమైన జగత్తు నతిక్రమించుచు బ్రహ్మము పరిపూర్ణముగనున్నది. ఉపాధులు నశింపగ కూటస్థచైతన్యమే పరిపూర్ణబ్రహ్మమై శేషించుచున్నది.

" కార్యోపాధిరయం జీవః కారణోపాధి రీశ్వరః " ౫
" కార్యకారణతాం హిత్వా పూర్ణబోధోవశిష్యతే " ౬
(కృ-య-౩౫-శుకరహస్య)

" ఖేదోల్లాసవిలాసేషు స్వాత్మకర్తృతయానయా ” ౧౩
" స్వసంకల్పే క్షయం యాతే సమతైవావశిష్యతే ” ౧౪

(సామ-౬౧ మహా-అ-౬)

టీ. ఖేదోల్లాసవిలాసేషు=దుఃఖసంతోషవిలాసములందు, అనయా=ఈ, స్వాత్మకర్తృతయా=ప్రయత్నరూపమైన తనకర్తృత్వముచేతను, స్వసంకల్పే=తనసంకల్పము, క్షయంయాతే=నాశనమునొందుచుండగా, సమతైవ=సమత్వమైన బ్రహ్మమే,అవశిష్యతే=శేషించుచున్నది.

తా. సుఖదుఃఖాదిభేదములచే నానావిధములైన సంకల్పములను నభ్యాసరూపమగు తనప్రయత్నముచే నశింపజేయగా సమత్వమైన బ్రహ్మమే శేషించును. (అభ్యాసవైరాగ్యాభ్యాంతన్నిరోధః)అను యోగసూత్రముచొప్పున నభ్యాసవైరాగ్యములసంకల్పమునశించును.

" సమతాసర్వభావేషు యాసౌసత్యవరాస్థితిః ” ౧౫

(సామ-౬౧ మహా-అ ౬)

" పరమామృతనామ్నీ సాసమతైవావశిష్యతే. ” ౧౬

(సామ-౬౧ మహా-అ-౪-౬.)

టీ. సర్వభావేషు=సమస్తవిషయములందును, యాసమతా=ఏసమత్వముగలదో, అసౌ=ఈసమత్వము, సత్యవరాస్థితిః=శ్రేష్ఠమైన సత్యస్థితి, సా=ఆసమత్వమయిన-యాసత్యస్థితి, పరమామృతనామ్నీ=పరమామృతయని పేరుగలది, సమతైవ=ఆసమత్వరూపమైనబ్రహ్మమే, అవశిష్యతే=శేషించుచున్నది.

తా. సమస్తవిషయములందు సమభావము గలిగియుండవలెను. ఆసమభావమే సత్యమైన స్థితి. ఆసమభావము సత్యమైనది. సమభావమనగా రాగద్వేషములు లేకుండుట. అట్టిసమత్వమే శేషించును. అదియే బ్రహ్మము. శేషించుట యనగా సమస్తము నశించుచుండగా నిత్యమై ఈవస్తువుండుట.

" కాలత్రయముపేక్షిత్రాః హీనాయాశ్చైత్యబంధనైః " ౧౭
" చితశ్చైత్యముపేక్షిత్రాః స్సమత్వైవావశిష్యతే. " ౧౮
(సామ-౬౫-సన్యాస.)

టీ. కాలత్రయముపేక్షిత్రాః=మూఁడుకాలముల నపేక్షించునట్టియు, చైత్యబంధనైః=చిత్తవృత్తు లనుబంధములచే, హీనాయాః=హీనమైనట్టియు (చిత్తవృత్తులు లేనట్టియు) చైత్యముపేక్షిత్రాః = చిత్తవృత్తి నుపేక్షించునట్టియు, చితః=చిత్తుయొక్క, సమత్వైవ=సమత్వమే, అవశిష్యతే= శేషించుచున్నది.

తా. దేహేంద్రియ వృత్తులు మంచివైనను చెడ్డవైనను వాని నే వికారములు బొందక చిద్వస్తువు సమముగా తెలిసికొనుచున్నది. మంచివృత్తుల నెరుగునపుడు వికసింపలేదు. దుర్వృత్తుల నెరుగనపుడు క్షీణించలేదు. కావున సమముగా నెరుగుచున్నదని తెలియవలయును. ఆచిద్వస్తువు మూఁడుకాలముల నపేక్షింపక చిత్తవృత్తులు లేక చిత్తవృత్తుల నపేక్షింపక స్వయముగ సత్యమై ప్రకాశించుచున్నది. సమత్వము గలిగిన ఆచిత్తే శేషించుచున్నది.

" సాహి వాచామగమ్యత్వా దసత్తామివ శాశ్వతీం. " ౧౯
" నైరాత్మ్యసిద్ధాంత దశాముపయాతేవశిష్యతే. " ౨౦
(సామ-౬౫ సన్యాస.)

టీ. సా=ఆసమత్వము, వాచాం= వాక్కులకు, అగమ్యత్వాత్ = అగమ్యమగుటవలన, శాశ్వతీం=శాశ్వతమైన, నైరాత్మ్యసిద్ధాంత దశాం = ఆత్మయున్నదని చెప్పుట కవకాశములేని స్థితిని, అసత్తాం=అసత్తునుపొందినట్లు, ఉపయాతే=పొందుచున్నది, అవశిష్యతే= శేషించుచున్నది.

తా. అసత్యమైన యాస్థితి వాగాదీంద్రియముల కగోచరమైనందున నితరదృశ్యములుగాని యితరజ్ఞానములుగాని లేనందున

శూన్యమువలె నాత్మలేనిస్థితి యట్లుండునుగాని వాస్తవమున నాస్థితి శేషించుచున్నది.

" యావద్యావన్మునిశ్రేష్ఠ స్వయంసంత్యజ్యతేఖిలం. " ౨౧

" తావత్తావత్పరోలోకః పరమాత్మైవశిష్యతే. " ౨౨

(అధర్వ-౭౦ అన్నపూర్ణ.)

టీ. మునిశ్రేష్ఠ=ఓనిదాఘుడ, యావద్యావత్ = ఎంతయెంత వరకు, స్వయం=తాను, అఖిలం=సమస్తమును, సంత్యజ్యతే= విడుచుచున్నాడో, తావత్తావత్ =అంతయంతవరకు, పరమాత్మైవ=పరమాత్మయే, అవశిష్యతే- శేషించుచున్నది, లోకః=అట్లెరిగిన మనుష్యుడు, పరః=శ్రేష్ఠుడు.

తా. దృశ్యరూపమే యాత్మయను నితరసిద్ధాంతముల నొకదాని తరువాత నొకదానిని విడువవచ్చును. అట్లు వానిని విడుచుచుండగ నద్వైతసిద్ధాంతోక్తమయిన నిర్గుణబ్రహ్మము విడుచుట కశక్యమై శేషించియుండును. ఇట్లు ఉభయసిద్ధాంతముల నెరిగినవాడే శ్రేష్ఠుడు. అన్నమయకోశమగు స్థూలదేహమే యాత్మయను చార్వాకసిద్ధాంతము. స్థూలదేహము దృశ్యమగుటను స్వప్నావస్థలలో లేకుండుట తెలియుటవలనను విడువవచ్చును. అట్లు వానిని విడుచుచుండగ నద్వైతసిద్ధాంతోక్తమయిన నిర్గుణబ్రహ్మము విడుచుట కశక్యమై శేషించియుండును. ఇట్లే ప్రాణమనో విజ్ఞానానందాదులు ఆత్మయను సిద్ధాంతము విడుచుచుండగా నిర్విశేష బ్రహ్మముమాత్రము శేషించియుండును. అన్వయ వ్యతిరేకములచే దెలియవచ్చును. అన్వయమనగా సర్వావస్థలందును విడుచుటకు శక్యముగాక ప్రకాశించుచుండుట. వ్యతిరేకమనగా నొక యవస్థయందుండి మఱియొక యవస్థయందు లేకుండుట, స్థూలదేహము జాగ్రదవస్థయందుండుట యన్వయము. స్వప్నావస్థయందు లేకుండుట వ్యతిరేకము. లింగదేహము (మనస్సు) స్వప్నములోనుండుట యన్వయము, సుషుప్తిలో లేకుండుట

వ్యతిరేకము. కారణశరీరము, (అవిద్య) సుషుప్తియందున్నది. సమాధియందులేదు. ఇట్లు నిర్విశేషబ్రహ్మావరణములైన చార్వాకబౌద్ధ ప్రాభాకరాది సిద్ధాంతములను విడుచుచుండగా నవస్థాత్రయ సాక్షియై సత్యజ్ఞానానంత స్వరూపమై భేదత్రయ రహితమైన యద్వైతసిద్ధాంతోక్త బ్రహ్మము విడువబడక శేషించియుండును. అట్లెరిగినవాడే బ్రహ్మవిదుడు.

" అభ్యాసేనపరిస్పందే ప్రాణానాం క్షయమాగతే " ౨౩

" మనఃప్రశమమాయాతి నిర్వాణమవశిష్యతే " ౨౪

(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ ౨)

టీ. అభ్యాసేన=ధ్యానయోగాభ్యాసముచే, ప్రాణానాం=ప్రాణములయొక్క, పరిస్పందే=చలనము, క్షయమాగతే=క్షయమగుచుండగా, మనః=మనస్సు, ప్రశమం=ప్రశాంతమును, ఆయాతి=పొందుచున్నది, నిర్వాణం=మోక్షరూపమైనసుఖము, అవశిష్యతే=శేషించుచు

తా. దృఢధ్యానమునగాని ప్రాణాయామమునగాని వాయువు చలింపక కుంభకస్థితినుండగ మనస్సు శాంతమునొందును. నిర్వాణము శేషించియుండును. ప్రాణాయామమున నుచ్ఛ్వాసనిశ్వాసములు లేక వాయువు నిలుచును. ధ్యానమున ధ్యేయముదక్క నితరము గోచరముకాదు. కనుక శ్వాసములు వచ్చుచున్నవానియెడ స్ఫురణయుండదు. సుషుప్తిస్థితివలెనే యుండును. సుషుప్తియందు శ్వాసములు వచ్చుచున్నవి వచ్చుచున్నట్లు తెలియుటలేదు. ధ్యానమునను నట్లేయుండగా మనస్సు శాంతించును. నిర్వాణమై బ్రహ్మము శేషించును. సుషుప్తియందు ధ్యేయముగాక యజ్ఞానము శేషించుటచే ధ్యానమునకును సుషుప్తికిని భేదముగలదని తెలియవలయును.

" జ్ఞేయవస్తుపరిత్యాగే విలయం యాతిమానసం " ౨౫

" మానసేవిలయం యాతే కైవల్యమవశిష్యతే" ౨౮

(అధర్వ-౫౭ శాండిల్య)

టీ. జ్ఞేయవస్తుపరిత్యాగే=దృశ్యత్యాగమున, (విషయము న వలంబింపనపుడు) మానసం=మనస్సు, విలయం=నాశమును, యాతి= పొందుచున్నది, మానసే=మానసము, విలయంయాతే=లయమునొం దుచుండగ, కైవల్యం= కేవలత్వమే, అవశిష్యతే=శేషించుచున్నది.

తా. విషయము నవలంబింపనపుడు సంకల్పరహితమయిన మ నస్సు నశించును. మనోజృంభణము లేనపుడు కేవలప్రత్యగాత్మయే శేషించును.

" యతోవాచోనివర్తంతే వికల్పకలనాన్వితాః " ౨౮

" వికల్పసంక్షయాజ్జంతోః పదంతదవశిష్యతే " ౨౯

(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ ౨)

టీ. యతః=ఏబ్రహ్మమునుండి, వికల్పకలనాన్వితాః=అంతరత్వ ముగలిగిన, వాచః=వాగాదింద్రియములు, నివర్తంతే (బ్రహ్మము నె రుంగలేక) మరలుచున్నవో (ఆకారణమువలన)జంతోః=జంతువునకు, వికల్పసంక్షయాత్ =వాగ్వికల్పనాశమున, తత్పదం=బ్రహ్మపదము, అ వశిష్యతే=శేషించుచున్నది.

తా. నిర్వికల్పములుకాని మనోవాక్కులు బ్రహ్మము నెరుంగ ప్రయత్నించి యెరుగలేక నిర్వికల్పబ్రహ్మమునుండి మరలుచున్నవి. వికల్పములైన మనోవాక్కులు నశింప బ్రహ్మము నిర్వికల్పముగాన శే షించును. ఒకప్పుడుండి యొకప్పుడు లేకుండుట వికల్పము.

" చిద్వ్యోమైవకిలాస్తీహ పరాపర వివర్జితం " ౨౯

" సర్వత్రాసంభవాచ్చైత్యం యత్కల్పాంతేవశిష్యతే" ౩౦

(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ ౫)

టీ. ఇహ=ఈజగమునందు, కల్పాంతే=కల్పాంతమునందు యచ్చైతన్యం=ఏచిత్తవ్యాపారము,సర్వత్ర=అంతట, అసంభవాత్ = సంభవింపమివలన, పరాపరవివర్జితః=జీవేశ్వరవ్యవహారములేని, చిద్వ్యోమైవ=చిదాకాశమే, అస్తికిల=ఉన్నదిగదా, అవశిష్యతే=చిదాకాశమే శేషించుచున్నది.

తా. వికల్పమైన చిత్తవృత్తి కల్పాంతమందు (సుషుప్తియందు) నశించుచుండగా జగజ్జీవేశ్వరాది భేదములేని చిదాకాశమే నిర్వికల్పమై శేషించుచున్నది.

"పంచరూపపరిత్యాగా దర్వరూపప్రహాణతః" ౩౧

"అధిష్ఠానంపరంతత్వమేకం సచ్ఛిష్యతేమహత్" ౩౨

(ఋ–౧౦౭ బహ్వృచ.)

టీ. పంచరూప పరిత్యాగాత్=బ్రహ్మవిష్ణు మహేశ్వర రుద్ర సదాశివరూపములను పరిత్యజించుట వలనను, అర్వరూపప్రహాణతః= అర్వరూపనాశము వలనను, అధిష్ఠానం=జగత్తున కాధారమగు, పరం తత్త్వం=పరతత్వమైన, ఏకం=అద్వితీయమయిన, మహత్ = గొప్పదియగు, సత్=సద్వస్తువు, శిష్యతే=శేషించుచున్నది.

తా. అర్వమనగ పంచభూతములును వానికార్యమైన జగత్తును, నామరూపాత్మకమైనది, (సృష్టి) యెట్లుగలిగినో యట్లే నశింప సద్వస్తువైన బ్రహ్మమే, శేషించుచున్నది. మనోజృంభణము నశింపగ సాక్షియైన ప్రత్యగాత్మ కేవలుడై యున్నట్లు మాయాజృంభణము నశింపజగదధిష్ఠానమైన సద్వస్తువు కేవలమై ప్రకాశించును. మనోజృంభణరాహిత్యే యథాసాక్షి నిరాకులః మాయాజృంభణరాహిత్యేస త్తథైవ నిరాకులం అని విద్యారణ్యవచనము గలదు. బ్రహ్మమే యొకవ్యష్టిస్థూల లింగాత్మకమయిన శరీరముననుండుటచే ప్రత్యగాత్మయనియు కూటస్థుడనియు చెప్పబడినట్లు మాయయు నావ్యష్టిస్థూలలిం

గాత్మకమైన శరీరమునకుండి మనస్సని వ్యవహరించ బడుచున్నది. కూటస్థ బ్రహ్మములకెట్లు భేదములేదో యట్లే మనస్సునకు మాయకు భేదములేదు. మాయయు తత్కార్యమైన సమస్తమును నశింపసత్తే శేషించును.

"సర్వవేదాంతసిద్ధాంతసారం వచ్మియథార్థతః" ౩౩
"స్వయంమృత్వాస్వయంభూత్వాస్వయమేవావశిష్యతే." ౩౪
(కృ-య-౩ ౪౭.)

టీ. సర్వవేదాంతసిద్ధాంతసారం = సమస్తోపనిషత్సిద్ధాంతసారమును, యథార్థతః=ఉన్నదియున్నట్లుగ, వచ్మి=చెప్పుచున్నాను, (అదెట్లనిన) స్వయం=బ్రహ్మమగుతాను, మృత్వా=చచ్చినను, (తనయందు కల్పింపబడిన శరీరములందు ప్రవేశింపగ నాశరీరములు నశించునపుడు తాను నశించునట్లు మూఢులకు గనబడుచున్నను) స్వయం = బ్రహ్మమగుతాను, భూత్వా=పుట్టినను (తనయందు గల్పింపబడినశరీరములు పుట్టుచుండగా తాను పుట్టుచున్నట్లు గనబడుచున్నను) స్వయమేవ=బ్రహ్మమగుతానే, అవశిష్యతే= శేషించుచున్నాడు.

తా. ఘటము పుట్టునపుడును నశించునపుడును ఘటాకాశము పుట్టుచున్నట్లు నశించుచున్నట్లు గనబడుచున్నను వాస్తవమున నెట్లు శేషించియున్నదో యట్లే శరీరములు పుట్టుచుండ నశించుచుండ మూర్ఖులకు తాను పుట్టుచు నశించుచున్నట్లు గనబడునుగాని దేహాత్మబుద్ధిలేని జ్ఞానికి తాను శేషించుటయే తెలియును. "నాసతోవిద్యతేభావోనాభావోవిద్యతేసతః అను గీతావాక్యము (౨-౧౬) చొప్పున సద్వస్తువున కెప్పుడును లేకుండుట యుండదు. అసత్తునకుండుట యుండదు. ఇదియే సర్వవేదాంత సిద్ధాంతము.

"అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథారసంనిత్యమగంధవచ్చయత్." ౩౫

" అనాద్యనంతంమహతః పరంధృవంత దేవశిష్యత్యమలంనిరామయం, " ౩౭

(శు-య-౫౯ పైంగల-కృ-య-౮౬ యోగకుండలీ.)

టీ. యత్ =ఏది, అశబ్దం=శబ్దముగానిదో, అస్పర్శం = స్పర్శముగానిదో, అరూపః=రూపముగానిదో, అవ్యయం=నాశముగానిదో, తథా=అట్లే, అరసం=రసముగానిదో, నిత్యం=నిత్యమయినదో, అగంధవత్ =గంధవంతముగానిదో, అనాది=ఆదిలేనిదో, అనంతం= అంతములేనిదో, మహతఃపరం=మహత్తత్వమునకు పరమైనదో, ధృవం= నిశ్చయమైనదో, అమలం = శుద్ధచైతన్యస్వరూపమైనదో, నిరామయం = రోగహీనమైనదో, తదేవ=అదియే, శిష్యతి= శేషించుచున్నది.

తా. ఏకాదశేంద్రియము వాని విషయములును నశించుచుండగా వాని కన్నిటికిని విలక్షణమైన బ్రహ్మము నిత్యమై శేషించుచున్నది.

ఇతిసార్థాంతికావశిష్ట స్వరూపవాక్యానిషట్త్రింశత్.

ఇట్లు సార్థాంతికావశిష్టస్వరూప వాక్యములు ముప్పదియారు.

ఇతిసార్థాంతికాష్ట విధస్వరూపవాక్యా న్యాహత్యతుద్వావింశత్యధికత్రిశతం.

ఇట్లుసార్థాంతికాష్టవిధ స్వరూపవాక్యములు మొత్తం మూడువందలయిరువదిరెండు.

ఇట్లు పదునెనిమిదవ ప్రకరణము సమాప్తము.

---

శ్రీ

సద్గురవేనమః.

# ౧౮ ఫలవాక్యములు.

"సర్వోహ్యైతత్పరమంబ్రహ్మ వేదబ్రహ్మైవభవతి" ౧

(అధర్వ–౫ ముండక–ముం-3.)

టీ. సర్వోహ్యై=సమస్తమును, తత్=తత్పదలక్ష్యమైనట్టియు, పరమం=ఉత్కృష్టమైనట్టియు, బ్రహ్మ=బ్రహ్మముగా, వేద=తెలిసికొన్నట్టివాడు, బ్రహ్మైవ=బ్రహ్మమే, భవతి=అగుచున్నాడు.

తా. సమస్తమును బ్రహ్మమని తెలిసికొనువాడు బ్రహ్మమే యగుచున్నాడు.

"బ్రహ్మవిదాప్నోతిపరం" ౨

(కృ–యు-౭ తైత్తిరీయ–ఆనందవల్లి.)

టీ. బ్రహ్మవిత్ = బ్రహ్మవిదుడు, పరం = పరమపదమును, ఆప్నోతి=పొందుచున్నాడు.

తా. బ్రహ్మజ్ఞాని ప్రకృతికతీతమైన పరమపదమును బొందును.

"బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి" 3

(సామ–౯ ఛాందోగ్య-ప్ర–౨–ఖం_౨3)

టీ. బ్రహ్మసంస్థః=బ్రహ్మమునున్నవాడు, అమృతత్వం=నాశనరహితమైన కైవల్యమును, ఏతి=పొందుచున్నాడు.

తా. బ్రహ్మమును తెలిసికొనువాడు బ్రహ్మసంస్థుడు.

"తరతిశోకమాత్మవిత్" ౪

(సామ-౯ ఛాందోగ్య-ప్ర-౭-ఖం-౧.)

టీ. ఆత్మవిత్ = ఆత్మజ్ఞాని, శోకం = శోకమును, తరతి = దాటుచున్నాడు.

తా. సచ్చిదానంద స్వరూపమగు నాత్మయే తానని తెలిసికొనువాడు అనృతజడ దుఃఖమైన జగత్తును దాటుచున్నాడు.

" యఏవం వేదాహం బ్రహ్మాస్మీతిసఇదం సర్వంభవతి " ౫

(శు-య-౧౦ బృహదారణ్యక-బ్రా-౪)

టీ. యః = ఎవడు, ఏవం = ఈరీతుగ, అహం = నేను, బ్రహ్మ = బ్రహ్మము, అస్మి = అగుచున్నాను అని, వేద = తెలిసికొను చున్నాడో, సః = వాడు, ఇదంసర్వం = ఈసమస్తమును, భవతి = అగుచున్నాడు,

తా. ఎవ్వడు బ్రహ్మమే నేనని తెలిసికొనుచున్నాడో వాడే సర్వాత్మయగుచున్నాడు.

" సఏషవిసుకృతోవిదుష్కృతో బ్రహ్మవిద్వాన్ బ్రహ్మైవాభిప్రైతి. " ౬

(ఋ-౨౫ కౌషీతకి బ్రాహ్మణ.)

టీ. సఏషబ్రహ్మవిద్వాన్ = ఆఈబ్రహ్మజ్ఞాని, విసుకృతః = పుణ్యములేనివాడై, విదుష్కృతః = పాపములేనివాడై, బ్రహ్మైవ = బ్రహ్మమునే, అభిప్రైతి = పొందుచున్నాడు.

తా. బ్రహ్మజ్ఞాని పుణ్యపాప స్వరూపమగు కర్మము నశింపగ నిరంజనుడై బ్రహ్మమును పొందుచున్నాడు. పునర్జన్మమునొందడు. పుణ్యకర్మము నొనర్చిన బ్రహ్మలోకాదులకుబోయి మరల జనించును. పుణ్యపాపముల వలన కర్మము అభివృద్ధినొందును గాని నశింపదు. బ్రహ్మజ్ఞానమున, కర్మక్షయముకాగా మోక్షము నొందుచున్నాడు.

" యఏవంనిర్బీజంవేద నిర్బీజఏవసభవతి " ౭

టీ. జంతుః=విద్వాంసుడు, యత్ = ఏబ్రహ్మమును జ్ఞాత్వా= ఎరిగి, ముచ్యతే=ముక్తుడగుచున్నవాడై, అమృతత్వంచ=నాశరహితమైన కైవల్యమునుగూర్చి, గచ్ఛతి=పొందుచున్నాడు.

తా. బ్రహ్మము తానేయని యెరిగిన విద్వాంసుడు ముక్తుడై బ్రహ్మమే యగుచున్నాడు,

" యదాపశ్యఃపశ్యతిరుక్మవర్ణం కర్తారమీశంపురుషం బ్రహ్మయోనిం. " ౧౩

" తదావిద్వాన్ పుణ్యపాపే విధూయనిరంజనః పరమంసామ్యమభ్యుపైతి. " ౧౪

(అధర్వ-ణ ముండక-ముం-౩-ఖం-౧.)

టీ. యదా=ఎప్పుడు, పశ్యః=చూచువాడు, (జ్ఞాని) రుక్మవర్ణం=బంగారు వర్ణముగలిగినట్టి (స్వయంప్రకాశమానుడగు), కర్తారం=సకలజగత్కర్తయైనట్టియు, పురుషం=పురుషుడగునట్టియు, బ్రహ్మయోనిం=బ్రహ్మకు కారణమగునట్టియు (వేదమునకు కారణమగునట్టియు) ఈశం=నియామకుడు నంతర్యామియునగు నీశ్వరుని, పశ్యతి= చూచుచున్నాడో, తదా=అప్పుడు, విద్వాన్=అజ్ఞాని, పుణ్యపాపే= పుణ్యపాపములను (కర్మబంధమును) విధూయ=ఎగరగొట్టి, నిరంజనః= నిర్దోషుడై (దేనినంటనివాడై) సామ్యం=సమత్వమైన, పరమం=ప్రకృతికిపరమైన బ్రహ్మమును, అభ్యుపైతి=పొందుచున్నాడు.

తా. జగత్తు ఇంద్రజాలమువంటిది. జగత్కర్తయగు నీశ్వరుడు ఇంద్రజాలకునివంటివాడు. ఇంద్రజాలకుని జూడనంతవరకు నింద్రజాలము సత్యముగ నున్నట్లుండును. మనుష్యుడెప్పుడింద్రజాలకు నెరుగుచున్నాడో యపుడింద్రజాలము మిథ్యయని నిరసించుచు స్తిమితుడగును. అట్లే జగత్తునకు నిమిత్తకారణభూతుడైన ఈశ్వరు నెరింగిన జగత్తునందలి వ్యామోహము నశించును. అప్పుడు శుద్ధశాంతమైన బ్రహ్మము నొందుచున్నాడు.

" ఏతద్యో వేదనిహితం గుహాయామ విద్యాగ్రంథిం వికిరతీహ సౌమ్య. " ౧౫

(అథర్వ-౫ ముండక-ముం-౨.)

టీ. సౌమ్య = ఓ శ్వేతకేతూ, గుహాయాం = పంచకోశాత్మకమైన గుహయందు, నిహితం = ఉన్నట్టి, ఏతత్ = ఈబ్రహ్మమును, యః=ఎవడు, వేద = తెలిసికొనుచున్నాడో వాడు, ఇహ = ఈ దేహమందే అవిద్యాగ్రంథిం=అవిద్యయను ముడిని, వికిరతి=చిమ్ముచున్నాడు.

తా. పంచకోశములకు గుహయని పేరు. అ గుహయందున్న బ్రహ్మము నెరుంగువాడు అవిద్యాబంధమును త్రెంచుచున్నాడు. పంచకోశాతీతము బ్రహ్మమని తెలియవలయును.

" భిద్యతేహృదయగ్రంథిశ్ఛిద్యంతేసర్వసంశయాః " ౧౬

" క్షీయంతేచాస్యకర్మాణి తస్మిన్‌దృష్టేపరావరే " ౧౭

(సామ-౬౧ మహో-అ ౪, అథర్వ ౭౦ అన్నపూర్ణ-అ౪, కృ-య౧౦౬,)

(సరస్వతీరహస్య, కృ-య-౬౩ యోగశిఖ, అథర్వ-౫ ముండక)

(ముం-౨-ఖం-౨-ఇంకచాలాయున్నవి.)

టీ. పరావరే = సర్వోత్కృష్టమైన, తస్మిన్ = ఆబ్రహము, దృష్టే = తెలియబడిన దగుచుండగా, అస్య = బ్రహ్మము నెరిగినజ్ఞానియొక్క, హృదయగ్రంథిః=హృదయమందుముడివలెనున్నయజ్ఞానము, భిద్యతే= భేదింపబడుచున్నది, సర్వసంశయాః=సమస్త సందేహములు, ఛిద్యంతే=ఛేదింపబడుచున్నవి. కర్మాణి = సర్వకర్మలు, క్షీయంతే= క్షీణించుచున్నవి.

తా. బ్రహ్మమందు దృష్టిగలజ్ఞానికి సందేహములు నశించును. అజ్ఞానమునశించును. కర్మము నశించును అని తాత్పర్యము.

"యథానద్యస్స్యందమానా స్సముద్రేఽస్తంగచ్ఛంతి నామ రూపేవిహాయ" ౧౮

"తథావిద్వాన్నామ రూపాద్విముక్తః పరాత్పరంపురుషము పైతిదివ్యం." ౧౯

(అధర్వ-౫ ముండక-ముం-౩-ఖం-౨)

టీ. యథా=ఏప్రకారము, స్యందమానాస్యః=చలించు, నద్యః=నదులు, నామరూపే=నామరూపములను, విహాయ=విడిచి, సముద్రే=సముద్రమునందు, అస్తంగచ్ఛంతి=లయమునొందుచున్నవో, తథా=అట్లే, విద్వాన్=జ్ఞాని, నామరూపాత్ = నామసహితమగు రూపము నుండి (జగత్తునుండి) విముక్తః=ముక్తుడై, దివ్యం=ప్రకాశస్వరూపుడైన, పురుషం=పురుషుడైన, పరాత్పరం=పరమాత్మను, ఉపైతి=పొందుచున్నాడు.

తా. నదులు సముద్రమున కలియునపుడు తమ నామరూపములను విడిచి సముద్రమునం దైక్యమునొందునట్టుల బ్రహ్మజ్ఞాని నామరూపాత్మకమైన జగత్తునుండి ముక్తుడై శరీరత్రయరహితుడై యాత్మయందైక్యము నొందును.

"జ్ఞాత్వాతంమృత్యుమత్యేతినాన్యః పంథావిముక్తయే" ౨౦

(కృ-యు-౧౨ కైవల్య.)

టీ. తం=ఆపరమాత్మను, జ్ఞాత్వా=ఎరిగి, మృత్యుం=మృత్యువు, అత్యేతి=అతిక్రమించుచున్నాడు, విముక్తయే = మోక్షముకొరకు, అన్యః=ఇతరమైన, పంథాః=మార్గము, న=లేదు.

తా. జ్ఞానమున తానే పరమాత్మయని యెరిగినవాడు జననమరణ రహితుడగుచున్నాడు. ఆత్మజ్ఞానము దక్క ముక్తికితరమార్గము లేదు.

" తద్బ్రహ్మాహమితిజ్ఞాత్వా బ్రహ్మసంపద్యతేధ్రువం. " ౨౧

(అధర్వ-౮౦ త్రిపురతాపనీ-ఉ-౫.)

టీ. అహం=నేను, తద్బ్రహ్మేతి=ఆబ్రహ్మమేయని, జ్ఞాత్వా=ఎరిగి, బ్రహ్మ=బ్రహ్మమును, ధ్రువం=నిశ్చయముగ, సంపద్యతే=పొందుచున్నాడు.

తా. నేనే బ్రహ్మమని దృఢముగ నెరిగినవానిచే బ్రహ్మము పొందబడుచున్నది.

" యత్ర యత్రమృతోజ్ఞానీ పరమాక్షరవిత్సదా. " ౨౨

(కృ-య-౪౦ బ్రహ్మవిద్యా.)

" పరబ్రహ్మణిలీయేతనతస్యోత్క్రాంతిరిష్యతే. " ౨౩

(కృ-య-౪౧ యోగతత్వ.)

టీ. సదా=ఎల్లప్పుడు, పరమాక్షరవిత్=ఉత్కృష్టమైన యాక్షరణము నెరిగిన (సర్వత్ర సమబుద్ధిగలిగిన), జ్ఞానీ = ఆత్మజ్ఞాని, యత్ర యత్ర=ఎక్కడెక్కడ, మృతః=చచ్చినవాడగునో (అచ్చటచ్చట ఆచచ్చినవాడు) పరబ్రహ్మణి=బ్రహ్మమునందు, లీయేత=ఐక్యమునొందును (కాని), తస్య=ఆజ్ఞానియొక్క. ఉత్క్రాంతిః=ప్రాణముపోవుట, నేష్యతే=ఇచ్ఛగింపబడదు.

తా. జ్ఞాని మృతినొందినట్లుగుపడునపుడు బ్రహ్మమునం దైక్యమునొందునుగాని ప్రాకృతులవలె లోకాంతరములకు బోయి మరల జన్మించడు.

" యద్యత్స్వాభిమతంవస్తు తత్త్యజన్ మోక్షమశ్నుతే " ౨౪

(సామ-౬౧ మహా-అ-౪.)

టీ. యద్యత్=ఏదేది, స్వాభిమతం = తనకిష్టమైన, వస్తు = వస్తువో, తత్=దానిని, త్యజన్=విడుచుచు, మోక్షం=మోక్షమును, అశ్నుతే=పొందుచున్నాడు.

తా. కామాదులను విడిచిన మోక్షమునొందునని యభిప్రాయము.

" అసంకల్పనశస్త్రేణ ఛిన్నం చిత్తమిదం యదా. " ౨౫

" సర్వం సర్వగతం శాంతం బ్రహ్మసంపద్యతే తదా. " ౨౬

(సామ-౬౧ మహో-౬-౪.)

టీ. యదా=ఎప్పుడు, అసంకల్పనశస్త్రేణ=అసంకల్పమను ఖడ్గముచేత, ఇదంచిత్తం=ఈచిత్తము, ఛిన్నం=ఛేదించబడునో, తదా=అప్పుడు, సర్వం = సమస్తమును, సర్వగతం = సర్వమందున్నదియు, శాంతం=శాంతమైనదియునగు; బ్రహ్మ=బ్రహ్మము, సంపద్యతే=పొందబడుచున్నది.

తా. సంకల్పరహితమై చిత్తమెప్పుడు నశించునో యపుడు శాంతస్వరూపమగు బ్రహ్మము పొందబడుచున్నది.

" ప్రియేషుస్వేషు సుకృతమప్రియేషు చదుష్కృతం " ౨౭

" విసృజ్యధ్యానయోగేన బ్రహ్మాప్యేతిసనాతనం " ౨౮

(అధర్వ-౭౩ నారదపరివ్రాజక.)

టీ. స్వేషు=తన, ప్రియేషు=ప్రియవస్తువులయందు, సుకృతం=సుకృతమును (మంచిపని) అప్రియేషుచ=తనకిష్టముకాని వానియందు, దుష్కృతం=దుష్కృతమును (చెడ్డపని) విసృజ్య=విడిచి, ధ్యానయోగేన=ధ్యానయోగముచే, సనాతనం=అనాదిసిద్ధమైన, బ్రహ్మాపి=బ్రహ్మమునే, ఏతి=పొందుచున్నాడు.

తా. శాస్త్రసమ్మతముకాని వస్తువు తన కిష్టమగునపు డది మంచిదని దానియందు సుకృతము నారోపించక దానిని విడిచి శాస్త్రసమ్మతిమైన వస్తువు తన కిష్టముగానియపు డది మంచిదికాదని దానియందు ద్వేషమువిడిచి ధ్యానమున బ్రహ్మము నొందవలయును. రాగద్వేషముల విడిచి ధ్యానమున బ్రహ్మము పొందవలయును.

"ఘటాకాశమి వాత్మీయ విలయం వేత్తి తత్త్వతః" ౨౯
"సగచ్ఛతినిరాలంబం జ్ఞానాలోకంసమంతతః" ౩౦
(శు-య-౯౫ పైంగల-అ ౪)

టీ. యః=ఎవడు, ఘటాకాశమివ=ఘటాకాశముపోలె (ఘటము నశింపగా ఘటాకాశము మహాకాశమున గలియునట్లు) ఆత్మీయవిలయం = ప్రత్యగాత్మస్వరూపుడైన తనయైక్యము, తత్త్వతః=తత్త్వజ్ఞానముచే, వేత్తి= తెలిసికొనుచున్నాడో, సః=వాడు, సమంతతః=అంతటను, జ్ఞానాలోకం=జ్ఞానదృష్టిని, నిరాలంబం=ఆధారములేని బ్రహ్మమును, గచ్ఛతి=పొందుచున్నాడు.

తా. ఘటమునశింపగ ఘటాకాశము మహాకాశమగుననియెరుగునట్లు తత్త్వజ్ఞానమున నుపాధినశింపగ ప్రత్యగాత్మయగు తాను బ్రహ్మమగునని యెరుగువాడు బ్రహ్మమగు చున్నాడు.

"తృణాగ్రేష్వంబరే భానౌ నరనాగామరేషుచ" ౩౧
"య త్తిష్ఠతి తదేవాహం ఇతిమత్వానశోచతి" ౩౨
(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ-౫.)

టీ. తృణాగ్రేషు =అతిస్వల్పములయిన తృణాగ్రములందును, అంబరే = అనంతమైన ఆకాశమందును, భానౌ = తేజోరాశియగు సూర్యునియందును, నరనాగామరేషుచ = మనుష్యగజాదిజంతు దేవతలయందును, యత్ =ఏబ్రహ్మము, తిష్ఠతి = ఉన్నదో, తదేవ=ఆబ్రహ్మమే, అహామితి=నేనని, మత్వా=తలచి, నశోచతి=శోకింపడు.

తా. సర్వపరిపూర్ణమగు బ్రహ్మమే తానని దేహేంద్రియాదులు తానుగానని లెస్సగ నెరిగి యీదేహేంద్రియాదులకు గలుగునుపద్రవములకు తాను శోకింపడు. బ్రహ్మమే తానను జ్ఞానమున తానుగాని దేహేంద్రియాదులకు శోషింపకుండుటయు వ్యామోహము చెందకుండుటయు ఫలము.

"సర్వసాక్షిణమాత్మానం వర్ణాశ్రమవివర్జితం." ౩౩

"బ్రహ్మరూపతయాపశ్యన్ బ్రహ్మైవభవతిస్వయం." ౩౪

(కృ-య-౯౮ వరాహ.)

టీ. సర్వసాక్షిణం = సమస్త దేహేంద్రియ వృత్తులకుసాక్షియు, వర్ణాశ్రమవివర్జితం = వర్ణాశ్రమములులేనిదియు, ఆత్మానం = ప్రత్యగాత్మయగు తన్ను, బ్రహ్మరూపతయా = పరబ్రహ్మస్వరూపమున, పశ్యన్ = చూచుచు, స్వయం = తాను, బ్రహ్మైవ = బ్రహ్మమే, భవతి = అగుచున్నాడు.

తా. సమస్తమునకు సాక్షియు వర్ణాశ్రమములు లేనిదియునగు ప్రత్యగాత్మను (తనను) బ్రహ్మముగ నిశ్చయించుచు తాను బ్రహ్మమగును.

"తద్బ్రహ్మానందమద్వంద్వం నిర్గుణంసత్యచిద్ఘనం." ౩౫

"విదిత్వాస్వాత్మనోరూపంనబిభేతికుతశ్చన." ౩౬

(కృ-య-౯౮ వరాహ-అ-౨-౮౩ కర, సామ-౬౧ మహో-అ-౪.)

టీ. ఆనందం = ఆనందమును, అద్వంద్వం = సుఖదుఃఖాది ద్వంద్వములు లేనిదియు, నిర్గుణం = త్రిగుణరహితమును, సత్యచిద్ఘనం = సత్యజ్ఞానఘనమునునగు, తద్బ్రహ్మ = ఆబ్రహ్మము, స్వాత్మనః = తనయొక్క, రూపం = రూపమని, విదిత్వా = తెలిసి, కుతశ్చన = దేనివలనను, నబిభేతి = భయపడడు.

తా. సత్యజ్ఞానానంద స్వరూపమగు బ్రహ్మమే తానని జ్ఞాని యెప్పుడును భయపడడు.

"వాసనాంసంపరిత్యజ్యమయి చిన్మాత్రవిగ్రహే." ౩౭

"యస్తిష్ఠతిగతస్నేహస్సోహం సచ్చిత్సుఖాత్మకః." ౩౮

(శు-య-౧౦౮ ముక్తిక)

టీ. వాసనాం=చిత్తవృత్తులకు బీజమైనవాసనను, సంపరిత్యజ్య=లెస్సగనువిడిచి, యః=ఎవడు, గతస్నేహం = రాగద్వేషాదికము లేనివాడై, చిన్మాత్రవిగ్రహం=చిన్మాత్ర స్వరూపుడనగు, మయి=నా యందు, తిష్ఠతి=ఉన్నవాడగునో, సచ్చిత్సుఖాత్మకః=సత్యజ్ఞానానంద స్వరూపుడగు, సః=వాడు, అహం=నేను.

తా. వాసనాశ్రయమును విడిచి వ్యామోహములేక ఎవడు బ్రహ్మమందుండునో సత్యజ్ఞానానంద స్వరూపుడగు వాడే బ్రహ్మము.

"దర్శనాదర్శనే హిత్వా స్వయంకేవల రూపతః" ౩౯

"యఆస్తేకపిశార్దూలబ్రహ్మ తద్బ్రహ్మవిత్స్వయం" ౪౦

(శు–య–౧౦౮ ముక్తిక)

టీ. కపిశార్దూల=కపిశ్రేష్ఠుడవగు హనుమంతుడా, దర్శనాదర్శనే=జ్ఞానాజ్ఞానములను (శాస్త్రాశాస్త్రములను) హిత్వా=విడిచి, స్వయం=తాను, కేవలరూపతః=ద్వైకైకనయద్వితీయబ్రహ్మ స్వరూపమున, యః=ఎవడు, ఆస్తే=ఉన్నాడో, తద్బ్రహ్మవిత్=ఆ బ్రహ్మము నెరుగుజ్ఞాని, స్వయం=తానే, బ్రహ్మ=బ్రహ్మమైయున్నాడు.

తా. విధినిషేధములను విడిచి స్వస్వరూపముననున్న వాడు బ్రహ్మమేయైయుండును. బ్రహ్మజ్ఞానమున సర్వదుఃఖనివృత్తియును బ్రహ్మమగుటయును ఫలమని తెలియవలెను.

ఇతి సార్థాంతిక ఫలవాక్యాని చత్వారింశత్.

ఇట్లు సార్థాంతిక ఫలవాక్యములు నలుబది.

ఇత్యేకోనవింశం ప్రకరణం సమాప్తమ్.

ఇట్లు పందొమ్మిదవ ప్రకరణము.

సమాప్తము.

శ్రీ

సద్గురవేనమః.

# ౨౦ విదేహముక్తి వాక్యములు.

"విముక్తశ్చవిముచ్యతే" ౧

"గుహాగ్రంధిభ్యోవిముక్తోఽమృతోభవతి" ౨

(అధర్వ-౫ ముండక-ముం౩-ఖం౨)

టీ. విముక్తశ్చ=విముక్తుడు, విముచ్యతే=విడువబడుచున్నాడు గుహాగ్రంధిభ్యః = గుహాగ్రంధులవల్లనుండి, విముక్తః = విడువబడినవాడు, అమృతోభవతి=నాశనరహితమైన బ్రహ్మమగుచున్నాడు.

తా. తానుస్వతస్సిద్ధముగ ముక్తుడై యున్నాడుగాన ముక్తుడనబడును. అట్టివాడు అవిద్యావరణచే బద్ధుడైనట్లు గనబడుటచే జ్ఞానమున నవిద్యనశించగా ముక్తుడైనట్లు గనబడుచున్నాడు. పంచకోశములు గుహాయనబడును. గ్రంధియనగా ముడి. ఏకోశమందైన నభిమానముగాని యాకోశమేతాననిభ్రమనొందుటగా గుహాగ్రంధి. అట్టి గుహాగ్రంధినుండి విడువబడినవాడు బ్రహ్మమగుచున్నాడు.

"అధాకామయమానో నిష్కామఆప్తకామఆత్మకామో నతస్యప్రాణాఉత్క్రామ్యంత్యత్రైవ సమవలీయంతేబ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి" 3

(శు-య-౧౦ బృహదారణ్యక-అ౬-బ్రా౪-౭.)

టీ. అకామయమానః=కోరికలను కోరనివాడగుచు, నిష్కామః=కోరికలేనివాడై, ఆప్తకామః = పొందబడిన కోరికగలవాడై, ఆత్మకామః=ఆత్మయందు కోరికగలవాడగును. తస్య = ఆబ్రహ్మజ్ఞాని

యొక్క, ప్రాణాః=ప్రాణములు, నోత్క్రామ్యంతి= మరియొక చోటికి బోవు, అత్రైవ=ఈశరీరమునందే, సమవలీయంతే=బ్రహ్మమునం దైక్యమును జెందుచున్నవి. సః=అజ్ఞాని, బ్రహ్మాప్యేతి=బ్రహ్మమునొందు చున్నాడు, బ్రహ్మైవ=బ్రహ్మమే యగుచున్నాడు.

తా. జ్ఞాని నిష్కాముడు ఆప్తకాముడునై ఆత్మకాముడగు టచే నతని ప్రాణములు స్వర్గాదిలోకములకు బోక బ్రహ్మమునం దైక్యమునొందును. అప్పుడతడు బ్రహ్మమే యగుచున్నాడు. నిష్కా ముడై యాత్మకాముడుగాక మరియొక దానిని గోరిన బ్రహ్మము నొందక యాయాలోకమునకు బోయి మరల జన్మించును. మరణ కాలమందే దేవతను స్మరించునో యాదేవతాలోకమునకు బోయి యాస్వరూపము నొందునని "యంయంవాపిస్మరన్భావంత్యజత్యంతేకళే బరం। తంతమేవైతికౌంతేయ సదాతద్భావభావితః" అని గీతావా క్యము (అ-౮-శ్లో-౬) గలదుగావున నాత్మకాముడై యుండవల యును. లేకుండిన "ఆబ్రహ్మభువనాల్లోకాఃపునరావర్తినోఽర్జున" అను గీతావాక్యము (అ-౮-శ్లో-౧౬) చొప్పున నేలోకమునకు బోయినను పునర్జన్మము గలుగును.

"తద్యథాహినిర్ల్వయనీ వల్మీకేమృతాప్రత్యస్తా శయీతైవ మిదంశరీరం శేతేతథాయమ శరీరోమృతః." ౭

(శు-య-౧౦ బృహదారణ్యక అ-౬-బ్రా-౪)

టీ. అయం=ఈజ్ఞాని, అశరీరః=శరీరములేనివాడును, అమృతః=నాశరహితమైన బ్రహ్మమునగుచుండ, ఇదంశరీరం=ఈస్థూలశరీము, శేతే=పడియుండును (జ్ఞానికి దేహాభిమానముండదుగావున శరీరము సంరక్షింపబడక పడియుండుననియు నభిప్రాయము గలదు) తద్యథా=అదియెట్లనిన, మృతా=నిర్జీవమైన, అహినిర్ల్వయినీ=పాముపొర, వల్మీకే=పుట్టయందు, ప్రత్యస్తా = ఉంచబడినదై, తథాశయీతైవ = పడి యుండునట్లే.

తా. పాము తనచేవిడువబడిన పొర దేహమగుచున్నను దానిని స్మరింపనట్లు జ్ఞాని తాను బ్రహ్మమని యెరుగక తనశరీర మేమగుచున్నను దానిని స్మరింపడు.

" అశరీరోనిరింద్రియోఽ ప్రాణస్సచ్చిదానంద మాత్రస్స్వస్వరాడ్భవతి. " ౫

(అధర్వ—౨౭ నృసింహోత్తరతాపినీ—ఖం-౭.)

టీ. అశరీరః=స్థూల దేహములేనివాడును, నిరింద్రియః = ఇంద్రియములు లేనివాడును, అప్రాణః=ప్రాణములేనివాడును, సచ్చిదానందమాత్రః=సత్యజ్ఞానానంద స్వరూపుడునై, స్వస్వరాట్ = స్వయంప్రకాశమానుడు, భవతి=అగుచున్నాడు.

తా. విదేహముక్తుడు దేహేంద్రియ ప్రాణములులేనివాడై సత్యజ్ఞానానంద స్వరూపమగు బ్రహ్మమగుచున్నాడు. దేహేంద్రియ ప్రాణములు లేనివాడనుటచే జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలతోగూడిన స్థూల సూక్ష్మ కారణశరీరములు లేనివాడని యభిప్రాయము. స్థూల శరీరము జాగ్రదవస్థలోనుంకును-ఇంద్రియములు (మనస్సు) స్వప్నావస్థలో నుండును. ప్రాణములు సుషుప్తియందును వృత్తి విడువకుండును. విదేహముక్తునకు మూడుశరీరములు నశించునుగాన దేహేంద్రియ ప్రాణములుండవనియును జీవన్ముక్తున కుండుననియు తాత్పర్యము. అయితే జీవన్ముక్తుని కింద్రియార్థముల దగులని ఇంద్రియములును వాసనలులేని చిత్తమునుండును.

" పృథివ్యప్సుప్రలీయతే ఆపోజ్యోతిషిప్రలీయంతేజ్యోతిర్వాయౌవిలీయతేవాయురాకాశే ఆకాశమింద్రియేష్వింద్రియాణి తన్మాత్రేషుతన్మాత్రాణి భూతాదావిలీయంతే భూతాదిర్మహతివిలీయతేమహానవ్యక్తే విలీయతేఽవ్యక్తమక్షరే విలీయతేఽక్షరంతమసివిలీయతే తమఃపరేదేవఏకీభవతి " ౯

(శు-య-౩౦ సుబాల-ఖం ౨)

టీ. పృథివీ=భూమి, అప్సు=ఉదకములందు, ప్రలీయతే=లయించుచున్నది, ఆపః=ఉదకములు, జ్యోతిషు=అగ్నియందు, ప్రలీయన్తే=లయించుచున్నవి, జ్యోతిః=అగ్ని, వాయౌ=వాయువునందు, విలీయతే=లయించుచున్నది. వాయుః=గాలి, ఆకాశే=ఆకాశమునందును, ఆకాశః=ఆకాశము, ఇంద్రియేషు = ఇంద్రియములందును, ఇంద్రియాణి=ఇంద్రియములు, తన్మాత్రేషు=పంచతన్మాత్రలందును, తన్మాత్రాణి=తన్మాత్రలు, భూతాదౌ=భూతాదియైన విక్షేపబీజమందును, విలీయంతే=లయించుచున్నవి, భూతాదిః=భూతాదియగు విక్షేపబీజము, మహతి=మహత్తత్త్వమున, విలీయతే=లయించుచున్నది. మహాన్=మహత్తత్త్వము, అవ్యక్తే=అవ్యక్తమందు, విలీయతే = లయించుచున్నది. అవ్యక్తం=అవ్యక్తము, అక్షరే=కూటస్థునియందు, విలీయతే=లయించుచున్నది. అక్షరం=అక్షరము, తమసి=ప్రకృతియందు, విలీయతే=లయించుచున్నది, తమః=ప్రకృతి, పరే = సమస్తమునకు పరుడైన, దేవే=దేవునియందు, (చిదానందమైన సద్వస్తువున) ఏకీభవతి=ఐక్యమునొందుచున్నది.

తా. స్పష్టము.

"బ్రహ్మాండంతద్గతలోకాని కార్యరూపాంశ్చ కారణత్వంప్రాపయిత్వాతతస్సూక్ష్మాంగం కర్మేంద్రియాణి ప్రాణాంశ్చజ్ఞానేంద్రియాణి అంతఃకరణచతుష్టయంచైకీకృత్యసర్వాణి భౌతికాని కారణేభూతపంచకే సంయోజ్యభూమింజలేజలంవహ్నౌవహ్నింవాయౌవాయుమాకాశే చాకాశమహంకారే చాహంకారం మహతిమహదవ్యక్తేఽవ్యక్తం పురుషే క్రమేణవిలీయతే విరాడ్ధిరణ్యగర్భేశ్వరా ఉపాధివిలయాత్పరమాత్మని లీయంతే" ౭

(శు-య-గీ. పైంగల-అ ౩.)

టీ. బ్రహ్మాండం=బ్రహ్మాండమును, కార్యరూపాంశ్చ=కార్యరూపములుగానున్న, తద్గతలోకాని=బ్రహ్మాండముననున్న లోకములను, కారణత్వం = కారణస్వరూపమును, ప్రాపయిత్వా = పొందింపజేసి,

తతః=తరువాత, సూక్ష్మాంగం = సూక్ష్మశరీరాంగ సముదాయమైన, కర్మేంద్రియాణి=కర్మేంద్రియములను, ప్రాణాంశ్చ = ప్రాణములను, జ్ఞానేంద్రియాణి = జ్ఞానేంద్రియములను, అంతఃకరణ చతుష్టయంచ= అంతఃకరణ చతుష్టయమైన మనోబుద్ధిచిత్తాహంకారములను, ఏకీకృత్య=ఒక్కటిగా జేసి, (లింగ దేహమును నాశము చేసి) సర్వాణి=సమస్తమైన, భౌతికాని=భౌతకార్యములను, కారణే=ఆభౌతికములకు కారణమైన, భూతపంచకే = భూతపంచకమునను, (పంచభూతములందు) భూమిం=భూమిని, జలే=జలమునందును, జలం=జలమును, వహ్నౌ= అగ్నియందు, వహ్నిం=అగ్నిని, వాయౌ=వాయువునందును, వాయుం= వాయువును, ఆకాశేచ=ఆకాశమునందును, ఆకాశం= ఆకాశమును, అహంకారేచ = అహంకారమునందును, అహంకారం=అహంకారమును, మహతి = మహత్తత్త్వమునందును. మహత్ = మహత్తును, అవ్యక్తే=అవ్యక్తమందును,అవ్యక్తం=అవ్యక్తమును, పురుషే=పరమాత్మయందును, క్రమేణ=క్రమముగా, సంయోజ్య=కూర్చి, విలీయతే= తానైక్యమగుచున్నాడు. ఉపాధివిలయాత్ =ఉపాధినాశమున, విరాట్= వైశ్వానరుడును, హిరణ్యగర్భః= సూత్రాత్మయును, ఈశ్వరాః=అంతర్యామియును, పరమాత్మని= పరబ్రహ్మమున, లీయంతే = ఐక్యమగుచున్నారు.

తా. బ్రహ్మాండము త్రిలోకములు కార్యరూపములుగావున వానిని వానికికారణమైన మాయయందు గలిపి మిథ్యగానెంచి లింగాంగభంగము జేసి ప్రత్యగాత్మ స్వరూపుడగు తాను బ్రహ్మమగుచున్నాడు. వాడే విదేహముక్తుడు. స్థూలసూక్ష్మకారణ శరీరభేదముచే బ్రహ్మమే విరాడ్ఢిరణ్యగర్భేశ్వరులను నామములవ్యవహరించబడుచున్నది కావున నాయుపాధినాశమున నాయీశ్వరత్రయము నశింపబ్రహ్మమే అవును.

"ప్రారబ్ధక్షయవశాద్దేహ త్రయ భంగం ప్రాప్యోపాధివినిర్ముక్త ఘటాకాశవత్పరిపూర్ణతా విదేహముక్తిః." ౮

(శు-య-౧౦౮ ముక్తిక-అ-౧.)

టీ. ఉపాధి వినిర్ముక్తఘటాకాశవత్, ఉపాధివినిర్ముక్త=ఉపాధియైనఘటము నశింపదానినుండి విడువబడిన, ఘటాకాశవత్=ఘటాకాశమువలె (ఆఘటాకాశము మహాకాశమున గలిసి పరిపూర్ణమైనట్లు) ప్రారబ్ధక్షయవశాత్=ప్రారబ్ధనాశమున (ఇతరులచే నారోపింపబడిన ప్రారబ్ధము), దేహత్రయభంగం=స్థూల సూక్ష్మ కారణశరీరములయొక్క భంగమును, ప్రాప్య=పొంది, పరిపూర్ణతా= (పొందగా గలిగిన) పరిపూర్ణత్వము, విదేహముక్తిః=విదేహముక్తియగును.

తా. ఘటనష్టమున ఘటాకాశము మహాకాశమై పరిపూర్ణత్వము నొందినట్లు ప్రత్యగాత్మ స్వరూపుడగు తాను శరీరత్రయనాశమున బ్రహ్మమై యనంతత్వము నొందును. శరీరత్రయభంగమే విదేహముక్తియని ముఖ్యాభిప్రాయము.

"యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృదిస్థితాః." ౯
"అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే." ౧౦

(కృ-య-౨ కఠ-అ-౨-వ-౬.)

టీ. యదా=ఎప్పుడు, అస్య = ఈపురుషునియొక్క, హృదిస్థితాః=హృదయమునందున్న, యే కామాః = ఏకోరికలు, సర్వే=అన్నియును, ప్రముచ్యన్తే=విడువబడుచున్నవో, (అప్పుడుఅనగ), అథ=అనంతరమున, మర్త్యః=ఈపురుషుడు, అమృతః=అమృతుడు, భవతి=అగుచున్నాడు, అత్ర=ఈదేహమునందే, బ్రహ్మ=బ్రహ్మమును, సమశ్నుతే=పొందుచున్నాడు.

తా. సమస్తకామములను విడిచిన యాపురుషుడు ఈదేహమునందే బ్రహ్మమును పొందుచున్నాడు. కామము నశించిన స్వర్గాదులం

దువలె పరోక్షముగ గాక యీ దేహమునందే ప్రత్యక్షముగ ఫలము
నని తాత్పర్యము.

" వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థాఃసన్న్యాసయోగాద్యతయశ్శు
ద్ధసత్వాః. " ౧౧

" తే(బ్రహ్మలోకేతు పరాంతకాలే పరామృతాత్పరిముచ్యంతి
సర్వే. " ౧౨

(శృ-యా-౧౨ కైవల్య। అధర్వ-౫ ముండక-ముం-౩-ఖం-౨.)

టీ. వేదాంతవిజ్ఞాన = వేదాంతానుభవ జ్ఞానమున, సునిశ్చిత=
లెస్సగ నిశ్చయింపబడిన, అర్థాః = విషయము గలవారును,
సన్న్యాసయోగాత్ =సన్యాసయోగమువలన (కర్మసన్యాసమున), యత
యః=యతులైనవారును, శుద్ధసత్వాః=శుద్ధసత్వప్రధానులును (జగ
త్తుమిథ్యగ దలచువారు), తేసర్వే=వారందరు, బ్రహ్మలోకేతు=బ్రహ్మ
లోకమందు, పరాంతకాలే = ప్రళయకాలమున, పరామృతాత్ =
అమృతస్వరూపమైన బ్రహ్మముగుటవలన, పరిముచ్యంతి విదేహముక్తు
లగుచున్నారు.

తా. శుద్ధసత్వగుణ ప్రధానులును కర్మసన్యాసము(శమున) ఈశ్వరాయతు
లైనవారును వేదాంతానుభవజ్ఞానమున తామే బ్రహ్మంతే = నిశ్చయ
ముగలవారును నేదేని యొకకారణమున (ఆగామిప్రతిబంధమున)
బ్రహ్మలోకముబొంద కోరికగలవారగుదురేని వారు బ్రహ్మలోకము
నకుబోయి బ్రహ్మతో విదేహముక్తులగుదురుగాని మరల పునర్జన్మమె
త్తరు. వీరుగాక యితరకర్మములచే బ్రహ్మలోకముపొందువారు మరల
జన్మింతురు. బ్రహ్మజ్ఞాని సత్యలోకముబొంద నిచ్ఛించిన ముక్తినిబొం
దక బ్రహ్మలోకమునకు బోవుననుటకు " బ్రహ్మలోకాభివాంఛాయాం
సమ్యక్సత్యాంనిరుధ్యతాం విచారయేద్యఆత్మానం నతుసాక్షాత్కరోత్య
యం. వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాదిశాస్త్రతః బ్రహ్మలోకేశకల్పాం
తే బ్రహ్మణాసహముచ్యతే " అని విద్యారణ్యులును చెప్పుచున్నారు.

ఈవాక్యములకు నీయుపనిషత్తులయందు స్వరములేదు. అయినప్పటి కిని తైత్తిరీయయాజ్ఞికోపనిషత్తు అను నారాయణమందున్న స్వరము వేయడమయినది.

" జీవన్ముక్తపదంత్యక్త్వా స్వదేహేకాలసాత్కృతే. " ౧౩
" విశత్యదేహముక్తత్వం పవనోఽస్పందతామిహ. " ౧౪
(శు-య-౫౯ పైంగల-అ ౩ కృ-య-౬౬ యోగకుండలీ.)
(శు-య-౧౦౮ ముక్తిక। సామ-౬౧ మహో-అ-౨.)

టీ. స్వదేహే=తనదేహము, కాలసాత్కృతే = మృతినొందు చుండగా. జీవన్ముక్తపదం=జీవన్ముక్తస్థితినీ, త్యక్త్వా=విడిచి, అదేహ ముక్తత్వం=విదేహముక్తస్థితిని, విశతి = పొందుచున్నాడు. పవనః = అతని ప్రాణవాయువు, ఇహ=ఇక్కడనే, అస్పందతాం = నిశ్చలత్వ మును పొందుచున్నది.

తా. స్థూలదేహము నశించుచుండగా జీవన్ముక్తస్థితిని విడిచి విదేహముక్తస్థితిని పొందును. అప్పుడు ప్రాణము బ్రహ్మము నైక్యమ గును. జ్ఞాని స్థూలదేహముతోనుండుట జీవన్ముక్తియగును. నిరుపాధి కమైబ్రహ్మమున నైక్యమగుట విదేహముక్తి.

" తస్యాభిధ్యానాద్యోజనాత్తత్త్వభావాత్ భూయశ్చాంతేవిశ్వ మాయానివృత్తిః. " ౧౫

(కృ-య-౧౪ శ్వేతాశ్వతార-అ-౧.)

టీ. భూయశ్చ=మాటిమాటికి, అభిధ్యానాత్=దృఢధ్యానము వలనను, యోజనాత్ = జీవేశ్వరైక్యానుసంధానమునను, తత్త్వభా వాత్ = బ్రహ్మసత్యము జగత్తుమిథ్యయను తత్త్వజ్ఞానమునను, తస్య = అజ్ఞానియొక్క, విశ్వమాయా = తన కార్యముతోగూడిన మాయయొక్క (మాయయు మాయాకార్యమైన జగత్తును) నివృ త్తిః=నాశనమగును.

తా. ఎల్లప్పుడు తత్త్వవిచారము చేయుచు తానే బ్రహ్మమని యు జగత్తు మిథ్యయనియు తలంచుజ్ఞానికి మాయయు మాయాకార్య మగు జగత్తును నివృత్తియగును.

" తతస్సత్సంబభూవా సౌయద్గిరామప్యగోచరం " ౧౬
(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ 3)

టీ. తతః=విదేహముక్తికలిగిన, తరువాత అసౌ = ఈజ్ఞాని, యత్ =ఏది, గిరామపి=వేదములకును (వాక్కులకును) అగోచరం= తెలియబడనిదో, సత్ =ఆసద్వస్తువే, సంబభూవ=ఆయెను.

తా. సృష్టికిపూర్వమున భేదత్రయములేనిదేు సద్వస్తువుగల దో యూసద్వస్తువే యీవిదేహముక్తుడగు చున్నాడు.

" యచ్ఛూన్యవాదినాం శూన్యంబ్రహ్మబ్రహ్మవిదాంచయత్ . " ౧౭
" విజ్ఞానమాత్రంవిజ్ఞానవిదాం యదమలాత్మకం " ౧౮
(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ 3.)

టీ యత్ =ఏది, శూన్యవాదినాం=శూన్యమనివాదించువారికి (నాస్తికులకు) శూన్యం=శూన్యమగునో, యత్ =ఏది, బ్రహ్మవిదాం= బ్రహ్మవేత్తలకు, బ్రహ్మ=బ్రహ్మమో, విజ్ఞానవిదాం=విజ్ఞానవాదులకు, యత్ = ఏది, అమలాత్మకం = నిర్మలరూపమైన, విజ్ఞానమాత్రం= విజ్ఞానమో.

తా. శూన్యవాదులకేది శూన్యమో బ్రహ్మవాదులకేది బ్రహ్మ మో విజ్ఞానవాదులకేది విజ్ఞానమోవి దేహముక్తుడదియే.

" పురుషస్సాంఖ్యదృష్టీనాం ఈశ్వరోయోగవాదినాం " ౧౯
" శివశ్శైవాగమస్థానాం కాలఃకాలైకవాదినాం. " ౨౦
(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ 3)

టీ. సాంఖ్యదృష్టీనాం=సాంఖ్యజ్ఞానులకు, పురుషః = పురుషు డును, యోగవాదినాం=యోగమతస్థులకు, ఈశ్వరః = ఈశ్వరుడును,

శైవాగమస్థానాం=శైవమతస్థులకు, శివః = శివుడును, కాలైకవాది నాం=కాలమేదైవమని వాదించువారికి, కాలః=కాలమును.

తా. సాంఖ్యులకేది పురుషుడో యోగులకేది యీశ్వరుడో, శైవులకేది శివుడో, కాలవాదులకేది కాలమో యదియే విదేహముక్తుడగుచున్నాడు.

"యత్సర్వశాస్త్రసిద్ధాంతం యత్సర్వహృదయానుగం ౨౧
"యత్సర్వంసర్వగం వస్తు యత్తత్త్వం తదసౌ స్థితః' ౨౨
(అధర్వ-౩౦ అన్నపూర్ణ-అ 3)

ప్ర. యత్=ఏది, సర్వశాస్త్ర=ఈశ్వరునిగూర్చి చెప్పెడు సమస్తశాస్త్రములయొక్క, సిద్ధాంతం=సిద్ధాంతమో, యత్=ఏది, సర్వహృదయానుగం = సమస్తభూత హృదయములందున్నదో, యత్=ఏది, సర్వం=సమస్తమో, సర్వగం=అంతటనున్నదో, వస్తు=వాస్తవమైనదో, యత్=ఏది, తత్త్వం=జగత్తునకధిష్ఠానమైనదో, తత్=అదియగుచు, అసౌ=ఈవిదేహముక్తుడు, స్థితః=ఉన్నవాడు.

తా. శూన్యవాదులకేది శూన్యమో బ్రహ్మవాదులకేది బ్రహ్మమో, సాంఖ్యులకేది పురుషుడో, యోగులకేది ఈశ్వరుడో, శైవులకేది శివుడో, విజ్ఞానవాదులకేది విజ్ఞానమో, కాలవాదులకేది కాలమో ఏది సమస్తశాస్త్ర సిద్ధాంతమో ఏది సర్వగతమో ఏది జగదధిష్ఠానమో యావస్తువే యీవిదేహ ముక్తుడగుచున్నాడు. నాస్తికులు సృష్టికి పూర్వము శూన్యమే (అసత్తే) యున్నదని చెప్పుదురు. అట్టి శూన్యమునుండి యీజగత్తు గలిగెనని వారి మతప్రకారము చెప్పవలెను. అప్పుడీజగత్తును కారణముకన్న కార్యము వేరుగా నుండదుగావున శూన్యమై యుండవలయును. జగత్తిట్లు గనబడుచున్నది గావున శూన్యమని చెప్పరాదు. నాస్తికుల మతప్రకారము జగత్తు సత్యమనిన నసత్తునుండి సత్తు కలుగుట యసంభవముగాన నట్లు చెప్పరాదు. జగత్తు మిథ్యయనిన నధిష్ఠానములే

కుండ త్రాడులేకుండ పాము కనబడనట్లు మిథ్యాపదార్థము తోచదు. కావున నట్లును చెప్పరాదు. జగత్తు సత్యమనినను మిథ్యయనినను దానికి కారణముగాని యధిష్ఠానముగాని యుండవలయును. అది యెన్నటికిని శూన్యము గానేరదు. కావున నాస్తికమతము నిషిద్ధమైనది. నాస్తికులు సృష్టికి ముందున్న దేనిని శూన్యమని చెప్పుదురో (శూన్యమను పేరు సరియైనదిగాదు) దానినే బ్రహ్మవేత్తలు బ్రహ్మమనియు యోగు లీశ్వరుడనియు శైవులు శివుడనియు నిట్లా యామతములవారా యా నామములను చెప్పుదురు. ఆవస్తువే ఈవిదేహముక్తుడగునని తాత్పర్యము. ఇంతకన్న నింక నుత్కృష్టదశ మరిలేదు. ఇంత సర్వోత్కృష్టదశ నితరమతస్థులు చెప్పరు. బ్రహ్మవేత్తలు (అద్వైతులు) సృష్టికి పూర్వ మీజగము సజాతీయ విజాతీయ స్వగతభేదములులేని సద్వస్తువుగా నున్నదని చెప్పుదురు. ఆసద్వస్తువు (బ్రహ్మము) సత్యజ్ఞానానంత స్వరూపమైనది. అట్టి సద్వస్తువున (త్రాడునందు భ్రాంతిచే సర్పమారోపింపబడిన విధమున) మాయచే జగత్తు కల్పింపబడెను. అనగా మాయచే బ్రహ్మమే జగత్తుగా కనబడుచున్నదని యభిప్రాయము. ఈమాయ యున్నట్లు కనబడుటచే నసత్తుగాదు. వస్తువిచారమున బాధింపబడుట వలన సత్తుగాదు. సదసత్తుగాదు. ఆహేతువుచే నది యనిర్వచనీయమనబడును. మాయాస్వరూపము నెరిగి యనిర్వచనీయమనిరిగాని యితర మతస్థులనుకొనునట్లు తెలియక చెప్పలేమని యద్వైతులు చెప్పినవారుకారు. అనిర్వచనీయమను శబ్దముననే దానివిధమును బుద్ధిమంతు లూహింపవచ్చును. అట్టిమాయ నంగీకరించినను బ్రహ్మముయొక్క యద్వితీయత్వమునకు భంగములేదు. మాయా కార్యములగు నుపాధులను బ్రహ్మముండుటచే జీవేశ్వరాది భేదములను పొందెను. ఉపాధులు నశింప బ్రహ్మమొక్కటియే శేషించును. అనంతమైు ఉపాధినాశమున నాబ్రహ్మమే యీవిదేహముక్తుడగుచున్నాడు. అహంవృత్తియే బుద్ధియనియు విజ్ఞానమనియు చెప్పబడును. ఈవిజ్ఞానము నిర్మలమయినది.

విజ్ఞానవాదులు బాహ్యప్రపంచము లేదనియు విజ్ఞానమే యానాయారూపములుగ బరిణమించి బాహ్యప్రపంచముగ గనబడుచున్నదనియు చెప్పుదురు. ఈవిజ్ఞానము వృత్తి రూపముగ నుండును. వృత్తి పుట్టుచు నశించుచుండును. గావున విజ్ఞానము క్షణికమయ్యెను. క్షణికమై నశించుచుండుటచే నది యాత్మగాదు. ఆత్మక్షణికమైన యావిజ్ఞానమునకు సాక్షియైయున్నది. సాంఖ్యుల మతప్రకారము పురుషుడు ప్రకృతి యని రెండుపదార్థములు శాశ్వతములు. పురుషుడు చిన్మాత్రుడు. ప్రకృతి జడమోహాత్మకమైనది. ప్రకృతి పురుషసంయోగముచే సుఖదుఃఖములు గలుగును. ఈప్రకృతి పురుషునికొరకు భోగబంధమోక్షములు గలుగజేయుచున్నది. (గల్పించుచున్నది) ప్రకృతి పురుష వివేకము గలుగుచుండగ పురుషునికి మోక్షము గలుగుచున్నదని సాంఖ్యులు చెప్పుదురు. భార్య తన దోషములు నెరిగిన భర్త ముఖము చూచుటకు సిగ్గుపడి ఎట్లు మరలునో యట్లే తానసంగ చిద్రూపుడనియు ప్రకృతి జడమోహాత్మకమైనదనియు నెరిగిన పురుషుని నాప్రకృతి విడుచును. ఆవిడుచుటనే మోక్షము. ప్రకృతి నిత్యముగావున వివేకదశయందును బురుషుని విడుచుట కవకాశముండదు. మరియు తన పనినే (మోహింపజేయుట) చేయుచుండును. ఇదిగాక యితరులచే నీసాంఖ్య మతమున గల్పింపబడిన దోషము. ప్రకృతి విడువక తనపని చేయుచుండిన మోక్షమున కవకాశములేదు. యోగమతమున ప్రకృతి జీవుడు నీశ్వరుడునని మూడు పదార్థములు శాశ్వతములు. జీవుడు నీశ్వరుడు నసంగ చిద్రూపులైనను నీశ్వరుడు క్లేశకర్మవిపాకాశయములచే కాలత్రయమునను బాధింపబడనివాడై జీవులకు నియామకుడగుటచే పురుషశ్రేష్ఠు డనబడును. జీవులుమాత్రము ప్రకృతికి వశులగుదురు. వారు పురుషులనబడుదురు. అవిద్యాస్మిత రాగద్వేషాభినివేశములు పంచక్లేశములు. పుణ్యపాపమిశ్ర స్వరూపమైన క్రియ కర్మను. జాత్యాయుర్భోగములు విపాకము. మలినములైనచిత్తవృత్తులాశయములు. ఇవి ప్రకృతిలోచేరును. ఈశ్వరధ్యానమున జీవులకు

" స్వానుభూత్యేకమానంచ యత్తత్త్వంతదసౌస్థితః " ౨౪
(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ 3.)

టీ. తదనుత్తమనిష్పందం, తదనుత్తమ=దానికన్న నుత్తమమైనదిలేనట్టి, నిష్పందం=నిశ్చలమైనది, తేజసామపి= తేజస్సులకును, (సూర్యాదులకు) దీపకం=ప్రకాశము నిచ్చునది, స్వానుభూత్యేకమానం=స్వానుభవైకగమ్యమైనదియు, తత్తత్త్వం=ఏతత్త్వమో, తత్=ఆతత్త్వమై, అసౌ=ఈవిదేహముక్తుడు, స్థితః=ఉన్నవాడు.

తా. తదనుత్తమమయి సూర్యాదులకు దీపకమై ఏతత్త్వమున్నదో యాతత్త్వమే విదేహముక్తుడగు చున్నాడు.

" యదేకంచాప్యనేకంచ సాంజనంచ నిరంజనం " ౨౫
" యత్సర్వంచాప్యసర్వంచ యత్తత్త్వంతదసౌస్థితః " ౨౬
(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ 3.)

టీ. యత్=ఏది, ఏకంచాపి=ఒకటియైనను, అనేకంచ=ఉపాధిభేదములచేననేకముగనున్నట్లు గనబడుచున్నదో, సాంజనంచ=ఉపాధిసంబంధము గలిగియున్నను, నిరంజనం (తామసాదులచే నంటబడక) దేనినంటక యున్నదో, యత్=ఏది, సర్వమపి=వివర్తమున సర్వజగద్రూపమున నున్నదైనను, అసర్వంచ = విచారమునఈసర్వమును కానిదో, యత్=ఏది, తత్త్వం=జగత్తున కధిష్ఠానమైనదో, తత్=అదియై, అసౌ=ఈవిదేహముక్తుడు, స్థితః=ఉన్నాడు.

తా. ఏదియొక్కటియైన నుపాధిభేదములచే ననేకవిధములుగ తోచుచున్నదో యుపాధిసంబంధమున్నను, నిరంజనమై యేది యున్నదో సమస్తజగద్రూపము దోచినను నేదిఈజగత్తుగాక దీనికధిష్ఠానమైయున్నదో, యాతత్త్వమే యీవిదేహముక్తుడగుచున్నాడు.

" నిరానందోపిసానందః సచ్చాసచ్చబభూవసః " ౨౭
" నచేతనోనచజడో నచైవా సన్నసన్మయః " ౨౮
(అధర్వ-౭౦ అన్నపూర్ణ-అ 3.)

టీ. సః=ఆవిదేహముక్తుడు, నిరానందోపి = ఆనందము లేని వాడైనను (ఉపాధిలేమి) సానందః=ఆనందముతోఁగూడిన వాడును, సచ్చ=సత్తును, అసచ్చ=అసత్తును, బభూవ=అయ్యెను, నచేతనః=చేతనుడుగాడు, నచజడః=జడుడుగాడు. నచైవాసత్ = అసత్తుగాడు, నసన్మయః=సద్రూపుడుగాడు.

తా. అద్వితీయుడగుటచే నానందములేనివాడైనను సన్మృతజడ దుఃఖ స్వరూపమైన ప్రకృతిచే నానందముగలవాడుగ భేదింపబడు చున్నాడు. పరమార్థమున సన్మృతదుఃఖజడ స్వరూపమైన సమస్తము లేదు గావున నాతడుచేతనుడుగాడు జడుడుగాడు అసత్తుగాడు సత్తు గాడు అని భావము.

"అజమమరమనాద్యమాద్యమేకం పదమమలంసకలంచ నిష్కలంచ" ఇతి

"స్థితఇతిసతదానభ స్స్వరూపాదపి విమలస్థితిరీశ్వరఃక్షణేన"౩౦ (అధర్వ-౩౦ అన్నపూర్ణ-అ 3.)

టీ. అజం = పుట్టువు లేనిదియును; అమరం = నాశము లేనిదియును, అనాద్యం=ఆదిలేనిదియును, ఆద్యం=సమస్తమునకు దానాదిమైనదియును, ఏకం=ఒక్కటియును; పదం=ముక్తులకు బొందదగిన స్థానమైనదియును; అమలం = శుద్ధచైతన్య స్వరూపమైనదియు, సకలం=షోడశకళలతోఁగూడి నదియును, నిష్కలంచ = షోడశకళలు లేనిదియునైన, ఇతి=ఇట్టిబ్రహ్మమందు; స్థితః=ఉన్నవాఁడై; సః= ఆవిదేహముక్తుఁడు; తదా=అప్పుడు (దేహత్రయభంగమున); క్షణేన=ఆక్షణముననే; నభస్స్వరూపాదపి = ఆకాశస్వరూపము కన్నను; విమలస్థితిః=వికారములేని స్వచ్ఛస్థితిగలవాఁడై; ఈశ్వరః=ఈశ్వరుఁ డేయగును. అనగ నిచ్చట బ్రహ్మమేయగును.

తా. విదేహముక్తుఁడు సర్వజ్ఞానానంద స్వరూపమగునన బ్రహ్మమేయగునని తాత్పర్యము. కూటస్థజీవులకునలె నీశ్వర బ్రహ్మ

ములకు, నన్యోన్యాధ్యాసమును చెప్పి బ్రహ్మమను భావముతోనే విదేహముక్తుఁడీశ్వరుఁడగుచున్నాఁడని చెప్పఁబడెను. వాస్తవమున నీశ్వరుఁడు లేఁడు కావున బ్రహ్మమే యగునని తాత్పర్యము.

"వ్యపగతకలనాకలంకశుద్ధః స్వయమమలాత్మని పావనే పదేసౌ" ౩౦

"సలిలకణ ఇవాంబుధౌ మహాత్మా విగలితవాసనమేకతాం జగామ" ౩౧

(సామ ; ౯౧ మహో ; అ ౨.)

టీ. వ్యపగతకలనాకలంకశుద్ధః, వ్యపగత=నశించిన, కలనాకలంక=వ్యవహారకలంకమునుండి కలిగిన, శుద్ధః=పరిశుద్ధివలన ; పావనే పదే=పవిత్రపదమైన ; అమలాత్మని = శుద్ధచైతన్యమందు ; అసౌ మహాత్మా=ఈమహాత్ముఁడు ; స్వయం=స్వయముగ, అంబుధౌ=సముద్రమందు ; సలిలకణ ఇవ=నీటికణమువలె ; విగలితవాసనం=వాసన నశించునట్లు ; ఏకతాం=బ్రహ్మైక్యమును : జగామ=పొందెను.

తా. సముద్రమున జలబిందువైక్యమగునట్లు జగజ్జీవేశ్వరాది భేద వ్యవహారనాశమున బరిశుద్ధుఁడైన బ్రహ్మమున నైక్యమగుచున్నాఁడు.

"సశాంతదుఃఖమజడాత్మకమేకముత్తమానంద మంథరమపేతరజస్తమోయత్" ౩౩

"ఆకాశకాశతనవోఽతనవో మహాన్తస్తస్మిన్పదే గలితచిత్తలవా భవన్తి" ౩౪

(అధర్వణ ; ౭౦ అన్నపూర్ణ ; అ ౪)

టీ. ఆకాశకాశతనవః, ఆకాశ=ఆకాశమువలె ; కాశ=ప్రకాశించుచున్న ; తనవః=శరీరములు గలవారగుటచే, ననగ, అతనవః=శరీరములులేనివారై ; మహాంతః = మహాత్ములగు విదేహముక్తులు; సశాంతదుఃఖం=శాంతించిన దుఃఖముగలదియు (అధ్యస్తమైన దుఃఖ

ముపోయినదియు); అజడాత్మకం = జడరూపముకానిదియు (చిద్రూప మైనదియు) ఏకం = భేదత్రయములేనిదియు, సద్రూపమైనదియు, సుప్తం=ఏవృత్తియును లేనిదియును (నిర్వికారమైనది); ఆనందమంఘ రం=ఆనందఘనమైనదియు, అపేతరజస్తమః=రజస్తమో గుణములు లేనిదియు; యత్ =ఏదియో; తస్మిన్పదే=ఆబ్రహ్మపదమందు; గళిత చిత్తలవాః = నశించినచిత్తలేశములు గలవారై, భవంతి=ఐక్యమగు చున్నారు,

తా. మహాత్ములు విదేహముక్తులు శరీరత్రయము లేనివార గుటచే నాకాశమువలె నిర్వికారులై బ్రహ్మమున నైక్యమగుదురు.

"విదేహముక్త ఏవాసౌవిద్యతే నిష్కలాత్మకః" 3౬

"సమగ్రాగ్ర్యగుణాధార మపిసత్వంప్రలీయతే" 3౭

(అధర్వ; ౭౦ అన్నపూర్ణ; అ ౨)

టీ. సమగ్ర=పరిపూర్ణమయిన; అగ్ర్య=ఉత్కృష్టమైన, గుణా ధారం=గుణముల కాధారమైన, సత్వం=సత్వగుణమును, ప్రలీయతే= అపి=లయించుచున్నది, ఐనప్పటికిని (లయించుచుండగ) నిష్కలా త్మకః=షోడశకళలు లేనివాఁడై; అసౌ=వీఁడు, విదేహముక్త ఏవ= విదేహముక్తుఁడై; విద్యతే=ఉన్నాడు.

తా. సమస్తగుణముల కాధారమైన సత్వగుణమును లయిం చుచుండఁగా షోడశకళలు లేనివాఁడై యీవిదేహముక్తుడుండును. బ్రహ్మమై త్రిశరీరములు లేకయుండును, పంచప్రాణదశేంద్రియాంతః కరణచతుష్టయము షోడశకళలు.

"విదేహముక్తావిమలేపదే పరమపావనే" 3౮

"విదేముక్తివిషయే తస్మిన్సత్వక్షయాత్మకే" 3౯

"చిత్తనాశేవిరూపాఖ్యే నకించిదిహవిద్యతే" 3౯

"నగుణానాగుణాస్తత్ర నశ్రీర్నాశ్రీర్నచైకతా" ౪౦

(అధర్వణ-౭౦ అన్నపూర్ణ; అ౪;)

టీ. విమలే=నిర్మలమైనదియును. పదే= ముక్తిలక్షణస్థాన మును, పరమపావనే = అత్యంతపావనమును, విదేహముక్తివిషయే= విదేహముక్తివిషయమైనదియును; సత్త్వరూపాత్మకే=సత్త్వగుణము లేనిదియును ; చిత్తనాశే=చిత్తములేనిదియును; విరూపాఖ్యే=నామరూప ములులేనిదియునగు, తస్మిన్=ఆ; విదేహముక్తౌ=విదేహముక్తియందు ; కించిత్ =ఇతరమయినది కొంచెమును, ఇహ=ఇచ్చట, నవిద్యతే=లేదు, తత్ర=ఆముక్తియందు; నగుణాః=గుణములు లేవు; నాగుణాః=అగుణము లులేవు; నశ్రీః=శ్రీలేదు; నాశ్రీః=అశ్రీయునులేదు; నచైకతా=ఏకత్వ మునులేదు;

తా. పరమార్థమైన విదేహముక్తిదశయందు మనోవాగాదీంద్రి యములును, దృశ్యరూపమయిన జగత్తును లేవు గావున, వ్యవహరిం చుటకు శ్రీగాని యశ్రీగాని గుణములుగాని యగుణములుగాని యేక త్వముగాని నానాత్వముగాని లేవు.

"జీవన్నేవసదాముక్తః కృతార్థోబ్రహ్మవిత్తమః" ౪౧
"ఉపాధినాశాద్బ్రహ్మైవ సద్బ్రహ్మాప్యేతినిర్భయం" ౪౨
(అధర్వణ; ఉప. ఆత్మ.)

టీ. కృతార్థః=కృతకృత్యుడగు (పొందబడిన విషయముగల) బ్రహ్మవిత్తమః=బ్రహ్మవిదులలో శ్రేష్ఠుడు, జీవన్నేవ=బ్రతికియుండి యును, సదా=ఎల్లప్పుడును, ముక్తః=ముక్తుడే, ఉపాధినాశాత్ =శరీ రనాశమున, నిర్భయం=అభయమైన, సద్బ్రహ్మ=సద్వస్తువైన బ్రహ్మ మును, అప్యేతి=పొందుచున్నాడు. బ్రహ్మైవ=బ్రహ్మమే యగుచు న్నాడు.

తా. కృతార్థుడైన బ్రహ్మవిద్వరిష్ఠుడు బ్రతికియుండినను ముక్తుడే. ఉపాధినాశమున ఘటాకాశము మహాకాశమైనట్లు సత్య జ్ఞానానంద స్వరూపముగు బ్రహ్మమగుచున్నాడు. అదియే విదేహముక్తి యనబడును.

"శాస్త్రీణనశ్యేత్పరమార్థదృష్టిః కార్యక్షమంనశ్యతిచాపరోక్షాత్" ౪౩

"ప్రారబ్ధనాశాత్ప్రతిభాననాశః ఏవంత్రిధానశ్యతిచాత్మమాయా." ౪౪

(కృ-యః; నా వరాహ)

టీ. శాస్త్రీణ=శాస్త్రజ్ఞానమున (పరోక్షజ్ఞానమున) పరమార్థదృష్టిః=జగత్తు సత్యమనుబుద్ధి, నశ్యేత్=నశించును, కార్యక్షమం=అభిమానపూర్వకమైన వ్యవహారము, అపరోక్షాత్ = అనుభవజ్ఞానమున, నశ్యతిచ=నశించుచున్నది, ప్రారబ్ధనాశాత్=ప్రారబ్ధకర్మనాశమున, ప్రతిభాననాశః=శరీరత్రయజీవత్వము (మూడు దేహములు) వీని యొక్క, నాశః=నాశమగును, ఏవం=ఇట్లు, త్రిధా=మూడురీతులుగ, ఆత్మమాయాచ=తనమాయయును, నశ్యతి=నశించుచున్నది.

తా. మొదట గురూపదేశమునను, శాస్త్రమునను గలుగు జ్ఞానమున జగత్తు సత్యమనుబుద్ధి నశించును. జగత్తు మిధ్యయని తెలియును. పిమ్మట 'అహంబ్రహ్మాస్మి' యను నపరోక్షజ్ఞానమున నభిమానపూర్వకమైన జగద్వ్యవహారము నశించును. తాను బ్రహ్మమని తెలియఁగనే జగద్వ్యాపారము స్వప్నగతవ్యాపారము ప్రబోధమునఁ దోచినట్లుండును. అదియే జీవన్ముక్తి. పిదప ప్రారబ్ధనాశమున శరీరము నశింప ఘటాకాశము మహాకాశమైనట్లు ప్రత్యగాత్మస్వరూపుఁడగు తాను బ్రహ్మమగును. అదియే విదేహముక్తి యనబడును.

"అహినిర్ల్వయనీసర్పనిర్మోకో జీవవర్జితః" ౪౫

"వల్మీకే పతితస్తిష్ఠే త్తం సర్పోనాభిమన్యతే" ౪౬

(కృ-యః; నా వరాహ.)

టీ. అహినిర్ల్వయనీ=పాముండినట్టియు, జీవవర్జితః=ప్రాణములేనిదియునగు, సర్పనిర్మోకః=పాముపొర, వల్మీకే=పుట్టయందు, పతితః=పడి

సత్రై, తిష్ఠతి=ఉండును, సర్పః=పాము, తం=ఆనిర్మోకమును, నాభి మన్యతే=తలపదు.

తా. తనచే విడువబడిన పొరయైన పామున కభిమానముండదు. అట్లే జ్ఞానికి తాను శరీరరహితుండని తెలియఁగనే శరీరమం దభిమానముండదని ముందు వాక్యమున జెప్పబడుచున్నది.

"ఏవం స్థూలంచసూక్ష్మంచ శరీరం నాభిమన్యతే" ౮౭
"ప్రత్యజ్ఞానశిఖిధ్వస్తే మిథ్యాజ్ఞానే సహేతుకే" ౮౮
(కృ-య; ౯౦ వరాహ.)

టీ. సహేతుకే=కారణముతోఁగూడిన, మిథ్యాజ్ఞానే = మిథ్యయగుజగత్తు, కలఁనుజ్ఞానము. ప్రత్యజ్ఞానశిఖిధ్వస్తే = ఆత్మజ్ఞానమను నగ్నిచే ధ్వంసముచేయబడగా, ఏవం=ఈరీతిగ (పాముతనచే విడువబడిన నిర్మోకముగలచనట్లు) స్థూలంచ=స్థూలమయినట్టియు, సూక్ష్మంచ=సూక్ష్మమయినట్టియు, శరీరం=శరీరమును. నాభిమన్యతే=తలపదు.

తా. పాముతనచే విడువబడిన పొరయేమగుచున్నను దానిద లచనట్లు, జ్ఞానిమాయాకార్యమైన జగత్తువిషయమై గలిగిన మిథ్యాజ్ఞాన మాత్మజ్ఞానమున నశింప దాను శుద్ధచైతన్యస్వరూపుఁడై స్థూల సూక్ష్మశరీరముల దలపడు. కారణశరీరమయిన యవిద్యమొదట నశించగావున నాత్మజ్ఞానమున గారణశరీరమునుగూర్చి యిక్కడచెప్పలేదు కారణమైన యవిద్యనశించినను దానికార్యమైన సూక్ష్మస్థూలశరీరములు మరికొంతకాలముండు గావున జ్ఞానివానిగూర్చి చింతింపడు. కారణమునశించి కార్యముమరికొంత కాలమెట్లుండునని శంకకలుగును. ఉపాదానకారణము నశించినను కార్యము క్షణమాత్రముండునని తార్కికులు చెప్పుదురు. అట్లే వేదాంతశాస్త్రమునను నావృతిస్వరూపమైన యవిద్యనశించినను విక్షేపరూపమై యవిద్యాకార్యమైన సూక్ష్మస్థూలశరీరములు కొంతకాలముండును. తార్కికులు క్షణకాలమని చెప్పిరిగాని కొంతకాలమని చెప్పలేదనిన కొన్నిదినము

లనుండి యున్నతంతువులు నశించినక్షణమున వస్త్రమునశించునని తార్కికులుచెప్పుదురు. అనాదినుండియున్నయవిద్యనశించిన మరికొంత కాలమునకు విక్షేపస్వరూపము నశించును. ఇదియనాదికార్యము కావున నట్టిక్షణమే యిక్కడకొంత కాలమనిచెప్పబడెను. ఇట్టిశంకకే మాపక్షమున విద్యారణ్యులవారు 'ఉపాదానేవినష్టేఽపిక్షణంకార్యంప్రతీక్ష్యతే, ఇత్యాహుస్తార్కికాస్తద్వదస్మాకం కింనసంభవేత్, తంతూనాందిన సంఖ్యానాంతైస్తార్కైః క్షణఈరితః। భ్రమస్యాసంఖ్యకల్పస్యయోగ్యః క్షణఇహేష్యతాం'' అని సమాధానము జెప్పుచున్నారు.

"నేతి నేతీతిరూపత్వాదశరీరో భవత్యయం" ౯౯
(శ్రు—యు; కాం వరాహ ;)

టీ. అయం=ఈజ్ఞాని, నేతి నేతీతిరూపత్వాత్ = నేతినేతివాక్యములచే సమస్తమును నిషేధింపగ పరమాత్మ శేషించిన స్వరూపము కాటవలన, అశరీరః = శరీరత్రయము లేనివాడు, భవతి = అగుచున్నాడు.

తా. నేతినేతివాక్యములచే సమస్తప్రపంచపదార్థములను నిషేధింపగ పరమాత్మయే శేషించిన స్వరూపముగలవాడౌటచే, బ్రహ్మజ్ఞానిశరీరములేని విదేహముక్తుడగుచున్నాడు.

"విశ్వశ్చ తైజసశ్చైవ ప్రాజ్ఞశ్చేతి చ తే త్రయః" ౫౦
"విరాట్సూత్రశ్చ బీజశ్చ ఇత్యేతే చ త్రయః" ౫౧
"బ్రహ్మాండం చైవ పిండాండం లోకా భూరాదయః క్రమాత్" ౫౨
"స్వస్వోపాధిలయాదేవ లీయంతే ప్రత్యగాత్మని" ౫౩
(శ్రు—యు ౧ ౬. తారాసారోపనిషత్)

టీ. విశ్వశ్చ=విశ్వుడు, తైజసశ్చైవ = తేజసుడును, ప్రాజ్ఞః చేతిచ=ప్రాజ్ఞుడనను, తే త్రయః= ఆముగ్గురుజీవులును, విరాట్ = వైశ్వాన

రుడును, హిరణ్యగర్భశ్చ=సూత్రాత్మయును, ఈశ్వరశ్చేతి=అంతర్యామియునను, తేత్రయః = ఆముగ్గురీశ్వరులును, బ్రహ్మాండం చైవ= బ్రహ్మాండమును (బాహ్యప్రపంచము) పిండాండం = పిండాండమును (అంతఃప్రపంచము) భూరాదయః = భూమిమొదలగునట్టి, లోకాః= లోకములును, క్రమాత్=క్రమముగ, స్వస్వోపాధిలయాదేవ=తమతమ యుపాధులు నశింపగనే, ప్రత్యగాత్మని = ప్రత్యగాత్మయందు, లీయంతే = లయించుచున్నవి.

తా. స్థూలసూక్ష్మకారణోపాధికులగు విశ్వతైజసప్రాజ్ఞులను జీవులును విరాడ్ఢిరణ్యగర్భేశ్వరులను నీశ్వరులను మాయాకార్యమైన బ్రహ్మాండమును మనఃకార్యమగు పిండాండమును భూరాది లోకములును నుపాధులు నశింపగ ప్రత్యగాత్మయందు లయించును. ఉపాధులన్నియును నశింపప్రత్యగాత్మయే పరమాత్మ స్వరూపమున శేషించుగావున నయ్యాత్మయందే సమస్తమును లయించును.

"తూష్ణీమేవస్థితస్తూష్ణీం తూష్ణీంసత్యంనకించన" ౫౮

(కృ-య; ౩౦ తేజోబిందు.)

టీ. తూష్ణీం=నిర్వాసనామౌనమే, సత్యం=కాలత్రయాబాధ్యమైనది. తూష్ణీమేవ = నిర్వాసనామౌనమే, స్థితః = పరమార్థమున నున్నది. తూష్ణీం=నిర్వికల్పముగనున్నది, నకించన=దానికన్ననితరము కొంచెమును లేదు.

తా. పరమార్థమున దృశ్యములు మిథ్యలుగావున తూష్ణీంభావమేయున్నది. దానికదియెసాటి. అది త్రికాలాబాధ్యము. దానికన్న నన్యముకొంచెమును లేదు.

"సర్వేశ్వరేతివాక్యేతి వేదశాస్త్రైకసంతత్యాపి" ౫౯

"ఇదంచైతన్యమేవేతి అహంచైతన్యమిత్యపి" ౬౦

"ఇతినిశ్చయశూన్యోయో వై దేహీముక్తఏవసః" ౬౧

"బ్రహ్మభూతః ప్రశాంతాత్మా బ్రహ్మానందమయస్సుఖీ" ౫౮
(కృ-యః ౨౭ తేజోబిందు.)

టీ. జీవేశ్వరేతి=జీవేశ్వరులనియు, వాక్యేతి=వాక్యములనియు, వేదశాస్త్రాణి=వేదశాస్త్రములు, కథంత్వితి=ఎట్లనియు, ఇదం=ఇది, చైతన్యమేవేతి=చైతన్యమేయనియు, అహంచైతన్యమిత్యపి=నేను చైతన్యమనియు, ఇతినిశ్చయశూన్యః=ఇట్టినిశ్చయములేనివాడు, యః=ఎవడో, సః=వాడు, వైదేహీముక్తః=విదేహముక్తుడు, బ్రహ్మభూతః=బ్రహ్మమైనవాడు, ప్రశాంతాత్మా=శాంతస్వరూపుడు, బ్రహ్మానందమయః=బ్రహ్మానందమయుడు, సుఖీ=సుఖవంతుడు.

తా. పొందప్రయత్నించు బ్రహ్మము పొందువానికి, జీవ ఈశ్వరులు, వేదశాస్త్రము లెట్లున్నవి, నేను చైతన్యస్వరూపుడనను నిట్టి తలంపులుండవు. అట్టి తలంపులుగలవాడభ్యాసియగును. బ్రహ్మమైన పిదప నట్టితలపులుండవు గావున వాడు విదేహముక్తుడు. "వేదశాస్త్రాణి"యనియుండవలయును. వేదశాస్త్రాణి అనియు, వాక్యేతియనియు వేదప్రయోగములని యనుకొనవలెను.

"కాలభేదం వస్తుభేదం దేశభేదం స్వభేదకం" ౫౯
"కించిద్భేదం నతస్యాస్తి కించిద్వాపి నవిద్యతే" ౬౦
(కృ-యః-౨౭ తేజోబిందు.)

టీ. తస్య=ఆవిదేహముక్తునకు, కాలభేదం=కాలభేదమును, వస్తుభేదం=వస్తుభేదమును, దేశభేదం=దేశభేదమును, స్వభేదకం=స్వగతభేదమును, కించిద్భేదం=మరేదైన కొంచెముభేదమును, నాస్తి=లేవు, కించిద్వాపి=అభేదమైనను మొదలైనది మరియొకటి కొంచెమైనదియును, నవిద్యతే=లేదు.

తా. అనంతమైన బ్రహ్మస్వరూపుడగుటచే విదేహముక్తునకు దేశకాలవస్తుభేదములుండవు. స్వగతభేదముండదు. ఇతరమైన దేదియు నుండదు.

"స్వచ్ఛరూపో మహామౌని ర్వైదేహముక్త ఏవసః" ౬౧
"బ్రహ్మైవాహం చిదేవాహం ఏవం వాపి నచింత్యతే" ౬౨

(కృ-య-౩౮ తేజోబిందు.)

టీ. వైదేహముక్తః=విదేహముక్తుడు, స్వచ్ఛరూపః=శుద్ధచైతన్యస్వరూపుడు, మహామౌనీ=సర్వేంద్రియములు లేమిచే మహామౌనముగలవాడు, సఏవ=అతడే, బ్రహ్మైవాహం= నేనుబ్రహ్మను చిదేవాహం=నేను చిద్రూపుడను, ఏవంవాపి=ఈప్రకారమునైనను, నచింత్యతే=చింతింపడు.

తా. శరీరత్రయము లేదుగావున, మహామౌని నేను బ్రహ్మమని చింతచేయువాడు గాడు. కేవల బ్రహ్మమే యతడని యభిప్రాయము.

"చిన్మాత్రేణైవ యస్తిష్ఠేద్వైదేహముక్త ఏవసః" ౬౩

(కృ-య-౩౮ తేజోబిందు.)

టీ. యః=ఎవడు, చిన్మాత్రేణైవ=చిద్రూపముననే, తిష్ఠేత్=ఉండుచున్నాడో, సఏవ=వాడే, వైదేహముక్తః=విదేహముక్తుడు.

తా. శరీరత్రయము నశింప నితరసంబంధములేక కేవల చిన్మాత్రుడుగా నీవిదేహముక్తుడుండును.

"చైతన్యమాత్రసంసిద్ధ స్స్వాత్మారామస్సుఖాసనః" ౬౪
"తుర్యతుర్యః పరానందో వైదేహముక్త ఏవసః" ౬౫

(కృ-య-౩౮ తేజోబిందు.)

టీ. చైతన్యమాత్రసంసిద్ధః=శుద్ధచైతన్యస్వరూపుడును, స్వాత్మారామః=ఆత్మయందే క్రీడించువాడును, సుఖాసనః=నిరతిశయసుఖమే ఆసనముగాగలవాడును, తుర్యతుర్యః= తురీయమునకు దురీయుడైనవాడును (తురీయాతీతుడు) పరానందః=బ్రహ్మానందస్వరూపుడునైనవాడో, సఏవ=వాడే, వైదేహముక్తః=విదేహముక్తుడు.

తా. ఇంకకొన్ని జీవన్ముక్తలక్షణములు చెప్పబడినవి. ఆత్మారామః, సుఖాసనః, ఈమొదలయినవి మోక్షమున జీవన్ముక్త విదేహముక్తులకు భేదములేదు. కావున కొన్నివేళలందు జీవన్ముక్తుడు విదేహముక్తుడుగా గణింపబడుచున్నవాడు. వాస్తవమున ముక్తి ఇన్ని విధములులేదు. జీవన్ముక్తి యనియు విదేహముక్తియనియు వ్యావహారికమున జెప్పబడుచున్నవి.

"యస్యప్రపంచభానం న బ్రహ్మాకారంనచాపిహి" ౬౬
"అతీతాతీతభావోయో వైదేహీముక్త ఏవసః" ౬౭
(కృ-యు-౩౭ తేజోబిందు.)

టీ. యస్య=ఎవనికి, ప్రపంచభానం=ప్రపంచస్ఫురణము, న=ఉండదో, బ్రహ్మాకారమపి=బ్రహ్మాకారమును, నహి=ఉండదో, అతీతాతీతభావః=సమస్తమునకతీతమైన తురీయమునకతీతమైనవాడు, యః=ఎవడో, సఏవ=వాడే, వైదేహీముక్తః=విదేహముక్తుడు.

తా. శరీరములేదు గావున ప్రపంచస్ఫురణముండదు. తానే బ్రహ్మముగావున బ్రహ్మాకారస్ఫురణముండదు. సర్వాతీతుడై యుండును. అట్టివాడే విదేహముక్తుడు.

"చిత్తవృత్తేరతీతోయశ్చిత్తవృత్త్యవభాసకః" ౬౮
"సర్వవృత్తివిహీనాత్మా వైదేహీముక్తఏవసః" ౬౯
(కృ-యు-౩౭ తేజోబిందు.)

టీ. యః=ఎవడు, చిత్తవృత్తేః=చిత్తవృత్తికి, అతీతః=అతీతుడో, చిత్తవృత్త్యవభాసకః=చిత్తవృత్తిని ప్రకాశింపజేయువాడో, సర్వవృత్తివిహీనాత్మా=సమస్తవృత్తులు లేనివాడో, సః=వాడు, వైదేహీముక్తఏవ=విదేహముక్తుడే.

తా. ఈవాక్యమున వృత్తిరహితుడై సమాధియందుండువాడె విదేహముక్తుడని చెప్పబడెను. దీనివలన జీవన్ముక్తునకు వ్యవహార

